# కాంతులీనే చర్మం. సింథాల్ శాండల్ చర్మం.

ఇప్పుడు మీరు సింథాల్ శాండల్ సహాయంతో మచ్చలేని నిర్మల చర్మ సౌందర్యం పొందవచ్చు. ఒక్క సింథాల్‌లోనే ఉంది, చర్మంపైన మచ్చల్ని, శరీర దుర్గంధాన్ని కలిగజేసే బాక్టీరియాను చంపగల టిసిసి. దానితోటే, కాంతులీనే మృదువైన చర్మంకోసం అనాదిగా పేరు పొందిన చందనం సుగుణాలు కూడాను.

**ఈనాటి నారీమణి కోసం ఈనాటి శాండల్ సబ్బు.**




Madison-G-369 Tel

# రచయితలకు సూచనలు



ప్రచురించే ప్రతి నవలకు రు. 2,000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర' లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే. వైవిధ్య పూరిత ఇతివృత్తాలతో, ఆసక్తికర రచనా సంవిధానంతో పాఠకులను ఆకట్టుకో గల నవలలకు వేదిక 'చతుర'.

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. "చతుర"లో అచ్చులో ఒక పేజీలో సుమారుగా 350 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా, మొత్తంమీద 35వేల పదాలకు తక్కువకాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో వారివారి దస్తూరీని బట్టి, ఒక పేజీకి ఎన్నిపదాలు వస్తున్నాయనే దానినిబట్టి మొత్తం నవల ఎన్ని పేజీలు ఉండాలనేది ప్లాన్‌వేసుకోవటం అవసరం.

★ ఈ లెక్క ప్రకారం "చతుర" కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవుతాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసివచ్చే పక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు త్రిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏ నెల చతురలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలో పంపబడు తుంది.

ఎడిటర్

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482

# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

✶ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

------------------------------ కూపన్ ------------------------------

సెప్టెంబర్ చతురనవల సామర్థ్యం

సమీక్షకుని పేరు : ..............................................................

చిరునామా: ..............................................................

..............................................................

..............................................................

..............................................................

# మాతృబంధం పై సమీక్షలు

'జ్యోతి' చతురలో ప్రచురితమైన శ్రీమతి ఇంద్రగంటి జానకీబాల నవల 'మాతృబంధం' పై మాకు అందిన సమీక్షలలో ఉత్తమంగా వున్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాం.

## ముగింపులోనే ఉంది!

(ప్రథమ బహుమతి రు: 100/- పొందిన సమీక్ష)

మహిళా దశాబ్దాలే కాదు. శతాబ్దాలు జరుపుకున్నా స్త్రీల సమస్యలు మాత్రం ఎక్కడ వున్నావే గొంగళీ అంటే, వేసినచోటే అన్నట్లుగా వున్నాయి. ఆధునిక స్త్రీ ప్రగతి పథంలోకి పరిగెడుతూ ఆర్థిక స్వాతంత్ర్యాన్ని సంపాదించుకుంటున్నా సామాజికంగా ఎన్నోరకాలుగా అణగదొక్కబడుతూనే ఉంది. ఆర్థిక స్వాతంత్ర్యమొక్కటే పరిష్కారం కాదు. ఆమెలో తెగింపు, ఆలోచనా విధానంలో మార్పు రావాలి. సహజంగా సహనశీలి, క్షమాశీలి అయిన స్త్రీ పురుషుని అన్యాయాలను తన వైవాహిక బంధం నిలుపుకునేటందుకూ, సంతానంకోసమూ సహించనూగలదు, క్షమించనూగలదు. కాని ఈ అన్యాయాలు మితిమీరినప్పుడు పిల్లిలాంటి స్త్రీ బెబ్బులిలా ఎలా తిరగబడుతుందో శ్రీమతి ఇంద్రగంటి జానకీబాల తమ నవలలో చాలా సహజంగా చిత్రీకరించారు.

నవలని కేవలం స్త్రీల సమస్యల చర్చావేదికలా తయారుచేయకుండా ఒక్కో పూవుని చేర్చి అందమైన మాల అల్లినట్టు ఒక్కో సమస్యనూ చాలా నేర్పుగా సహజంగా కథలో పొందుపరచి అందమైన నవలను అల్లారు రచయిత్రి. ఆదినుండీ స్త్రీ వంటరిగా జీవించలేదని భయపెట్టి, భద్రతకోసం బానిసత్వం అంటగట్టి, అదే పరమార్థమని నూరిపోసి ఆమెను అశక్తురాలిని చేస్తున్నారు. ఈ భద్రతకోసమే చేసిన పునర్వివాహంవల్ల ఉత్పన్నమయ్యే సమస్యలు అన్నీ ఇన్నీ కావు. పురుషుడు పెళ్లయి సంసారం చేసిన స్త్రీని పెళ్లి చేసుకుంటే ఎప్పుడో అప్పుడు కుళ్లు మాటలు అనక మానడు. అవిధంగా, స్త్రీ కూడా అనవచ్చు. కానీ అంటే చెల్లదు. మన వ్యవస్థాగత లక్షణాలు ఇవి. భార్యకు ఇంకొకరి ద్వారా పుట్టిన బిడ్డను ఏ భర్తా భరించలేడు. కానీ పురుషుడు మాత్రం పునర్వివాహం చేసుకునేటప్పుడు తనకు ఇంకొకరి ద్వారా పుట్టిన బిడ్డలని కన్నతల్లిలా కాపాడాలని ముందే షరతులు విధిస్తాడు. ఎంతో ఆదర్శవాదియైన రాజారావు కూడా తన రెండవ భార్యతో రాకేందు తనకి పుట్టిన బిడ్డ కాదని చెప్పవలసిన అవసరం కూడా లేదనే అనుకుంటాడు. స్త్రీ చనిపోయిన భర్త తాలూకు చిహ్నాలనేకాదు, జ్ఞాపకాలను కూడా వుంచుకోకూడదు. కాని పురుషుడు మాత్రం చనిపోయిన మొదటి భార్య ఫోటోని గోడకెక్కించి, పూలదండ వేసి నాకిదివరకే ఒక పెళ్లి అయింది సుమా అని అడుగడుగునా చాటగలడు.

రాకేందు ఉనికిని భరించలేని సవితి తండ్రి మధు కన్నకొడుకుని వదిలి వేయమన్నపుడే అనుపమలో మార్పుని, తెగింపుని చూపివుంటే కథ చాలా అసహజంగా వుండి వుండేది. సంప్రదాయమైన, పూర్వాచారపరాయణుల ఇంట్లో పుట్టి పెరిగిన ఈనాటి సగటు భారతీయ స్త్రీకి ప్రతీక అయిన అనుపమలో మార్పుని రచయిత్రి ఎన్నో సంఘటనల ద్వారా సహజంగా తీసుకువచ్చారు. ఉగ్గుపట్టినప్పుడూ, లాలపోసినప్పుడూ చివరికి తుమ్మినప్పుడు కూడా తన సంతానాన్ని 'చిరంజీవి' కమ్మని దీవించుకునే తల్లి చివరికి కన్నబిడ్డ ప్రతి

కవర్ ట్రాన్స్‌పరెన్సీ: అరుణ్ బేశేకర్

కుండగానే చనిపోయాడని చెప్పి తనకి కాకుండాచేసి మాతృబంధానికే విలువలేకుండా చేసినప్పుడు భరించలేకపోతుంది. రాకేందుని కూడా తన దగ్గరకు తెచ్చుకుని, భర్తని క్షమించి సినిమాలలోలాగా 'సహనశీలివమ్మా, త్యాగశీలవమ్మా...' అని మెప్పుని పొందివుంటే ఈ నవల ముగింపుని గురించి గొప్పగా చెప్పుకోవలసిన అవసరం వుండేదికాదు. అనుపమలో అభిలషణీయమైన మార్పుని తెచ్చి అసాధారణమైన ముగింపునిచ్చి, పిల్లి పులిలా ఎందుకు మారుతుందో చెప్పారు. అందుకనే నవలను ఆసాంతం చదివిన తరువాత అనుపమ తీసుకున్న నిర్ణయం సరిఅయినదే అని మనం హర్షిస్తాం, రచయిత్రిని అభినందిస్తాం.

**-తూములూరి కనకదుర్గ**
గుంటూరు

## ఫెమినిజం?

*(ద్వితీయ బహుమతి రు: 75/- పొందిన సమీక్ష)*

**ఈ** నెల నవల 'మాతృబంధం' పేరు చూడకుండానే రాసింది ఓ రచయిత్రి అని చెప్పగలిగేలా వుంది. పురుషాధిక్యాన్ని దుయ్యబట్టడం, స్త్రీని ఆకాశానికెత్తడం అరకాసు బుట్టలు, మురుగులు, మిలమిల మెరిసే ఎర్రటి గాజులు, ఆకుపచ్చని 'వెంకటగిరి' చీరవంటి స్త్రీ సహజమైన వర్ణనలు అడుగడుగునా తెలిసిపోతూనే వున్నాయి.

మొదట కామ్‌గా ఇంటరెస్టింగ్‌గా మొదలైన నవల మధ్యకొచ్చేసరికి పాత్రల మధ్య సంభాషణలు కొరవడి డాక్యుమెంటరీలా సాగింది. అన్ని పాత్రల తరపునా రచయిత్రే వకాల్తా పుచ్చేసుకుని చెప్పడం సబబుగా లేదు. సహజంగా, నెమ్మదిగా పాఠకులు జీర్ణించుకోవాల్సిన సంఘటనల్ని ఉరుకులు పరుగులు పెట్టించారు. రాహుల్ మరణం, సావిత్రి మరణం, నళిని మరణం ఇలాటివే! పాఠకులతో అనుబంధం ఏర్పడ్డ పాత్రల్ని పుటుక్కున చంపేయడం, మొదట్నించీ నళిని వ్యక్తిత్వాన్ని అదేపనిగా వర్ణించి హఠాత్తుగా ఆమెను చంపేసి చరమగీతం పాడడం విచిత్రం! కుక్కపిల్లలంటే ఇష్టపడే నళిని కుక్కకాటుకే మరణించడంలో ఉద్దేశం ఆ పాత్రపట్ల సానుభూతి కలగడమే అయితే, ఆ విషయంలో విఫలమయినట్లే.

మధు వ్యక్తిత్వాన్ని చిత్రీకరించడంలో వివక్షత చూపించారే తప్ప నిష్పాక్షికంగా వ్యవహరించలేకపోయారు. కేవలం ధనార్జనా వ్యామోహం కలవాడుగా పరిచయం చేయబడ్డ మధుకు అన్ని అవలక్షణాలూ అంటగట్టి పచ్చి దుర్మార్గుడుగా తేల్చారు. అతని వ్యక్తిత్వంలో వచ్చిన మార్పుల్ని రచయిత్రి సరిగా చూపలేదు. కేవలం పురుషాహంకారానికి ప్రతీకగా మధును చిత్రీకరించి, తన కసి తీర్చుకున్నారు అంతే!

రాజారావు భార్య నళిని చనిపోవడం, ఆమె స్థానే లక్ష్మి రావడం పరిశీలిస్తే అసలు కథకీ దీనికీ పొంతనలేదు. ఇది అసలు కథను ఎంతమాత్రమూ మార్చదు. కేవలం చివర్లో అనుపమ రాజారావుతో "నీ భార్యపోతే ఆమె ఫొటో ముందుగదిలో వేలాడదీశావు. మరి నా భర్త ఫొటోని నేనెందుకు దాచుకోవాలి?" అని అడుగుతుంది. ఇలా పోలిక తీసుకువచ్చేందుకే రాజారావుకు ఇద్దరు భార్యలు కావల్సివచ్చిందా? గతంలో వచ్చిన 'స్రవంతి' సినిమాలో కూడా ఇదే సమస్య. అందులో హీరోయిన్ (సుహాసిని) రెండవ భర్త (శరత్‌బాబు) ఆమె మొదటిభర్త ఫొటోను చూస్తే సహించడు. తాను మాత్రం తన మొదటి భార్య ఫొటోను నట్టింట్లో వేలాడదీస్తాడు. అయితే అక్కడ హీరోయిన్‌కూ, ఆమె తొలిభర్తకూ మధ్యగల అనుబంధం హృద్యంగా చూపారు. ఇక్కడసలు రాహుల్‌పై అనుపమ ఎందుకంత ప్రేమ పెంచుకుందో కనీసం నాలుగు వాక్యాలైనా వ్రాయలేదు. 'అనురాగంతో కొన్ని హృదయాలు ముడిపడేందుకు ఒక్కక్షణం చాలు' అని తప్పించుకొన్నారేగానీ వారిమధ్య బలమైన సన్నివేశం ఒక్కటీలేదు.

అంతటి హుందాయైన రాజారావుచేత 'బ్లాక్‌మెయిల్' చేయించి చివర్లో చీప్ ట్రిక్ ప్లేచేశారు. కేవలం స్త్రీ వాదాన్ని (ఫెమినిజం) ఊతగా తీసుకుని సమాజ సంస్కరణకోసమన్నట్లు చేసిన ప్రయత్నమే 'మాతృబంధం' నవల!

**-వక్కలంక కిషోర్**
అమలాపురం



## చక్కని స్ఫూర్తి

*(తృతీయ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

తరతరాలుగా పురుషాహంకార ఉక్కుపాదం కింద పడి నలిగిపోతున్న నలిపివేయబడుతున్న స్త్రీ మనసుకి, ఇష్టాఇష్టాలకి, అభిప్రాయాలకి నవలా రూపమైన 'మాతృబంధం' ప్రతి మాతృమూర్తికి ఓ స్ఫూర్తినిచ్చేదిలా ఉంది.

సంభాషణలు, శైలి, వర్ణనల పరంగా కాక పోయినా ఇతివృత్తపరంగా ఓ చక్కటి నవల 'మాతృబంధం'.

ఏడు మల్లెలెత్తుగా, అతిగారాబంగా పెంచిన అనుపమని విధి చిన్నచూపు చూస్తే...

తమ దగ్గరికి అనాధలా వచ్చిన ఓ అనామకుడైన మధు 'మీ అమ్మాయిని నేను పెళ్లి చేసుకుంటాను' అనగానే అదేదో దేవుడి వరమన్నట్టు మళ్లీ లేటయితే ఆ వరం అందకుండా పోతుందన్నట్టు...

భర్తపోయిన దుఃఖంనుంచి పూర్తిగా కోలుకోని అనుపమ మెడకి బలవంతంగా ఉచ్చుబిగిస్తూ, ఆ ఉచ్చు నీ సుఖం కోసమే బిగిస్తున్నామనటం తప్పిస్తే... 'నేను మనిషిననుకుంటున్నారా? దొడ్లో కట్టేసిన పశువుననుకుంటున్నారా?' అన్న అనుపమ ఆక్రందనని ఎవ్వరూ పట్టించుకోకపోవటం... విలువలేని ఆడపిల్ల ఇష్టానికీ, మనసుకి ఓ ఉదాహరణ.

పేదరికంలో దరిద్రాన్ని చవిచూస్తూ పెరిగిన మధులో వేళ్లూనుకున్న ధనాపేక్షకూడా చివరికి అసహాయంగా అల్లాడుతున్న అనుపమని 'ఆదర్శం' పేరుతో పెళ్లిచేసుకోవటం ద్వారా తీర్చుకోవటం, ఆమె ధనంవల్ల తను లాభం పొందుతూ కూడా ఆమెని మానసికంగా చిత్రహింసలు పెట్టిన కుసంస్కారం... చివరికి స్త్రీకి అపురూపవరమైన మాతృత్వాన్ని కూడా కఠినంగా శాసించిన క్రూరత్వం...లకి కూడా అతని పరంగా వక్రభాష్యాలు చెబుతూ సమర్థించిన మిగతావారి అభిప్రాయాలు తరతరాలుగా సంఘం మగవాడికిచ్చిన అధికారానికి ప్రతీక.

స్త్రీ పునర్వివాహం గురించి ఉపన్యాసాలిచ్చే ఆదర్శవాదులు పునర్వివాహంవలన స్త్రీకి కలుగుతున్న ప్రయోజనాలతోపాటు సమస్యలు, మానసిక క్షోభల గురించి కూడా ఆలోచించరు. ఆలోచించినా అతని ఆదర్శానికి స్త్రీని మానసికంగా ఆమాత్రం హింసించే హక్కుందని సమర్థిస్తారు.

-ఎన్.రాజేశ్వరి
పాలకొండ

## కనువిప్పు

*(రు: 25/- బహుమతి పొందిన సమీక్ష)*

ఆదర్శం, అభ్యుదయం పేరుతో భర్త పోయిన స్త్రీకి పునర్వివాహం చేస్తున్నామని గొప్పలు చెప్పుకోవడం కాకుండా రెట్టింపు జాగరూకత వహించాలని చెప్తూ, 'మాతృబంధం' నవలలోని రాసువేంద్రరావు, సావిత్రిలవంటి తల్లిదండ్రులకు కనువిప్పు కలిగించేలా ఉంది జూలై 'చతుర' నవల.

స్త్రీ పునర్వివాహం అనేది మనదేశంలో ఇంతకుముందు సమాజంలో అరుదైనప్పటికీ ఇప్పుడది సర్వసాధారణవిషయంగా వింటున్నాము, చూస్తున్నాము. అందువల్ల ఈ నవలను ప్రచురించి, ప్రోత్సహించడమనేది కొత్తబాటకు ముందుండి దారిచూపించడమే. ఇది 'చతుర' ఉత్తమాభిరుచికి చిహ్నం.

'పిల్లిని కూడా గదిలో బంధించి కొడితే పులైపోతుంది' అనే లోకోక్తి పిల్లివంటి అనుపమ విషయంలో నిజమయింది. ఈ నవలలోని హీరోయిన్ మానసిక సంఘర్షణ చదివిన తరువాత స్త్రీలకు పునర్వివాహం అనేది కత్తిమీద సాములాంటిదని అర్థమవుతుంది. అటువంటి పరిస్థితి ఎదురయినప్పుడు తగు ముందుచూపుతో వ్యవహరించాలని హెచ్చరిస్తుంది.

అచ్చంగా మధులాంటి కారెక్టర్సే కాకపోయినా ఆదర్శం పేరుతోనో, వాళ్ళనేదో ఉద్ధరిస్తున్నామన్న జాలితోనో లేదా అందానికో, డబ్బుకో ఆకర్షితులై భర్తపోయిన స్త్రీలను వివాహం చేసుకోవడానికి ముందుకు వచ్చే యువకులు ముందు తమ మనస్తత్వాన్ని అర్థంచేసుకుని, వాళ్ళు ఎదుర్కోబోయే సమస్యలను విశ్లేషించుకుని, ఆచరణలో ఆదర్శం అనేది ఎంత





కష్టమో తెలునుకుని మరీ ముందుకు అడుగు వేస్తారు ఈ నవల చదివిన తరువాత.

ఈ నవలద్వారా స్త్రీ పెళ్ళినాటికి ఎంతటి ముగ్ధ అయినా తర్వాత వయసుతో వచ్చే ధైర్యం, ముఖ్యంగా పరిస్థితుల ప్రాబల్యంవల్ల తనకు జరిగే అన్యాయాలను ఎదిరించగల దనీ, అవసరమైతే ఆదిశక్తి అవతారం కూడా ఎత్తగలదనీ హెచ్చరించింది.

-యం.రాజశ్రీ
హైదరాబాద్

## ఇది ఎందరి కథో...!

*(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

ఈనెల 'చతుర' నవల ఇంద్రగంటి జానకీబాలగారి 'మాతృబంధం' చదువుతున్నంతసేపూ కంటతడి పెట్టించేలా వుంది. అనుపమకొచ్చి నన్ని కష్టాలు పరాయివాళ్ళకు కూడా రాకూడద నిపించింది. మన పురుషాధిక్య సమాజంలో, స్త్రీలు ఎన్నో రంగాలలో ముందడుగు వేస్తున్నా వంచనలకు, వేదనలకు గురి అవుతూనే వున్నారు.

ఇది ఒక్క అనుపమ కథే కాదు. ఇలాంటి అనుపమలు దేశంలో ఎందరో వున్నారు. ఆదర్శవాదులం అని చెప్పుకుంటూ స్త్రీ వెనుకే వస్తున్న ఆస్థిని చూసి ఆమెను పునర్వివాహం చేసుకొని, తర్వాత అన్యాయం చేసే పురుష పుంగవులు మన కళ్ళముందే వున్నారు.

రాజారావు పునర్వివాహానికి, అనుపమ పునర్వివాహానికి వున్న తేడాను చూపించి, మన సమాజంలో స్త్రీ, పురుషులమధ్య వున్న అసమానతలను వేలెత్తి చూపించారు రచయిత్రి. "నళిని చనిపోతే ఆమె ఫోటోను ముందుగదిలో గోడకి తగిలించి దండవేశావు. నీ కన్నబిడ్డ కాకపోయినా, వాడిని పెంచి పెద్దచేసే బాధ్యత ధైర్యంగా నీ రెండోభార్యకు అప్పగించగలిగావు. ఏం? ఎందుకని? ఈ వ్యత్యాసం, స్త్రీ పురుష బేధం... నీలాంటి బాధ్యత కాదా నాది? నీలాంటి మనసు కాదా నాది?" అంటూ అనుపమ చివరలో అడిగిన ప్రశ్నలు ఒక్క రాజారావునే, మధునో ప్రశ్నించినవి కాదు. సమాజాన్ని నిలదీసి అడిగిన ప్రశ్నలు.

ఆడది తనకి జరిగిన అన్యాయాన్ని ఎదిరించాలనుకున్నప్పుడు ఆమె అపరకాళియే అవుతుంది. అది అనేక సంఘటనలలో ఋజువవుతోంది కూడా. ఇటువంటి సాంఘిక చైతన్యం తెచ్చే రచనలే నేటితరం స్త్రీలందరూ కోరుకునే నవలలు. ఈ నవల రచించిన రచయిత్రిగారికి, ప్రచురించిన మీకు ధన్యవాదాలు.

-శాంతి.పి
మధిర

## పురుషద్వేషం?

*(రు: 25/- బహుమతి పొందిన సమీక్ష)*

ఈనెల 'చతుర' నవల ఇంద్రగంటి జానకీబాలగారి 'మాతృబంధం' పూర్తిగా పురుషద్వేషంతో రాసినట్లుంది. నవలలోని అనుపమ, సావిత్రమ్మ, నళిని, లక్ష్మి, సుభద్రమ్మ పాత్రలను ఎంతో మంచివాళ్ళుగా, సహనశీలురుగా వర్ణించి, ఒక్క మధుపాత్రలోనే పురుషులమీద ఉన్న ద్వేషాన్నంతటినీ వెళ్ళగక్కారు. ఇది చాలా అసమంజసంగా వుంది. ఈ సమాజంలో భార్య చనిపోయిన మగవాడు తన పిల్లలను చూసుకోవటానికి వేరే స్త్రీని పునర్వివాహం చేసుకుంటే ఆ వచ్చిన స్త్రీ తన సవితి పిల్లలను ఎంతవరకు ప్రేమగా చూడగలుగుతుంది? ఎంతమంది పిల్లలు సవతి తల్లుల ప్రేమకి నోచుకోకుండా అనాథలుగా వీధులపాలు, రైల్వే ఫ్లాట్‌ఫారంలపాలు కావటంలేదు? రచయిత్రిగారు చెప్పదలచుకున్న సందేశం రెండువైపులనుంచి అంటే స్త్రీలవైపునుంచి, పురుషులవైపునుంచి ఆలోచించి చెప్పినట్లైతే బాగుండేది. మార్పు రావాలి అంటే అది స్త్రీలోనే రావాలి. స్త్రీ తనచుట్టూ తాను ఒక పరిధి ఏర్పరచుకొని అంతవరకే ఆలోచించగలుగుతుంది. తల్లి చిన్నప్పుడు ఆడపిల్లలను ఒక కట్టుబాట్లతో, కొన్ని పరిధులలో పెంచుతుంది. మార్పు పెంపకంలోనించే రావాలి. రచయిత్రిగారు నవలలో పాత్రలకు సరిగ్గా న్యాయం చేయలేకపోయారు.

-అవుతు సంజీవరెడ్డి
మస్కట్



## సచిత్ర-విచిత్రం



తమ లగేజీతో దేశదేశాలు సైకిల్‌మీద పర్యటిస్తున్న పాట్రిస్ దంపతులు

# దంపతుల సైకిల్ పర్యటన

పాట్రిస్, ఫ్రాంకోయిజ్‌రైడర్ అనే ఈ ఫ్రెంచి దంపతులు ఐరోపా, ఆసియా, ఆస్ట్రేలియా, ఇంకా మధ్య తూర్పుదేశాలూ కేవలం తమ సైకిలుమీదే చుట్టబెట్టివచ్చారు. సుమారు నాలుగు సంవత్సరాల పాటు సాగిన ఆ పర్యటనలో వారు ఎదుర్కొన్న అనుభవాలు వర్ణనాతీతం. ఆస్ట్రేలియాలో పర్యటించేప్పుడైతే ఓసారి వారి లగేజీతోపాటు, మరెన్నో ముఖ్యమైన ఫొటోలు, డైరీలు పోయాయి. అయినాసరే ధైర్యం కోల్పోకుండా వారు తమ పర్యటనను కొనసాగించారు. దేశదేశాలన్నీ సైకిల్‌పై పర్యటనచేసి రికార్డు సృష్టించిన ఈ దంపతులు తమ సాహస యాత్ర గురించి ఓ పుస్తకం రాయబోతున్నారు.

# చతుర కతలు

## కొంపముంచిన ఆదర్శం

వంటింట్లో ఏదో భళ్ళున పగిలిన చప్పుడు!

కంగారుపడుతూ పరుగెత్తాడు కాంతారావ్.

గాజుగ్లాసు కిందపడి ముక్కలుచెక్కలై కన్పించింది. చెల్లాచెదురైన ఆ ముక్కలమధ్య వణికిపోతూ నిలబడిఉంది అలివేలు.

"ఏమిటి? ఏంజరిగింది?" అడిగాడు కాంతారావ్.

భయంభయంగా అతనివంక చూసిందామె. "మీ... మీ... గాజుగ్లాసు తుడుస్తుంటే... చెయ్ జారిపోయింది..." ధారాపాతంగా అలివేలు కళ్ళనుండి నీళ్ళు కారిపోతున్నాయి.

గ్లాసు పగిలినందుకు తనెక్కడ తిడతాడోనని ఆమె బెదిరిపోవడం చూసి జాలిపడ్డాడు కాంతారావ్. ఆమెకు ధైర్యంచెప్పాలన్పించిందతనికి.

"సర్లే... ఏడవకు అలివేలూ... పోతేపోయిందిలే వెధవ గ్లాసు..."

అయినా ఏడ్పు మానలేదు అలివేలు.

"బంగారంలాంటి మీ గ్లాసు పగలగొట్టానయ్యా పాపిష్టిదాన్ని" అంటూ మళ్ళీ రాగం ఎత్తుకొంది.

"ఫర్వాలేదన్నాగా... ఇక ఆ ఏడ్పు ఆపెయ్?..."

"అయ్‌గారి గ్లాసు పగలగొట్టానని తెలిత్తే మా అమ్మ సంపేత్తాది" కళ్ళు తుడుచుకుంటూ అంది అలివేలు.

"పిచ్చిపిల్లా! అసలు మీ అమ్మకి విషయం చెప్పడమెందుకు? అయినా ప్రతిసారీ 'మీగ్లాసు', 'మీ గ్లాసు' అంటావెందుకు? నువ్విక్కడ పనిచేస్తున్నావుగాబట్టి ఈ సామానంతా నాదేకాదు, నీదికూడా అనుకోవాలి. అంటే మనదన్నమాట... అది గుర్తుంచుకో..."

ఆమెకు ధైర్యం చెప్పి శోకాన్ని మాన్పించేసరికి తలప్రాణం తోకకి వచ్చింది కాంతారావ్‌కి. పనిమనుషులు అసలే దొరకని ఈ రోజుల్లో కాంతా



రావ్‌లాంటి బ్రహ్మచారికి వంటపని, ఇంటిపని చేసే పనిపిల్ల దొరకడం అదృష్టమనే అనుకోవాలి. పనిమనుమల తలనొప్పి పడలేక కొన్నాళ్లు హొటల్ తిండి తిన్నాడు కానీ ఆరోగ్యం చెడింది. దాంతో మళ్లీ పనిమనుమలకోసం అతడు పాకులాడక తప్పలేదు. అందుకే - ఏమంటే ఆమె పనిమానేస్తుందోనన్న భయంతో అలివేలును అపురూపంగా చూసుకుంటున్నాడతను.

★ ★ ★

ఆరోజు కాంతారావ్‌కి ఓ పెళ్లి సంబంధం వచ్చింది. కాబోయే వియ్యంకుడ్ని వెంటపెట్టుకొని కాంతారావ్ తండ్రి తన కొడుకుని చూపించేందుకు పట్నానికి వచ్చాడు.

తన కాబోయే అల్లుడిదగ్గర అలివేలులాంటి వయస్సులోవున్న పిల్ల పనిచేస్తుండడం ఆ వియ్యంకుడిగారికి నచ్చలేదు. అయినా మర్యాదకోసం మౌనంగా ఉండిపోయాడు. అదీగాక తనది కేవలం అనుమానమే... అసలు నిజం ఏమిటో నిలకడమీద అదే తెలుస్తుందిలెమ్మని ఊరుకుండిపోయాడాయన.

అలివేలు వంటచేసి ముగ్గురికీ టేబిల్‌మీద అన్నీ సర్దిపెట్టి పక్కగదిలోకి వెళ్లింది. తన కొడుకు గుణగణాల్ని గురించి, గొప్పదనం గురించి వియ్యంకుడికి ఊదరగొట్టేస్తున్నాడు కాంతారావ్ తండ్రి. కాంతారావ్ మౌనంగా తింటూ కాబోయే మామగారు పెరుగు గిన్నెకోసం వెదుక్కోవడం గమనించాడు. అది టేబుల్‌మీద పెట్టడం అలివేలు మర్చిపోయినట్లుంది.

"అలివేలూ... అలివేలూ..." అంటూ వెంటనే పిలిచాడు కాంతారావ్.

"వస్తున్నానయ్‌గారూ..." అందేగానీ ఐదు నిముషాలదాకా అలివేలు లోపల్నుంచి ఇవతలికి రాలేదు.

"ఇప్పటిదాకా ఏంచేస్తున్నావ్. మామయ్యగారికి పెరుగు వడ్డించు..." చిరాకుగా అన్నాడు కాంతారావ్.

"ఏంలేదయ్‌గారూ... అక్కడ ఒక ఎలక మన బెడ్‌రూంలో దూరి మన పరుపంతా కొట్టేస్తావుంటే... దాన్ని సంపి వస్తున్నా! లేకుంటే రాత్రికి మనం పడుకోడం కష్టంగదా..." అయ్‌గారికి కోపం రాకూడదని అమాయకంగా 'మన' 'మన' అంటూ వత్తిపలికింది అలివేలు.

అంతే! కాబోయే మామగారు పెరుగు వడ్డించుకోకుండానే చివాలున లేచి చేతులు కడిగేసుకున్నారు.

కాంతారావ్, అతని తండ్రి ముఖముఖాలు చూసుకుంటూ కూర్చుండిపోయారు.

-ప్రతాపచంద్ర

## స్పెషలిస్ట్

"సార్...సార్... టెర్రరిస్టుల ఆచూకీ తెలిసింది" ఉత్సాహంగా వచ్చి చెప్పాడు ఇన్స్పెక్టర్, కమీషనర్‌తో.

"ఎలా తెలిసింది? ఎక్కడున్నారు?" ఆత్రంగా ప్రశ్నించాడు కమీషనర్.

"మన ఇన్ఫార్మర్లద్వారా తెలిసింది సార్"

"వెరీగుడ్. వెంటనే మన స్క్వాడ్‌ని వెళ్ళి కన్‌ఫర్మ్ చేసుకొమ్మని చెప్పు. ఎవ్వరూ వాళ్ళను కనిపెట్టినట్టు అనుమానం రాకూడదు. ఈలోగా నేను ఐ.జి.గారితో మాట్లాడి, వాళ్లను పట్టుకోవట్టానికి ప్లాన్ ఆలోచిస్తాను" చెప్పాడు కమీషనర్.

చకచకా ఏర్పాట్లన్నీ జరిగిపోయాయి గానీ, ఒక్క విషయంలో ఆటంకం కలిగింది. టెర్రరిస్టులందరి దగ్గరా సైనేడ్ క్యాప్సూల్స్ వున్నాయని ఖచ్చితంగా తెలుసు. కాని సైనేడ్ విరుగుడు మందు రెడీగా లేదు. వెంటనే ఢిల్లీకి ఫోన్‌చేసి సంప్రదించారుగానీ యాంటీసైనేడ్ మందు పంపటానికి మరునాటివరకూ గానీ వీలుకాదని తెలిసింది. అది కూడా ప్రత్యేక హెలికాప్టర్ ద్వారా తెప్పిస్తేగానీ ఆ మాత్రం తొందరగా రాదు. ఏం చేయాలో తెలీలేదు.

"సార్, తమిళనాడులో శ్రీలంక టెర్రరిస్టు టైగర్ శివరాసన్‌ని పట్టుకునేప్పుడూ యిలాగే జరిగి పోలీసులకు చెడ్డ పేరొచ్చింది. అసలీ






టెర్రరిస్టుల దగ్గర సైనేడ్ క్యాప్సూల్స్ వున్నాయని తెలియటం యిదే మొదటిసారి మనకు. లేకపోతే మనమూ యాంటీసైనేడ్ డ్రగ్స్ దగ్గరుంచుకునేవాళ్ళం. ఇప్పుడు తొందరపడితే తప్పు. పడకపోయినా తప్పు'' విచారంగా అన్నాడు కమీషనర్.

''హోమ్‌మినిస్టర్‌కు పరిస్థితి వివరించి ఆదేశాలు తీసుకుందాం'' అన్నాడు ఐ.జి.

''ఐనా, ఒకవేళ పొరపాటున ఏదైనా అయితే మన డిపార్ట్‌మెంట్‌నే నిందిస్తారు, పోలీసులు అసమర్థులంటారు''

ఇలాంటి తరుణంలో ఓ ఇన్‌స్పెక్టర్ చెప్పాడు-

''సార్, మనం వెంటనే దాడిచేయటమే మంచిది. ఒకవేళ నిజంగానే ఈ తీవ్రవాదుల దగ్గర సైనేడ్ వుండి, వాళ్ళు దాన్ని మింగారే అనుకుందాం. ఆ సైనేడ్‌వల్ల వాళ్ళు చచ్చిపోక ముందే కాపాడటానికి ఓ మార్గం వుంది...'' వివరించాడు ఇన్‌స్పెక్టర్ ఈశ్వర్.

అతను చెప్పింది విని, సగం నమ్మకంతోనే అయినా, చివరకు ఒప్పుకున్నాడు ఐ.జి.

''వెంటనే ఆయన్ని పిలిపించండి. ఎందుకైనా మంచిది, అంబులెన్సులు కూడా 'జీరో అవర్'కి స్పాట్‌కొచ్చే ఏర్పాటు చేయండి''

''మంచిది సార్'' వినయంగా బదులిచ్చాడు ఇన్‌స్పెక్టర్ ఈశ్వర్.

అనుకున్న ప్రకారంగా దాడిజరిగింది. కాసేపు కాల్పులు, ఎదురు కాల్పుల అనంతరం టెర్రరిస్టుల దగ్గరి అమ్యూనిషన్ ఐపోయింది లొంగిపోక తప్పదని తెలియగానే టెర్రరిస్టులంతా సైనేడ్ క్యాప్సూల్స్ మింగేసారు. పోలీసులకు పరిస్థితి అర్థమయింది.

''సార్, నా మాట దక్కించండి'' తను తీసుకొచ్చిన పెద్దమనిషితో అన్నాడు, ఇన్‌స్పెక్టర్ ఈశ్వర్.

''మీరేం వర్రీ అవకండి. మనం వెళ్ళేసరికి ప్రమాదమేమీ జరగకపోతే నాదీ బాధ్యత'' అభయమిచ్చాడా పెద్దమనిషి.

కాస్సేపటికి పోలీసులు, టెర్రరిస్టుల స్థావరంలోకి ప్రవేశించారు. ఇన్‌స్పెక్టర్ ఈశ్వర్‌తో వచ్చిన పెద్దమనిషి రెండు నిమిషాల్లోనే మొత్తం ఏడుగురు టెర్రరిస్టుల చేత సైనేడ్ క్యాప్సూల్స్ కక్కించాడు. మరుక్షణంలో వైద్యులు వచ్చి, చికిత్సచేశారు. పదినిమిషాల తరవాత టెర్రరిస్టులెవరికీ ప్రాణభయంలేదని తెలియగానే పోలీసు అధికారులు హాయిగా ఊపిరిపీల్చుకున్నారు.

''సార్, ఇంతకీ ఆయనెవరు? ఏం స్పెషలిస్టు?'' ప్రశ్నించాడు, అంబులెన్సులో వచ్చిన డాక్టర్, ఆ పెద్దమనిషిని.

''ఈయనా, మొత్తానికి నామాట దక్కించిన ఈయన ఇన్‌కమ్‌టాక్స్ డిపార్ట్‌మెంట్‌లో సీనియర్ ఆఫీసర్లెండి'' పరిచయం చేశాడు ఇన్‌స్పెక్టర్ ఈశ్వర్.

''నేను చెబుతూనే వున్నానుగదా, భయం లేదని. మహామహులతో మూలమూలనున్నవన్నీ ముక్కుపిండి, కక్కించాను. ఇదో పెద్ద పనా!'' తేలిగ్గా అన్నాడా సదరు ఆదాయపు పన్నుశాఖ పెద్దమనిషి.

-వినయ్



# చతుర

సంపుటి :15 సంచిక :8 సెప్టెంబర్ 1992

ఆధునిక యుగంలో ఈ ప్రపంచాన్ని ఏకచ్ఛత్రాధిపత్యంగా ఏలుతున్నది 'డబ్బు'.

తల్లికి- బిడ్డకి, అన్నకి-తమ్ముడికి, అక్క-చెల్లెళ్ళకు మధ్య కూడా అంతరాల అడ్డుగోడలను నిలిపి తన ఆధిపత్యాన్ని సదా పెంచుకుంటూ వస్తోందీ డబ్బు.

అయినా... అదే విశ్వజనీన సత్యం కాదనీ, తమ మేధాశక్తితో, నిరంతరకృషితో, మానవతా దృక్పథంతో ఎలాంటి పరిస్థితులనయినా అధిగమించి మన్ననలందుకోవచ్చనీ నిరూపిస్తూ... తన జీవితాన్ని ఒక అద్భుత మార్గంలో పయనింపచేసిన ఓ అమ్మాయి సాహసాల్ని అక్షరబద్ధం చేస్తూ తనికెళ్ళ కల్యాణి రాసిన 'సామర్థ్యం' ఈనెల చతుర సమగ్ర నవల.



సూర్యుడి వేడి కిరణాలు లోకంలో ప్రసరిస్తూ న్నా చలిగాలులు మాత్రం సాయంత్రం అవ గానే ప్రజలను బాధపెడుతూనే ఉన్నాయి. డిసెంబరు నెల చివరి రోజులవడం వలన అవి మరింత తీవ్రంగా తమ ప్రతాపాన్ని చూపిస్తున్నాయి. వేసవి కాలపు వేడిమికైనా, శీతాకాలపు చలికైనా తలవంచవలసిందేగదా.

లోకంతో పనిలేనట్లు ఆ ఇంట్లో మాత్రం వాతావరణం వేరుగా కన్పిస్తోంది. అక్కడ ఒక వైరాగ్య ధోరణి, నిరాశ తాండవమాడుతు న్నాయి.

విశాలంగా ఉన్న ముందు గదిలో ఒక మూలగా కూర్చుని నిశ్శబ్దంగా ఏడుస్తోంది వసుధ. బాగా ముడుచుక్కూర్చున్న వసుధ తల ముడుకులమీద పెట్టుకొని ఉండటంతో ఆమె మొహం గదిలోనున్న వారికి కన్పించ డంలేదు. దుఃఖంవలన ఎగిరెగిరి పడుతున్న ఆమె భుజాల కదలికే, ఆమె ఎంతగా ఏడు స్తోందో చెపుతోంది. తల్లి పక్కనే కూర్చుని ఏడుస్తోంది ప్రీతి.

రామచంద్రం నిస్సహాయంగా మరదలి వైపు చూశాడు. ''చూడమ్మా! నువ్వు ఎంత ఏడ్చినా పోయిన నా తమ్ముడు తిరిగి రాడు గదా! నాకు మాత్రం దుఃఖం లేదా? ఏం చేస్తాం చెప్పు. చెట్టంత తమ్ముడు చనిపోయాడంటే నాకు నమ్మకం కలగడంలేదు. ఇంత సంసారా న్నీ ఏం చేద్దామని భగవంతుడు వాడిని అలా తీసికొనిపోయాడో?

ఆ దేముడు నీ నడుం విరిచేశాడు. నీ ఇల్లు కూల్చేశాడు. నిన్ను నిరాధారురాలిని చేశాడు. ఈ ముగ్గురు పిల్లలతో నీ బతుకు ఇంక గోదారే కాబోలు. ఎలాంటి రాత రాశావురా భగ వంతుడా!''అంటూ భార్య కామేశ్వరివైపు చూశా డు.

''ఏం చేస్తాం? అతడికి ఆయువు తీరిపో యింది, వెళ్ళిపోయాడు. పోయిన వాళ్ళతో సమానంగా మనమూ పోతామా? గుండె దిటవు చేసికొని బతకాలి. నారు పోసినవాడు నీరు పోయడా?'' అంటూ సాగదీసింది కామేశ్వరి.

అది వాళ్ళని ఓదార్చడమో, లేక వాళ్ళ బాధ్యత తమమీద పడకుండా జాగ్రత్తపడ టమో అక్కడ ఉన్నవారికి అర్థమవలేదు.

''అది కాదే! వసుధ ఎంత మంచిది- ఎంత యోగ్యురాలు. అటువంటి దానికి ఇటువంటి కష్టమా? ఏ ఆశ చూసుకొని ఇంక అది బతుకు తుంది చెప్పు. భగవంతుడు దాన్ని చావు దెబ్బకొట్టాడు. చదువా, రాదు. తమ్ముడు దాచిన డబ్బా లేదు. ఉన్న ఆ ఉద్యోగాన్న యినా వాడు వదలకుండా ఉంటే పిల్లలకో, దానికో ఆ ఉద్యోగం వచ్చేది. తిక్కవెధవ... ఉన్న ఉద్యోగం వదిలేశాడు. ఈ పిల్లలని అది ఎలా సాకుతుంది?'' అంటూ మరదలివైపు జాలిగా చూశాడు రామచంద్రం.

''నువ్వు ఉండగా నీ తమ్ముడి కుటుంబం ఎందుకు అనాథ దవుతుందిరా? వాళ్ళని మీ రు ఎలాగోలాగ ఒక ఒడ్డుకు చేర్చకపోతే ఎలాగ?'' అంటూ లక్ష్మమ్మ కన్నీళ్ళు తుడుచు కొంటూనే కొడుక్కి కర్తవ్యబోధ చేసింది.

రామచంద్రం ఈ ప్రమాదాన్ని ముందే ఊహించినట్లున్నాడు. పైమీది కండువా తీసి, ఒకసారి మొహం తుడుచుకొన్నాడు. అతడి వైపు కామేశ్వరి అర్థవంతంగా చూసింది.

''ఏనుగు పడిపోతే ఏనుగే లేపాలమ్మా! ఒక కుటుంబాన్ని మరో కుటుంబం పోషించడం మాటల్లో పనా? సర్లే... నీకేం నువ్వు ఏదో చెప్పేస్తావు. భాను పోయాడని వింటేనే నా నవనాడులూ క్రుంగిపోయాయి. ఎంత ఆపద తెచ్చావురా భగవంతుడా! వాళ్ళకి ఏది దారి అని బెంగపడ్డాను. భాను ఎందరికో సహాయం చేసేవాడు. ఆ పుణ్యమైనా వాడిని కాయలేదు. వాడి కుటుంబం దిక్కులేనిదైపోయింది. వాడి ఇల్లు కూలిపోయింది''

అలా అంటున్న పెదతండ్రివైపు ఎర్రబడిన కళ్ళతో చూస్తూ గయ్యిమని లేచింది శ్రుతి.

''చూడండి పెదనాన్నా! మీరు మాకూ, మా అమ్మకీ ధైర్యం చెప్పడానికి వచ్చారో, లేక భవిష్యత్తంటే మాకు భయం కలిగించడానికి వచ్చారో అర్థమవడంలేదు. మా అమ్మకి ఈ ఆపద సమయంలో మీరు చెప్పవలసిన మాట లు ఇవా? అసలే దారీతెన్నూ కనబడక అలమ టిస్తున్న ఆ అమాయకురాలిని మీరు మరింతగా బాధపెడుతున్నారు. భయపెడు తున్నారు. మా అమ్మకేం? ముగ్గురు పిల్లలు





న్నారు. మా నాన్నగారు పోయినా మేము ఉన్నాం కదా! మా ఇల్లు ఏ దేముడూ కూల్చలేడు. మా నాన్నగారు ఏనాడూ ఎవరికీ అన్యాయం చేయలేదు. భగవంతుడే మాకు అండగా నిలబడతాడు. నేను ఉండగా మా అమ్మకి ఏమీ లోటు లేదు. నేను కూడా చనిపోయిననాడు మా అమ్మ నిజంగా నిరాధారురాల వుతుంది'' అంటున్న శ్రుతి కంఠంలోని తీక్షణతకి, రామచంద్రం, అతని భార్య ఒక్కనిముషం జడిశారు.

''శ్రుతీ'' అంటూ ఆమె మాటలు భరించలేని దానిలాగ వసుధ దగ్గరికి తీసికొంది. ఆమెతోపాటు భరత్‌కూడా తల్లి ప్రక్కన కూలబడ్డాడు.

''శ్రుతీ! నా తల్లీ! నీకు ఎంత కష్టం వచ్చిందే? నేను మిమ్మల్ని ఎలా పెంచగలను? ఏం చేయగలను? ఆ భగవంతుడు మీ నాన్నగారి బదులు నన్నయినా తీసికొనిపోయాడు కాదు'' అంటూ శ్రుతి తలనిమురుతూ ఏడ్చేసింది వసుధ.

''అమ్మా! నేనుండగా నీకు, చెల్లికి, తమ్ముడికి భయం లేదమ్మా! మమ్మల్ని చూసుకొని నువ్వు బతకాలమ్మా! మా కోసం నువ్వు బతకాలి. నాన్నగారూ లేక, నువ్వూ లేకపోతే మేం ఏమవ్వాలి? భగవంతుడు అన్నివిధాలా మనుషుల్ని అన్యాయం చేయడమ్మా! ఎవరి మాటలూ నువ్వు పట్టించుకోవద్దు. నామీద నీకు నమ్మకం ఉందా లేదా చెప్పు'' అంటూ తనని చుట్టుకొన్న తల్లిచేతిని పట్టుకొని అడిగింది శ్రుతి.

ప్రీతి ఏడుస్తూ అక్కవైపు బేలగా చూసింది.

''తల్లీ! నువ్వు మగపిల్లవాడివైనా కాదు ఆడపిల్లవి. ఇంత పెద్ద కుటుంబాన్ని ఎలా నడిపిస్తావే? మీ పెదనాన్న మావయ్యలు మాత్రం మిమ్మల్ని అనాథలుగా వదిలేస్తారా? వాళ్ళే ఇంక మీకు దిక్కు. వాళ్ళే మీకు ఒకదారి చూపిస్తారు'' అంటూ కళ్ళ నీళ్ళు తుడుచుకొంటూ లక్ష్మమ్మ మనవరాలితో అంది.

ఆవిడ భయం ఆవిడది. అసలే పెద్దకొడుకు ఏనాడూ కుటుంబ బాధ్యతలు పట్టించుకోలేదు. ఇప్పుడు శ్రుతి మాటలతో తమని వదిలేస్తే ఈ కుటుంబం ఏమవ్వాలి? తమ గతి ఏం కావాలి?

లక్ష్మమ్మ మాటలు విన్న భానుమూర్తి అన్న రామచంద్రానికి, బావమరిది ప్రకాశానికి ఏమీ తోచలేదు. గొంతుక లోంచి మాటలు రానివాళ్ళ లాగ మౌనం వహించారు. దానికి తోడు రామచంద్రం భార్య కామేశ్వరి మరిది పోయాడని విన్న క్షణం నుండే, భర్తతో ఏ బాధ్యతలూ నెత్తిమీద వేసుకోవద్దని చెవినిల్లుకట్టుకొని మరీ చెపుతోంది.

''బావగారు ఎప్పుడైనా ఏ పనికైనా ఎవరినైనా సంప్రదించారా? నిక్షేపంలాంటి ఉద్యోగం వదిలేసి వచ్చేశారు. ప్రభుత్వ ఉద్యోగం వదిలేసే తెలివి తక్కువ వాళ్ళుంటారా? అంతా మా 'వసు' అదృష్టం. ఇలాగ దాన్నీ దాని పిల్లలనూ దిక్కులేని వాళ్ళను చేయాలనే భగవంతుడు ఆయనకి ఆ బుద్ధి పుట్టించాడు. వినాశకాలే విపరీతబుద్ధీ! అని పెద్దలు ఊరికే అనలేదు కదా'' అంటూ సపోర్టుకోసం రామచంద్రం వైపు చూశాడు ప్రకాశం.

''చూడండీ, అయిందేదో అయిపోయింది. ఇప్పుడు ఎవరిని ఏమనుకొన్నా ప్రయోజనం లేదు. ఇప్పుడు మనందరం ఆలోచించవలసింది ముక్కుపచ్చలారని ఈ ముగ్గురు పిల్లల గూర్చి, మీ అక్కగార్ని గూర్చినూ. వాళ్ళకి ఉన్న పెద్దదిక్కు మీరు. వాళ్ళని ఈ కష్టసమయంలో ఆదుకోవలసిన బాధ్యత ఉన్నవారు మీరు'' -అంటూ రాఘవరావు వాళ్ళని హెచ్చరించాడు.

భానుమూర్తి స్నేహితుడు రాఘవరావు. భానుమూర్తి అంటే ఆయనకి అపారమైన ప్రేమ.

''మేముమాత్రం ఏం చేయగలం చెప్పండి? ఏదో ఆయన ఒక పిల్లని, నేను ఒక పిల్లనీ తీసికెళ్ళి పట్టెడన్నం పెట్టమంటే పెట్టగలం కానీ పెళ్ళిళ్ళూ, పేరంటాలూ చేయగలమా? ఇద్దరూ ఆడపిల్లలు. మా బతుకులు చూస్తే అంతంతమాత్రమే. ఏ ధైర్యంతో అక్క కుటుంబానికి దారి చూపగలం?'' అంటూ నిష్కర్షగా తేల్చేశాడు ప్రకాశం.

వాళ్ళ మాటలకి భయంగా అక్కచేతిని పట్టుకొంది ప్రీతి. తండ్రి ఉండగా ఏనాడూ

ఒకరిని విడిచి ఒకరు నాలుగు రోజులైనా ఎక్కడికీ వెళ్ళి ఎరగరు. ఈనాడు ఈ మాటలు వాళ్ళని భయపెడుతున్నాయి.

"అయినా మగవాడు కట్టుకొన్న భార్య, బిడ్డల గురించి ఆలోచించాలి. ఎలా బుద్ధి పుడితే అలా ఉద్యోగం వదిలి, ఇలా చేస్తే ఎవరం మాత్రం ఏం చేయగలం? ఇప్పుడు చూడండి, వీళ్ళు గతీ, గోత్రం లేక అలమటిస్తున్నారు" అంటూ ఆడపడుచు కుటుంబం గురించి హేళనగా అంది జానకి. భర్త మాటలకి వాళ్ళు ఎక్కడ వెంటపడి వస్తారో అని ఆమె భయం.

"అత్తయ్యా! మేము ఎవరమూ ఎక్కడికీ రాము. ఇక్కడే ఉండి కలో గంజో తాగుతాం. దయచేసి మా చర్చలు ఇక ఆపెయ్యండి. మీ ఇష్టం వచ్చినట్లు మా నాన్నగారిని అనవద్దు. నాకే మీ మాటలు ఇంత బాధ కలిగిస్తున్నాయే! మా అమ్మ ఎలా భరించగలదు? దొడ్డమ్మ అన్నట్లు నారు పోసిన వాడు నీరు పోయక మానడు. జరిగింది ఏదో జరిగిపోయింది. మాకు వచ్చిన కష్టం ఎవరూ పూడ్చలేనిది. ఇంతకన్నా మా కుటుంబానికి వచ్చే కష్టం మరొకటి లేదు. మీరు ఎవ్వరూ మా భారం పంచుకోనక్కరలేదు" అంటూ దృఢంగా చెప్పింది శ్రుతి.

"బావుందమ్మాయి. మేమేం మీ నాన్నని ఆడిపోసుకోవాలని వచ్చామా? ఏదో మంచీ, చెడ్డా వచ్చింది కదా అని వచ్చాము. తోచింది. అన్నాము. అంతమాత్రానికే నువ్వు మామీద పైరవ్వనక్కరలేదు. ఇంకా చూస్తారేం? పదండి. వాళ్ళ బాధ ఏదో వాళ్ళు పడతామంటున్నారు కదా" అంటూ లేచాడు రామచంద్రం.

"పెద్దోడా! అది చిన్నపిల్ల. మీ మాటలకి బాధపడి అంది. ఇంత కుటుంబాన్ని నట్టేట్లో వదిలేసి మీ దారి మీరు చూసుకోవద్దు. అది ఇంకా రెక్కలు రాని పిల్ల. అక్కని, నన్ను, మీ మరదలిని చూసి అయినా నువ్వు ఒక నిర్ణయానికి రా!" అంటూ వెళ్ళిపోబోతున్న కొడుకుని ప్రాధేయపడసాగింది లక్ష్మమ్మ.

సుభద్ర మాత్రం ఇదేమీ పట్టనట్లుగా ఓ మూల కూర్చుని ఏదో గొణుగుతోంది.

"బావుందండీ అత్తగారూ! ఇన్నాళ్ళూ వాళ్ళ పంచన ఉండి ఇప్పుడు కష్టకాలం వస్తే మాతో వచ్చేస్తారా? వాళ్ళకి పెద్ద దిక్కుగా ఉండక వస్తే నలుగురూ గడ్డిపెట్టరా? అయినా మేము మళ్ళీ వస్తాం. వాళ్ళు వద్దనుకొన్నా రావలసిన బాధ్యత మాకు ఉంది కదా!" అంటూ అత్తగారి కాళ్ళకి బంధాలు వేసి, భర్తని బయలుదేరమని సూచించింది కామేశ్వరి.

"మిమ్మల్ని ఎవరూ కాదనుకోలేదు దొడ్డమ్మా! అమ్మకి ధైర్యం చెప్పండి కానీ భయపెట్టవద్దన్నాను. నా మాటలు మీరు అర్థం చేసుకోండి. అసలే క్రుంగిపోతోంది అమ్మ. ఆమె కూడా లేకపోతే మా గతిఏమిటి? అమ్మ పరిస్థితి ఆలోచించమన్నాను" అంటూ శ్రుతి ఎంతగా నచ్చచెప్పబోయినా కామేశ్వరి వినిపించుకోక విదిలించి కొట్టింది. శ్రుతిని మింగేసేలాగ చూసి- "చెట్టంత కూతురివి. నువ్వు ఉండగా మీ అమ్మకి మా ధైర్యం ఏం మూలకి చెప్పు? మేము పూర్వకాలం వాళ్ళం. మా మాటలు అంతే వస్తాం" అంటూ దెప్పి పొడుస్తూ బయటికి నడిచింది.

"అక్కయ్యా! శ్రుతిని ఏమీ అనవద్దు. దానికి ఏమీ తెలియదు. అది వట్టి అమాయకురాలు. మీరు కాక మాకు ఎవరున్నారు?" అంటూ వసుధ తోటికోడలి చేతులు పుచ్చుకొని బతిమాలింది.

శ్రుతి తల్లిని జాలిగా చూసింది. బంధువుల స్వభావం ఆ అమ్మాయికి బాగా అర్థమైంది. "దొడ్డమ్మా! నువ్వు అన్నట్లు చెట్టంత కూతురిని నేను ఉన్నాను. అమ్మకి, మా కుటుంబానికి నేను ఉండగా ఏలోటూ రాదు. నీ నోటి చలవవలన అలాగే కావాలి" అంటూ వారి వెనకగా నడిచింది.

లక్ష్మమ్మ వాళ్ళని ఇంకా బతిమాలుతూనే ఉంది. రామచంద్రానికి ఆ పరిస్థితి ప్రాణాంతకంగా ఉంది. సుభద్రనైనా అతడు తీసికెళ్ళాలని లక్ష్మమ్మ ఉద్దేశ్యం.

అయితే రాఘవరావు లక్ష్మమ్మ ఎంతగా నచ్చచెప్పినప్పటికీ వాళ్ళు ఆ కుటుంబానికి ఏ భరోసా ఇవ్వకుండానే వెళ్ళిపోయారు. లక్ష్మమ్మ చేసేదేం లేనిదానిలా ఉసూరుమంటూ నెత్తి మీద చెయ్యివేసికొని ఒక మూల కూర్చుండిపోయింది. ఆవిడని కొడుకు పోయిన దుఃఖం

ఒకవైపు, ఈ కుటుంబ బాధ్యత మరొకవైపు భయపెడుతోంది. పసిపిల్లల భవిష్యత్తు తల చుకొని ఆవిడ బాధపడుతోంది.

అందరూ వెళ్ళిపోయిన కాస్సేపటివరకూ రాఘవరావు వాళ్ళకి ధైర్యం చెపుతూనే ఉన్నాడు. తర్వాత తను కూడా మర్నాడు కలుస్తానని, అవసరమైతే తనకి కబురు పెట్టమనీ చెప్పి ఇంటికి బయలుదేరాడు. ఆ కష్టసమయంలో ఆయనే వాళ్ళకి ఆత్మీయునిలాగ కన్పిస్తున్నాడు.

సాయంత్రం అయిదు గంటలైనా ఎవరూ కూర్చున్నచోటు నుండి కదలలేదు. అందరూ నిస్త్రాణగా అలాగే ఉండిపోయారు. ఎవరి ఆలోచనలో వాళ్ళున్నారు.

"బావుంది... అందరూ అలాగే కూర్చుండిపోతే ఇంట్లో ఉన్న పసిబిడ్డలేమైపోవాలి? వాళ్ళకి ఇంత హార్లిక్సు అయినా పోయవద్దా? అమ్మా! నువ్వు పెద్దదానివి. వాళ్ళ అతీ గతీ చూడవద్దా? ఏడ్చి ఏడ్చి నీ కోడలు ఎలా సొమ్మసిల్లిపోయిందో చూడు. దానికి కాస్త కాఫీ అయినా ఇయ్యి" అంటూ సుభద్ర తల్లిపై గొణుగుతూ, వంటింట్లోకి నడిచింది.

"చెట్టంత కొడుకు పోయాడు. ఇంకా కాఫీల కోసం, భోజనాలకోసమా నాకీ బతుకు" అంటూ లక్ష్మమ్మ రాగాలు తీసింది.

సుభద్ర ఏమనుకొందో, ఏమిటో కాఫీ కలిపి తల్లిచేత, మరదలిచేత బలవంత పెట్టి తాగించింది. పిల్లలికి బోర్నవీటా కలిపి ఇచ్చింది. శ్రుతి, ప్రీతి ఎప్పుడూ కాఫీ తాగరు. భరత్ మాత్రం తల్లీ, తండ్రీ తాగినప్పుడు వాళ్ళ గ్లాసులో కాఫీ అడిగి మిగిలినది తాగేవాడు. భానుమూర్తి కొడుకుకి కాస్త పాలు ఎక్కువ వేసి, తన కాఫీ ఇచ్చేవాడు.

ఆ రాత్రి సుభద్రే అందరినీ బలవంతంగా లేపి, ఉదయం మిగిలిన వంటలు వడ్డించి తినిపించింది. ఏనాడూ ఇంటినిగూర్చి పట్టించుకోని సుభద్ర ఆ మాత్రంగానైనా కోడలుని, పిల్లలని పట్టించుకొని ఆదుకోవడం లక్ష్మమ్మకి కొంత సంతృప్తినిచ్చింది.

శ్రుతికి తెల్లవారు ఝామున నాలుగు గంటలకి మెలకువ వచ్చింది. అది తండ్రి చిన్ననాటినుండి చేసిన అలవాటు. "లేరా శ్రుతీ! లేరా తండ్రీ! మనం ఇప్పుడు చదువుకోవాలి. తెల్లవారుఝామున చదివితే బాగా వస్తుంది. శరీరం విశ్రాంతి తీసికొని ఉంటుందేమో బాగా పనిచేస్తుంది. మెదడు చురుకుగా ఉండి, జ్ఞాపకశక్తి బాగా ఉంటుంది. ఇది దేవతలు సంచరించే టైము ఛ...ఛ... నిద్రతో ఇంత మంచికాలాన్ని వృధాగా గడపవచ్చునా? సూర్యకిరణాలు చీకటిని పారద్రోలే టైము. శ్రుతి మంచిపిల్ల. ఇప్పుడు శ్రుతి లేచి చదువుకొంటుందిట" అని ఆయన ముద్దుగా లేపేవాడు.

శ్రుతికి తండ్రిచెప్పే ఆ మాటలంటే ఎంతో ఇష్టం. అందుకే ప్రతిరోజూ ఆయన అవన్నీ చెప్పేవరకూ లేవదు. అప్పుడు నవ్వుతూ లేచి, తండ్రిని అల్లుకొని పోయేది. ఆయన ఆ అమ్మాయి నుదిటిమీద మృదువుగా ముద్దుపెట్టుకొనేవాడు. శ్రుతి తన కలలకి ప్రతి రూపం అనుకొని ఆయన మురిసిపోయేవాడు. తొలి బిడ్డ, అందులో ఆడపిల్ల అంటే ఆయనకి ప్రాణం.

అక్కని తండ్రి నిద్రలేపుతోంటే ప్రీతి తనంతటతనే లేచి తండ్రి దగ్గరకు వచ్చేది. "భరత్‌గారు ఇప్పుడప్పుడే లేవరుట. ఆ అబ్బాయి ఎండ ఎక్కేదాకా అలాగే బద్ధకంగా పడుకొనే ఉంటాడుట. షేమ్ షేమ్" అనగానే భరత్ దుప్పటిలోనుండి లేచిపోయి "నేను ఎప్పుడో లేచిపోయాను. నేను పడుకొని లేవలేను కదా! నన్ను ఎత్తుకొని నాన్న లేపాలి కదా" అని అరిచేవాడు. భానుమూర్తి నవ్వుతూ కొడుకు చేత భగవంతుడికి దండం పెట్టించి, గుడ్‌మార్నింగ్ చెప్పి ఎత్తుకొనే వాడు.

తెల్లవారుఝామున ఎప్పుడూ జరిగే ఈ కార్యక్రమం అంటే పిల్లలికి ఎంతో ఇష్టం. తర్వాత వాళ్ళు లేచి కూర్చుని చదువుకునేవారు. భానుమూర్తి తనకి నచ్చిన పుస్తకం చదువుకొంటూ కూర్చునేవాడు. పిల్లలికి మధ్యలో ఏదైనా సందేహంవస్తే తీర్చేవాడు.

శ్రుతికి అలవాటు ప్రకారం మెలకువ వచ్చేసింది. "ఏరీ నాన్నగారు? ఏవీ ఆయన చెప్పే మంచి మాటలు. భగవంతుడు ఎంత నిర్దయగా తమని శిక్షించాడు. నాన్నగారిని చూసి పదమూడు రోజులైంది. అసలు తను ఆయనని చూడకుండా ఉండలేదే? ఎలా? ఆయన లేనిదే ఎలా బతకడం?" అనుకొంటూంటే




శ్రుతికి పెద్దగా ఏడుపు వచ్చేసింది. అంతవరకూ లోపల అణిగి ఉన్న దుఃఖం ఒక్కసారిగా గట్టుతెంచుకొని పారే నదిలాగ ఉధృతంగా వచ్చి శ్రుతిని వశపరచుకొంది.

వెక్కిళ్ళు పెట్టి పెద్దగా ఏడుస్తున్న శ్రుతి ఏడుపుకి లక్ష్మమ్మ, సుభద్ర, వసుధ, భరత్, ప్రీతి అందరూ ఒక్కసారి ఉలిక్కిపడి లేచిపోయారు. భరత్ అక్కని కావలించుకొని ఏడుస్తూండిపోయాడు. లక్ష్మమ్మ ఆ పసివాళ్ళని దగ్గరికి తీసుకొంది కన్నీళ్ళతో.

"మామ్మా! నాకు నాన్న కావాలి. నాన్న కావాలి మామ్మా! మరేం వద్దు. నాన్నని చూసి ఎన్నిరోజులైపోయిందో? నాన్నని చూడకుండా నేను ఉండలేను. నాన్న కావాలి మామ్మా" అంటూ హృదయవిదారకంగా ఏడుస్తున్న శ్రుతి ఏడుపు లక్ష్మమ్మని నిలువునా నీరుచేసింది.

లక్ష్మమ్మకి కడుపులో చెయ్యిపెట్టి దేవినట్లయింది. ఆ మనవరాలికి ఏం సమాధానం చెప్పగలదు? ఎలా ఈ పిల్లల ఏడుపుని పోగొట్టగలదు? ఆ భగవంతుడు కాటికి కాళ్ళు చాచుకొన్న తననైనా తీసుకొని వెళ్ళిపోయాడు కాదు. ఇంత పెద్ద కుటుంబాన్ని ఏం చేద్దామనుకొన్నాడో!

"శ్రుతీ! అలాగ ఏడవకూడదమ్మా! అమ్మ చెల్లి వాళ్లు ఎలా మళ్లీ ఏడుస్తున్నారో చూడు. నామాట విను తల్లీ! దుఃఖాన్ని దిగమింగుకోవాలి" అంటూ సుభద్ర ఓదార్చింది.

"నాన్నగారు లేకపోతే ఇల్లు ఎలా ఉందో చూడు మామ్మా! అసలు నాన్నగారు మనల్ని వదిలి ఎప్పుడైనా ఇన్నాళ్లు ఎక్కడికైనా వెళ్ళారా? అమ్మని చూస్తే నాకు భయంగా ఉంది. నాన్న లేకుండా మనం ఎలా ఉండగలం" అంటూ శ్రుతి ఏడుస్తోంటే వాళ్ళందరికీ ఏడుపు వచ్చింది.

వసుధ కూతురివైపు చూస్తూ గోలపెట్టేసింది. "తల్లీ! నువ్వు అలాగ ఏడిస్తే నేను చూడలేను. అసలు నేను ఏం చేయగలను? ఎలా మిమ్మల్ని పెంచగలను? మీ నాన్నగారు ఎప్పుడూ నాకు ఏ చిన్న బాధ్యతా అప్పగించేవారు కాదు. ఇప్పుడు ఒక్కసారే అన్నీ నా మీద వదిలివెళ్లేరు. ఎలా నేను మిమ్మల్ని పెంచను? భగవంతుడా! నా బిడ్డల మొహం చూసైనా నా భర్తకి ఆ ప్రమాదం తప్పించలేదే" అంటూ ఏడుస్తున్న వసుధని చూసి, పిల్లలు మరింతగా ఏడవడం మొదలెట్టారు.

భానుమూర్తి అప్పుడే పోయినట్లు అందరూ కదిలి కదిలి ఏడుస్తోంటే సుభద్ర ఏమీ చేయలేకపోయింది. ఆవిడకి చిన్న తమ్ముడు భాను అంటే ఎంతో ఇష్టం. తనూ కళ్ళనీళ్ళు పెట్టుకొని ఒక పక్కగా కూర్చుండి పోయింది. పని చేయడానికి వచ్చిన చిన్నమ్మ వాళ్ళని చూసి అవాక్కయింది. తనే తెప్పరిల్లి అందరిన్ని నాలుగు కేకలువేసింది.

"ఏంటమ్మా! ముసలిదానివి. పసిబిడ్డలని ఓదార్చవలసినదానివి. ఆ కోడలమ్మ మొహంచూడు. ఆ అమ్మకి ఏడవడానికి ఇంకా ఊపిరి ఉందా? ఆమెని ఓదార్చడం పోయి నువ్వే ఏడిస్తే ఈ కుటుంబం ఏమవుతుంది?" అంటూ అందరినీ మందలించింది. "పొద్దుటే లేసి మీరు చేసే పని ఇదా" అంటూ కసిరింది.

"ఎదిగిన కొడుకు చేతిలో కన్నుమూస్తానని ఎంతో ఆశపడ్డాను. నా కళ్ళఎదుటే నా బిడ్డని దేముడు తీసికొని పోయాడు. ఈ బిడ్డల మొహమైనా చూశాడు కాదు" అంటూ లక్ష్మమ్మ గోలపెట్టేసింది.

"పుట్టిన వాళ్ళం సావమా? ఎవరి టైమయిపోతే ఆళ్ళు ఎల్లాలి. నువ్వయినా అంతే, నేనయినా అంతే! మా భానుమూర్తి బాబు మంచోడు కనుక అందరినీ నవ్విస్తూ, తాను నవ్వుతూ ఎళ్లిపోయాడు" లక్ష్మమ్మతో అని, పిల్లలవైపు తిరిగింది.

"ఏంటి శుతమ్మా! ఏంటా ఏడుపు? మీరు ముగ్గురు బాగా సదువుకోవాల. మీ అమ్మని బాగా సాకాలి. మీ మామ్మ దినం తీరసాల. తెలిసిందా పెద్దమ్మా! ఇలా బెంబేలుపడి ఏడిత్తే పోయిన నాన్న తిరుగొస్తాడా? శ్రుతమ్మ మంచి పిల్ల. సెప్పిన విషయం అర్దంసేసుకొంటుంది" అంటూ శ్రుతిని ఓదార్చి, లేవదీసింది.

చిన్నమ్మ పెరడు ఊడుస్తోంటే లక్ష్మమ్మ అక్కడే కూర్చుని తన బాధ వెళ్ళగ్రక్కింది. "దేముడు నాకు ఎంత కడుపు మంట కలి

గించాడే! ఎదిగిన కొడుకు చావు ఒకపక్క, ఈ బిడ్డలు, కోడలు ఏమవుతారా అని బెంగ మరొకపక్క తినేస్తున్నాయి. పెద్దాడు కుటుంబానికి సాయపడతాడనుకొంటే వాడు దులిపేసుకొని పారిపోయాడు'' అంటుంటే చిన్నమ్మ అందుకొంది.

''ఏం సేస్తామమ్మా! ఎవరి కర్మవారు అనుభవించాల. నా ఇసయమే సూడండి. ఒక్కగానొక్క కూతురికి భర్త కరువైపోయాడు. ఏం సేస్తాను? నాలుగిళ్ళ పని చేసి దాన్ని, దాని బిడ్డలను సాకుతున్నాను'' అంటూ ఆమెని ఓదార్చి, తన బాధ కూడా చెప్పుకొంటూ పనిలో పడింది.

భానుమూర్తి పోయిన దుఃఖం ఒక పక్క, వచ్చేపోయేవాళ్ళ పరామర్శలొకపక్క లక్ష్మమ్మని బాధపెడుతున్నాయి. వసుధ లేచి ఇంట్లో తిరగాడటంలేదు. వచ్చిన వాళ్ళ ప్రశ్నలు, మాటలు అన్నీ లక్ష్మమ్మే ఎదుర్కొంటోంది. మళ్ళీ మళ్ళీ ఆ జరిగిన ఏక్సిడెంటు విషయం అంతా ఏకరువు పెట్టుకొని బాధపడటం అవుతోంది.

బంగారంలాంటి ఉద్యోగం మానేసి, ఈ ప్రెస్‌నిపెట్టుకొని కూర్చున్నాడు. ప్రభుత్వ ఉద్యోగమైతే డబ్బూ వచ్చేది. పిల్లలకి ఉద్యోగమూ వచ్చేది. అయినా ఆ బాబు ఎవరి మాటా వినేవాడు కాడట'' అని ఒకరూ, ''అంతేనమ్మా కర్మని బట్టి బుద్ధి పరుగెడుతుంది. లేకపోతే ఎందుకు ఉద్యోగం వదిలేస్తాడు? భార్యా పిల్లలంటే పిచ్చి ప్రేమట. వాళ్ళని వదిలి ఉండలేనని కేంపుల ఉద్యోగం వదులు కొన్నాడట'' అని మరొకరూ అందుకొని సానుభూతి చూపేవారు.

''ఎలా బతుకుతారో ఏమిటో, అయిన వాళ్ళు చేతులు దులుపుకొని వెళ్ళిపోయారు. ఈ కుటుంబం ఎలా ఒడ్డెక్కుతుందో?'' అంటూ కుటుంబ భారమంతా తనమీదే పడినట్లు సానుభూతి చూపించేది మరొక ఇల్లాలు. జాలి చూపించి వెళ్ళేవారు మరికొందరు.

వచ్చేవాళ్ళు, చూసి పరామర్శించేవాళ్ళు ఎక్కువైపోయారు.

శ్రుతికి ఇదంతా మింగలేక, కక్కలేక అన్పించేది. వాళ్ళందరూ రావడం, మామ్మ బొంగురుపోయిన గొంతుకతో అన్నీ మళ్ళీ వివరించడం, తల్లి కుమిలికుమిలి ఏడవడం చాలా కష్టం కలిగించి ఆమెలో అసహనాన్ని లేపేవి. పడిపోయిన వాళ్ళని చూసి జాలిపడే వాళ్ళే కాని లేవదీసేవారు ఎవరూ కనబడరేం? దెబ్బతిన్న వాళ్ళకి మరింత అధైర్యాన్ని కలిగించే ఈ సానుభూతి దేనికి? అవగింజంత అయినా ఆత్మవిశ్వాసం కలిగిస్తుందా? ఒక్కరంటే ఒక్కరైనా భవిష్యత్తుపై ఆశ కలిగించరేం? ఆసరాగా ఉంటామని అనరేం?

అందుకే లక్ష్మమ్మతో ''ఎవరినీ రానివ్వకు మామ్మా! ఎందుకూ, మానని గాయాన్ని వాళ్ళందరూ వచ్చి కెలకడం? దేనికి ఈ తంతు అంతా?'' అంటూ విసుక్కొనేది.

లక్ష్మమ్మకి శ్రుతి మాటలు జాలికలిగించేవి ''అయినా ఇది లోకాచారం తల్లీ! ఏ సహాయం చేసినా, చేయకపోయినా ఒకరి దుఃఖం పదిమందీ పంచుకోవడం ఆనవాయితీ! ఇది సంఘం. ఒక కాకి చచ్చిపోతే పదికాకులు చేరి అరవడంలేదా? ఇదీ అంతే. ఎవరైనా వింటే బావుండదు, నవ్వుతారు'' అంటూ శ్రుతికి నచ్చచెప్పేది.

''ఏమో మామ్మా! కష్టంలో ఉన్నవాళ్ళని ఆదుకోవాలి. చేయూత నియ్యాలి. కానీ వారిని మరింత క్రుంగదీసే ఈ పరామర్శలు మంచివి కాదని నా ఉద్దేశ్యం'' అంటూ నిరాసక్తంగా ఇంట్లోకి వెళ్ళిపోయే శ్రుతిని చూసి లక్ష్మమ్మ నోరు వెళ్ళబెట్టేది. శ్రుతి వచ్చిన వాళ్ళ దగ్గరకి రాకుండా అలాగ దూరంగా ఉంటేనే ఆవిడ మనసు కాస్త కుదుటపడేది. మనవరాలు తెలియక ఎవరిని ఏం అంటుందో అని ఆవిడ భయం.

సాయంత్రం వేళలో అస్తమిస్తున్న సూర్యబింబాన్ని చూస్తూ శ్రుతి పెరట్లో నిలబడింది.

''అక్కా! నీకోసం స్వప్న వచ్చింది'' అంటూ ప్రీతి స్వప్నని వెంటబెట్టుకొని వచ్చింది.

స్వప్నని చూసి శ్రుతి ఒక జీవంలేని నవ్వు నవ్వింది. ఇద్దరూ ఆలోచనగా కాసేపు అలాగే ఉండిపోయారు. శ్రుతే తెప్పరిల్లి వరండాలోకి తీసికొని వచ్చింది.

''శ్రుతీ! నువ్వు ఎలాగ అయిపోయావో చూసుకొన్నావా? నువ్వే ఇలాగ ఉంటే అమ్మకి,




చెల్లికి ధైర్యం ఎవరు చెపుతారు? ధైర్యం తెచ్చుకొని జరగవలసిన దానిగురించి ఆలోచించు'' అంటూ స్వప్న మందలించింది. శ్రుతికి కళ్ళు నీళ్ళు తిరిగాయి.

స్నేహితురాలి ఆత్మీయతకి ఏం మాట్లాడడానికీ తోచలేదు.

''నాకు చిన్నప్పటినుండీ నాన్నగారంటే చాలా ఇష్టం. ఆయన లేకపోవడాన్ని భరించలేకపోతున్నాను. మా ఇంట్లో అందరికీ ఆయన ఒక స్ఫూర్తి. ఆయన ఎంత ఉత్సాహంగా ఉండేవారో నీకూ తెలుసు. ఒకో మనిషి మన మధ్యనుండి వెళ్ళిపోతే ఆ లోటు ఎంత బాధాకరమోగదా'' అంటూ చెంపలపై జాలువారుతున్న కన్నీటిని తుడుచుకొంది.

స్వప్నకి స్నేహితురాలిని ఎలా ఓదార్చాలో తెలియలేదు. శ్రుతి అన్న విషయం యదార్థమే. భానుమూర్తి పెద్దవాళ్ళల్లో పెద్ద. చిన్నవాళ్ళల్లో చిన్నపిల్లవాడు. అందరినీ తన చతురోక్తులతో ఆకట్టుకొనేవాడు.

కాసేపు ఇద్దరూ భానుమూర్తి జ్ఞాపకాల ప్రపంచంలోకి వెళ్ళిపోయారు. స్వప్న కాసేటికి తెప్పరిల్లి శ్రుతివైపు ఆర్ద్రంగా చూసింది. ''ఈ వారం చివరిలో లెక్కల మేషార్లు టెస్టు పెడతానన్నారు. పరీక్షలు కూడా దగ్గరకు వచ్చేస్తున్నాయి. నువ్వయితే రేంకు స్టూడెంటువి. నాకు మాత్రం ఎంతో భయంగా ఉంటోంది. క్లాసు రాకపోతే ఏ కాలేజీలోనూ సీటు రాదు. కాలేజీలో సీటు దొరక్కపోతే నేను మా పిన్ని వంట ఇంటికి చక్కగా చవగ్గా దొరికిపోయినట్లే'' అని భయం భయంగా స్వప్న అంటుంటే శ్రుతి పెదవులమీద కన్పించీ కన్పించనట్లు చిరునవ్వు వెలిసింది.

''శ్రుతీ! మా పిన్నిని భగవంతుడు నా కోసమే పుట్టించాడు కాబోలు. నన్ను సాధించడానికే ఆవిడ పుట్టింది కాబోలు. నా సంగతి వదిలేయ్. మూడేళ్ళుపోతే పెళ్ళి చేసుకొని మా పిన్ని బారినుండి తప్పించుకు వెళ్ళిపోతాను. కానీ మా నాన్నగారు... పాపం. ఆయన్ని తలుచుకొంటేనే జాలివేస్తుంది'' అంటూ చక్రాల్లాగా కళ్ళు త్రిప్పుతూ మాట్లాడుతున్న స్వప్నని శ్రుతి ప్రేమగా చూసింది.

శ్రుతిని కొన్ని నిమిషాలైనా తన ప్రపంచంలోకి లాగగలిగినందుకు స్వప్న చాలా సంతోషించింది. గంభీరంగా ఉండే శ్రుతిని చూడటం ఆమెకి కష్టంగా ఉంది.

శ్రుతి ఏదో ఆలోచిస్తూ, కిటికిలోనుండి బయటకు చూడసాగింది.

''శ్రుతీ! ఒకమాట చెప్పనా! ఏమీ అనుకోవు కదా'' అని సందేహంగా అంది.

''నీకూ నాకూ మధ్య అనుకోవడాలు ఉన్నాయా? ఏమిటో చెప్పు'' అని శ్రుతి ఆమెను అడిగింది.

''అబ్బే అదికాదు. మీ నాన్నగారంటే మీ పెదనాన్నగార్కి చాలా ఇష్టంకదా! ఆపదలో ఉన్నారనైనా చూడకుండా అలా ప్రవర్తించారేమిటి?'' అని స్వప్న కుతూహలంగా అడిగింది.

''డబ్బు దగ్గర అనుబంధాలు, ఆత్మీయతలు ఏమీ నిలబడవు స్వప్నా. ఒకవేళ మా పెదనాన్నగారు మా కుటుంబభారం వహిద్దామనుకొన్నా మా పెద్దమ్మ ఒప్పుకోదు. అందుకే ఆయన తప్పించుకొన్నారు'' అంటూ క్లుప్తంగా తేల్చేసింది. ''అక్కా! శారద అత్తయ్య, ప్రసాద్ మన ఇంటికి వచ్చారు. అత్త నిన్ను రమ్మంటోంది'' అంటూ ప్రీతి వచ్చింది. శ్రుతి, స్వప్న వాళ్ళందరూ ఉన్నచోటికి వచ్చారు.

ప్రసాద్ శ్రుతిని చూసి స్నేహపూర్వకంగా నవ్వాడు. శారదమ్మ ఆదరంగా శ్రుతిని దగ్గరకు తీసుకొని కూర్చోపెట్టుకుంది.

సుభద్ర అందరికీ కాఫీ తెచ్చి ఇచ్చింది.

''ఎందుకు సుభద్రా ఈ సమయంలో కూడా కాఫీలు, మర్యాదలూ. మేమేమైనా పరాయివాళ్ళమా? మనలో మనకివన్నీ ఏమిటి?'' అని శారదమ్మ సుభద్రని మందలించింది.

''మీ అందరితోనైనా మా మరదలు గుక్కెడు కాఫీ త్రాగుతుందేమోనని తెచ్చాను. దానికో నమైనా తీసుకోండి'' అంటూ సుభద్ర వంట ఇంటివైపు నడిచింది. శారదమ్మ ఆమె మాటలకు, చేస్తున్నపనికి ఆశ్చర్యపోయినా పైకి ప్రదర్శించలేదు.

ఏనాడూ ఎవరు ఇంటికి వచ్చినా సుభద్ర మాట్లాడేదికాదు. ఇంటిపనులైనా సరే చేసేదికాదు. ఏ మూలో కూర్చునో పడుకొనో కన్పించేది. అలాంటిది ఆమె ఇలా ఇల్లు సాకుతొంటే

శారదమ్మకు ఎంతో ఆశ్చర్యంగా ఉంది.

తనతో తెచ్చిన అరటిపళ్లు, కూరలు ఇంట్లో పెట్టించింది శారదమ్మ. వసుధకి, లక్ష్మమ్మకి ధైర్యం చెప్పింది. శ్రుతితో "నువ్వు ఇంకా కాలేజీకి వెళ్లకపోతే ఎలాగా? పాఠాలు పోవా? పరీక్షలు చూస్తే దగ్గరికి వచ్చేస్తున్నాయి. రేపటినుండి నువ్వు, చెల్లి కాలేజీకి వెళ్లండి. తమ్ముడిని స్కూలుకి పంపండి" అంటూ బుజ్జగింపుగా చెప్పింది. శ్రుతి ఏం మాట్లాడలేక చేతివేళ్లు చూసుకొంటూ కూర్చుంది.

"ఏం చెప్పమంటావే తల్లీ! నాకు దాన్ని, ఆ పిల్లలను చూస్తొంటే మతిపోతోంది. ఏమీ తోచడంలేదు. పిల్లల్ని చదువులకి పంపాలనే ఆలోచనే రాలేదు" అంటూ ఏడ్చింది లక్ష్మమ్మ.

"ఏం చేస్తాం పిన్నిగారూ? పోయినవాళ్లతో మనం కూడా వెళ్లిపోగలమా? ఆ దుఃఖం తీరేదికాదు. కాలం ఎవరికోసం ఆగదు. కాలంతోపాటు మనం సాగవలసిందే. పిల్లల చదువులు పోతే ఎలాగా?" అంటూ అందరికీ తలకొకరకంగా ధైర్యం చెప్పింది శారదమ్మ. "అమ్మా! అసలు విషయం మరిచిపోయావు" అంటూ ప్రసాద్ తల్లి చేతిని నెమ్మదిగా తట్టాడు. శారదమ్మ లక్ష్మమ్మ దగ్గరకి వచ్చి వెయ్యి రూపాయలు చేతిలో పెట్టింది. శ్రుతి వారించబోతే ఆమె విన్పించుకోలేదు.

"శ్రుతీ! నువ్వు చిన్నపిల్లవి. ప్రస్తుతం ఎన్నో అవసరాలుంటాయి. నేను పరాయిదానిని కాను. మీ నాన్న నన్ను స్వంత చెల్లెలుకన్నా ఎక్కువగా చూశారు. ఏ ఆలోచనలూ మనసులోకి రానియ్యక శుభ్రంగా చదువుకొని పరీక్షలు పూర్తిచేయి" అంటూ శ్రుతి గడ్డం పుచ్చుకొని చెప్పింది శారదమ్మ.

తమ దగ్గర కొంత డబ్బు ఉందనీ, ఇప్పుడు ఇది ఎందుకనీ శ్రుతి ఎంతగా చెప్పినా ఆమె విన్పించుకోలేదు. శ్రుతి అభిమానానికి ఆమె కళ్లు చెమర్చాయి.

"శ్రుతీ! పెద్దదాన్ని. మీరు కష్టంలో ఉంటే ఏమీ చేయలేకపోయాననే అన్న బాధ నాలో ఉండిపోనీయకమ్మా! ఈ డబ్బు ఉంచు. ప్రసాద్ కూడా మీ విషయంలో ఎంతో ఆందోళన పడుతున్నాడు. మేమూ జీవితంలో అన్నిరకాల కష్టాలూ అనుభవించిన వాళ్ళమే" అని బలవంతంగా వారిచేతిలో డబ్బువుంచి, బయలుదేరింది. శ్రుతి, ప్రీతిలవైపు స్నేహపూర్వకంగా చూసి, తనూ తల్లిని అనుసరించాడు ప్రసాద్.



లక్ష్మమ్మ ఇచ్చిన డబ్బుని శ్రుతి బీరువాలో భద్రపరిచింది. ఆమెకు నవ్వాలో, ఏడ్వాలో తెలియటంలేదు. రక్తసంబంధీకులు, అయినవాళ్లు తప్పుకొని పక్కకు వెళ్లిపోతే ఏ సంబంధమూ లేని శారదమ్మ, ప్రసాద్‌లు తమకోసం ఆర్తిచెందుతున్నారు. ఆదుకోవాలనీ, ఆపదలో సాయపడాలనీ పరితపిస్తున్నారు. కష్టాలు వచ్చినప్పుడే నిజమైన ఆత్మీయులెవరో, స్నేహితులు ఎవరో తెలుస్తుంది కాబోలు మనిషికి అనుకొంది.

శారదమ్మ చేసిన సూచన గూర్చి ఆమె ఆలోచించింది. మర్నాటినుండే తమ్ముడిని, చెల్లిని చదువుకు పంపాలని అనుకొంది. ఆమె చెప్పేవరకూ ఇంకా తాము ఆ ఆలోచనే చేయని స్థితిలో ఉన్నామని అనుకొంది.

ఆ రాత్రి శారదమ్మ ప్రసాద్‌ల ‍మధ్య కూడా వీరి గురించే ఆలోచన సాగుతోంది.

"అమ్మా! మావయ్య ఎంతో మంచివాడు. మరి అలాంటి ఆయన పోతే వాళ్ళ అన్నయ్య అలా చేసేడు ఏమిటమ్మా? మావయ్యమీద ఆయనకి ప్రేమలేదా?" అంటూ తల్లిని అమాయకంగా అడిగాడు.

"తమ్ముడంటే అన్నకి ప్రేమ ఎందుకు ఉండదురా ప్రసాద్? ఆయన బాధలు ఏమిటో? ఒకవేళ ఆయనకి ఉన్నా భార్య కూడా సహకరించాలికదా! వాళ్ళ గొడవలు ఏమిటో" అంటూ ప్రక్కమీద వాలింది శారదమ్మ.




''నువ్వు మరీ అమాయకమమ్మా! అసలు ఆయనకే తమ్ముడి కుటుంబాన్ని ఆదుకోవాలని లేదు. ఉంటే భార్యమాట వింటాడేమిటి? నువ్వు ఎన్ని చెప్పు. మావయ్య పోయాక ఆయన మారిపోయాడు. మావయ్య ఉన్నప్పుడు ఈయన అడపాదడపా వచ్చి ఎన్ని మోసుకొని పోలేదూ? ఎంత డబ్బు తీసుకెళ్ళలేదూ?'' అంటూ అక్కసుగా ప్రసాద్ మనసులోని విషయం బయటపెట్టాడు.

తల్లి తన మాటలకి జవాబు చెప్పకపోవడంతో తనే ''అమ్మా! శ్రుతీ వాళ్ళకి ఇప్పుడు చాలా కష్టంకదూ! పాపం ఏంచేస్తారో'' అంటూ తల్లివైపు సాభిప్రాయంగా చూశాడు.

''అవునురా నాయనా! కుటుంబయజమాని పోతే ఆ కుటుంబం పడేపాట్లు ఇన్నీ అన్నీ కావు. పాపం అందరూ చిన్నపిల్లలు. ఎలా తెములుతారో ఏమిటో'' అని ఆవలిస్తూ అంది. ''అసలు శ్రుతికి చదువంటే ఎంతో ఇష్టమమ్మా! ఇప్పుడు మావయ్య పోయిన దుఖంలో ఎలా చదవగలుగుతుందో ఏమిటో. నేను ఇప్పుడు ఇలాగా బి.ఎ. పూర్తిచేస్తున్నానంటే మావయ్య, శ్రుతీ కారణమమ్మా'' అంటూ తల్లివైపు చూసిన ప్రసాద్‌కి ఆమె నిద్రలోకి జారుకోవడం కన్పించింది.

తల్లి నిద్రపోయినా అతడికి మాత్రం నిద్రపట్టడం లేదు. శ్రుతి ప్రీతుల రూపాలే కళ్ళముందు మెదులుతున్నాయి. ''పాపం వాళ్ళకి ఎలాగో'' అని పదిసార్లయినా అనుకున్నాడు. ''ఛీ... ఈ దేముడికి ఆవగింజంత అయినా దయలేదు. ఉంటే దేముడులాంటి మావయ్యని అలా తీసుకొనిపోతాడా?'' అని కన్పించని భగవంతుడిని తిట్టుకొన్నాడు.

తల్లి దుప్పటి పెట్టిందో, లేదో అని కాళ్ళవైపు చూశాడు. దుప్పటి కన్పించింది. దాని దగ్గర నుండి దృష్టి అతడికి తన కాళ్ళవైపు మళ్ళింది. పోలియో వచ్చిన సన్నని కాళ్ళు తనవి. మోకాళ్ళ వరకూ బాగుంటాయి. అక్కడనుండి పుల్లల్లాగా, సన్నగా చచ్చుబడిఉన్నాయి. కాళ్ళమీద నుండి అతడి దృష్టిపక్కనే ఉన్న కర్రలమీదికి మళ్ళింది.

తను అందరు పిల్లల్లాగా నడవలేడు. పరుగెత్తలేడు. సన్నగా ఉన్న ఈ చచ్చుబడిన కాళ్ళు దేనికీ సహకరించవు. కుంటివాడని తనతోటి పిల్లలందరూ గేలిచేసేవాళ్ళు. కర్రలతో స్కూలుకి వెళితే, అవి దాచేసి తనను ఏడిపించేవారు.

తనకి ఊహ తెలిసిననాటినుండీ ఈ లోకం చేసే హేళనను భరిస్తూనే ఉన్నాడు. చివరికి ఆ హేళన, వెక్కిరింతలు తనకి మామూలయిపోయాయి. తోటిపిల్లలు ''కుంటీ, సాట్టోడు'' అనీ పిలిచేవాళ్ళు తప్ప ఏనాడూ పేరుపెట్టి పిలవలేదు. ''పదహారేళ్ళవయస్సు'' సినిమాలో చంద్రమోహన్ వీడేరా అని ఇష్టం వచ్చినట్లు ఏడ్పించేవారు. వాళ్ళు అలా అంటున్నారని అభిమానపడి, కర్రలు మానేద్దామంటే ఎక్కువదూరం నడవలేడు. అసలు అలాగ నడిచే నడక మరీ వికృతంగా ఉండేది.

''ఈ అవిటితనం లేకపోతే తనకి శ్రుతితో పరిచయం అయ్యేది కాదేమో! శ్రుతితో పరిచయం గుర్తుకి రాగానే అతడి పెదవులపై చిరునవ్వు వెలసింది. తను పదవతరగతిలోకి వచ్చినప్పుడు శ్రుతితో పరిచయం కలిగింది.

స్కూలు వదిలాక, కర్రల సాయంతో తను నెమ్మదిగా ఇంటివైపు నడుస్తున్నాడు. కొందరు కొంటెపిల్లలు తనని అల్లరి చేయడం మొదలుపెట్టారు. తను వాళ్ళకి ఎదురుచెప్పకుండా తలవంచుకొని వచ్చేస్తున్నాడు. తను ఏమీ వాళ్ళని బ్రతిమాలనందుకు, సమాధానం చెప్పనందుకు వాళ్ళు రెచ్చిపోయి తన చేతికర్రలను లాగి దూరంగా పొదలలోకి విసిరేశారు. తన పుస్తకాలు దూరంగా విసిరేసి నవ్వడం ప్రారంభించారు.

తనకి ఏడుపు వచ్చింది. స్కూలుకి వెళ్ళనంటే అమ్మ ఇంటి దగ్గర ఏడుస్తుంది. అమ్మ ఏడిస్తే తను చూడలేడు. అందుకని స్కూలుకి వస్తే వీళ్ళ అల్లరి భరించలేడు. తన బాధ అమ్మకి చెప్పి ఇంకా బాధపెట్టలేడు. అమ్మ ''మనమే సర్దుకొని పోయి, మన బతుకు మనం బ్రతకాలి'' అంటుంది. తన బాధ ఎవరికి తెలుస్తుంది.

కుర్రవాళ్ళందరూ నవ్వుకొంటూ వెళ్ళిపోయారు.

కాసేపు ఏడ్చిన తరువాత కళ్ళు తుడుచుకొని

లేచి, కర్రలు తెచ్చుకోబోయిన తను ఆశ్చర్యంగా నిలబడిపోయాడు. తనని సానుభూతిగా చూస్తున్న ఓ అందమైన అమ్మాయి ఎదురుగా కన్పించింది. తనకి అమ్మాయిలంటే అసలే భయం. కళ్లు తుడుచుకొంటూ కంగారుగా ఆ అమ్మాయివైపు చూశాడు. ఆ అమ్మాయి చేతిలో తన కర్రలు. ఆ అమ్మాయి జాకెట్ జబ్బ దగ్గర చిరిగిఉంది. చేతిమీద ముళ్ళు గీసికొని రక్తం వస్తోంది. తనవైపు చూస్తూ ''ఈ కర్రలు తీసికోండి'' అని చేతికిచ్చి దూరంగా పడివున్న పుస్తకాలు తెచ్చి దులిపి, వరుసగా పెట్టి అందించింది.

''ఇహ ఇంటికి వెళదామా'' అంటున్న ఆ అమ్మాయివైపు చూసి తల ఊపాడు. అబ్బ... ఈ అమ్మాయివి ఎంత పెద్దకళ్లు. ఎంత అందంగా ఉన్నాయి అని అనుకున్నాడు. ఇద్దరూ కలిసి నడవడం మొదలుపెట్టారు.

''నా పేరు శ్రుతి. కొత్తగా ఈ ఊరు... కాదు ఈ స్కూలుకి వచ్చాను. మీ స్కూల్లో ఏడవతరగతి చదువుతున్నాను'' అంటూ తన గురించి చెప్పింది. ఆమె అడిగాక తన పేరు, తరగతి చెప్పాడు. కొంతదూరం ఇద్దరూ కలిసి నడిచాక శ్రుతి గబుక్కున అడిగింది ''నేను ఇలా అంటున్నానని ఏమీ అనుకోవద్దు. నిన్ను వాళ్లు అలా కొట్టి ఏడిపిస్తూవుంటే ఎందుకు ఊరుకొన్నావు? నీ పుస్తకాలు పడేసి, కర్రలు తుప్పల్లోపడేసి అల్లరిచేసి, ఏడిపిస్తోంటే ఎందుకు ఊరుకోవాలి? వాళ్లని ఏమీ చేయాలన్పించలేదా?'' అని కోపంగా అడిగింది.

తను ఆ అమ్మాయివైపు కోపంగా చూశాడు. ''వాళ్లని నేను ఏం చేయగలను? వాళ్ళకిలాగా నాకు కాళ్లు లేవు. వాళ్ల జోలికి నేను వెళ్ళకపోయినా నన్ను ఏడిపిస్తారు. కాళ్లు సరిగ్గా లేని నేను వాళ్లని ఏం చేయగలను?'' అని చిరాకుగా అడిగాను.

''అబ్బే అదికాదు ప్రసాద్. ఒక్కసారి నువ్వు వాళ్లమీద తిరగబడ్డావనుకో మర్నాడు మళ్ళీ వాళ్లు నీ జోలికి రారు. అంతెందుకు నీ

పక్కనున్న నాలుగు రాళ్ళు తీసి విసిరావంటే మరెవరూ నీ జోలికి రారు. మెత్తగా ఊరుకొన్నావంటే ఇలాగే ఏడిపిస్తారు'' అంది ఆరిందాలాగా.

తనకి ఎంతో ఆశ్చర్యం వేసింది. అమ్మో... ఇంత చిన్నపిల్లయినా ఈ అమ్మాయికి ఎంత ధైర్యం.

''నేను అడిగినదానికి జవాబు చెప్పవేం'' అంటూ తనవైపు చూసింది.

''ఏం చెప్పను? వాళ్ళు టీచర్‌గారికి రిపోర్టు చేస్తే నాపని సరి'' అని భయంగా అంటూంటే ''అదేమిటి స్కూల్లో మీ మేష్టారు వాళ్లని ఏమీ అనరా? ఆయనకి... వాళ్లు చేస్తున్నపని చెప్పినా ఏమీ అనరా? అల్లరి చేస్తున్నవాళ్లని వదిలేసి నిన్ను కొడతారా'' అంటూ ఆశ్చర్యంగా, అసలే పెద్దవైన కళ్లను మరింత పెద్దవి చేస్తూ అడుగుతోంటే తను ఆ అమ్మాయిని చూస్తూ జవాబు చెప్పడం మరిచిపోయాడు.

''ఏమిటి ప్రసాద్ మాట్లాడవు. నేను అడిగినది వినబడలేదా'' అంటూ రెట్టించింది. ''మరేమో... మరేమో టీచర్‌కి వాళ్లంటేనే ఇష్టం. మాటిమాటికీ వాళ్లనే క్లాసులో పొగుడుతారు. కోపం వచ్చినప్పుడు ఆవిడ కూడా నన్ను కొడతారు'' అంటూ తలవంచుకొన్నాడు.

అందరినీ సమానంగా చూడవలసిన టీచర్ అలా చేయడమా అని పదిసార్లు అనుకొంటూ ఆశ్చర్యపోయింది. ఇంతలో వాళ్ల ఇల్లు రావడంతో ''ప్రసాద్ మా ఇంటికి వస్తావా! మా చెల్లిని, తమ్ముడిని, నాన్నగారిని చూపిస్తాను. మా చెల్లి కూడా మన స్కూల్లోనే చదువుతోంది. ఈరోజు ఒంట్లో బావుండక స్కూలుకి రాలేదు. మా నాన్నగారిని పరిచయం చేస్తాను రా ప్రసాద్'' అంటూ బలవంతంచేసి తన ఇంటికి తీసుకెళ్లింది.

''శ్రుతీ! తల్లీ... ఇంత ఆలస్యం అయిందేమిటిరా?'' అని కూతురు ఇంట్లోకి రాగానే అభిమానంగా అడిగాడు భానుమూర్తి. అతడు తన పక్కన ఉన్న గిన్నెలోనుండి పకోడీలు తీసి అందరి ప్లేట్లలో సర్దుతున్నాడు. వసుధ హాల్లో

ముక్కలను ప్లేట్లలో వరుసగా వేస్తోంది.

"నాన్నా! ఈరోజు పకోడీలు, హల్వా చేయించారా? అమ్మో... ఉండండి. కాళ్లు కడుక్కుని వస్తాను. ప్రసాద్ నువ్వు కూడా రా" అంటూ హడావుడిగా పెరట్లోకి పరుగుతీసింది. ప్రసాద్ ఆమె వెంట వెళ్లకుండా ఇబ్బందిగా నిలబడిపోయాడు.

భానుమూర్తే ఆ అబ్బాయి బిడియం చూసి మొదట పలకరించాడు. కూతురి కంగారు స్వభావానికి నవ్వుకుంటూ ప్రసాద్‌ని మళ్లీ పిలిచాడు.

"చూశావురా! నాయనా! నీ గారాలకూతురు చేసినపని. ఇంటికి తెచ్చిన పిల్లవాడిని వాడి మానాన వాడిని వదిలేసి ఎలా పారిపోయిందో" అంటూ ఫిర్యాదుగా అంది లక్ష్మమ్మ.

ప్రసాద్ మళ్లా చెప్పడంతో పుస్తకాలు పక్కన పెట్టి కూర్చున్నాడు.

"నాన్నా! మామ్మ నామీద అప్పుడే ఏమిటి ఫిర్యాదు చేస్తోంది" అంటూ టిఫిన్ తీసుకొంది. ప్రసాద్ చేతికి ప్లేటు ఇస్తూ "సారీ ప్రసాద్. నీకు వీళ్లని వెంటనే పరిచయం చేయలేదుకదూ!" అంటూ పేరు పేరునా అందర్నీ పరిచయం చేసింది.

"ఇంటికి తీసుకొని వచ్చిన వాళ్లని గౌరవించి మొదట పరిచయం చెయ్యాలి తల్లీ?" అని భానుమూర్తి అంటూంటే.

"ప్రసాద్ విషయం మరిచిపోవడానికి మీరే కారణం నాన్నగారూ" అంది శ్రుతి.

"నేనా...?" అంటూ అతడు తెల్లబోయాడు.

"మరి... మీరూ, మీ పకోడీలూ కన్పడేసరికి నేను అన్నీ మరిచిపోయాను" అంటూ కూతురు దబాయిస్తోంటే అతడు నవ్వేశాడు.

ప్రసాద్‌ను చూస్తూనే అతడు గొప్ప మొహమాటస్థుడని భానుమూర్తి గ్రహించాడు. అందుకే అతడిని మాటలలో పెట్టి టిఫిన్ తినిపించాడు.

ప్రీతి నీళ్లగ్లాసులు తెచ్చి అందరికీ ఇచ్చింది. అతడు చెయ్యి కడుగుకొందుకు లేవబోతుంటే "అందులో కడుక్కోండి" అంటూ ప్లేటు చూపించి స్నేహపూర్వకంగా నవ్వింది. పర్వాలేదని లేవబోతోంటే అతడిని వసుధ కూడా వారించింది. భానుమూర్తితో టిఫిన్ చేస్తూ శ్రుతి అసలు విషయమంతా చెప్పేసింది.

ఆయనకి కూతురు ఏపని చేసినా అపురూపమే. "ప్రసాద్... ఈ రోజునుండి ఇది మీ ఇల్లు అనుకో. వీళ్లతో కలిసి హాయిగా చదువుకో! అంతేకాదు. ఎవరో పిల్లలు ఏడ్పించారని స్కూలు మానకూడదు. మన జీవితం మనది. ఏడిపించినవాళ్లే మనల్ని చూసి సిగ్గుపడాలి. తెలిసిందా? నీకు తెలియని పాఠాలు నేను చెపుతాను. బాగా చదువుకొని నువ్వు అభివృద్ధిలోకి రావాలి?" అంటూ అతడి తల నిమిరాడు.

ఆయన చూపిస్తున్న ప్రేమకి, స్నేహానికి ప్రసాద్ చలించిపోయాడు. తల్లి తర్వాత ప్రపంచంలో అతడికి తనని ప్రేమగా చూసేవారు ఇప్పుడే కన్పించారు. అక్క ఆ అబ్బాయి గురించి జరిగిన విషయం చెపుతోంటే ప్రీతి ఆశ్చర్యంగా అతడిని చూస్తూ ఉండిపోయింది. తర్వాత తండ్రి ఒడిలో చేరి "నాన్నా! పాపంకదూ! కాళ్లులేని వాళ్లని అలాగా ఏడ్పించవచ్చునా?" అనడిగింది.

"అవునమ్మా! పాపమే! కానీ వాళ్లూ చిన్నపిల్లలేకదూ. అందుకని అలా చేశారు. తెలిసిన వాళ్లయితే కావాలని అలా తోటిమనిషిని ఎవరూ ఏడిపించరమ్మా" అంటూ ప్రీతికి సమాధానమిచ్చి, ప్రసాద్‌ని వాళ్ల ఇల్లు కనుక్కొని, స్కూలుకి రోజూ శ్రుతితో కలిసి వెళ్లమన్నారు. ఒకరికొకరు సాయంగా ఉంటారని ఆయన అభిప్రాయం. ప్రీతి, శ్రుతి తండ్రి మాటలకు ఎంతో సంతోషంగా అంగీకరించారు. అసలు తనుముందే అతడికీ విషయం చెప్పానని శ్రుతి చెప్పింది.

ఆ కుటుంబంతో పరిచయం ఏర్పడిన నాటి నుండీ అతడి జీవితమే మారిపోయింది. భానుమూర్తిని తెలిసిన ఎవరైనా సరే ఆయనని ప్రేమించకుండా ఉండలేరు. ఆయన నిరాడంబర మనస్తత్వం, మానవత్వం స్నేహ ప్రవృత్తి అందరినీ ఆకట్టుకొంటాయి. మావయ్య తమకు దూరమవడం నిజంగా ఎంతో దురదృష్టం. తనే ఆయనకోసం ఇలా బాధపడుతోంటే ఇంక ఆయన కడుపున పుట్టిన




పిల్లలు ఎలా ఉండగలరు? అనుకొంటూ ఒక పక్కకు తిరిగి ప్రసాద్ పడుకొన్నాడు.

తెల్లవారుఝామున లేచి ప్రీతి, భరత్ చదువుకుంటున్నారు. శ్రుతి మామ్మ దగ్గర కూర్చుని వాళ్ల చదువు విషయం చెప్పింది. చదువులు పోతాయని, కనుక వాళ్లని పంపేద్దామని చెప్పింది. లక్ష్మమ్మ ఉసూరుమని నిట్టూర్చింది.

''చూశావే పెద్దాడు ఇటువైపే తొంగిచూడలేదు. ఆరోజు చేతులు పుచ్చుకొని ఎంత బ్రతిమాలి చెప్పాను. వస్తే మనని ముట్టుకొంటే ఎక్కడ వాడికి అంటుకుంటామోనన్నట్లు ముఖమే చూపించలేదు. నేను పెద్దదాన్ని. బిడ్డచేతులలో కనుమూయకుండా ఈ అనుభవాల కోసం మిగిలాను కాబోలు'' అంటూ బాధపడింది లక్ష్మమ్మ.

''మామ్మా! నాన్నగారు మాకు ఇచ్చిన పాకెట్‌మనీ వెయ్యిరూపాయలవరకూ ఉంటుంది. అది ప్రస్తుతానికి మనకి కొన్నిరోజులు వస్తుంది. ఈలోపు ఏదో ఒకటి చూసుకుందాం'' అని శ్రుతి అనగానే ''మీ నాన్న అడపాదడపా ఇచ్చిన డబ్బు నా దగ్గర కూడా కొంత ఉందే తీసుకో. నేను మాత్రం ఏం చేసుకొంటాను. అమ్మతో మాత్రం ఈ విషయాలేం అనకు. మీ నాన్న ఒక్కనాడూ ఏ విషయంలో దాన్ని కష్టపెట్టి ఎరుగడు. వాడితో దానికి అంతే ప్రాప్తముంది.'' అంటూంటే శ్రుతి ఏదో ఆలోచిస్తూ కూర్చుండిపోయింది.

''శ్రుతీ'' అంటూ సుభద్ర బోర్నవిటా తీసుకొచ్చి ఇచ్చింది.

''పరీక్షలు ఇంక రెండు, మూడు నెలలే ఉన్నాయి. అవి అయ్యాక ఏం చేయాలో ఆలోచించుకొందాం. ఈలోపు నువ్వు మరే ఆలోచనా పెట్టుకోకు. మొదట నీ చదువు సంగతి చూసుకో. రోజులు అవే నడుస్తాయి'' అంటూ వచ్చినంత వేగంగానూ వెళ్లిపోయింది.

అత్త మాటలకి శ్రుతి ఆశ్చర్యపోయింది. ఆమెకి తెలిశాక సుభద్ర ఇంటి విషయాలు పట్టించుకోవడం, సలహా ఇవ్వడం ఇదే మొదటిసారి. అంతేకాదు మరొకసారి కూడా సందర్భం వచ్చినప్పుడు శ్రుతి బాగా చదువుకోవాలని, వాళ్ల నాన్నకి పిల్లలని ఎప్పుడూ బాగా చదివించాలని ఉండేదని అందుకే కాలేజీకి వెళ్లి పరీక్షలు పూర్తిచేయమనీ నొక్కి నొక్కి చెప్పింది. శ్రుతికి కూడా అలాగే అన్పించింది.

రాఘవరావు తర్వాత ఇంటికి వచ్చినప్పుడు పిల్లల్ని లక్ష్మమ్మని దగ్గర కూర్చోపెట్టుకొని సాధకబాధకాలు అడిగారు. వసుధని పలకరించి ధైర్యం చెప్పారు. శ్రుతితో మాత్రం ఖచ్చితంగా చెప్పారు. ''నువ్వు మేథ్స్ స్టూడెంటువి. కాలేజీలో పాఠాలన్నీ అయిపోతున్నాయి. ఈ రోజు నుండే నువ్వు కాలేజీకి వెళ్లిపో. కోర్సులు మిస్సయితే కష్టం'' అంటూ హెచ్చరించారు. శ్రుతి మౌనంగా తల ఊపింది.

లక్ష్మమ్మ ఆయనని తన పెద్దకొడుక్కి ఉత్తరం వ్రాయమంది. శ్రుతి వద్దని వారించబోయింది, ''మీరే చెప్పండి అంకుల్. బాధ్యతలు అన్నవి ఒకళ్ళు గుర్తుచేస్తే కానీ తెలియనివా? అంతగా పట్టించుకోని వాళ్లకి మనం ఉత్తరం వ్రాసి, వాళ్లు నిరాదరించారని మళ్లీ బాధపడటం మంచిదా? ఏది ఏమైనా మీరు వ్రాయవద్దు'' అని సున్నితమైన గొంతుకతో రోషంగా అంటూంటే ఆయన ఆశ్చర్యపోయారు. ఈ అమ్మాయికి ఎంత అభిమానం అనుకొన్నారు.

చివరికి ''శ్రుతీ! నా మాట వింటావా? మామ్మగారు ఈ ఇంటికి పెద్దవారు. ఆవిడకి ఈ ఇంటి గురించి ఆలోచించే హక్కు వుంది. ఆవిడ ఒకపని నాకు చెపితే చెయ్యాలా వద్దా'' అంటూ శ్రుతికి ఆయన నచ్చచెప్పబోయారు.

''ఈ విషయం ఆవిడ ఒక్కరికే సంబంధించింది కాదండీ! మా కుటుంబానికి సంబంధించినది. అంతేకాదు మా కుటుంబ పరువు ప్రతిష్ఠలకి సంబంధించింది కూడా అవునో, కాదో మీరే నిష్పక్షపాతంగా చెప్పండి. అందుకే ఆయనకి ఏమీ వ్రాయవద్దని నా ఉద్దేశ్యం'' అంటూ స్పష్టంగానే తన మనసులోని మాట చెప్పింది.

ఆయన ఏమీ మాట్లాడలేకపోయారు. మనవరాలు చూడకుండా లక్ష్మమ్మ ఆయనకి సంజ్ఞ చేసింది. ఆయన అది గ్రహించి మిగతా విషయాలు ఏవో మాట్లాడుతూ కూర్చున్నారు. ఆయన వెళ్లడానికి లేవబోతూంటే ఆయనని ఇంటివరకూ దింపిరమ్మని మనవరాలుని లక్ష్మ



మ్మ పురమాయించింది.

ఆయన వద్దంటున్నా శ్రుతి ఆయనను అనుసరించింది. చూసినవాళ్ళెవరైనా వాళ్లిద్దరూ తండ్రీ, కూతుళ్లని అనుకొంటారు. రాఘవరావు ఇంటికి చేరాక గేటుతీసి, "లోపలికి రా శ్రుతీ" అని పిలిచారు. శ్రుతి మౌనంగా ఆయనని అనుసరించింది.

ఆ అమ్మాయిని కూర్చోమని చెప్పి, ఆయన వంట ఇంట్లోకి నడిచారు. ఆయనకి భార్యలేదు. వంశీకృష్ణ ఒక్కడే కొడుకు. వంశీకృష్ణ నెలరోజులు పిల్లవాడుగా ఉన్నప్పుడే ఆయన భార్య పోయింది. తను మళ్ళీ పెళ్లి చేసుకొంటే వంశీకృష్ణను వచ్చినవాళ్ళు సరిగ్గా చూడరన్న భయంతోను, భార్యమీద గల ప్రేమతోను ఆయన దానికి అంగీకరించలేదు.

ఆయన మంచి లీడింగ్ లాయరు. రెండు చేతులా సంపాదిస్తున్న ఆ బంగారు పిచ్చుకను అల్లుడిని చేసుకోవాలని ఎందరో కాళ్ళకు బలపం కట్టుకొని తిరిగారు. కాని ఆయన వారికి ఒక కొరకరానికొయ్య అయ్యారు. భార్య వెళ్లిపోతూ "ఏమండీ! వంశీ జాగ్రత్త. వాడిని జాగ్రత్తగా పెంచండి. బాగా చదివించండి" అని చెప్పిపోయింది. ఆ మాటకి ఆయన కట్టుబడిపోయి కొడుకే లోకంగా బ్రతికారు.

శ్రుతి ఒక్కర్తీ డ్రాయింగ్ రూంలో కూర్చుని ఏదో ఆలోచిస్తోంది. ఈలోపు ఎక్కడనుండో వంశీకృష్ణ ఇంటికి వచ్చాడు. చేతిలో పుస్తకాలతో లోపలకి వెళ్ళబోతున్న అతడు శ్రుతిని చూసి ఆగిపోయాడు. అతడికి అసలే ఆడపిల్లలంటే బెరుకు. శ్రుతిని చిన్నప్పటినుంచి చూస్తున్నా ఈ సమయంలో మాత్రం ఏం మాట్లాడాలో తెలియలేదు. ఇంజనీరింగ్ చదువు పూర్తిచేసిన అతడికి ఒక ఆడపిల్లతో ఎలా మాట్లాడాలో అర్థమవలేదు.

అలాగని మౌనంగా లోపలికి వెళ్లిపోదామంటే భానుమూర్తి పోయాక అతడికి వాళ్లింటికి వెళ్లినప్పుడు శ్రుతితో ఏమీ మాట్లాడలేదని గుర్తు వచ్చింది. భానుమూర్తి, రాఘవరావు ఎంత మంచి స్నేహితులో అందరికీ తెలుసు. నిలబడిన శ్రుతిని చూస్తూ "కూర్చోండి ఫర్వాలేదు" అన్నాడు.

శ్రుతి "ఫర్వాలేదని" నిలబడేవుంది.

"మీ నాన్నగారు పోయినందుకు నాకు చాలా బాధ అన్పించింది. ఇంత చిన్నవయస్సులో ఆయన పోవడం నిజంగా మన దురదృష్టం" శ్రుతితో అంటూ తలవంచుకొన్నాడు. శ్రుతి ఏమీ మాట్లాడలేదు.

ఎంతకీ ఆమె ఏమీ మాట్లాడకపోయేసరికి తలెత్తి ఆమెవైపు చూశాడు. తండ్రి గురించి సంభాషణ వినబడగానే శ్రుతి కళ్లనుండి కన్నీళ్లు ధారాపాతంగా రావడం మొదలుపెట్టాయి.

ఆ అమ్మాయి ఏడుపు చూసేసరికి అతడికి కంగారుపుట్టింది. "ఇదిగో చూడండి. మీ నాన్నగారిని గుర్తుచేసి మిమ్మల్ని బాధపెట్టాను. నా ఉద్దేశం అదికాదు. మీరు ధైర్యంగా ఉండాలని చెప్పాలని అనుకొన్నాను.అంతే. ప్లీజ్... మీరు ఏడవవద్దు" అంటూ బ్రతిమాలాడు.

"మా నాన్నగారి తలపులు నన్ను విడిచిపెట్టినపుడుకదా మీరు మళ్ళీ గుర్తుచేసి బాధించేది. ఆయన లేని మేము చాలా దురదృష్టవంతులం" అనుకుంది శ్రుతి.

"చూడండి. నాకు ఈ ఫార్మాలిటీస్ బొత్తిగా తెలియవని మా నాన్నగారు ఎప్పుడూ కేకలేస్తూ ఉంటారు. మీ అమ్మగారు ఎలా ఉన్నారు? ఆవిడని మీరే జాగ్రత్తగా చూసుకోవాలి. మీ కుటుంబం ఎలా తట్టుకుంటారో అని మా నాన్నగారు బెంగపడుతున్నారు" అంటూ శ్రుతివైపు చూశాడు.

పమిటచెంగుతో ఎంతగా తుడుచుకుంటున్నా శ్రుతికి ఇంకా కన్నీళ్ళు వస్తున్నాయి.

విశాలమైన ఆమె సోగకళ్లు ఏడవడంవలన ఎర్రబడి ఎర్ర కలువరేకుల్లా ఉన్నాయి. ముక్కు చివరిభాగం గట్టిగా తుడుచుకోవడంవలన కందిపోయి మెరుస్తోంది. ముక్కుకి ఉన్న చిన్న బంగారపు ముక్కుపుడక గమ్మత్తుగా చిన్న చుక్కలాగా మెరుస్తోంది"

"ఈ అమ్మాయి ఎంత అందమైనది" అనుకొన్నాడు.

మరుక్షణమే తననితానే తిట్టుకొన్నాడు. "ఆ అమ్మాయి ఒకప్రక్క ఏడుస్తోంటే పెద్ద సౌందర్యారాధకుడిలాగా ఆమె అందాన్ని మెచ్చుకొంటున్నాను. నాన్నగారు అనుకొనేటట్లే నాకు కామన్‌సెన్స్ లేదు" అని తనని గూర్చి అనుకొని, ఆ అమ్మాయిని ఏవిధంగా మరొకవైపుకి




మరల్చాలా అని ఆలోచించాడు. అతడికి ఏం మాట్లాడాలో తోచలేదు.

పదిమాటలు గట్టిగా మాట్లాడలేనివాడిని కోరి ఎందుకు ఆ అమ్మాయిని కదిపానురా, పోనీ కదిపాను అనుకో ఓదార్చడమే రానివాడిని. ఇప్పుడు ఏం చేయడమా అని అనుకుంటూంటే, దేముడిలాగా రాఘవరావు హార్లిక్సు గ్లాసులతో ఆ గదిలోకి వచ్చారు.

"నువ్వు కూడా వచ్చేశావన్నమాట. నేను నాకు, శ్రుతికి మాత్రం తెచ్చాను. పోనీ ఇది నువ్వు తీసుకో. నేను వెళ్ళి మళ్ళీ కలుపుకొని వస్తాను"అని వెళ్లబోతూంటే వంశీకృష్ణ ఆయనని వారించి "నాకు ఇప్పుడే ఏమీవద్దు. మీరు తీసుకోండి" అని అంటూ లోపలికి వెళ్లాడు.

"అదేమిటి శ్రుతీ! అలాగా నిలబడిపోయావేమిటి? కూర్చో... అరే పిచ్చిపిల్లా... ఏడుస్తున్నావా? ఛ... ఛ... ఇలా ఏడుస్తారా ఎవరైనా నువ్వు ఇంటికి పెద్ద ఆడపిల్లవి. నువ్వే ఇలాగ బెంబేలుపడితే ఎలా చెప్పు?" అంటూ బలవంతంగా హార్లిక్సు ఆమె చేతికిచ్చి, ఓదార్చారు. ఏవో నాలుగు కబుర్లు చెప్పి ఆ అమ్మాయి దృష్టి మరల్చారు. లోపలిగదిలో నిల్చొన్న వంశీకృష్ణ అమ్మయ్య అనుకొన్నాడు శ్రుతి మామూలయిపోయి హార్లిక్స్ తాగింది.

ఒంటరిగా శ్రుతి తనతో రావడం వలన ఆమెతో కొన్ని ఇంటి విషయాలు మాట్లాడవచ్చునని ఆయన అనుకొన్నారు. భానుమూర్తీ, ఆయన స్నేహితుడు రమేష్‌చంద్ర కలిసి ప్రెస్ పెట్టుకొన్న విషయం చెప్పారు. ఇద్దరూ ఇంతవరకూ జాయింట్‌గా ప్రెస్‌మీద వచ్చే డబ్బు పంచుకొన్నారు. ఇప్పుడు అతడు లేడు కనుక ప్రెస్సు విషయం ఏం చేయడమో ఆలోచించాలి. అదే శ్రుతితో చెప్పారు. భానుమూర్తి అంటే ఉండే ఇష్టంవలన అతడు పెట్టుబడి కొంతపెట్టాడు. ఇప్పుడు ఆయన ఈ విషయమే ఆలోచిస్తున్నారు.

కొంతకాలం గడిచాక వసుధతో, శ్రుతితో ప్రెస్ విషయం మాట్లాడవచ్చునని రమేష్ చంద్ర అనుకోవడం గురించి ఆయన చెప్పారు. శ్రుతి పెద్దనాన్నో మావయ్యో వస్తే ఇవన్నీ మాట్లాడదామనుకొన్నారు.

వాళ్ళెవరూ మళ్ళీ రాకపోవడం వలన శ్రుతికి చెప్పారాయన, "పెట్టుబడి సగం పెట్టడమే కానీ ఏనాడూ రమేష్ చంద్ర ఆ ప్రెస్ విషయాల్లో తలదూర్చలేదు. అదంతా భానుమూర్తే చూసుకొనేవాడు. ఇప్పుడు ఆయన ఏం నిర్ణయం తీసుకొంటాడో?" ఆయన తనలో తాను అనుకొన్నట్లు అనుకొన్నాడు.

"ఇవన్నీ ఆలోచించవలసిన విషయాలే. నువ్వు చూస్తే చిన్న పిల్లవి. ఈ గొడవలన్నీ పడలేవు. నేను అనవసరంగా నిన్ను కంగారు పెడుతున్నానేమో కదూ" అని ఇబ్బందిగా అన్నాడు.

"లేదంకుల్... మనం ఎప్పటికైనా వీటి గురించి ఆలోచించవలసిందే కదా! మీరు రమేష్‌చంద్రగారిని కలిసి ఆయన ఉద్దేశం తెలుసుకోండి" అని చెప్పింది.

ఆయన కూడా శ్రుతి చెప్పినట్లే చెయ్యాలనుకొన్నారు. శ్రుతిని మాత్రం మొదట కాలేజీకి వెళ్ళిపోమనీ, చదువును అశ్రద్ధ చెయ్యవద్దనీ, డబ్బుగానీ మరేదైనాగానీ అవసరమైతే తనకి చెప్పి, సహాయం తీసికోమనీ నొక్కి నొక్కి చెప్పారు.

శ్రుతి ఆయన చెప్పిన మాటలన్నీ జాగ్రత్తగా విని 'అలాగే' అంది.

శ్రుతి వెళ్ళిపోగానే ఆయన తన దైనందిన కార్యక్రమంలో మునిగిపోయారు. మణమ్మగారు వచ్చి, తండ్రీ కొడుకులని భోజనానికి పిలిచారు.

భోజనాల దగ్గర వంశీకృష్ణ "పాపం... శ్రుతీ వాళ్ళు చూస్తే చిన్నపిల్లలు. బంధువులు చూస్తే ఆదుకొనేలాగ కన్పించడంలేదన్నారు. వాళ్ళకి చాలా ఇబ్బంది కదండీ!" అన్నాడు.

కొడుకు మాటలు వినగానే ఆయనకు చాలా ఆశ్చర్యం కలిగింది. వంశీకృష్ణ ఎప్పుడూ బయటవాళ్ళ గురించి ఆలోచించడు. తండ్రితో ఇతరుల కబుర్లే మాట్లాడడు. ఎంతసేపూ తను, తన కాలేజీ కబుర్లు, తండ్రి ఉద్యోగ విషయాలు, కబుర్లు అంతే. ఇవి తప్ప అతడికి ప్రపంచం తెలియదు. అటువంటివాడు ఇతరుల సమస్యలు ఆలోచించడంతో ఆయనకి కొడుకు మీద అభిమానం పొంగిపొర్లింది. కొడుకు కాస్త లౌకిక ప్రపంచంలో పడుతున్నాడని

అనుకొన్నారు.

"నిజమే వంశీ! చాలా కష్టమే ఇప్పుడు వాళ్ళకి. కానీ భగవంతుడు చేసే నిర్ణయాలకి మనుష్యులు తలవంచక తప్పదుకదా" అని వాళ్ళ కుటుంబపరిస్థితులు ఏకరువు పెట్టారు. పిల్లలు చూస్తే చిన్నవాళ్ళు. బంధువులు ఒక్కరైనా కాస్త ముందుకు వచ్చి ఆదుకొంటే బావుండునని అనుకొన్నారు.

శ్రుతి కాలేజీకి బయలుదేరుతుందో లేదో అని స్వప్న ముందుగా వాళ్ళ ఇంటికి వచ్చింది. స్నానం చేసి కడిగిన ముత్యంలాగ ఉన్న శ్రుతిని చూస్తూ 'చక్కనమ్మ చిక్కినా అందమే' అని పెద్దలు ఇందుకే అన్నారు కాబోలు అనుకొని మనస్ఫూర్తిగా శ్రుతి సౌందర్యాన్ని మెచ్చుకొంది.

తల్లి గదిలోకి వెళ్ళి కాలేజీకి వెళ్ళివస్తానని, పరీక్షలు దగ్గరకి వస్తున్నాయి కనుక రెండు నెలలు కష్టపడితే ఈ మెట్టు దాటవచ్చునని చెప్పింది. వసుధ వస్తున్న కన్నీళ్ళని ఆపుకొంటూ వెళ్ళిరమ్మన్నట్లు తల ఊపింది.

వంటింట్లోకి వచ్చి మామ్మకి చెప్పి, తల్లిని వాళ్ళకి అప్పచెప్పి కాలేజీకి బయలుదేరింది. శ్రుతి మాటమీద భరత్ స్కూలుకి, ప్రీతి కాలేజీకి వెళ్ళిపోయారు.

కాలేజీలో లెక్చరర్స్ అందరికీ శ్రుతంటే అభిమానం. ఎంతో తెలివైనదనీ, అన్ని సబ్జెక్టులలో ఫస్టున ఉంటుందనీ వారికి ఆసక్తి. శ్రుతి తండ్రి పోయాడని విని వాళ్ళు ఎంతో బాధపడ్డారు. దానికి సాయం, వాళ్ళందరికీ భానుమూర్తితో పరిచయముంది. శ్రుతికున్న తెలివితేటలకి ఒక డాక్టరో, ఇంజనీరో అవుతుందని ఆశపడ్డారు. తండ్రి పోవడంతో ఆమె చదువు గూర్చి వాళ్ళు బాధపడ్డారు.

అందుకే శ్రుతి కాలేజీకి రాగానే వాళ్ళందరూ ఎంతో సంతోషించారు. ఆమె రానిరోజులలో జరిగిన పాఠాలు మళ్ళీ చెపుతామనీ, బాగా చదవమనీ హామీ ఇచ్చారు. లెక్చరర్స్ తనయందు చూపిస్తున్న వాత్సల్యం ఆమెకి ధైర్యాన్నిచ్చింది.

ఇంటికి వచ్చి, కాసేపు తల్లి దగ్గర కూర్చుంది. శుష్కించిపోయిన ఆమెను చూస్తే ఎంతో ఆవేదన పెల్లుబికింది. లక్ష్మీదేవిలాగ కళకళలాడే తల్లి తండ్రిపోగానే కళావిహీనమైపోయింది. వెలవెలబోతున్న తల్లి రూపం శ్రుతికి ఆందోళన కలిగిస్తోంది. మళ్ళీ ఆమెను ఎలా మామూలుగా చేయడమో అర్థమవలేదు. తల్లి చేతులని తన చేతులలోకి తీసుకొంది.

"అమ్మా! నువ్వు ఇలాగ మంచంలో ఉండిపోతే మాకేం తోచడంలేదు. ఎంతో బెంగగా ఉంది. నాన్నగారు లేనేలేరు. నువ్వయినా లేచి తిరగకపోతే మమ్మల్ని ఎవరు చూస్తారు? మాకు ఎవరు ఉంటారు?" అని కన్నీటితో ఆర్తిగా అడిగింది.

"శ్రుతీ" అంటూ వసుధ కూతురిని గుండెలమీదకు తీసుకొంది. శ్రుతి ఒళ్ళంతా ప్రేమతో నిమిరింది "అవునమ్మా... మామ్మ పెద్దదయిపోయింది. కొడుకును పోగొట్టుకొన్న దుఃఖం ఆమెను కలచివేస్తోంది. అయినా సరే మనకోసం దిగమింగుకొని బతుకుతోంది. మేము ఎక్కడ బెంగపడతామో అని లేచి తిరుగుతోంది. అవునా" అంటూ తల్లివైపు మొహం ఎత్తి చూసింది. వసుధ చెంపలపై జారుతున్న కన్నీళ్ళని తుడుచుకొంటూ అవునని తల ఊపింది.

"నాన్నగారు మామ్మకి, అత్తకి ఏలోటూ రాకుండా చూద్దామనుకొన్నారు. ఆయన కోరికని మనం తీర్చాలి కదా! నువ్వు ఇలాగ కుంగిపోతే మామ్మ ఇంకా దిగులుపడుతుంది. మాకోసం, మామ్మకోసం నువ్వు మామూలు మనిషివి కావాలమ్మా" అంటూ తల్లికి నెమ్మదిగా నచ్చచెప్పింది శ్రుతి.

శ్రుతి చెప్పేది మౌనంగా వింటోంది వసుధ. మాట్లాడదామంటే ఆమెకు నోరు పెగల్లేదు. నెమ్మదిగా తనని తాను సంభాళించుకొని "శ్రుతీ! నాకు బ్రతకాలనే కోరిక లేదే! నాన్నగారు లేకుండా నేను ఉండలేను" అంటూ గొల్లుమంది. ఆమెలో పేరుకొని ఉన్న ఏడుపంతా పైకి వచ్చేసింది. ప్రీతి, భరత్ పరుగు పరుగున వచ్చారు.

"అమ్మా! భరత్‌ని చూడు. వాడు చాలా డల్‌గా ఉంటున్నాడు. వాడికి నాన్నగారి దగ్గర బాగా చనువు. ఆయన లేకపోయేటప్పటికే వాడు తలకిందులవుతున్నాడు. అన్నం కూడా




సరిగ్గా తినడంలేదు. నువ్వు కనుక వాడి గురించి పట్టించుకోకపోతే చాలా కష్టం'' అంటూ తల్లి దృష్టిని తమ్ముడివైపుకి మరల్చింది.

భర్త పోయిన దగ్గరనుండీ వసుధ తన దుఃఖంలో తానుంది. పిల్లలు తింటున్నారో లేదో కూడా ఆమె ఆలోచనలోకి రాలేదు. స్వయంగా దగ్గరుండి తినిపిస్తేనే భరత్ తిండి దగ్గర పేచీలు పెడతాడు. ఇప్పుడు ఎలా ఉన్నాడో? శ్రుతి భరత్ గూర్చి చెప్పగానే ఆవిడకి వాడిమీద ప్రేమ పొంగింది.

శ్రుతి తల్లి ఆలోచనని గ్రహించినట్లు భరత్‌ని తల్లి దగ్గరకి పిల్చింది. ''చిన్నూ! అమ్మ పిలుస్తోంది రా'' అంటూ మళ్ళీ పిలిచింది. భరత్ అపనమ్మకంగా తల్లివైపు చూశాడు. తల్లి తనను దగ్గరకి పిలవడమా అన్న సంశయం అతడి మొహంలో కొట్టొచ్చినట్లు కన్పిస్తోంది. తండ్రి పోయిన దగ్గర్నుండీ తల్లిని చూడాలన్నా దగ్గరికి రావాలన్నా అతడికి భయంగా ఉంటోంది. అందుకే దూరం దూరంగా తిరుగుతున్నాడు.

ఇప్పుడు కూడా అడుగులో అడుగు వేసుకొంటూ నెమ్మదిగా తల్లి దగ్గరికి వచ్చాడు. వసుధ ఒక్క ఉదుటన వాడిని దగ్గరకు లాక్కొని, అక్కున చేర్చుకొంది. వాడి చెక్కిళ్ళని నిమిరింది. వాడి జుట్టు సవరించింది. కొడుకు అలనా పాలనా ఇన్నాళ్ళనుండీ చూడలేదన్న బాధ ఆమెలో కలిగింది. భరత్ మౌనంగా తల్లి ఒడిలో వాలిపోయాడు.

''అమ్మా! నువ్వు ఏ విషయం గురించీ బెంగపడవద్దు. అన్నీ నేను చూసుకొంటాను. లోకంలో ఎందరు మనకన్నా అనాథలు లేరు? నువ్వు మాకోసం బతకాలి. మనకి మనమే ధైర్యం చెప్పుకొని నడవకపోతే ఎలాగ?'' అంటూ అదేసమయమని తల్లికి నాలుగు మాటలు చెప్పి, ధైర్యం నూరిపోసింది.

శ్రుతి, ప్రీతి వద్దన్నావినకుండా లక్ష్మమ్మ పెద్దకొడుకు రామచంద్రానికి ఉత్తరం వ్రాయించింది. పిల్లలు ఇంకా కళ్ళు విప్పనివారనీ, వాళ్ళ గురించి ఇంటికి పెద్దవాడిగా అతడు ఆలోచించాలనీ, తమ్ముడు అతడియందు ఎంత ప్రేమగా గౌరవంగా ఉండేవాడో గుర్తుచేసుకోమనీ బతిమాలుతూ ఉత్తరం రాయించింది. అతడిని తప్పక ఒకసారి రమ్మని పదేపదే కోరింది.

రామచంద్రం నుండి ఎన్నిరోజులైనా జవాబు రాకపోయేటప్పటికి ఆవిడ హతాశురాలైంది. చివరికి మళ్ళీ ప్రీతిని బతిమాలి, ఆ పిల్లచేత పెదనాన్నకి మరో ఉత్తరం రాయించింది. ప్రీతి ఎదురు చెప్పలేక రాసింది.

ప్రీతి స్వభావమే వేరు. శ్రుతిలాగ ఏ విషయం ఖచ్చితంగా చెప్పలేదు. ఆ పిల్ల మనసు మెత్తనిది. ఇతరులు ఏమనుకొంటారో అనే ఆలోచిస్తుంది. ఆ అమ్మాయికి తనవలన ఎవరూ బాధపడటం ఇష్టం ఉండదు. మామ్మ కవరు చేతికిచ్చి, పెదనాన్నకి ఉత్తరం రాయమని పదేపదే చెపుతోంటే రాయనని అనలేకపోయింది. లక్ష్మమ్మ దగ్గరగా కూర్చుని రాయించింది.

ప్రీతి ఉత్తరం చూశాక రామచంద్రం మౌనంగా ఉండలేకపోయాడు. ఊపిరి సలుపని పనులు ఎక్కువగా ఉండటంవలన తను రాలేకపోతున్నానని, త్వరలో వీలు చూసుకొని వస్తానని, పిల్లలని శ్రద్ధగా చదవమని మరదలిని బెంగపడవద్దని రాశాడు.

ఆ ఉత్తరానికే లక్ష్మమ్మ పొంగిపోయింది. శ్రుతిమాత్రం చాలా బాధపడింది. తనకి తెలియకుండా చెల్లెలు, ఎందుకు ఉత్తరం వ్రాయాలని అభిమానంగా అడిగింది. ''అన్నింటికన్నా అభిమానం కాపాడుకోవడం ముఖ్యం ప్రీతీ! మరొకసారి నాకు తెలియకుండా ఏమీ రాయకు'' అంటూ చెల్లెల్ని అంటూంటే లక్ష్మమ్మ కలగచేసుకోకుండా ఉండలేకపోయింది.

తనే ప్రీతిని రాయమంది. శ్రుతి చిన్నపిల్ల. ఆ వయసులో పట్టుదల, అభిమానం తప్ప ముందుచూపు ఉండదు. పెద్దకొడుకు వస్తే నాలుగు డబ్బులు సహాయం చేయకుండా ఉండలేడు. అయినదానికి, కానిదానికి ఆపదలో, అవసరంలో ఉన్నవాళ్ళు పౌరుష పడకూడదు. తన వయసులో ఉన్న ఆలోచన వాళ్ళకి ఉంటుందా? అందుకే శ్రుతికి తన మనసులోని విషయం చెప్పి, నచ్చచెప్పింది. అంత పెద్దావిడ ఇల్లు జరుగుబాటు గురించే బెంగపడుతోందని గ్రహించిన శ్రుతి ఆవిడని గట్టిగా ఏమీ అనలేకపోయింది.




# ఐదుకాళ్లకప్ప

నాలుగుకాళ్ల కప్పల్ని మనం చూస్తూనేవున్నాం. కాని ఐదుకాళ్ల కప్పని చూసే అవకాశం ఆస్ట్రేలియాలోని టౌన్‌జ్విల్ పట్టణవాసులకు దక్కింది. ఆ పట్టణ సమీపంలోనున్న ఓ సిమెంట్ ఫ్యాక్టరీ ప్రాంగణంలో కన్పించిందా విచిత్రమండూక రాజం. చూడడానికి అది మామూలు కప్పలాగే వుంది. గానీ కంఠం దిగువనుంచి ఓ అయిదు సెంటీమీటర్ల పొడవున్న ఎముక బయటకు పొడుచుకొచ్చింది. అలా బయటకొచ్చిన ఎముకకు కూడా చర్మం ఉండడం మరీవిశేషం. ఆ కప్ప బెకబెకలాడుతూ గెంతుతుంటే, వెళ్లుకొచ్చిన ఆ ఎముక అయిదోకాలులా నేలను తాకుతూ దానికి ఓ ప్రత్యేకతను ఆపాదించిపెడుతోంది.

మొదటిసారిగా ఆ కప్పను గమనించి అందరి దృష్టికీ తీసుకొచ్చినవాడు రాడ్‌స్టాక్‌హామ్. ప్రస్తుతం అతడే దాన్ని తన అధీనంలో ఉంచుకొని పత్రికలవారికి దాని సమాచారం అందిస్తున్నాడు. "ఈ విచిత్రమైన కప్పను ఏ యూనివర్శిటీకైనా ఇచ్చేద్దామనుకుంటున్నాను" అంటున్నాడతను.

ఒకరోజు సాయంత్రం శ్రుతి ఖాళీచూసుకొని రాఘవరావు ఇంటికి వెళ్ళింది. ఆయన ఆ సమయంలో శ్రుతి రావడం చూసి కంగారుపడ్డారు. అందరూ బాగున్నారనీ, తనే అవసరముండి ఆయన దగ్గరకు వచ్చాననీ శ్రుతి చెప్పింది. తను ఏపని చేయడానికీ చదువు అడ్డువస్తోందని, చదువుమానేస్తే ఇంట్లోవాళ్ళు ఒప్పుకోరని, అందుకే పరీక్షలకి సిద్ధమవుతున్నానని చెప్పింది.

రాఘవరావు ''డబ్బేమైనా కావాలా'' అని అడిగితే శ్రుతి వద్దని వారించింది. ఆమె ఏదో విషయం చెప్పాలనుకొని చెప్పలేకపోతోందని ఆయన గ్రహించారు. ప్రెస్ గురించా అని అడిగితే కాదంది. ప్రెస్ గురించి ఆయననే మాట్లాడమని, పరీక్షలు అయ్యాక ఆ విషయం చూసుకొందామని చెప్పింది. ఇంక మరే విషయంమీద వచ్చిందో ఆయనకి అర్థమవలేదు. ఏనాడూ ఇతరులను ఏమీ అడగని శ్రుతికి ఇలా అడగవలసి రావడం కష్టంగా ఉంది. చివరికి మొహమాటాన్ని అవతలికి తోసి ఆయనను నెమ్మదిగా అడిగింది.

''అదికాదంకుల్... మీ ఇంట్లో పప్పు రుబ్బు మిషన్ ఖాళీగా ఉంది కదా! మీరు దాన్ని మాకు ఇవ్వగలరా? మన చుట్టు పక్కల ఎక్కడా రుబ్బుడు మిషన్ లేదు. అందాక నేను దాన్ని ఉపయోగించుకొందామనుకొంటున్నాను. అలాగే సెకండ్ హేండ్ కారాలు, పిండ్లు దంపు మిషన్ దొరికితే కొందామని, దాన్నొక కుటీర పరిశ్రమగా పెడదామని ఆలోచిస్తున్నాను. అందుకే మీరు మాకు గ్రైండర్ ఇవ్వగలరా?'' అని నెమ్మదిగా అడిగింది.

ఆయన ఆ అమ్మాయి ఆలోచనకి ఆశ్చర్యపోయారు. ఇల్లు జరుగుబాటు గురించి ఆమె తీవ్రంగా ఆలోచిస్తోందని ఆయనకి అర్థమైపోయింది. ఆయనకి వెంటనే ఆ అమ్మాయిమీద జాలివేసింది.

పరీక్షలు అయ్యేవరకూ ఏ విషయం పట్టించుకోవద్దనీ, అంతవరకూ తాను ఇంటికి అవసరమగు డబ్బు సర్దుతానని, ఏకాగ్రతతో పరీక్షలు పూర్తిచేసుకోమనీ ఆయన ఎంతగానో నచ్చచెప్పారు. శ్రుతి విన్పించుకోలేదు. రుబ్బుడు పని ఉదయంవేళలో, సాయంత్రం వేళలో ఉంటుంది. తాను అప్పుడు ఖాళీయే కదా అని వాదించి ఆయనను ఒప్పించింది. అత్త, మామ్మ తను లేనప్పుడు చూసుకొందుకి ఉన్నారు. కనుక కాలేజీ పాడవదు. అని ఆయనకు భరోసా ఇచ్చింది.

ఆయన డబ్బు ఇస్తానంటే వద్దన్నందుకు ఏమనుకొంటారో అని ఆయనకి సర్ది చెప్పింది. అవసరమైనపుడు ఆదుకోవడానికి ఆయనకాక తనకి ఎవరు ఉన్నారు? తప్పక అవసరం వస్తే తీసుకొంటానని, అన్ని విషయాలలో ఆయన అండ చూసుకొనే తను ధైర్యంగా ఉన్నానని శ్రుతి చెపుతోంటే ఆయన హతాశులయ్యారు.

ఆయన ఇంక ఏం మాట్లాడగలరు? అసలు శ్రుతి ఆయనకి ఏదైనా మాట్లాడటానికి అవకాశం ఇస్తే కదా! భార్య ఉన్నప్పుడు పదిమంది బంధువులూ వచ్చేవారని ఆవిడ రుబ్బు మిషన్ కొన్నది. ఇప్పుడు అది తమకి అనవసరం. అందుకే శ్రుతికిచ్చేశారు. అయినా శ్రుతి చదువు విషయం చూసుకోకుండా ఈ యాతనలు పడటం ఆయనకి కష్టంగానే ఉంది.

ప్రెస్ విషయంలో రమేష్ చంద్ర దాని బాధ్యత వహిస్తారేమో కనుక్కోమని ఆయనకి చెప్పింది. తనకి ఆయనతో పరిచయం లేదు. అందుకే ఆ బాధ్యత ఆయనమీద పెట్టింది.

పెద్ద అట్టమీద ''ఇచ్చట పిండి రుబ్బబడును'' అని గుండ్రంగా రాసి ఇంటిగేటు దగ్గర పెట్టింది. ముందు గది వసారాలో దాన్ని అమర్చింది. లక్ష్మమ్మ శ్రుతిచేస్తున్న పని చూసి తమ ఇంటా, వంటా ఎరగమని గోలపెట్టింది. పెద్దకొడుకు రానందుకు నాలుగు తిట్టిపోసింది. శ్రుతి మాత్రం ఏమీ పట్టించుకోలేదు. తాను చేయదలచుకొన్న పని చేసేసింది.

ఆ ఏరియా ఊరుకి కాస్త దూరం. ఆ ఏరియాలోకి ఇంకా రుబ్బుడు మిషన్ రాలేదు. అక్కడ ఉన్న ఆడవాళ్ళందరూ శ్రుతి చేస్తున్న పనికి ఎంతో ఆనందించారు. పైగా బ్రాహ్మణులు. పరిశుభ్రంగా ఇస్తారని అందరూ రావడం మొదలుపెట్టారు. శ్రుతి మొదట కేజీ పప్పుకి అర్థరూపాయి చొప్పున పుచ్చుకొనేది. దాంతో వాళ్ళే దెబ్బలాడి కేజీకి ఒక రూపాయి చొప్పున పెట్టారు. శ్రుతికి ఉదయం, సాయంత్రం అదే

పని. మామ్మ గొణుక్కొన్నా ఆమె పట్టించుకోలేదు. పైగా దానివలన రోజుకి పదిరూపాయిలకి తక్కువ లేకుండా ఆదాయం వచ్చేది.

ఈలోపు అనుకోని విషయం ఒకటి జరిగింది. బాబామెట్టలో ఇళ్ళు బాగా లేచాయని, ఇంకా ఇళ్ళు ఎక్కువమంది కట్టుకొంటున్నారని అక్కడ రెండు పాక హొటళ్ళు ప్రారంభించారెవరో. వాళ్ళు శ్రుతి దగ్గరికి వచ్చి రోజూ తమకు కావసినంత పప్పు రుబ్బి ఇవ్వవలసినదిగా కోరారు. తాము వారానికి ఒకసారి డబ్బు చెల్లిస్తామని చెప్పారు. వాళ్ళకి శ్రుతి ఆపద్బాంధవురాలిలాగ కన్పించింది. శ్రుతికీ ఈ విషయం ఆనందంగానే ఉంది. వాళ్ళకి చీకటితోనే పిండి రుబ్బి ఇస్తానని వాగ్దానం చేసేసింది. వాళ్ళు ఇడ్లీతోపాటు గారెలు కూడా చేయడం మొదలుపెట్టారు. శ్రుతి వద్దన్నా వినకుండా భరత్‌కోసం టిఫిన్ పంపేవారు. శ్రుతికి అలాంటివి గిట్టవు. తానేం పట్టినే చేయడంలేదు. పైగా ఇవి ఎందుకు? అందుకే వాళ్ళని కేకలేసి మాన్పించింది.

శ్రుతి అట్టమీద పనిచేసే గంటలు వ్రాసి పెట్టినా కొందరు దాన్ని గుర్చి పట్టించుకోలేదు. భర్తలకి సాయంత్రం వచ్చేటప్పటికి వేడిగా టిఫిన్ చేసేపెట్టడంకోసం కొందరు మధ్యాహ్నం వేళలో వచ్చేవారు. సుభద్ర వాళ్ళ పని చూసి పంపించేది.



రామచంద్రం ఒకసారి తన స్వంత పని మీద విజయనగరం వచ్చాడు. అతడు ఉన్న సమయంలో మధ్యాహ్నం వచ్చిన వాళ్ళ పని చూస్తోంది సుభద్ర. అతడు తల్లిని, మరదలిని పలకరించి, క్షేమ సమాచారాలు అడిగాడు. లక్ష్మమ్మ కొడుకు రాక చూసి పొంగిపోయింది. అతడికి అన్నం పెట్టి కష్టసుఖాలు అడిగింది. కోడలు గురించి, మనవల గురించి అడిగింది. పిల్లలు, తాము పడుతున్న ఇబ్బందులు అతడితో ఏకరువు పెట్టింది.

"చూశావా అమ్మా! నువ్వు అనవసరంగా శ్రుతి గురించి బెంగపడుతున్నావు. అది చూడు... వాళ్ళకోసం అప్పుడే ఎలాంటి ఆలోచన చేసిందో. ఏమైనా అది చాలా తెలివైనది. నీకు ఎందుకమ్మా అక్కరలేని ఆందోళన? హాయిగా కృష్ణా, రామా అనుకొంటూ కూర్చోక ఈ ఆలోచనలు ఎందుకు?" అంటూ తల్లిని మందలించాడు. లక్ష్మమ్మకి కొడుకు మాటలకి ఒళ్ళు మండింది. అయినా తమాయించుకొంది.

"రామూ! శ్రుతి ఆడపిల్ల, చిన్నపిల్ల అని మరిచిపోతున్నావు. ఏదో కూర ఖర్చయినా వెళుతుందని అది అలాగ కష్టపడుతోంటే అదే చాలన్నట్లు నువ్వు మాట్లాడితే ఎలాగ? తమ్ముడి పిల్లలు నీ పిల్లలు కారా? వాళ్ళ చదువులు, పెళ్ళిళ్ళు నీ బాధ్యత కాదా? శ్రుతిని ఒక అయ్య చేతిలో పెట్టవలసినవాడివి నువ్వేరా!" అంటూ కొడుకుని గట్టిగా నిలదీసింది. కోడలు కొడుకుతో రాకపోవడంవలన ఆవిడకి కాస్త ధైర్యం వచ్చింది. అందుకే తన మనసులోని మాటని నిర్భయంగా చెప్పింది.

"ముగ్గురు ఆడపిల్లలు, ఇద్దరు మగబిడ్డలతో నా అవస్థ నీకు తెలియదమ్మా! ఆ పిల్లలతో ఎలా తెములుతానా అని నేను బెంగపడుతున్నాను. ఈ కాలంలో పెళ్ళిళ్ళన్నా చదువులన్నా మాటలుకాదు. మాకు తండ్రి ఇచ్చిన పిత్రార్జితం ఏదైనా ఉంటే అలాగే ఆదుకొనేవాడిని. లాయర్‌గా నా సంపాదన నాకు, నాకుటుంబానికే చాలడంలేదు. ఎలా ఈ బరువంతా నేను మోయగలను?" అంటూ గయ్యిమని తల్లిమీద ఎగిరాడు రామచంద్రం.

"తండ్రి ఇచ్చిన ఆస్థి ఉంటే ఈ ప్రాధేయత ఎందుకు పడతానురా? ఏదో నీకు తోచింది పంపి ఈ కుటుంబానికి సాయం చేయి. ఈ కుటుంబం నడుస్తుంది. భాను బతికున్నన్నిరోజులూ అక్కని, నన్ను పోషించడం మానేశాడా?" అంటూ చిన్నకొడుకుని తలచుకొని





లక్ష్మమ్మ వాపోయింది.

"ఇప్పుడు నువ్వు వచ్చి నా దగ్గరుండు. నేను వద్దన్నానా? ఇంత అన్నం పడేస్తాను. అంతేగానీ అక్క, చెల్లి అంటూ అందరినీ పట్టుకొని రాకు. వాడు ఒళ్ళు కొవ్వెక్కి అక్కను తీసికొని వచ్చేశాడు కానీ పిచ్చిదైతే మాత్రం భార్యని దాని భర్త పోషించనవసరం లేదా? దాన్ని తీసికెళ్ళి అత్తవారింట్లో వదిలేస్తే ఎవరికీ ఏ గొడవా ఉండదు" అంటూ మూడు ముక్క ల్లో తేల్చేశాడు.

వసుధ బావగారి మాటలకు నొచ్చుకొంది. రామచంద్రం పద్ధతి మొదటినుండీ అంతే.

లక్ష్మమ్మకి అతడిలో చిన్ననాటినుండీ స్వార్థమే కన్పించింది. అక్కన్నా, తమ్ముడన్నా పెద్దగా ఆపేక్ష చూపేవాడు కాడు. ఎంతసేపూ తన తిండి, తన సుఖమే చూసుకొనేవాడు. ఇంట్లో తల్లికి సాయంచేయాలన్నా, తమ్ముడి పనులు చేయాలన్నా వంద గొణిగేవాడు.

భానుమూర్తి దారి వేరు. అతడికి అందరూ కావాలి. అక్క అంటే అతడికి ప్రాణం. ఏదైనా సరే అక్కకి, అన్నయ్యకి పెట్టందే అతడు తినేవాడు కాదు. తల్లి వెనకాలే అన్ని పనులూ సాయంచేసేవాడు. లక్ష్మమ్మకి పెద్దకొడుకు స్వార్థం చూస్తే ఒళ్ళు మండేది. భానుమూర్తిని చూస్తే ఆవిడకి ఎంతో గొప్ప.

అసలే కోతిట, కల్లు తాగిందట, మరేదో అయిందిట అన్నట్లు కోతి లాంటి బుద్ధి ఉన్న రామచంద్రానికి తగ్గ భార్యే కామేశ్వరి. ఆవిడకి, డబ్బుకి లంకె. ఏ ఖర్చు తప్పిపోయినా చాలున నుకొనే ఆమె జీవితంలోకి అడుగుపెట్టాక రామ చంద్రం అనుబంధాలు, ఆత్మీయతలు తగ్గించుకొన్నాడు. తల్లి, అక్క తనకన్నా చిన్న వాడయిన భానుమూర్తి దగ్గరున్నా ఏమీ పట్టించుకోడు. ఎవరైనా అడిగితే వాళ్ళకి అక్క డి నీరే పడుతుందని జవాబిచ్చేవాడు.

రామచంద్రానికి మరదలు వసుధ అంటే గౌరవం. తన భార్యలో లేని సుగుణాలు ఆమెలో కన్పించడంవలనో, ఏమిటో అతడికి తెలియకుండానే గౌరవించేవాడు. అత్తింటివా రిని ఆత్మీయంగా చూసే ఆడవాళ్ళుండరనే అతడి ఉద్దేశం ఆమెను చూశాక పోయింది. ఆమెను చూస్తే ఆయనకి ఆశ్చర్యంగా ఉండేది. తన భార్య అయినా సరే ఆమెను ఏమన్నా అంటే ఒప్పుకొనేవాడు కాదు.

సాయంత్రం శ్రుతి కాలేజీ నుండి రాగానే భరత్ అక్కకి పెదనాన్న వచ్చి వెళ్ళిన విషయం, మామ్మ అడిగిన విషయాలు, ఆయన సమాధానాలు అన్నీ ఏకరువు పెట్టేశా డు. "భడవా! ఆడుకొందుకి వెళ్ళకూడదా? అది రాగానే అన్ని విషయాలూ దాని చెవిన ఊదెయ్యాలా" అంటూ లక్ష్మమ్మ మనవడిని కసిరింది. శ్రుతి స్వభావం చిన్నప్పటినుండీ ఆమెకి బాగా తెలుసు.

శ్రుతి పెదనాన్న అన్న విషయాలు మన సులో పెట్టుకొని, ఆయనకి ఇంకా దూరమవు తుందని ఆమె భయం. శ్రుతి తమ్ముడి మాట లు విన్నా ఏమీ మాట్లాడలేదు. పెరట్లోకి వెళ్ళి మొహం కడుక్కొని వచ్చింది.

ఆమె ఏమీ మాట్లాడకపోయేసరికి లక్ష్మమ్మకి ఏమిటోలాగా అన్పించింది. మనవరాలు మన సు తెలిసీ, తను అడిగినందుకు కోపం వచ్చిందనుకొంది. "అది కాదే అమ్మా! పెదనా న్న కాస్త పెద్ద మనసుతో సాయంచేస్తే మీ చదువులు, పెళ్ళిళ్ళు ఒడ్డెక్కుతాయని నా ఉద్దేశం" అంటూ నెమ్మదిగా అంది.

"మామ్మా! నాన్నగారు ఎప్పుడూ ఏమిటి చెప్పేవారు? గుప్పెట మూసికొని ఉంటేనే అందముంటుంది అని అనేవారు. గుర్తుందా? సంసారం గురించి నీకు బెంగవద్దు. నామీద నీకు నమ్మకం లేదా?" అని సూటిగా లక్ష్మమ్మని అడిగింది. ఆవిడ జవాబు చెప్పలేక పోయింది. గొంతుకకి ఏదో అడ్డుపడ్డట్లు అయ్యింది.

శ్రుతి పెరట్లోకి వచ్చేటప్పటికి సుభద్ర మొ క్కల పని చూస్తోంది. తను కూడా వెళ్ళి అత్త తోడిన నీళ్ళని తెచ్చి మొక్కలకి పోసింది. వాటి పాదులు సరిచేసింది. కాస్త పెద్దవిగా అన్పించిన వంకాయలు, టమాటాలు కోసు కొని, ఇంట్లోకి ఇద్దరూ వచ్చారు.

శ్రుతికి అత్తని చూస్తే ఆశ్చర్యంగా ఉంది "మతిస్థిమితంలేని మనిషి" అని అందరూ గేలిచేసిన అత్తేనా ఈమె? తల్లి, తమ్ముడు అన్నానికి పిలిస్తే రావడం, తిన్నాక పడుకో వడం, మిగిలిన సమయమంతా శూన్యంలోకి చూస్తూ గడిపే ఆ అత్త ఎక్కడ? ఈమె ఎక్కడ?

భానుమూర్తి హాస్యంగా ఇంట్లోవాళ్ళని ఏదైనా అన్నప్పుడు పెదవి కదిపీ కదపకుండా నవ్వేది. అతడికి అక్క నవ్వితే అపురూపం. అందుకే భార్యను మరింత ఆటపట్టించేవాడు. అక్క నవ్వితే మైమరిచి అటు చూసేవాడు. నవ్వుతూ తమ్ముడు తనవైపు చూస్తుండేసరికి సుభద్ర ఏదో పనున్నదానిలాగ అక్కడనుండి లేచి వెళ్ళిపోయేది.

ఎంతరాత్రయినా, ఏది తెచ్చినా అక్కకి, తల్లికి పెట్టందే అతడు నిద్రపోయేవాడుకాదు. అందరిని సమానంగా చూసే అతడంటే ఇంట్లో అందరికీ ఇష్టమే. తమ్ముడు వేళకి ఇంటికి రాకపోయినప్పుడు చూడాలి సుభద్ర పని. గేటు దగ్గరకి, వసారాలోకి ఒక్కలాగ తిరిగేది. తమ్ముడిని దూరం నుండి చూడగానే మామూలుగా వచ్చి కూర్చునేది.

''శ్రుతీ! మన గ్రైండర్ వలన మధ్యాహ్నం వేళల్లో వచ్చిన డబ్బులివిగో'' అంటూ శ్రుతి చేతిలో డబ్బులు పెట్టింది సుభద్ర ''అత్తా! నీకు విశ్రాంతి లేకుండా మధ్యాహ్నవేళల్లో ఈ పని ఎందుకు? నేను లేనని చెప్పి పంపెయ్యలేక పోయావా'' అంటూ అత్తవైపు అభిమానంగా చూస్తూ శ్రుతి అంది. ''ఏమో! మనం బద్ధకించి పొమ్మన్నామనుకో వాళ్ళు మామూలు వేళల్లో కూడా రావడం తగ్గించెయ్యవచ్చును. నాలుగు డబ్బులు వస్తే ఏ ఖర్చులయినా ఒడ్డెక్కుతాయి కదా! అయినా ఆ కాస్త పనిచేయడంలో అలసట మాత్రం ఏం ఉంది?'' అంటూ తల్లి పిలుస్తోంటే వెళ్ళింది.

''మా అక్క కూడా మామూలు మనిషే. ఆమెకి ఏ పిచ్చీ లేదు. మా అక్క అత్తవారు అనవసరంగా నిందలు వేశారు. మా అక్క మహాలక్ష్మి. ఆమెను అన్నవాళ్ళు అనుభవిస్తారు'' అని తండ్రి తన తల్లి దగ్గర, అతడి స్నేహితుల దగ్గర అనే మాటలు శ్రుతికి గుర్తుకు వచ్చాయి.

పరీక్షలు నెమ్మదిగా పూర్తయ్యాయి. శ్రుతి మరో ఆలోచనని మనస్సులోకి రానీయకుండా పరీక్షలు బాగా రాసింది. ప్రీతి కూడా ఎగ్జామ్స్ చక్కగా రాసింది. పరీక్షల బరువు దింపుకో






న్నాక శ్రుతికి అసలు బెంగ మొదలైంది.

తనేం చెయ్యాలి? సెకండరీ ట్రైనింగ్‌కి వెళదామంటే ఈ ఏడాదంతా ఇల్లు నడవడం కష్టం. ట్రైనింగ్ అయితే టీచరు పోస్టు ఏదో ఒకటి రావడం ఖాయం. కానీ తన ఖర్చుకి, ఇంటి ఖర్చుకి డబ్బో?... తను లేకపోతే అమ్మ, తమ్ముడు, చెల్లి ఈ పరిస్థితిలో ఎలా ఉండగల రు? ఊహూ... ఇది బావుండలేదు.

ఇలాగ పరిపరివిధాలుగా శ్రుతి ఆలోచనలు సాగుతూనే ఉన్నాయి. స్వప్న అడగనే అడి గింది - పరీక్షలు అయ్యాక ఏం చేస్తావని? ప్రస్తుతానికి ఏ ఆలోచనా తెమలడం లేదని తను సమాధానమిచ్చింది.

ఒక్క మనిషి దైనందిన జీవిత కార్యక్రమాల నుండి తప్పుకొంటే కుటుంబానికి ఎంత నష్టం? ఎడారిలో దిక్కుతోచక నిలబడినట్టు అయిపోయింది కదా కుటుంబం అని మనసు లోనే అనుకొంది శ్రుతి. ప్రకాశానికి లక్ష్మమ్మ బలవంతంవలన ప్రీతి అన్ని విషయాలూ తెలియచేస్తూ ఉత్తరం రాసింది. చివరిలో అమ్మ నిన్ను ఒక్కసారి రమ్మనమని రాయ మంది అంటూ రాసింది.

ప్రకాశానికి అక్కంటే ఇష్టమే. భార్య జానకి నోటిదురుసుతనానికి కాస్త భయపడతాడు. తర్వాత విషయం అతడిదీ అంతంతమాత్రం బతుకే. హైస్కూలులో గుమాస్తాగా ఉన్నాడు. వచ్చే జీతంకాక పైన కష్టపడి నాలుగు రాళ్ళు సంపాదిస్తాడు.

అక్క రాయించిన ఉత్తరానికి తాను త్వ రలో వస్తున్నట్లు వెంటనే జాబు రాశాడు. ఆమెని బెంగపెట్టుకోవద్దని, పిల్లల్ని జాగ్ర త్తగా చూడమని రాశాడు.

లక్ష్మమ్మకి కోడలిని చూస్తే జాలేస్తోంది. ఏనా డూ కొడుకు ఉన్నప్పుడు పుట్టింటికి వెళ్ళి ఎరుగదు. అతడు ఎంతో బలవంతం చేస్తే అన్నతో వెళ్ళి రెండు రోజులుండి వచ్చేసేది. ఏ ముహూర్తంలో భానుమూర్తి చేతిని పట్టుకొందో కానీ సాధారణంగా ఏ పెళ్ళిళ్ళూ, అవసరాలు ఏర్పడినా భానుమూర్తి, ఆమె కలిసే వెళ్ళేవా రు.

భానుమూర్తి ఆమెను విడిచి ఏనాడూ ఉండటానికి ఇష్టపడేవాడు కాదు. అంతేకాదు, అందరి భర్తల్లాగ ఆమె పుట్టింటివారు ఏమీ ఇవ్వలేదని దెప్పేవాడు కాడు. ఎప్పుడైనా లక్ష్మ మ్మ వియ్యాలవారు ఏ ముచ్చటా జరపలేదని గొణిగితే ''వాళ్ళు పేదవాళ్ళని తెలిసే పెళ్ళి చేసుకొన్నాం. ఇంకా వాళ్ళని ఎందుకు సాధించడం'' అంటూ తల్లిని మందలించే వాడు.

''అయినా ఒకళ్ళు ఇచ్చిందానితో మనకి ఎన్నాళ్ళు జరుగుబాటవుతుంది. మనం సంపా దించుకోవాలి. మనం ఖర్చు పెట్టుకోవాలి'' అనే కొడుకుని లక్ష్మమ్మ విడ్డూరంగా చూసేది ''బావుంది నాయనా! పిల్లలుపుడితే మాత్రం అల్లుడికి ముద్దు ముచ్చటలు చూసిన వారు లేరా? అయినా నీకే అవన్నీ అవసరం లేనప్పు డు నీ గొడవ నాకెందుకు?'' అని విసుక్కొనేది. అవన్నీ గుర్తుకి వచ్చి లక్ష్మమ్మ మనస్సు బాధప డింది.

తనని తాను సంభాళించుకొని కోడలిదగ్గ రకు వచ్చింది. ''వసూ! ఒక మాట చెప్పనా! అత్తగారు ఇలాగ చెపుతోందేమిటని అనుకో కు''అని అంది.

''అదేమిటత్తయ్యగారూ! మీ గురించి నేను ఎప్పుడైనా అలాగ అనుకొన్నానా?'' అంటూ నొచ్చుకొంది వసుధ.

''అదికాదే వసూ! పెద్దవాడా ఎంత చెప్పినా విన్పించుకోకుండా చేతులు దులిపేసుకొన్నట్లు ప్రవర్తించాడు. మీ తమ్ముడు వచ్చినప్పుడు అతడినైనా ఒక ఒడ్డుకి చేర్చమని సహాయం అడుగు. నువ్వు నోరు విడిచి అడిగితే అతడు కాదనడని నా ఉద్దేశం. పిల్లల మొహం చూసి కాస్త అడుగమ్మా'' అంటూ కోడలితో మెల్లిగా అంది. ఎంతయినా ఆడబిడ్డ నోరు విడిచి అడిగితే ఏ అన్నదమ్ముడూ కాదనలేడని లక్ష్మ మ్మ అభిప్రాయం. అందుకే కోడలికి నచ్చచె ప్పింది.

''ఎంత వీలైతే అంత సహాయం చేయమని అడుగు. ఎలా భగవంతుడు మనల్ని ఒడ్డెక్కి స్తాడో నాకు అర్థమవడం లేదు. అయినవాళ్ళ దగ్గర అభిమానపడి ప్రయోజనం లేదు. పిల్లల చదువులకోసం ఏ సహాయం చేసినా చాలు'' అంటూ అనునయంగా అంది. అత్త గారి మాటలకి వసుధ అలాగే అంటూ తల ఊపింది.

వసుధకి అత్తగారి బాధ బాగానే అర్థమవు తోంది. పై ఇద్దరూ ఆడపిల్లలే అయిపోయారు. వాళ్ళ చదువులు, పెళ్ళిళ్ళు అన్నీ తెమలాలి. కొడుకు ఇంకా రెక్కలు రాని పసికూన. ఎవరో ఒకరు సాయపడకపోతే తన కుటుంబం గతి అధోగతే.

అనుకొన్నట్లుగానే ప్రకాశం నాల్గయిదు రో జుల తర్వాత భార్యతో కలిసి మరీ వచ్చాడు. పక్కన అతడి భార్యని చూడగానే లక్ష్మమ్మ మొహం ఆవగింజంత అయింది. ఏమైతేనేం అవసరం తమది అనుకొని కోడలిని మరో మారు హెచ్చరించింది. శ్రుతికసలు వాళ్ళ రాకపోకలు పట్టడమే లేదు. మేనమామ ఏదో మామూలుగా చూడటానికి వచ్చాడనుకొంది. మధ్యాహ్నం శ్రుతి వాళ్లు నిద్రపోతుంటే వసుధ తమ్ముడితో తన కష్టాన్ని చెప్పుకొంది. ''నాకు ఏం చేయడానికీ పాలుపోవడం లేదురా ప్ర కాశం. మీ బావగారున్నప్పుడు బెంగంటే ఏమిటో తెలియదు. ఇప్పుడు ఈ పిల్లలగూర్చి బెంగపట్టుకొంది. నేను పోయి ఆయన ఉండి ఉంటే పిల్లలికి ఆధారమైనా ఉండేది'' అని బేలగా అంది. ప్రకాశం కదలిపోయాడు. ''అవేం మాటలక్కా?'' అంటూ ఎంతో నొచ్చుకొ న్నాడు.

ఎప్పుడూ అక్కగారు తన కష్టాన్ని పుట్టింటి వారికి చెప్పుకొని ఎరుగదు. అసలు ఎక్కువగా మాట్లాడటమే ఆవిడకి తెలియదు. అందుకే ''ఛఛ... దేముడు చేసిన దానికి ఎవరంమా త్రం ఏం చేస్తాం? జరిగిన దానికి విచారపడి లాభమేమిటి? జరగవలసినవి ఆలోచించాలి. నువ్వు, పిల్లలు మాతో వచ్చెయ్యండి. కలో గంజో అందరం కలిసి తాగుదాం'' అనేశాడు అనుకోకుండా.

జానకి ప్రకాశం అలాగ అంటాడని అనుకో లేకపోయింది. అయితే ''ఇంత కుటుంబాన్ని నీ మీద బరువుగా ఉంచడానికి నా మనసు ఒప్పుకోవడం లేదురా ప్రకాశం'' అని వసుధ బాధపడుతోంటే తను కూడా కల్పించుకొంది.

''బరువేమిటి వదినా! మాకు తోచింది




ఎప్పుడూ చేస్తాం. ప్రెస్‌లో మీ వాటా డబ్బు ఆయనని అడిగి తీసేసుకోండి. ఇల్లు ఎవరి కైనా అమ్మేద్దాం. ఆ డబ్బు వడ్డీకిచ్చుకొన్నా పిల్లల చదువులు జరిగిపోతాయి. పెళ్ళిళ్ళు కుదిరితే ఆ డబ్బుతో చేద్దాం. అందాక వడ్డీ డబ్బు జరుగుబాటుకి చాలు'' అని అన్నీ ఆలోచించి వచ్చినట్లు చెప్పింది జానకి.

ఇల్లు అమ్మడమంటే మాటలా! పెద్దవారు అత్తగారు ఉన్నారు. ఆడబిడ్డ ఉన్నారు. ఇంత మంది కలిసి ఎలా మరొక చోటకి వచ్చేస్తాం. పైగా అక్కడ కాలేజీలేదు. పిల్లల చదువులు సాగడం కూడా కష్టమే'' వసుధ నెమ్మదిగా అని జరగని పనన్నట్లు చెప్పింది.

ఆ మాటలు విన్న జానకి, ప్రకాశం ఆమెను ఒక తెలివి తక్కువదాన్ని చూసినట్లు చూశారు. ''అన్నయ్యగారు బతికి ఉన్నప్పుడు ఆయన సంపాదించేవాడు కనుక అందరినీ పోషించే వాడు. ఇప్పుడు కూడా అందరినీ పోషించా లంటే మాటలా? మీ బావగారు వాళ్ళిద్దరి బాధ్యతలూ వహించాలి కానీ మీమీదే వదిలే యడం' ఏం మర్యాద? ఇంకా ఆడపిల్లలకి కూడా చదువులంటే మాటలా? ఎవడినో ఒక డిని చూసి ముడిపెట్టెయ్యాలి'' అని కుండబ ద్దలు కొట్టినట్లు అనేశారు ఇద్దరూ.

వసుధ తెల్లబోయింది. వాళ్ళ మాటలకి అత్తగారు, ఆడబిడ్డ ఏమనుకొంటారో అని భయపడింది. మరదలు అంత నిక్కచ్చిగా మాట్లాడటమే ఆమెకి వింతగా అన్పించింది. తమ్ముడు, తాను మాట్లాడుతోంటే ఆమె ఎలా చొరవగా మధ్యలో వచ్చి ఇంత తేలికగా అనేయ గలిగిందా అని ఆశ్చర్యం. పిల్లల గురించి ఆమె ఆలోచనలు అలాగ ఉన్నాయే మిటా అన్న భయం ఆమెలో కలిగాయి. అవ సరం తనది. కనుక ఓర్మితో తమ్ముడికి నచ్చచె ప్పాలనుకొంది.

పక్కగదిలో పడుకొన్న శ్రుతికి మధ్యలో కరెంటు పోవడం వలన నిద్రమెలకువ వచ్చే సింది. బద్ధకానికి పడుకొని, వాళ్ళ మాటలు వినబడితే వింటోంది. అక్కగారికి తమ మాట లు కష్టం కలిగించాయని ప్రకాశం తెలుసుకొ న్నాడు. అందుకే ఆమెకు నచ్చచెప్పడానికి తన ఉద్యోగం, జీతం బాధ్యతలు, ప్రస్తుత కాలమాన పరిస్థితులు అన్నీ ఓపికగా వివ రించాడు. ఆడపిల్లలకి ఎంత చదువు చె ప్పించినా ఎప్పటికైనా పెళ్లి చేసి ఒక ఇంటికి పంపవలసినదే. కనుక ఇప్పుడే ఆ పని చేస్తే మంచిదనే తన ఉద్దేశ్యం చెప్పాడు.

ఇంక ఇదివరకటిలాగ అత్తగారి, ఆడపడు చుల బాధ్యత పడటానికి వీళ్ళకే కష్టంగా ఉన్నప్పుడు మాటలతో పనికాదని చెప్పాడు. తన భార్య అందని కాకుండా అన్ని విషయా లూ బాగా ఆలోచించుకోవడం మంచిదని హెచ్చరించాడు. అంతేకాదు అసలు ప్రకాశాని కీ జానకి అంత త్వరగా బయటపడ్డం నచ్చలే దు. ఎన్నిసార్లు చెప్పినా ఆమె ఆ దురలవాటు మానుకోనందుకు అతడికి ఒళ్ళు మండు తోంది.

అన్నీ విన్న వసుధ తమ్ముడిని ఎంతో కొంత సాయంగా కొంతకాలం పిల్లలు నిలదొక్కుకొనే వరకూ డబ్బు సహాయం చేయమని అడిగింది. అది తన వలన నెలనెలా జరిగే పనికాదనీ, తన బిడ్డల చదువులు, ఫీజులే తను తట్టుకోలే కపోతున్నాననీ, అవకాశం ఉన్నప్పుడల్లా సహా యపడతానని చెప్పాడు. పిల్లలు, ఆమె తనతో వచ్చెయ్యడమే శ్రేయస్కరమని నొక్కి నొక్కి చెప్పాడు.

రామచంద్రాన్ని పిలిపించి అత్తగారి ఆడబి డ్డల బాధ్యత ఇంటి పెద్దగా అతడికి అప్పచెప్ప మని, ఒకవేళ అక్కగారు చెప్పలేకపోతే తాను వెళ్ళి చెప్పి వస్తానని నెమ్మదిగా అన్నాడు. లక్ష్మమ్మకి ఈ మాటలన్నీ వినబడుతూనే ఉన్నాయి. వాళ్ళు అంటున్న మాటలు ఆవిడకి ఒక పక్క సబబుగా అన్పించినా బాధనే కలిగి స్తున్నాయి. వసుధ మాత్రం అనేసింది ''చూ డు తమ్ముడూ! ఒకవేళ నాకే మరో ఇద్దరు పిల్లలు ఉండి ఉంటే ఇన్నిసార్లు మనం వాళ్ళని గూర్చి ఆలోచించేవాళ్ళమా? బిడ్డలని బరువని ఎవరం ఏ పరిస్థితుల్లో అనుకోము. ఇంక వీళ్ళూ నాకు బిడ్డలే. కాలమంటావా అదే జరుగుతుంది. భగవంతుడి దయే మామీద వుంటే ఇవన్నీ ఒక లెక్కా?'' అంటూ ఇంక మాట్లాడటానికి ఏమీ లేదన్నట్లు తేల్చింది. అసలు వాళ్ళ ప్రస్తావనే మాటలలో వచ్చి నందుకు నొచ్చుకొంది.

లక్ష్మమ్మ కళ్ళనీరు వత్తుకొంది.

తల్లి పెద్ద మనసుకి శ్రుతికి ఎంతో సంతోషం కలిగింది. కడుపునిండా వాళ్ళకి అన్నం పెట్టగ లగవచ్చును. లేకపోవచ్చును. ఆత్మీయతను మాత్రం తన బిడ్డలతో సమానంగా అందచే యగలగడం సామాన్యమైన విషయం కాదు. తండ్రి, తల్లిలో ఉండే ఈ గొప్ప గుణాలకే ఆకర్షితుడై ఉంటాడు అని అనుకోకుండా ఉండలేకపోయింది.

ప్రకాశం, జానకి ఆ సాయంత్రమే బయలు దేరి వెళ్ళిపోయారు.

వాళ్ళు వెళ్ళగానే శ్రుతి దగ్గరికి సుభద్ర వచ్చింది. "శ్రుతీ! నన్ను మంచిరోజు చూసి మావయ్యగారి దగ్గర దింపెయ్యమ్మా!" అని అడిగింది.

"అత్తయ్యా! నువ్వు ఏమిటంటున్నావు?" అని శ్రుతి ఆశ్చర్యంగా అడిగింది. వంటింట్లో నుండి వదినగారి మాటలు వసుధ విన్నది. అందుకే వెంటనే వచ్చింది.

"మా తమ్ముడు తెలివి తక్కువవాడు. వాడు అలాగ మాట్లాడాడని మీరు వెళ్ళిపోతానంటు న్నారా? ఇది మీకు భావ్యమా? వాళ్ళ మాటలకి నన్ను క్షమించండి. పాపిష్టిదాన్ని. అనవస రంగా మీ మనసు కష్టపెట్టాను" అంటూ సుభద్ర చేతులు పుచ్చుకొంది.

"ఛ... ఛ... ఇదేమిటి? ఇందరం ఇక్కడ బతకడం కష్టంకదా అని అక్కడికి వెళితే బావుంటుందేమోనని నేను అనుకొంటున్నాను. అంతే!" అంటూ సుభద్ర అన్నా వసుధ కొట్టిపారేసింది.

అక్కడ సుభద్రకు గౌరవం లేదనీ, వాళ్ళు సరిగా చూడటం లేదనే తన భర్త ఇక్కడికి తీసుకొని వచ్చేశాడు. ఇన్నాళ్ళయినా వాళ్ళు ఆమె గురించి పట్టించుకోకపోవడం ఆయనకి ఎంతో బాధ కలిగించేది. వాళ్ళు ఆమెను పిలవకుండా ఆవిడ తిరిగి వెళ్ళడమా? వీల్లే దు. తన భర్త మనసు అక్కగారి గురించి ఎంత కొట్టుకొని పోయేదో తనకి బాగా తెలుసును. ఇప్పుడు ఆమెను వెళ్ళనిస్తే ఆయన ఆత్మకి శాంతి ఉండదు. అందుకే ఇవన్నీ వదినగారితో చెప్పేసింది.

సుభద్ర ఆమె ఆత్మీయతకి చలించింది.

"అత్తయ్యా! ఎవరమూ ఎక్కడికీ వెళ్ళనవ సరం లేదు. నేను ఇప్పుడే చెపుతున్నాను. ఏది ఉంటే అదే తిని అందరం గడుపుకొందాము. మీరందరూ ఏ దిగులూ పెట్టుకోవద్దు. నన్ను నమ్మండి. నేను ఈ కుటుంబాన్ని పోషిస్తాను. ఎవరి దయాధర్మాలూ మనకి వద్దు. మీరు ఇంక ఎవరిని ప్రాధేయపడ్డా నా మీద ఒట్టు"

అని శ్రుతి అందరి ఎదుటా గట్టిగా చె ప్పింది. ఇంక ఎవరూ మాట్లాడకుండా అక్కడ నుండి వెళ్ళిపోయింది. శ్రుతికి అయిదు సంవ త్సరాల వయస్సప్పటికే భానుమూర్తి సుభద్ర ను ఇంటికి తీసికొచ్చాడు.

సుభద్ర అత్తగారు బాగా ఉన్నవాళ్ళే. సుభ ద్రకి ఇద్దరు అబ్బాయిలు, ఒక అమ్మాయి. ఆడపిల్ల పెద్దది. అయినా వాళ్ళు ఏనాడూ సుభద్రని చూడటానికి రాలేదు. ఎప్పుడైనా వాళ్ళు గుర్తుకి వచ్చిననాడు సుభద్ర కళ్ళనీళ్ళు పెట్టుకొంటుంది. సుభద్ర భర్త మాధవరావు కరణం. ఆయన కూడా ఏనాడూ భార్యని చూడటానికి రాలేదు. పిల్లలకి ఈ విషయాలు ఏవీ బాగా తెలియవు.

మళ్ళీ ఇన్ని సంవత్సరాలకి సుభద్ర తన అత్తగారి ఊరును గుర్తు చేసుకొందంటే ఆవిడ మనస్థితి ఎవరికైనా బాగా బోధపడుతుంది. తమ్ముడి వెచ్చని రెక్కల కింద ఇన్నాళ్ళూ ఏ చీకూ చింతా లేకుండా బతికింది.

ఆ రాత్రి శ్రుతి లక్ష్మమ్మ మంచం మీద కూర్చుంది. "మామ్మా! అత్తయ్యని నాన్నగారు ఎందుకు తీసుకొచ్చేశారు? అందరూ అత్తయ్యకి పిచ్చి అని అంటారు. మనకి మాత్రం అత్తయ్య మామూలుగానే కన్పిస్తోంది కదా" అంటూ ఆరాగా అడిగింది.

లక్ష్మమ్మ కూతురు విషయం మనవరాలు ఎత్తేసరికి కదలికదలి ఏడ్చింది. తర్వాత నెమ్మదిగా అసలు విషయాలు చెప్పింది. సుభద్రకి చిన్నతనంలోనే మాధవరావునిచ్చి వివాహం చేసేశారు. పెద్దమనిషిఅయినవెంటనే అత్తవారు ఎంత చెప్పినా వినకుండా కాపురానికి తీసికొని పోయారు.

సుభద్ర భర్త మాధవరావుకి తల్లి అంటే అపరిమితమైన భక్తి. వారిది పెద్ద కుటుంబం.




పినతండ్రులు కూడా అప్పటికి వేరు పడలేదు. మాధవరావుకి ముగ్గురు తమ్ముళ్ళు, ఇద్దరు అక్కచెల్లెళ్ళు. సుభద్ర అత్తవారింటికి వచ్చిన ఏడేళ్ళకి మావగారు, పినమావలు ఆస్తులు పంచుకొని వేరు పడ్డారు.

బాగా ఆస్తిమంతులని లక్ష్మమ్మ పట్టుబట్టి కూతురిని అయినింటి కోడలిని చేశానను కొంది. కానీ గొర్రెల మందలాంటి కుటుంబంలో పడవేస్తున్నానని గ్రహించలేకపోయింది. మాధవరావు విషయం చూస్తే నోట్లో నాలుకలేని వాడు. పిల్లకాస్త ముదిరాక అత్తవారింటికి వెళు తుందనుకొంటే ఆమె అత్తగారు అదీ సాగనివ్వ లేదు.

అత్తవారింట్లో అడుగుపెట్టిన పదమూడేళ్ళ పిల్లకి ఎంత భయంగా ఉంటుందో సుభద్రకీ అంతే అయింది. అంత పెద్ద కుటుంబంలో ఎవరిని చూసినా ఆమెకి భయమే. మాధవరా వుకి భార్యంటే అవగాహన ఏర్పడేంత ఏకాంత మూ వారి మధ్యలేదు.

తన ఈడు పిల్లలు ఆటపాటలతో కాలం గడుపుతోంటే, తాను మాత్రం పెద్ద పేరక్కలాగ పెళ్ళి, అత్తవారిల్లుతో సతమతమవడం. సుభ ద్రకి తల్లిమీద బాగా కోపం వచ్చేది. అత్తగారి పోరుచూస్తే ప్రాణంపోయినంత భయంగా ఉండేది. ఆవిడ వెనకాలే అన్నింటికీ సాయం చేయడం, మరొకపక్క శరీరం అలసిపోయినా వదలని భర్త, జీవితం అంటే ఉదాసీనతని కలిగించాయి.

సుభద్ర కాపురానికి వెళ్లాక కూడా అత్తగారికి ఇద్దరు పిల్లలు పుట్టిపోయారు. ఖర్మకొద్దీ ఆవిడ పురిటిసేవ సుభద్రే చేయవలసి వచ్చింది. మావగారికి అత్తగారంటే అపురూపం. బాలింతరాలని ఆవిడని కదలనిచ్చేవాడు కా డు. పినమావగార్ల, అత్తగార్ల వేళాకోళాలమధ్య సుభద్రకి ఆ ఇల్లు ఎలాగో అన్పించేది.

ఆస్తులు పంచుకొన్నా అందరూ ఆ ఊర్లోనే వేరు కాపురాలు. దాంతో రాకపోకలు ఎప్పుడూ ఉంటాయి. ఎందరు వచ్చి సాయం చేసినా ఆ ఇంటి పని తెమలదు. పండగలకి, పబ్బాలకి అందరూ సుభద్ర మావగారింట విస్తళ్ళు వేయవలసినదే. వాళ్ళందరూ వేరుపడటం వలన మరుదులకి, ఆడబిడ్డలకి సుభద్ర బోలె డు చాకిరీ చెయ్యవలసివచ్చేది.

సుభద్ర అత్తవారింట్లో పెద్ద వాళ్ళదే ఆధి కారం. అందరూ వేరు అయిపోయినా సుభద్ర మావగారి చెప్పిన వేయనిదే ఏ పనీ చేయరు. ఈనాటికీ ఆయన మాటకి ఎదురు చెప్పరు. ఇదే గొప్ప సాంప్రదాయం అని మాధవరావు నమ్మకం. అతడికి తమ కుటుంబం అంటే ఊళ్ళో గొప్పపేరని తాను కూడా దాన్ని నిలబె ట్టుకోవాలని అన్పించేది.

సౌమ్యత, మంచితనం మూర్తీభవించినట్లు ఉంటాడు మాధవరావు. తండ్రి తల్లి ఏం చెప్పినా ఎదురు చెప్పేవాడుకాడు. సుకుమా రంగా ఉండే సుభద్ర ఇంటి పనంతా చేయలే కపోతోందని తెలిసినా, అత్తవారిల్లు అన్నాక ఆమాత్రం ఇంటి పెద్దకోడలు కష్టపడకపోతే ఎలాగ అని నచ్చచెప్పుకొనేవాడు. ఉదయం అత్తగారికి వెనకాల పని సాయం, రాత్రి వంట, దీనికి సాయం చెరువునుండి నీళ్ళమోత మర దుల, ఆడపడుచుల సేవలు ఇవన్నీ హైరా నాగా ఉన్నాయని అనుకొంటే, దీనికి సాయం సుభద్ర నెలతప్పింది.

ఇరవై ఏళ్ళయినా నిండని ఆ అమ్మాయికి మగపిల్లవాడు. ఇంక మాధవరావు గర్వానికి అంతులేదు. ఏనాడు అంత పెద్ద ఇంట్లోకి కోడలుగా అడుగుపెట్టిందో సుభద్ర మాట్లాడ టమే మరిచిపోయింది. చంటివాడి తర్వాత మళ్ళీరెండు కాన్పులు పోవడంతో అనారోగ్యపా లయింది. అయినా ఆమె ఆరోగ్యం గురించి ఎవరికీ శ్రద్ధలేదు.

మళ్ళీసారి ఆడపిల్ల పుట్టినపుడు లక్ష్మమ్మ అల్లుడిని ఆపరేషన్ చేయించుకోమని బతిమా లింది. అతడు తల్లిదండ్రులకి చెప్పాక చే యించుకొంటానని వెళ్ళిపోయాడు. పిల్ల బార సాలకి వచ్చిన తాయరమ్మ లక్ష్మమ్మ మాటలకు గయ్యిమని లేచింది. తమ ఇంటా, వంటా ఆపరేషన్లు అలవాటు లేదని, తమది పది మందికల కుటుంబమని, పిల్లలకి అన్నం పెట్టుకోలేని స్థితిలో తాము లేమని ఒకటే గొప్పలు చెప్పుకొంది.

మూడవ నెల వచ్చాక పంపిస్తానని ఎంత ప్రాధేయపడినా వినకుండా నెలపురుడు అవ గానే అత్తగారు సుభద్రని తీసికెళ్ళిపోయింది.



భానుమూర్తి అక్క జీవితం చూసి తల్లిదండ్రులతో పోట్లాడేవాడు. లక్ష్మమ్మ ఆడపిల్లలకు పెళ్ళిళ్ళు చేస్తే వాళ్ళ బతుకులింతే అని వేదాంతం చెప్పుకొంది. రామచంద్రం తనకి పట్టినట్లు ఊరుకొనేవాడు.

ఎప్పుడు సెలవలు వచ్చినా వెళ్ళి అక్కని చూసి రాకపోతే అతడికి తోచదు. పిల్లలతో, ఇంటి పనితో, స్వేచ్ఛ అన్నది ఎరుగని అక్క జీవితం అతడికి బాధగా ఉండేది. అక్కతో మాట్లాడటానికే అతడికి అయ్యేదికాదు. అయినాసరే సుభద్ర కన్నుల్లో అతడిని చూస్తే చాలు ఎన్నో కాంతులు. సుభద్ర అత్తగారు మాత్రం భానుమూర్తిని చూసి వేళాకోళమాడేది "మీ అక్కకి అరణపు తమ్ముడివేమిటోయ్ నువ్వు" అని. అతడు బావగారితో పోట్లాడేవాడు. ఎవరినైనా మనిషిని పెట్టించమని, అక్కగారికి శ్రమను తగ్గించమని భానుమూర్తి గోలపెట్టేవాడు.

"ఇయంగేహే లక్ష్మీ" అన్నట్లు సుభద్ర వాళ్ళ ఇంటి మహాలక్ష్మి అనీ, ఆవిడని నిర్లక్ష్యం చేయవద్దనీ, ఆమె ఉదాసీనంగా ఉంటే చూడలేకపోతున్నాననీ బావగారితో ఎంత గోలపెట్టినా అతడు నవ్వుతాలుగా తీసికొనేవాడు. అసలు ఇద్దరు బిడ్డల తండ్రయినా అన్ని విషయాలలో అస్వతంత్రంగా ఉండే బావగారంటే భానుమూర్తికి చిరాకుగా ఉండేది. భార్య ఆలనా, పాలనా చూడటం భర్త విధికాదా? అని వాదించేవాడు. "మీ అక్కకి ఏం లోటు చేశాము" అని అతడు అడ్డంగా వాదిస్తోంటే ఏమనగలడు? భానుమూర్తి భావాలు విపరీతమని అతడి ఉద్దేశ్యం.

ఎవరు ఎన్ని అనుకొన్నా భానుమూర్తి పట్టించుకొనేవాడుకాడు. స్వేచ్ఛ స్త్రీకి ఇస్తే ఏదో కొంపమునిగిపోతుందనుకొన్న వారిని చూసి అతడు జాలిపడే వాడు. స్త్రీ పురుషుడిలాగే ఆలోచించగలదు. ఆచరించగలదు. కానీ స్త్రీకి ఎందరు భర్తలు భావ స్వాతంత్ర్యం ఇస్తున్నారు. "నస్త్రీ స్వాతంత్ర్య మర్హతీ" అని ఏ ముహూర్తములో ఆ కవిగారు అనేశాడో కానీ అదే పట్టుకొని మాధవరావులాంటి వాళ్ళు పబ్బం గడుపుకొంటున్నారు.

కట్టుకొనే చీరనుండీ, తినే తిండి వరకూ ఆడదానికి ఇష్టం అనేది ఉండకూడదు. సాయంత్రం అయ్యేటప్పటికి శుభ్రమైన చీర కట్టుకొని, మల్లెలో, నన్నజాజులో తలలో పెట్టుకొంటేనే తప్పు. "సానివాళ్ళలాగ ఏమిటా వేషాలు? సంసారులు అన్నిసార్లు ముస్తాబులు అవరు" అని అత్తగారు పాట పాడుతోంటే కొత్తలో సుభద్ర కళ్ళల్లో నీళ్ళు తిరగేవి. ఆమెలో రాను రాను నిరాసక్తత ప్రవేశించింది. కనీసం అలాంటి విషయాలలోనైనా కల్పించుకోవద్దని తల్లికి మాధవరావు చెప్పలేకపోయేవాడు.

అందుకే భానుమూర్తి స్వేచ్ఛ విలువ ఏమిటో, అది ఆడవాళ్ళకు ఎంత అవసరమో ఎన్నోసార్లు బావగారికి చెప్పేవాడు. లోకమంతా మారిపోవచ్చుకానీ సుభద్ర అత్తవారు మాత్రం మారరు. చిన్న విషయాలైనా, పెద్ద విషయాలైనా భార్యకి చెప్పడం, ఆవిడ సలహా పొందడం మొదలైన వాటి వలన తనకీ ఆ ఇంటితో సంబంధమున్నదని, తనని ఒక మనిషిగా చూస్తున్నారనే భావం ఆమెకి తప్పక కలుగుతుందని, దానివలన ఆమెలో చైతన్యం వస్తుందని భానుమూర్తి నెత్తినోరు కొట్టుకొనేవాడు. కానీ ఏం లాభం? అది చెవిటివాడి ముందు శంఖమే.

ఆడపిల్ల పుట్టాక సుభద్రకి మళ్ళీ అబార్షన్ అయింది. డాక్టర్ ఆమె ఆరోగ్యం జాగ్రత్తగా చూడమని హెచ్చరించాడు. మళ్ళీ వెంటనే కాన్పు కలగకూడదని డాక్టరు చెప్పినా ఆపరేషనుకి అత్తగారు ఒప్పుకోలేదు. ఈ గొడవల మధ్యే మాధవరావు తండ్రి పోవడం, కరణీకం మాధవరావు చేతికి రావడంతో అసలు ఇంటి గురించి పట్టించుకొనే తీరికే లేకుండాపోయింది.

మాధవరావు కరణం అవడంతో ఊరు వ్యవహారాలు చూస్తూ ఉండటం, వచ్చేపోయే జనం, ఇల్లు తిరనాళ్ళలాగ ఉండేది. దానికి సాయం తమ్ముళ్ళ చదువులు, పెళ్ళిళ్ళు పెద్దదిక్కయి జరిపించడంతో అతడికి తీరిక ఉండేదికాదు. ఈ సందడిలోనే సుభద్రకి మరొక మగపిల్లవాడు కలిగాడు.

అవడానికి ముగ్గురు బిడ్డల తల్లయినా సుభద్రకి ఆ ఇంట్లో స్వతంత్రం లేదు. ప్రతీపనీ అత్తగారి ఇష్టప్రకారం జరగవలసిందే. భర్తపోవడంతో ఇంటిపెత్తనం తన చేతులలో నుండి





కోడలి చేతిలోకి ఎక్కడపోతుందో అని తాయారమ్మ భయం. అందుకే సుభద్రని ఎప్పుడూ రాక్షసిలాగ సాధించుకొని తినేది. కొడుకుని గుప్పెట్లో పెట్టుకొని ఇల్లు నడిపేది.

ఎంత పని అయినా చేయవచ్చును. కానీ భర్తకి, బిడ్డలకి అన్నం మాత్రం పెట్టనిచ్చేదికాదు అత్తగారు. వంట ఇంటి పెత్తనం ఆవిడ వదలదు. కొడుకు భార్యకి ఎక్కడ దగ్గరైపోతాడో అని ఆవిడ భయం. భర్తతో కష్టం, సుఖం చెప్పుకొందామంటే ఆయన పగలు దొరకడు. అన్ని వ్యవహారాలూ అత్యవసరమనుకొంటాడు కానీ భార్యతో మాట్లాడడం అత్యవసరమనుకోడు.

రాత్రిళ్ళు పది గంటలు దాటితే కానీ ఆమెకి భర్తతో ఏకాంతం దొరకదు. అలసిన శరీరం, మనసు విశ్రాంతి కావాలంటున్నా ఆయనకి చెప్పాలని, తన మనసు విప్పాలని సుభద్ర అనుకొనేది. రాత్రి టైములో ఆమె ఏది చెప్పినా ఆయన విన్పించుకొనేవాడుకాడు.

"అబ్బ... ఏమిటి సుభద్రా ఈ సమయంలో ఆ గొడవ లేమిటి? అమ్మ ఏదో పెద్దది. ఛాదస్తం కొద్దీ ఏదో అంటుంది. నువ్వు పట్టించుకోకు" అంటూ ఆమెను పక్కపైకి లాగేవాడు. ఆయనకి భార్య పతిరాత్రీ పక్కలో ఉండవలసినదే. ఆమె ఇష్టాయిష్టాలతో ఆయనకి పనిలేదు. హాయిగా నిద్రపోతున్న భర్తని చూసి సుభద్ర నిట్టూర్చేది.

సుభద్ర మనసు వాళ్ళతో విసిగిపోయేది. చివరికి బిడ్డలనైనా ప్రేమగా అక్కున చేర్చుకొందామన్నా, తన ఇష్టప్రకారం పెంచుదామన్నా అయ్యేదికాదు. తాయారమ్మకి వెధవ తెలివితేట్లకి తక్కువలేవు. పిల్లలికి డబ్బులు చేతిలో పడేసీ, తినుబండారాలు పెట్టీ వాళ్ళను తన చుట్టూ తిప్పుకొనేది. వేణు, రవిలకు ఎప్పుడూ చిన్నాన్న చెప్పే పనులు చేయడం, మామ్మతో చెప్పి ఆడుకోవడం తప్ప చదువుకోవాలని, బడికి వెళ్ళాలని ఉండేదికాదు. బడికి ఎగనామం పెట్టేవారు.

పిల్లలు అలాగ పాడవుతోంటే సుభద్రకి కష్టంగా ఉండేది. చూసిచూసి స్కూలుకి సరిగ్గా వెళ్ళడం లేదని ఒకరోజు వేణుని, ఇందిరని సుభద్ర చావగొట్టింది. వాళ్ళు తాయారమ్మ దగ్గరికి పరుగెత్తి ఒకటే ఏడుపు. రాత్రి కొడుకు ఇంటికి వచ్చాక తాయారమ్మ కోడలి మీద మరో నాలుగు మాటలువేసి రిపోర్టు చేసింది. ఏడ్చిన పిల్లల మొహాలు చూసేసరికి ఆయనకి కోపం వచ్చేసింది. దాంతో సుభద్రను చావబాదాడు.

పిల్లల ఎదురుగుండా ఆమెను కొట్టకూడదనే ఆలోచన ఆయనకి లేదు. భార్య చెపుతున్న మాటలు వినాలనైనా తోచలేదు. ఉమ్మడి కుటుంబంలో ఉండటం ఆవిడకి ఇష్టంలేదని, అందుకే బిడ్డలను చావబాది, కక్షతీర్చుకొంటోందని అత్తగారి ఆరోపణలు, తోటికోడళ్ళ దెప్పుళ్ళు, సుభద్రను అసహాయురాల్ని చేస్తున్నాయి. బిడ్డల విషయంలో రాజీపడకుండా వాళ్ళను చదివించాలనుకోవడం వాళ్ళందరికీ నేరాలు. ఈమధ్య ఆమె ఏదో స్వతంత్రించి ప్రవర్తిస్తోందనుకోవడం. బిడ్డలకా చిన్నతనం. తల్లి మనసు వారికి తెలియకపోవడం. వాళ్ళ దృష్టిలో మామ్మకి ఉన్న విలువ తల్లికిలేదు.

పిల్లలు కూడా తల్లిని పట్టించుకొనేవారుకారు. సుభద్ర ఏనాడూ వేరు కాపురం గురించి ఆలోచించలేదు. కానీ బిడ్డలు పాడైపోతూంటే ఎప్పుడూ గోళీలు, కోతికొమ్మచ్చులు ఆడుతూంటే చూస్తూ ఊరుకోలేకపోయేది. వాళ్ళని తమ్ముడి దగ్గర ఉంచుతానంటే మాధవరావు దెబ్బలాడేవాడు. ఇక్కడ బిడ్డలకోసం ఆమె ఏం చేసినా అత్తగారు వాళ్ళని వెనకేసుకొనివచ్చి పాడుచేయడం, దాంతో సుభద్ర పిల్లలని తిట్టడం, అడ్డం వస్తున్నందుకు అత్తగారిని విసుక్కోవడం చేసేది. అత్తాకోడళ్ళ మధ్య రగడలు, మాధవరావు ఇంటికి రాగానే తల్లి బుడిబుడి దీర్ఘాలు తీసి చెప్పడం, ఆయన ఎవరినీ ఏమీ అనలేక భార్యపై చేయిచేసుకోవడం మామూలై పోయాయి.

ఏ మగవాడైనా ఏకాంత సమయంలో అయినా భార్య మాట వింటాడు. ఆ సమయం అటువంటిది అని అంటారు. కానీ సుభద్ర జీవితంలో ఏ సమయం కూడా విలువైనది కాదు.

ఒకరోజు ఇనప్పెట్టెలోనుండి వేణు డబ్బు దొంగతనంగా తీయడం చూసి సుభద్ర న్రాన్పడిపోయింది. తన కళ్ళే తనని మోసం చేస్తు

న్నాయా అని బాధ పడింది. తల్లిని చూసి వాడు ఒక క్షణం బెదిరినా, వెంటనే తల ఎగరవేసి వెళ్ళిపోబోయాడు.

సుభద్ర కొడుకు దారి తప్పుతున్నాడే అన్న ఆవేదనతో వాడికి తప్పు తెలియచెప్పబోయింది. "ఇది మా నాన్న డబ్బు. దొంగతనం చేసినా, దొరతనం చేసినా నాదే" అంటూ పొగరుగా వాడు జవాబు చెప్పేటప్పటికి సుభద్రకి ఒళ్ళుమండిపోయింది. ఏడవతరగతి చదువుతున్న కొడుకు తప్పుచేసి, పట్టుబడి పైగా ఇన్ని మాటలు మాట్లాడటంతో సుభద్ర పిచ్చిదై కొడుకుని చావగొట్టి, కాలుతున్న అట్లకాడతో చురకవేసింది.

తాయారమ్మగారు చెరువునుండి స్నానం చేసి వచ్చేటప్పటికి వేణు ఇల్లు ఎగిరిపోయేలాగ ఏడుస్తున్నాడు. మనవడిని వెనకేసుకొని ఆవిడ సుభద్రతో పోట్లాటకి సిద్ధమయింది. దాంతో సుభద్ర తారాజువ్వలాగా లేచింది.

"మీ మూలంగానే నా బిడ్డలు ఉత్త వెధవలైపోతున్నారు. నా మనవలికి చదువులేకపోయినా ఫర్వాలేదు ఆస్తి ఉంది అని వెనకేసుకొని రావడం వలన వాళ్ళకి కొమ్ములొస్తున్నాయి. పంచుకొంటే ఎవరికి ఎంతెంత వస్తుందో మీకేం తెలుసును? చివరికి చదువుకోకపోతే ముష్టెత్తుకోవాలి" అంటూ దెబ్బలాడింది. మాధవరావు ఇంటికి వచ్చాక, తల్లి భోజనం చేయక, అలిగి కూర్చోవడంతో అసలు విషయం ఆరాగా అడిగి తెలుసుకొన్నాడు. పిల్లవాడి చేతిమీద వాత చూసేసరికి ఆయనకి కోపం ఆగలేదు. సుభద్రని చేదతాడుతోకొట్టాడు. నోరువిప్పి చెప్పబోతే చంపుతానని హూంకరించాడు.

బిడ్డల గురించీ, వాళ్ళ క్షేమం గురించీ భార్య పడుతున్న బాధ ఏమాత్రం ఆయన తెలుసుకోలేదు.తల్లిని ఏమీ అనలేని బలహీనత ఆయనని చుట్టుకొంది. తల్లికి, బిడ్డలకి మధ్య అగాధం ఏర్పడుతోందని ఆయన తెలుసుకోలేకపోయాడు. మిగిలిన కోడళ్ళు ఏం చేసినా పట్టించుకోదు తాయారమ్మ. ఆవిడ అజమాయిషీ పెద్ద కొడుకు, కోడలిపైనే.

నిరంతరం పని, తన మనసు గురించి అయినా భర్త తెలుసుకోకపోవడంతో సుభద్రకి విరక్తి వచ్చేసింది. తను తన భర్త పిల్లల గురించి ఒక్కనాడైనా ఆలోచించుకొన్నారా? ఏ సరదాలు ఇద్దరూ పంచుకొన్నారు? ఇద్దరి మధ్యా ఎంత దూరం? ఆడదై ఉండి అత్తగారు ఎదుటనున్న ఆడదాని మనసు ఎందుకు అర్థం చేసుకోదు? కోడలంటే ఎందుకంత చులకన? బిడ్డలైనా తల్లి గురించి పట్టించుకోరేం? నవమాసాలు మోసి, కని, పెంచిన తనకంటే వాళ్ళకి నాయనమ్మ ఎక్కువ. ఆమె మాటే వేదం. ఇంక తను ఎవరి గురించి ఆలోచించాలి? ఎందుకు ఆలోచించాలి?

భర్త పిల్లల ఎదురుగుండానే తనని చావగొట్టడం ఆమెను మరీ బాధించింది. ఆరోజు నుండీ ఆమె మారిపోయింది. ఏ పనీ అందుకొనేదికాదు. ఎవరితో మాట్లాడేదికాదు. తిండి సరిగ్గా తినేదికాదు. నిద్ర అన్నది ఆమెకు పట్టేదికాదు. ఎప్పుడూ ఒక మూల కూర్చుని తనలోతాను గొణుక్కొనేది.

సుభద్ర ఇరవై అయిదు సంవత్సరాలు ఆ ఇంటికి చేసిన చాకిరీ ఏమీతక్కువది కాదు. వంచిన నడుం ఎత్తకుండా చెరువు నీరు మోసేది. అత్తగారికి, మరుదులకి నిరంతరం వండివార్చిపోసింది. మిగిలిన కోడళ్ళు వచ్చాక వాళ్ళు ఇష్టం అయితే ఒక పూట వండేవారు. లేదా పై పనులు చేసి తప్పించుకొనేవారు. సుభద్రకి మాత్రం ఎప్పుడూ ఏ పనీ తప్పలేదు.

ఊళ్ళో వాళ్ళకి మాత్రం సుభద్ర ఒక దేవత. ఒక ఆదర్శవంతమైన కోడలు. తాయారమ్మ నోటి దురుసుతనం వారందరికీ బాగానే తెలుసును. పైవాళ్ళ సానుభూతి సుభద్రకే ఉండేది. ఊళ్ళో వాళ్ళు సుభద్ర ఆ ఇంటికి చేసిన సేవ ఎంతో గొప్పగా చెప్పుకొనేవారు. బిడ్డల దగ్గర ఎప్పుడూ ఆమె గూర్చి పొగిడి, వాళ్లవల్లే ఆమె అలాగ అయిపోయిందని మందలించేవారు. ఊళ్ళో వాళ్ళందరిచేత చెప్పించుకోవడం వేణుకి చిన్నతనం అన్పించి, చదువు విషయంలో శ్రద్ధ పడేవాడు. మామ్మమీద గౌరవం మాత్రం మానుకోలేదు. ఇప్పుడు ఎవరు ఎలా ప్రవర్తించినా సుభద్రకి ఏమీ పట్టదు. ఆమెది మరోలోకం.

మాధవరావుకి సుభద్ర అలాగ అయిపోవడం బాధగానే ఉంది. ఆయన ఎదురుగా





ఏనాడూ కూర్చుని ఎరుగదు. అలాగే పగలు ఎప్పుడూ ఆయన ఆవిడ పడుకొని ఉండగా చూడలేదు. ఇప్పుడు ఆమె ఒక మూల కూర్చోవడమో, పడుకోవడమో తప్ప ఇంట్లో నడయాడటమేలేదు. ఆయనకి ఆమె మాటలు గుర్తు వచ్చేవి.

''ఒక్క విషయం చెప్పండి... పెళ్ళయిన ఇన్నేళ్ళయినా మీకు నా చేతులతో అన్నం వడ్డించగలిగానా? మనం ఏ ఊరైనా సరదాగా తిరిగామా? అయినా నేను అలాంటి కోరికలు తీర్చమని మిమ్మల్ని అడగలేదు. నాకు ఆ కోరికలే లేవు. బిడ్డల బాగోగులు చూసుకోవలసినది తల్లా, కాదా చెప్పండి. నా బిడ్డలు పాడవుతున్నారు. మీ అమ్మగారికి దయచేసి ఆ విషయం చెప్పండి'' అని భర్తని రాత్రిళ్లు అశాంతితో నిలదీసేది.

''పోనీలే సుభద్రా! అమ్మ మాత్రం బిడ్డలని పాడు చేయాలని ఎందుకు అనుకొంటుంది? మనవలంటే ఆమెకి అపురూపం. ఈ ఇంటి పెద్ద కోడలు నువ్వు. మనకి మన కుటుంబ గౌరవం ముఖ్యం. నలుగురూ ఈ తగాదాలు వింటే నవ్వుతారు'' అంటూ నిద్రపోయేవాడు

భర్తకి పెద్దవాళ్ళంటే అంత గౌరవం ఏమిటో ఆమెకి అర్థమయ్యేదికాదు. పెద్దలంటే గౌరవం ఉండాలి. కానీ పెద్దలు కూడా వాళ్ళ హద్దులు పాటించాలి. బిడ్డలను అక్కున చేర్చుకోలేక, అన్నదమ్ములవలె పెద్ద చదువులు చదివించలేక వాళ్ళ ఎడల కన్న కలలు తీరక సుభద్ర అశాంతి పాలయ్యింది. మిగిలిన కొడుకులు భార్యల విషయంలో తల్లిని కలగచేసుకోనీయరు. వాళ్ళు తనని తేలికగా అనేస్తారని తాయారమ్మకీ వాళ్ళంటే భయమే.

ఇంటి పెత్తనం ఎవరికి కావాలి? అత్తగారినే ఉంచుకోమను. ముత్యాల్లాంటి తన బిడ్డలు తనకి కావాలి. అత్తగారిలో స్వార్థం చూస్తే ఆమెకి అసహ్యం. ఎప్పుడూ ఆవిడని చూసి పళ్ళు కొరుక్కొనేది. చిన్నవాడు మాత్రం సుభద్ర ఒడిచేరేవాడు. వాడికి నీళ్ళుపోసి. తలదువ్వికొంత సంతృప్తిపడేది. ఎవరు వాడిని ఎంత భయపెట్టినా వాడు సుభద్ర దగ్గరకి రావడం మానలేదు. అంతమౌనంలోనూ వాడి పనులు ఆమే చేసేది.

చిన్న ఆడపడుచుకి బిడ్డలు ఎన్నాళ్ళకీ కలగకపోవడంతో, తాయారమ్మకి ఒక ఆలోచన వచ్చింది. చిన్నవాడిని ఆవిడకి దత్తత చేస్తే కూతురి భర్త ఎక్కడికీపోడు. కూతురు సంసారం నిలబడుతుంది. ఒకవేళ పెంచుకొన్న వేళ బాగుండి, కూతురి కడుపున నలుగురు బిడ్డలు కలిగినా కలగవచ్చును.

ఆవిడకి ఆలోచన రావడమే భయం. కొడుకుని పగలూ, రాత్రీ పోరుపెట్టి, ఆడబిడ్డ సంసారం నిలబెడితే పుణ్యమని హితోపదేశాలు చెప్పి అతడి మెడలువంచి వప్పించింది. సుభద్ర ఆ విషయం వినడంతో తోకతొక్కిన తాచులాగ ఎగిరింది. సుభద్ర మాటకి విలువ ఏముంది? పోయినవాళ్ళు పోగా మిగిలిన ఆ ముగ్గురైనా తన కళ్ళముందుండాలనే ఆమె కోరిక భర్తకి అర్థమైనా మిన్నకుండిపోయాడు. దత్తత పూర్తయ్యాక అత్తతో తను వెళ్లనని చిన్నకొడుకు ఒకటే ఏడుపు. సుభద్రను చేతులతో చుట్టేసి వాడు గోలపెడుతోంటే సుభద్ర నరకం అనుభవించింది.

ఒడిలోకి వచ్చి గారాలు పోయేవాడు దూరమవడంతో ఆమె మనసు రణరంగమైపోయింది. భర్త, అత్తగారు తనమీద కక్ష కట్టినట్లు ప్రవర్తించడంతో మనసు విరిగిపోయింది. తల్లి నుండి బిడ్డను విడదీసే అధికారం ఎవరికుంది? సుభద్ర బాధ చూడలేక ఆమె పుట్టింటివారు ఆ దత్తత కార్యక్రమానికి రానేలేదు.



చిన్న కొడుకు దూరమవడంతో సుభద్ర తిండి, నిద్ర లేకుండా శుష్కించిపోయింది.

గంటలు గంటలు నిలబడి ఏదో గొణుక్కొంటూ ఉండేది. మధ్యలో హృదయవిదారకంగా ఏడ్చేది. ఆమెకి పిచ్చిపట్టిందని ఇంట్లోవాళ్ళు పట్టించుకోవడం మానేశారు.

అసలే తల్లికి కాస్త దూరంగా ఉండే పిల్లలు, బామ్మ చెప్పే పిచ్చివాళ్ళ కబుర్లు విని తల్లి పరిసరాలలోకి రావడమే మానేశారు. ఆవిడకి మందులిప్పించి, ఇప్పించి భర్తకి విసుగు వచ్చేసింది. పుట్టింటికి ఉత్తరం రాస్తే లక్ష్మమ్మ, రామచంద్రం వచ్చి చూసి వెళ్ళారు. కూతురిని తెచ్చి దగ్గర ఉంచుకొందామని లక్ష్మమ్మ ఎంత ప్రాధేయపడినా రామచంద్రం పడనిచ్చేవాడు కాడు. భర్త దగ్గరే ఉండటం న్యాయమని చెప్పి తప్పించుకొన్నాడు.

అక్క అనారోగ్యం గురించి తల్లినుండి ఉత్తరం రాగానే భానుమూర్తి చూడటానికి వెళ్ళాడు. అతడు వెళ్ళేటప్పటికి సుభద్ర సంస్కారం లేని జుట్టుతో, శుష్కించిపోయిన శరీరంతో గదిలో ఒక మూల తలక్రింద చెయ్యి పెట్టుకొని పడుకొని వుంది. అక్కని చూసి అతడు చిన్నపిల్లాడిలాగ ఏడ్చాడు. అక్కకి జరుగుతున్న అనాదరణకి అతడి మనసు ఎంతో బాధపడింది. బిడ్డలు దూరమవడం, అత్తింటి పరిస్థితులే ఆమెను అలాగ చేశాయని తెలిసినా ఏం చేయగలడు? తనతో వచ్చెయ్యమని, మందులిప్పించి బాగు చేసుకొంటానని ఏడ్చాడు.

తమ్ముడి కన్నీరు, తనకోసం అతడు చూపుతున్న ప్రేమ చూసి సుభద్ర కొంచెం చలించింది. తనతో వచ్చెయ్యమని అతడు ప్రాధేయపడుతోంటే ఆమె అలాగేనని తల ఊపింది. ఆమెను పంపేందుకు అత్తగారు సుముఖతే చూపింది. భానుమూర్తితో కొన్నాళ్ళు మాత్రమే పంపుతున్నామని అన్నవాళ్ళు తర్వాత ఆమె మాటే పట్టించుకోలేదు. పిచ్చి మనిషి ఎక్కడ ఉంటే ఏం? భర్త మాధవరావు ఎప్పుడైనా సుభద్ర విషయం ఎత్తినా, తాయారమ్మ తుంచేసేది.

భానుమూర్తి అక్కగారికి ఎంతో సేవ చేశాడు. మందులిప్పించి, ఎన్నో మంచి మాటలు చెప్పి, ఆమెను మునుపటి మనిషిని చేశాడు.

ఆమె శారీరకంగా బాగుపడినా, మౌనంమాత్రం పోలేదు. తిరిగి ఆమెలో చైతన్యం కలిగించాలనే అతడి ఆశ అడియాసే అయింది. ఆమె అక్కడికి వచ్చాక బిడ్డలు ఒక్కసారైనా చూడటానికి రాలేదు. భర్త ఎప్పుడో రెండు మూడుసార్లు వచ్చి చూసి వెళ్ళినా, తర్వాత తర్వాత ఆయన రాకపోకలూ తగ్గిపోయాయి.

అలాగ సుభద్ర శ్రుతి అయిదేళ్ళ పిల్లగా ఉన్నప్పుడు ఎవరికీ అవసరం లేనిమనిషిగా ఆ ఇల్లు చేరింది. మామ్మద్వారా సుభద్ర కథ విన్న శ్రుతి మనసు కలతపడిపోయింది. మౌన వీణగా కన్పించే అత్త వెనుక ఇంతటి దీన వ్యథ ఉందా అని బాధపడింది. తండ్రి ఆమెను ఎలాగ చూసేవాడో గుర్తుచేసుకుంది.

తల్లి మేనకోడలుతో చెపుతున్న తన జీవిత కథ విని సుభద్ర తనలో తనే ఏడ్చేసింది. అమ్మకి మతిలేదు. ఎప్పుడో అయిపోయిన బతుకు తనది. పిల్లల జీవితం మొగ్గలోనే ఉంది. వాళ్ళు తన కథ వింటే జీవితమంటే భయపడిపోరూ! అని బరువుగా అనుకొంది.

ఉదయం మజ్జిగ తిప్పుతున్న సుభద్ర దగ్గరికి శృతి వచ్చింది. "అత్తా! నాకు జడవేయవూ? బయటికి వెళ్ళాల్సిన పని ఉంది" అంటూ అడిగింది. ఏదో ఆలోచనలో ఉన్న సుభద్ర శృతి పిలుపుకి, ఆమె అడిగిన తీరుకు ఉలిక్కిపడింది. శృతి మళ్ళీ అడిగింది.

సుభద్ర కళ్ళల్లో సన్నని కన్నీటి పొర. శృతి తలని దగ్గరికి తీసుకొని గుండెలకి హత్తుకొంది. "ఈరోజునుండి నా పనులు నువ్వే చూడాలి" అని గారాలు పోతున్న మేనకోడలిని ఆర్ద్రంగా చూసింది.

ఎర్రబడి వాచిన అత్త కళ్ళల్లో శృతికి ఎన్నో భావాలు కన్పించాయి.

దువ్వెన అందుకొని శృతికి చక్కగా దువ్వి, జడవేసింది. పెరట్లోకి వెళ్ళి తెల్లగులాబిని తుంచి మేనకోడలి తలలో ఒక పక్కగా తురిమింది. వాళ్ళిద్దర్నీ అలాగ చూసిన లక్ష్మమ్మ కళ్ళు ఆనందంతో చెమర్చాయి.

శృతికి రాష్ట్రంలో రెండవ ర్యాంకు వచ్చింది. పేపర్లో పడ్డ ఆమె ఫొటో చూసి, ఆనందించే తండ్రి లేడే అని వసుధ ఏడ్చింది. తన చదువు గురించి ఎన్నో కలలు కన్న తండ్రి ఫొటోదగ్గర చాలాసేపు చూస్తూ శృతి నిలబడిపో




యింది. ఆయన ఉంటే ఈ ఆనందం అంబరాన్ని తాకేది.

కాలేజీ ప్రిన్సిపాల్, లెక్చరర్స్ ఇంటికి వచ్చి శృతిని ఎంతో అభినందించారు. పైచదువు చదవమని ప్రోత్సహించారు. శృతి మౌనంగా తల ఊపింది. అసలు సమస్య ఇప్పుడే మొదలైంది. తను ఏం చేయాలి? జీవితాన్ని ఎలా నిర్మించుకోవాలి?

కాసేపు సెకండరీ ట్రైనింగ్‌కి వెళదామా అనుకొంది. ఇటువంటి పరిస్థితులలో తల్లిని ఎలా అన్నాళ్ళు వదలగలదు? ఇంట్లో ఉండే ఏదైనా చేయాలి. తను దూరంలో ఉంటే తల్లి కోలుకోదు. చెల్లి, తమ్ముడు, ఉండలేరు.

ఇక్కడే వుండి ఎలా ఈ కుటుంబాన్ని పెంచగలదు? తను చదివిన ఈ కాస్త చదువుకి తనకి ఏం ఉద్యోగం వస్తుంది? ఏ హోటల్‌వాళ్ళనో బతిమాలి రిసెప్షనిష్టుగా ఉద్యోగం పొందినా మామ్మ, తల్లి చేయనిస్తారా? అయినా ఆ పనిమాత్రం ఎవరు ఇస్తారు? ఏ కాన్వెంటులో చేసినా నాలుగువందలు కూడా ఇవ్వరు. ఆ డబ్బు కుటుంబ పోషణకి చాలనే చాలదు. ఏ బట్టలకొట్లో చేసినా జీతం తక్కువే. పైగా మరొక పనికి తీరిక ఉండదు. ఏం చేయడం? ఇలాగ శృతి నాల్గయిదు రోజులు తర్జనభర్జన పడింది.

రాఘవరావు సాయంత్రం వస్తున్నానని కబురు పెట్టారు. ఆయన వస్తే ఏం సలహా ఇస్తారో చూద్దామనుకొంది. ఆ అమ్మాయి మనసులో ఎన్నో ఆలోచనలు, సందేహాలు. కుటుంబాన్ని విడిచిపెట్టకుండా ఏ పని చేసినా మంచిదే.

సాయంత్రం రాఘవరావు రాగానే లక్ష్మమ్మని, వసుధని కుశల ప్రశ్నలు వేశారు. సుభద్రను సాదరంగా ఆరోగ్యం విషయం కనుక్కొన్నారు. భరత్‌ను దగ్గర కూర్చోపెట్టుకొని, శృతితో కబుర్లు చెప్పారు. ప్రకాశం చెప్పిన విషయం, రామచంద్రం బాధ్యత దులుపుకొన్న విషయం ఆయన చెవిన వేసింది లక్ష్మమ్మ.

ఆయన కూడా శృతినే సమర్థించారు. "శృతి చెప్పినమాట నిజమేనమ్మా. ప్రీతిని తన దగ్గర ఉంచుకొంటానన్నారు కదా పూర్వం. అలాగని వాళ్ళు ఉంచుకొందామనుకొన్నా ప్రీతి మనల్ని విడిచి దూరంగా ఉండలేదు. మీ అబ్బాయి ఏనాడు పిల్లల్ని ఎక్కడా ఉంచి ఎరుగరు. ఈనాడు మనం అవసరంకొద్దీ పంపినా వాళ్ళు కొత్త వాతావరణంలో ఇమడలేరు. ఇంక మనకి ఉన్న ఇల్లు, పొల్లు అమ్ముకొని ఎక్కడికో వెళ్ళి బతకడం అనవసరం. ఎవరికైనా సరే తల దాచుకొందుకు ఇల్లు ఉండితీరాలి. కష్టకాలంలో అందరం ఒకేచోట ఉంటే తృప్తి, ధైర్యం" అంటూ మంచిచెడ్డలు ఆలోచించి చెప్పారు. ఆయన అనుభవంతో చెపుతున్న మాటలను లక్ష్మమ్మ కొట్టిపారేయలేకపోయింది. అదే ఆయనదగ్గర వాపోయింది.

"అందరూ ఇదివరకటిలాగ ఉండటం అవనిపని. కుటుంబం సాగడం అంటే మాటలతో పనికాదు. వాడు బతికి ఉన్నప్పుడు దారి వేరు. కనీసం నేను, సుభద్ర అయినా పెద్దవాడి దగ్గరికి వెళితే వాళ్ళకి కొంత శ్రమ తప్పించిన వాళ్ళం అవుతాము. దూరమా, భారమా, కావాలనుకొన్నప్పుడు వచ్చి, చూసి వెళతాం" అంటూ ఆవిడ మనసులోని మాట చెప్పింది. సుభద్రమాత్రం పెద్దన్నయ్య దగ్గరికి వెళ్ళడంపట్ల సుముఖత చూపలేదు. లక్ష్మమ్మ ఆలోచనలో ధీమా ఉంది. వెళ్ళి పీకమీద కూర్చుంటే ఎందుకు ఇంత ముద్ద పెట్టడు. అలాంటివాళ్ళకి అలాగే చెయ్యాలి.

శృతి వాళ్ళ మాటలు విని వెంటనే అంది "ఎవరం ఎక్కడికీ వెళ్ళవద్దు. ఇల్లు ఎలా గడవదో నేను చూస్తాను. అక్కరలేని ఆలోచనలు వద్దు" అని బలవంతంగా నవ్వుతూ "నారు పోసినవాడు నీరుపోయడా అంటావు కదా! అందువలన భగవంతుడిమీద, నామీద భారంవేసి హాయిగా నువ్వు విశ్రాంతి తీసుకో" అని శృతి అన్న మాటలను రాఘవరావు మనసులో మెచ్చుకొన్నారు. రాఘవరావు శృతితో రమేష్ విషయం చెప్పాడు.

భానుమూర్తి పోయాడు కనుక ప్రెస్ బాధ్యత వహించేందుకు రమేష్‌కి ఇష్టంలేదు. ఆయన ప్రెస్ అమ్మి తన వంతు డబ్బు తను తీసుకొందామనుకొంటున్నారట. భానుమూర్తికి ఉన్న పై పిల్లలు ఇద్దరూ ఆడవాళ్ళే. వాళ్ళనా దాని బాధ్యత వహించమనడం భావ్యం కాదు. వాళ్ళకీ ప్రెస్ బాధ్యత అవదు కనుక అమ్మితే మంచిదన్న ఆలోచనలో ఆయన ఉన్నాడు. ఆ

విషయాలే ఆయన రాఘవరావు దగ్గర బయటపెట్టాడు. శృతి సాలోచనగా ఆయనవైపు చూసింది.

భానుమూర్తి కాగితాలు, డైరీ చూస్తే శ్రుతికి ఈ విషయాలన్నీ తెలిశాయి. భానుమూర్తి పది వేలు మాత్రమే ప్రెస్ అప్పు తీర్చగలిగాడు. రమేష్ లాభం మాత్రమే ఇచ్చాడు. ఆయన వంతు ముప్పైవేలు పెట్టుబడి అలాగే వుంది. పైనమాత్రం బాకీలు ఉంచలేదు. మిగిలిన పెట్టుబడి భానుమూర్తిదే. శ్రుతి, రాఘవరావు విషయాల గురించే మాట్లాడుకొన్నారు.

రమేష్కి భానుమూర్తి అంటే ఇష్టం. ఆయనమీద ఉండే ప్రేమకొద్దీ ప్రెస్కి పెట్టుబడి పెట్టాడు. లేకపోతే ఆయన మరే వ్యాపారరంగానికో ఆ డబ్బు ఉపయోగించేవాడు. ప్రెస్ పనులన్నా, ప్రెస్ అన్నా ఆయనకి శ్రద్ధలేదు. ఇప్పుడు స్నేహితుడు ఎలాగో లేడు కనుక తనవాటా డబ్బు తీసికొని ఏ కంపెనీ షేర్లో కొందామని అనుకొంటున్నాడు.

ఇప్పుడు శ్రుతి ఎదురుగా ఉన్న దారులు రెండు. ఆయన చెప్పినట్లు ప్రెస్ అమ్మకానికి ఒప్పుకోవడం లేదా ఆయన ఇచ్చిన ముప్పైవేలు ఆయనకిచ్చి ప్రెస్ స్వంతం చేసుకోవడం. ఏదైనా అమ్మబోతే అడివి, కొనబోతే కొరివి అన్నారు. మనంతట మనం అమ్మితే అసలు డబ్బు సరిగ్గా రాదు. ఏదో ఒకటి చెయ్యాలి.

రాఘవరావు తన ఉద్దేశం చెప్పేశాడు. ప్రెస్ మంచి బేరం చూసుకొని అమ్ముకోవడం, వచ్చిన డబ్బు ఫిక్స్డ్ డిపాజిట్ చేసుకోవడం. అది భరత్ చదువుకో, పెళ్ళిళ్ళకో ఉపయోగిస్తుంది. శ్రుతి సెకండరీ ట్రైనింగ్కి వెళితే తాను ఆమెకు డబ్బు అప్పుగా ఇస్తానన్నాడు. ఉత్తినే అంటే అసలు మొదటే శ్రుతి వద్దంటుందని ఆయనకి తెలుసును. అందుకే అలాగ చెప్పాడు.

కొంతసేపు పోయాక ఆయన తన ఇంటి విషయాలు చెప్పారు. వంశీకృష్ణకి వైజాగ్లో అసిస్టెంట్ ఇంజనీర్గా గవర్నమెంట్ ఆఫీసులో ఉద్యోగం వచ్చింది. అతడికి పెళ్ళి చేసెయ్యాలని ఆయనకి ఉంది. ఇన్నాళ్ళూ ఆడదిక్కు లేకుండా బతికారు. ఇప్పుడైనా కోడలుని తెచ్చుకోవాలని ఆయన ఆలోచన. వైజాగ్లోని మన్మధరావు అనే ప్రొఫెసరు ఆయన కూతురిని ఇస్తానని వచ్చారు. ఆయనకి ఇద్దరమ్మాయిలు, ఇద్దరు అబ్బాయిలు. ఆయన ఎప్పటినుంచో అమ్మాయిని చూడటానికి రమ్మంటున్నారు. వాళ్ళ పెద్దమ్మాయి వీణ బి.యస్.సి. చదివింది. కనుక మర్నాడు వెళ్ళి పెళ్ళికూతురిని చూసికొని వచ్చేద్దామని, శ్రుతిని, ప్రీతిని తమతో రావాలని ఆయన కోరారు.

శ్రుతి వాళ్ళతో వైజాగ్ వెళ్ళడానికి మొగమాటంకొద్దీ ఏవో అభ్యంతరాలు చెప్పబోయింది. ఆయన ఏదీ వినలేదు. "ఏమిటమ్మా... మగవాళ్ళం ఇద్దరమే వెళ్ళిరావడం మర్యాదా? ఉదయం వెళ్ళి, సాయంత్రం వచ్చేద్దాం" అంటూ దెబ్బలాడారు. లక్ష్మమ్మ పిల్లల్ని ఆయనతో తప్పక పంపిస్తానని చెప్పింది. ఆయన వెళ్ళిపోతున్నప్పుడు తప్పక రావాలని మళ్ళీ చెప్పారు.

శ్రుతికి ఆ రాత్రి మొదటిసారిగా ప్రెస్ బాధ్యత తను వహిస్తే ఎలా ఉంటుందీ అన్న ఆలోచన వచ్చింది. తన తండ్రికి ఆ ప్రెస్ అంటే ప్రాణం. స్వయంగా బతకాలని ఆయన దాన్ని పెట్టుకొన్నారు. తండ్రి ఉన్నప్పుడు ప్రెస్కి వెళ్ళి తను అప్పుడప్పుడు పని ఆసక్తిగా గమనించేది. ప్రింటింగ్ సెక్షన్ అంతా తనకు తెలిసినపనే. అయినా తను సమర్ధవంతంగా నిర్వహించగలదా?

ప్రెస్ విషయంలో రమష్చంద్ర తనకి తోడ్పడతారో, లేదో? తను ప్రెస్ విషయంలో నిలదొక్కుకోలేదని వద్దంటారో, ఏమిటో? అయినా ప్రపంచంలో అన్ని పనులూ మనకి బాగా వస్తేనే చేస్తున్నామా? చేస్తూవుంటే నైపుణ్యం వస్తుంది. ఇంతకీ తగిన సహకారం కావాలి.

తన తండ్రి ప్రెస్ పెట్టుకొన్నాక ఎంతో గర్వంగా ఉండేవారు. తను స్వతంత్రంగా బతుకుతూ మరో నలుగురికి తన చేతికింద ఉపాధి కలిగిస్తున్నాననే సంతోషం ఆయనలో కొట్టవచ్చినట్టు కన్పించేది. ఎవనైనా కష్టపడి చేస్తే ఫలిస్తుందని ఆయన నమ్మకం. తల్లిదండ్రుల ఆదర్శాలను పిల్లలు గుర్తించి నెరవే

రిస్తే వారికెంత ఆనందం. ఏది ఏమైనా తను అంకుల్‌ని ఒకసారి తీసికెళ్లి రమేష్‌ని కల వాలి.

'శ్రుతీ! నాకు తెలియదురా! నేను లేకపోవ డంవలన నువ్వింత కష్టపడవలసి వస్తుందని నాకు తెలియదురా! ఆ ఏక్సిడెంటువలన మన కుటుంబం ఇలాగ రోడ్డుమీద పడవలసి వచ్చింది' అంటూ భానుమూర్తి శ్రుతి తల నిమురుతున్నట్లుందామెకు.

''నాన్నా! మీరు లేకపోతే మాకేం తోచడంలే దు. మాకు మీరు కావాలి. నాకు మీరు లేకపోవ డంవలన చచ్చిపోవాలనిపిస్తోంది. నాకు... నాకు రాంక్ వచ్చింది నాన్నా! మీరు ఉంటే ఎంత హడావుడి చేసేవారు? ఎంతగా ఆనందించేవా రు'' అంటూ శ్రుతి బాధపడింది.

''నాన్నా! నాకు భయం వేస్తోంది. మీరు మాదగ్గరికి వచ్చెయ్యండి. మీరు తప్పక వచ్చె య్యాలి'' అని ఏడుస్తోంటే మాట అసలు రాలేదు. తర్వాత కాసేపటికి తెప్పరిల్లింది. 'ఛీ... ఛీ... మా శ్రుతి ఇలాగ ఏడవదు. నాకు తెలిసిన మా శ్రుతి ఝాన్సీరాణిలాగ ధైర్య వంతురాలు. ఏ మనిషి అయినా తన సామ ర్థ్యంతో తన జీవితాన్ని తాను నిర్మించుకోవాలి. పరిస్థితులు అనుకూలంగా ఉంటే అందరూ జీవితంలో రాణిస్తారు. పరిస్థితులు ప్రతికూ లంగా ఉన్నప్పుడే వాటితో పోరాడి, విజయం పొందాలి. నువ్వు ప్రెస్ బాగా నడపగలవు. భయపడకుండా ప్రెస్ బాధ్యత వహించు. నామాట విను తల్లీ! నీవెనుక నేను ఎప్పుడూ ఉంటాను' అని ధైర్యం కలిగిస్తూ ఎన్నోసార్లు కబుర్లు చెప్పాడు తండ్రి. శ్రుతికి ఎంతో ఆనందం కలిగింది.

భరత్ కాలు వచ్చి ప్రీతిమీద పడటంతో ప్రీతికి మెలకువ వచ్చి లేచింది. శ్రుతి తనలో తానే ఏదేదో మాట్లాడుకోవడం గమనించి, గబు క్కున ఆమెను నిద్రలేపింది.

శ్రుతికి కాసేపు తాను ఎక్కడ ఉన్నానో అర్థమవలేదు. అయోమయంగా చెల్లివైపు చూ సింది. ప్రీతి భయపడి అక్కగారిని కుదిపి ''విషయం ఏమిటి'' అని అడిగింది.

తనకి వచ్చింది కలని గ్రహించింది శ్రుతి. తండ్రి ఫొటోవైపు కాసేపు చూస్తూ కూర్చుంది. ప్రీతికి అక్కగారి మౌనం భయంకలిగించింది.

ఆమె మిగిలినవాళ్ళదగ్గరికి వెళ్ళి లేపబో తూంటే శ్రుతి వారించింది. ఇంక ఎలాగో నిద్రపట్టదని మహాభారతం తీసికొని చద వటం మొదలుపెట్టింది.

భానుమూర్తికి సంగీతమన్నా, సాహిత్యమ న్నా ఎంతో ఇష్టం. పిల్లలకీ వాటిలో అభిరుచిని కలిగించాడు. శ్రుతిని చిన్నప్పుడు తెల్లవారు ఝామున ఒళ్ళో వేసుకొని పద్యాలు చదివేవా డు. వాళ్ళు నవ్వుతూ తండ్రి ఒడిలో ఆడేవారు. అలాగ పిల్లలలో గ్రంథపఠనాసక్తి కలిగించా డు. ఏమాత్రం తీరిక దొరికినా మంచి గ్రంథా లుగురించి, కవుల గురించి చర్చించేవాడు. గ్రంథాలే మంచి మిత్రులని, గ్రంథపఠనం వలన మనిషి వ్యక్తిత్వం వికసిస్తుందని నమ్మే వాడు.

శ్రుతికి ఆయన పోలికే వచ్చింది. పుస్తకాలు చదవడమన్నా సంగీతం పాడటమన్నా ఆ అమ్మాయికి ఎంతో ఇష్టం. శ్రుతికి చిన్నప్పటి నుండీ ఆయన గాత్రం చెప్పించేవాడు. మృదు మధురమైన గొంతుకతో ఆమె కీర్తన పాడు తోంటే ఆయన పొంగిపోయేవాడు. సాయంత్రం వేళలో ఎక్కువగా పిల్లలతో గడప డాన్నే ఆయన ఇష్టపడేవాడు.

ఆయన సరదాపడి ప్రీతికి వీణ నేర్పించా డు. ప్రీతి వీణ వాయిస్తోంటే సరదాపడి శ్రుతి కూడా చెల్లితోపాటు వీణ వాయించడం చేసేది, కేవలం చెల్లి ప్రాక్టీసు చేస్తోంటే చూసి తను నేర్చుకొంది. నా బిడ్డలు సరస్వతికి ప్రతిరూపా లు'' అని ఆయన పొంగిపోయేవాడు. ఆయన ఉన్నప్పుడు సంగీత సాహిత్యాలతో ఆ ఇల్లు గుబాళించేది.

తమలో కళాబీజాలు చల్లాలని తండ్రి ఎంతో తపన పడ్డాడు. సంగీత సాహిత్యాలలో తన బిడ్డలు ఆరితేరాలని ఆయన కోరిక. తండ్రి కోరిక తీర్చడం తన విధి అని శ్రుతి అనుకొంటుంది. భౌతికంగా ఆయన తమమ ధ్య లేకపోవచ్చును. కానీ ఆయన వారసులుగా ఆయన కోరిక తాము తీర్చాలి. శ్రుతికి ఆ సమయంలో 'పోయినోళ్ళందరూ మంచోళ్ళు ఉన్నోళ్ళు పోయినోళ్ళ తీపి గురుతులు' అన్న ఘంటసాలగారి పాట గుర్తుకు వచ్చింది.

వదిగంటలు దాటగానే లక్ష్మమ్మ మనవరాళ్ళ ని పెళ్ళిచూపులకి వెళ్ళమని బలవంతం చేసింది. శ్రుతికి మాత్రం చిరాకుగా ఉంది. "అబ్బ, మామ్మా... రాఘవరావుగారు చెప్పడం బాగుంది. నువ్వు వెళ్ళమని గొడవపెట్టడం బాగుంది. మేమేం పెద్దవాళ్ళమా? పెళ్ళిచూపు లంటే మాకేం తెలుస్తుంది?" అంటూ గొణి గింది. "తప్పమ్మా... ఆయన మీ నాన్నగారి స్నేహితుడు. అడదిక్కు లేనివాడు. ఆయన అన్నివిధాలుగా మనకి సాయం చేస్తోంటే మీరు వెళ్ళకపోతే ఏం బాగుంటుంది?" అని వసుధ కూడా పిల్లలకు చెప్పింది.

రాఘవరావు పిల్లలను వెంటబెట్టుకుని రమ్మని పనిమనిషిని వంపించాక శ్రుతికి బయలుదేరక తప్పలేదు. భరత్‌ను కూడా తమవెంట బయలుదేరదీసింది. తండ్రి పోయాక వాడు ఎక్కడికీ కదలలేదు. శ్రుతి మొహమాటంగానే తమ్ముడితో, చెల్లితో బయ లుదేరింది.

"రామ్మా! రండి. ఆడపిల్లలైనా మీరే త్వ రగా తెమిలిపోయారే! ఇదిగో... మావాడుమా త్రం ఇంకా తెమలలేదు" అంటూ ఎదురువ చ్చి రాఘవరావు వాళ్ళని లోపలకు తీసికొని వెళ్ళాడు.

"మీరు మరీ నాన్నగారూ! నేను ఏ డ్రెస్ తీసినా అది వద్దు ఇంకొకటి అంటూ మార్చివే స్తున్నారు. అసలు మీకే త్వరగా ఏవీ నచ్చ డంలేదు. పైగా నింద నామీద వేస్తున్నారు" అంటూ తన గదిలోనుండి వంశీకృష్ణ ఇవతలికి వచ్చాడు. గోధుమరంగు సఫారీ డ్రెస్‌లో అత డు మరింత అందంగా ఉన్నాడు. ఉంగరాల జుట్టు ఎంత అణచి దువ్వుకొన్నా ఆగక నుదిటి మీద వడి, అతడి మొహానికి వింత అందాన్ని కలిగిస్తోంది. రాఘవరావు కొడుకువైపు తృప్తిగా చూసుకొన్నారు.

"అక్కా! వంశీకృష్ణగారు చాలా బాగుంటా రుకదూ!" అని శ్రుతితో ప్రీతి అంది.

"ఉష్... ఆయన వింటే బావుండదు" అని చెల్లెలిని శ్రుతి మందలించింది. అతడు వచ్చి నెమ్మదిగా నవ్వుతూ వాళ్ళని పలకరించాడు. "మీకు వైజాగ్‌లో ఉద్యోగంకదూ?" అని భరత్ అడిగాడు.

"అవును, ఏం?" అంటూ అడుగుతున్న అతడివైపు నవ్వుతూ చూస్తూ భరత్, "అలా గైతే మీరు ఇదివరకే పెళ్ళికూతురిని చూసేసి ఉంటారుకదూ!" అనగానే అందరూ ఫకాలున నవ్వారు. "అయ్యో! మావాడు అంత ఫాస్టుగా ఉంటే నాకు ఇంక బెంగే ఉండేది కాదు. వీడొక పాతకాలం వాడు" అంటూ కొడుకు గురించి ఆయన నిట్టూర్చారు.

శ్రుతికి ఆయనను చూస్తే ఆశ్చర్యం వేసింది. అందరూ ఆడపిల్లల గురించి బెంగ పడతారు. కానీ ఆయనమాత్రం మగపిల్లవా డైనా కొడుకు గురించే బెంగపడతారు. అదేస మయానికి రాఘవరావుగారి దొడ్డమ్మ కూతురు సీతమ్మ వచ్చింది. ఆవిడని చూడగానే ఆయన మొహం సంతోషంతో విప్పారింది. "రా అక్క య్యా! రా! సరిగ్గా సమయానికి వచ్చావు. నాకు ఇప్పుడు ఎంత సంతోషంగా ఉందో" అంటూ ఆవిడని లోపలికి ఆనందంగా తీసికెళ్ళారు.

"బావున్నారా అత్తయ్యా!" అంటూ వంశీకృ ష్ణ ఆవిడను పలకరించాడు. "నువ్వు బాగున్నా వుకదా! నా బాగు సంగతేం అడుగుతావు నాయనా! పిల్లలు లేకపోతే లేరని ఏడుస్తాం. ఉన్న పిల్లలు సరిగ్గా చూడకపోయినా ఏడు పే" అంటూ తన బాధను వెళ్ళబోసుకుంది ఆవిడ. శ్రుతీవాళ్ళను ప్రేమగా పలక రించింది. రాఘవరావు పెళ్ళిచూపుల విషయం చెప్పి వైజాగ్ బయలుదేరమన్నారు. సరైన వేళకి పెద్ద దిక్కుగా ఆవిడ రావడం ఆయనకి చాలా శుభసూచకంగా అన్పించింది. ఇంటి ఆడపడుచు బయలుదేరితే ఆనందమే కదా!

ఆవిడకూడా పెళ్ళికూతురి వివరాలు కను క్కొని, త్వరగా స్నానం అదీ ముగించింది. ఆవిడ వచ్చింది కనుక తాము ఆగిపోతామని శ్రుతి అనగానే ఆవిడ, ఆయన కలిసి చివాట్లు పెట్టారు. అనుకొన్న టైముకి రమేష్ కారు పంపడంతో అందరూ బయలుదేరారు. సరిగ్గా మూడు గంటలయ్యేటప్పటికి మన్మథరావుగా రింటిముందు కారు ఆగింది.

పెళ్ళివారిని లోపలకు తీసికొని వెళ్ళడానికి వచ్చి నిలుచున్న మన్మథరావుగారు, ఆయన భార్య కారు దిగుతున్న శ్రుతిని చూస్తూ ఒక్క




క్షణం నిలుచుండిపోయారు. తేరుకొని లోపలికి వెళ్ళి కూర్చున్నాక రాఘవరావు వాళ్లకి అందరినీ పరిచయం చేశాడు.

తెల్లని పాల తెలుపురంగు, విశాలమైన కనుదోయి, కొనదేలిన నాసిక, చక్కటి పొడుగు, పొడుగుకి తగ్గ ఒళ్ళు, అందమైన అవయవ నిర్మాణం, సుకుమారమైన శ్రుతి రూపం పెళ్ళి వారి మతులను పోగొట్టింది. నిజమైన అందం అంటే ఏమిటో వారికి ఆ అమ్మాయిని చూస్తే అర్థమయింది. స్టన్నింగ్ బ్యూటీ అంటే ఏమిటో తెలిసింది. శంఖంలాంటి మెడ, దానినంటిపెట్టుకొని కిందికి వేలాడుతున్న బంగారు గొలుసు. అంతేకాదు, ఆమె ధరించిన నీలం పట్టుపరికిణీ, నీలం జాకెట్టు, తెలుపు ఓణీ ఆ అమ్మాయికి వింతశోభని కలిగిస్తూ తెలుపు, నీలం కలిసిన మబ్బుతునకని గుర్తుచేస్తున్నాయి. రెప్ప వేయకుండా శ్రుతిని ఆపాదమస్తకం చూస్తున్న ఆడపెళ్ళివారిని చూసి వంశీకృష్ణ మనసులో నవ్వుకొన్నాడు.

పెళ్ళివారికి చేయవలసిన మర్యాదలన్నీ మన్మథరావుగారు దగ్గరుండి జరిపించారు. సీతమ్మ, రాఘవరావు టిఫిన్ చేస్తూ పెళ్ళివారితో కబుర్లలో పడ్డారు. కొంతసేపు అయ్యాక పెళ్ళికూతురు వీణను తీసికొచ్చి కూర్చోపెట్టారు. సీతమ్మ పరీక్షగా పెళ్ళికూతురిని చూడటంలో మునిగిపోయింది.

పొట్టి, పొడుగు కాని ఎత్తు, చామనఛాయ రంగు, కొంచెం పరీక్షగా చూస్తే కాస్త బొద్దుగా అన్పించే శరీరం, ఆకర్షణీయమైన అలంకరణలవలన పెళ్ళికూతురు బాగుందన్పించింది. ఆమెని, ఆమె అలంకరణను చూస్తే ఫాషన్లంటే ఇష్టమనే విషయం అందరికీ అర్థమైంది.

''ఏరా కృష్ణా! కాసేపు పేపరు పక్కన పెట్టి అమ్మాయిని చూసుకో. శ్రుతీ! ఏమిటమ్మా నువ్వు కూడా ఏమీ ప్రశ్నలు వేయకుండా మౌనం వహించావు?'' అన్న రాఘవరావు మాటలకి శ్రుతి సిగ్గుపడింది. సీతమ్మ కాస్త పాతకాలం ఆవిడ కనుక పేరు అడిగి, సంగీతం ఏదైనా నేర్చుకొన్నావా అని అడిగారు. పెళ్ళికూతురు ఆవిడవైపు చురుకుగా చూసి, లేదన్నట్లు తల ఊపింది.

''ఈ కాలం పిల్లలకి చదువులు చదివేటప్పటికే సమయం సరిపోతోంది. ఇంక సంగీతానికి ఆస్కారం ఎక్కడ చెప్పండి. మావారికి సంగీతం అంటే ప్రాణం. అందుకే మా అమ్మాయికి వీణ అని పేరు పెట్టి సంతృప్తి పడ్డారు'' అని వీణ తల్లి సీతమ్మగారితో చెప్పింది. వీళ్ళు మాటలలోపడి ఉండగా వీణ పెళ్ళికొడుకు వైపు చూడటం అతడు గమనించకపోలేదు. చిరునవ్వుతో చూస్తున్న అతడిని గమనించగానే పట్టుబడిన దానిలాగ చూపులు మరల్చుకొంది. వంశీకృష్ణ చదువుతున్న పేపరు పక్కన పడేశాడు.

''మా శ్రుతి చదువులో ఫస్టు. మా స్నేహితుడికి సంగీతం అంటే ఇష్టమని గాత్రం చెప్పించాడు. ఒక్క కీర్తన పాడిందంటే మరి జన్మలో మరిచిపోము'' అంటూ మెచ్చుకోలుగా రాఘవరావు శ్రుతిగురించి చెప్పాడు.

''చదువుదారి చదువుది. సంగీతం దారి సంగీతంది. ఇంతకీ అభిరుచి ఉండాలి'' అని ఆయన అంటుంటే మన్మధరావుకి, భార్యకి ఒక్కక్షణం మొహాలు మాడిపోయాయి. పెళ్ళికొడుక్కి, మావగారికి ఇష్టమైతే వీణ పెళ్ళయ్యాక తప్పక నేర్చుకొంటుందని వాళ్ళే తేరుకొని చెప్పారు.

మన్మధరావుకి ఇద్దరబ్బాయిలు, ఇద్దరమ్మాయిలు. పెద్దబ్బాయి డాక్టరు, రెండవవాడు ఇంజనీరు. పిల్లలు బాగా సంపాదిస్తున్నారు. ఆడపిల్లల్లో పెద్దది వీణ, రెండవది శ్రీవల్లి. శ్రీవల్లి చలాకీ అయిన అమ్మాయి. వచ్చిన పెళ్ళివారితో కొద్దిసేపట్లోనే కలిసిపోయింది. ఆ అమ్మాయి కలుపుగోలుతనం ప్రీతికి వాళ్ళకి ఎంతో నచ్చింది.

వీణ ముభావం చూస్తే సీతమ్మకి అది బిడియమో, గర్వమో అర్థమవలేదు. ఎవరెన్ని చెప్పినా వంశీకృష్ణ ఏమీ ప్రశ్నలు వేయలేదు. రాఘవరావే చివరికి కొడుకు వినేటందుకోసం వీణని చదువుగురించి, అభిరుచుల గురించి ప్రశ్నలు వేశారు. పెళ్ళివారందరూ కబుర్లలో పడ్డారు. శ్రీవల్లి శ్రుతిని వదలలేదు. ''మీరిద్దరూ అక్కచెల్లెళ్ళైనా రూపంలో ఎంత తేడాయో'' అంటూ చక్రాల్లాగ కళ్ళు తిప్పుతూ ఆశ్చర్యపోయింది. ప్రీతిది చామనఛాయ

రంగు అక్కముందు. పొడుగు సమానంగా ఉన్నా కాస్త సన్నమే. బాగా పొడుగ్గా ఉన్న లావైన జడ ఆమెకి ఎంతో అందాన్నిస్తోంది. మోకాలు వరకూ ఉన్న బారైన జడ నల్లతాచు ను గుర్తుకు తెచ్చేలాగ ఉంది. శ్రుతిలాగ అద్భుతమైన అందగత్తె కాకపోయినా ప్రీతిని చూసి అందమైనదే అని అనుకోవచ్చు.

శ్రీవల్లి, ఆమె వదిన శ్రుతిని ఒక పాట పాడమని బలవంతం చేశారు. చివరికి తప్పక శ్రుతి 'మరుగేలరా ఓ రాఘవా!' అన్న పాట పాడింది. ఆమె శ్రావ్యమైన గొంతుకకి, పాట మాధుర్యానికి శ్రోతలు అలాగే ఉండిపోయారు. చివరికి వీణ తల్లిదండ్రులుకూడా ఆమెను ఎంతో మెచ్చుకొన్నారు. త్వరలోనే పెళ్ళివారికి ఉత్తరం రాస్తానని చెప్పి రాఘవరావు బయలు దేరాడు.

కారులో తిరిగి వస్తున్నప్పుడు రాఘవరావు కొడుకు అభిప్రాయం పెళ్ళికూతురి గురించి అడిగారు. "మీ ఇష్టం నాన్నగారూ! మీకు నచ్చితే నాకు నచ్చినట్లే" అని వంశీకృష్ణ అనగానే ఆయన నిండుగా నవ్వారు. "అలా గంటే ఎలాగరా? ఆ అమ్మాయితో నూరేళ్ళు కలిసి బ్రతకవలసినవాడివి నువ్వు. నువ్వు మొహమాటం లేకుండా చెప్పు. ఆయన వెంటనే ఉత్తరం వ్రాయమని అన్నారుకదా!" అని బలవంతం చేసినా వంశీకృష్ణ తండ్రి ఇష్టానికే వదిలేశాడు.

"తమ్ముడూ! నేను ఒకమాట చెప్పనా? పిల్ల బావుంది. వాళ్ళు బాగా డబ్బు ఉన్నవాళ్ళే. అందుకే పిల్లకి వైభవంగా అన్నీ పెడతామని చెప్పారు. అన్నీ బాగున్నాయి. కానీ పిల్లకి కాస్త గర్వమా అని అన్పిస్తోంది చూస్తే. మీరా అడది క్కు లేనివారు. కాస్త నెమ్మదైన అమ్మాయిని కోడలుగా తెచ్చుకొంటే సుఖపడతారు" అని నిర్మొహమాటంగా తన అభిప్రాయం చెప్పే సింది. సీతమ్మ మాటలు కూడా ఆయనకి సబబుగానే అన్పించాయి. శ్రుతిని, ప్రీతిని ఆయన పెళ్ళికూతురి గురించి అడిగితే వాళ్ళు నవ్వేసి "బావుంది అంకుల్. ఆ అమ్మా యికేం?" అని అన్నారు.

కొంతసేపైన తరువాత శ్రుతి ఆయనతో మర్నాడు తీరికవుతుందా అని అడిగింది.

"నాతో ఏదైనా పని ఉందా?" అని ఆయన అడగగానే నెమ్మదిగా శ్రుతి చెప్పింది. "మనం వెళ్ళి రమేష్‌గారిని రేపు కలుద్దాం అంకుల్. నేను నాన్నగారి ప్రెస్ తీసుకొని నడుపుదామను కొంటున్నాను. ఆ విషయం గురించి ఆయనతో మాట్లాడుదాం" అనగానే ఆయన ఆశ్చర్యంతో ముందు సీటులోనుండి వెనుకకి తిరిగి శ్రుతి వైపు చూశారు.

"నువ్వు... నువ్వు ప్రెస్‌ను నడుపుతావా శ్రుతీ!" అని అడిగారు. "అదేమిటంకుల్. అంతలాగ ఆశ్చర్యపోతున్నారు. నేను నా కాళ్ళ మీద నిలబడి మా కుటుంబాన్ని పోషించుకో వాలని అనుకొంటున్నాను. మా నాన్నగారి ప్రెస్ నేను నడిపితే ఎలా ఉంటుందని అన్పించింది" అని తన చేతివేళ్లవైపు చూస్తూ శ్రుతి చెప్పింది.

"శ్రుతీ! నువ్వు ఆడపిల్లవి. ప్రెస్ నడిపే అనుభవం ఉంటుందా అని నా భయం. అందులో ఎన్నో సాధకబాధకాలున్నాయి. ను వ్వు. అన్నీ పడలేవు. హాయిగా మిగిలిన పై చదువు చదువుకొని, ఏ టీచరు ఉద్యోగమో చెయ్యి. నా మాట విను" అంటూ ఆయన శ్రుతికి నచ్చచెప్పబోయారు.

శ్రుతి ఆయనకి తన మనసులోని ఉద్దేశా లని చెప్పింది. తను పై చదువులంటూ కూర్చుంటే తన కుటుంబం ఎలా నడు స్తుందని ముందు తన కుటుంబం సజావుగా బతికేమార్గం చూసుకోవాలనుకొంటున్నానని, చదువు ప్రైవేటుగానయినా పూర్తిచేసుకొంటా నని, తండ్రి పేరుమీద ఉన్న ప్రెస్ మరొకరికి పోవడం తనకిష్టంలేదని స్పష్టంగా తను అను కొంటున్న అభిప్రాయం చెప్పింది. రాఘవరావు కి కూడా ఆమె అభిప్రాయం సమంజసమైనదే నన్పించింది.

వంశీకృష్ణకి శ్రుతి మాటలు వింటూంటే ఎంతో ఆశ్చర్యం కలిగింది. ఇన్నాళ్ళూ తండ్రి మాటలవలన ఆమె చురుకైనదని, తెలివైన దని, అందమైనదని అనుకొనేవాడు. అంతవర కే అతడికి ఆమె తెలుసును. ఇప్పుడు ఆ అమ్మాయికి కుటుంబంపట్ల ఉన్న ప్రేమ, ఆమె ఆలోచనాశక్తి అతడికి స్వయంగా తెలి శాయి.





శ్రుతి ఇల్లు చేరగానే లక్ష్మమ్మగారు పెళ్ళి వారి విషయాలన్నీ అడిగి తెలిసికొన్నారు. భరత్ తన అక్కని అందరూ ఎలా ఆశ్చర్యంగా చూశారో, అక్క అందాన్ని ఎలా మెచ్చుకొన్నారో మామ్మకి వివరించి చెప్పాడు. ప్రీతి పెళ్ళివారి విషయాలు వివరించింది. ''ప్రతీవాళ్ళ కళ్ళు నా మనవరాలిమీదే. నరుడి దృష్టికి నల్లరాయి పగులుతుందట'' అంటూ లక్ష్మమ్మ గుప్పెడు ఉప్పు, మిరపకాయలు తెచ్చి మనవరాలికి దిష్టి తీసిపడేసింది. మామ్మ చాదస్తానికి పిల్లలు నవ్వుకొన్నారు.

వంశీకృష్ణ పెళ్ళికూతురిని ప్రశ్నలే వెయ్యలేదని, అందరూ అతడిని అడగమని బలవంతం చేశారని అయినా అతడు మౌనంగానే ఉన్నాడని ప్రీతి వివరించింది. లక్ష్మమ్మ వంశీకృష్ణ పెద్దమనిషి తరహాకి మురిసిపోయింది. ఈ కాలంలో వంశీకృష్ణలాంటి, అతడి తండ్రిలాంటి మనుషులే ఉండరని, లక్ష్మమ్మ తన అభిప్రాయాలని చెప్పింది. భరత్ తనవంతు అన్నట్లు వెంటనే అందుకొన్నాడు.

''మామ్మా! నువ్వన్నట్లు ఆ పెళ్ళికూతురికి ఎంత గర్వమనుకొన్నావు? మాతో సరిగ్గా మాట్లాడనే లేదు. పెళ్ళి కూతురుకన్నా వాళ్ళ చెల్లెలు శ్రీవల్లే నయం. సరదాగా బోలెడు కబుర్లు చెప్పింది'' అంటూ కినుకగా భరత్ అన్న మాటలను శ్రుతి ఖండించింది. బయటివాళ్ళని అలాగ విమర్శించడం తగదని హెచ్చరించింది. పిల్లల కబుర్లతో ఆరోజుఇంట్లో అందరికీ కాలక్షేపం అయింది.

ఆరాత్రి పడుకొనేటప్పుడు శ్రుతి తనలో తాను అనుకొంది- 'ఏమైనా వంశీకృష్ణ అందరిలాంటివాడు కాదు. అతడిలో సంస్కారం ఉంది. ఎదుటివారికి ఎంతో గౌరవం ఇస్తాడు. ఇంజనీర్ అయినా అవగింజంత గర్వమైనా లేనివాడు' అని. ఆ అమ్మాయికి ఊహ తెలిశాక చూసిన పెళ్ళి చూపుల సందడి అదే. లక్ష్మమ్మ ఎప్పుడూ లోకంలోని పెళ్ళికొడుకుల ఆగడాలు, పెళ్ళికూతురి తరపువాళ్ళు పడుతున్న ఇబ్బందులు వివరించి చెప్పడంవలన ఈ పెళ్ళిచూపులు వాస్తవానికి భిన్నంగానే ఆమెకి తోచాయి. ఆడపిల్లల్ని పెళ్ళి చూపుల్లో శల్యపరీక్షచేసే మగ పెళ్ళివారి గురించి లక్ష్మమ్మ చెప్పేటప్పుడు శ్రుతి నొసలు ముడిచి వినేది.

ఏమైనా అన్నం అంతా పట్టి చూడనక్కరలేదు. అంకుల్ కుటుంబ తరహాయే వేరు అని అనుకొంది. మర్నాడు అనుకొన్న ప్రకారం రాఘవరావు రమేష్ దగ్గరకి శ్రుతితో కలిసి బయలుదేరారు. ముందుగా కబురుపెట్టడంవలన ఆయన ఎక్కడికీ వెళ్ళకుండా వీళ్ళకోసం ఎదురుచూస్తున్నాడు. వీరిద్దరినీ ఆయన సాదరంగా ఆహ్వానించాడు. రాఘవరావు శ్రుతి ఉద్దేశ్యం, ఆమె కుటుంబ పరిస్థితులు స్నేహితుడికి వివరించారు. రమేష్ శ్రుతి అభిప్రాయానికి ఆశ్చర్యపోయాడు.

కాసేపటి మౌనం తర్వాత రమేష్ శ్రుతివైపు సూటిగా చూస్తూ చెప్పాడు. ''ఇప్పుడు మీ ఏరియాలో మరొక కొత్త ప్రెస్సు కూడా వచ్చింది. మనకి ఇంక కష్టమే. మీ నాన్నగారున్నప్పుడే నాకు ప్రెస్ పనిపట్ల ఇంట్రస్టు లేదు. ఆయన మాట కొట్టివేయలేక భాగస్థులమయ్యాం. మా తోడల్లుడు ఇప్పుడు బెజవాడలో కొత్త బిజినెస్సు ప్రారంభిస్తున్నాననీ, వాటాదారునిగా చేరమని కబురుచేశాడు. నీకా ప్రెస్సు పని కొత్త. నాకా డబ్బు అవసరం ఏర్పడింది. కనుక మనం దాన్ని ఎవరికైనా అమ్మేస్తే ఇద్దరికీ మంచిదని నా ఉద్దేశ్యం'' అంటూ తన అభిప్రాయాన్ని స్పష్టంగా చెప్పేశాడు.

శ్రుతిని ఈ బాదరబందీ పడవద్దని, హాయిగా ఏ ట్రైనింగ్‌కి వెళ్ళడమో, పై చదువు చదవడమో చేయమని తామిద్దరూ ఆమెకు ఆర్థికంగా సాయపడతామని కూడా చెప్పారు.

శ్రుతికి ఆయన అలాగ తన నిర్ణయాన్ని చెపుతోంటే మాట్లాడటానికే ఎంతో ఇబ్బందిగా అన్పించింది. చల్లకొచ్చి ముంత దాచడం బాగుండదని, అవసరం తనదని నచ్చచెప్పుకొని తన మాటగా ఆయనకి ప్రెస్ బాధ్యత కొన్నాళ్ళు తన మీద వేయమని అడిగింది. కొంతకాలం నిలదొక్కుకొంటే ఆయన కోరిక ప్రకారం ఆయన వాటా డబ్బు ఇవ్వడానికి వీలవుతుందేమో అన్నట్లు చెప్పింది.

ఏపని అయినా ప్రారంభిస్తే కాని తెలియదు. కనుక రమేష్ కొంతకాలం ఓర్పుపట్టి తమకు సహకరిస్తే, తన ప్రయత్నం తను చేస్తాననీ, ఒకవేళ తను అనుకొన్నట్లు నడపలేక పోతే అప్పుడే అమ్మకం విషయం ఆలోచించవ

చ్చనీ చెప్పింది.

శ్రుతి తన మనసులోని విషయం చెప్పేట ప్పటికి ఆయన ఏమీ మాట్లాడలేకపోయారు. చివరికి ఒక నిర్ణయానికి వచ్చారు.

మొత్తానికి ఒక ఆరు నెలల వ్యవధి శ్రుతికి ఇవ్వడానికి ఆయన ఒప్పుకొన్నారు. ఆడపిల్ల వచ్చి తన కాళ్ళపై నిలబడతానని కోరడం వలన, ప్రెస్ అమ్మకం విషయం వాయిదావేశా రు. శ్రుతి ఈ ఆరు నెలలలో నిలబడగలిగితే ప్రెస్‌లో ఆయన పెట్టిన వాటా డబ్బు దఫాల వారీగా ఆయనకి చెల్లించాలి. నిలబడలేకపోతే ప్రెస్ అమ్మకం పెట్టి, ఇద్దరూ డబ్బు తీసేసు కొంటారు. శ్రుతిమీదే ఆయన ప్రెస్ విషయం వదిలేశారు.

ప్రెస్ విషయంలో ఆయన జోక్యం ఏమీ ఉండదని శ్రుతి గ్రహించింది. కేవలం రాఘవ రావు దగ్గర ఉన్న మొహమాటంకొద్దీ తన వాటా డబ్బు అడగలేదని నిర్ణయించుకొంది. ఏమైనా వచ్చిన పని అయినందుకు సంతో షించింది. అంతేకాదు బంధువులకన్నా ఆయనే నయమని అనుకొంది. ఎప్పుడూ తన తండ్రి జీవితంలో మంచిస్నేహితులను సంపా దించుకోవాలని ఎందుకు అనేవారో ఇప్పుడు బాగా బోధపడింది. ప్రెస్‌ను అభివృద్ధి చేసుకో వడం ఇప్పుడు తనమీదే ఉంది. ఎంత కష్టప డైనా సరే తను విజయాన్ని సాధించాలి.

ఇంట్లో వాళ్ళకి రాఘవరావు చెప్పడంవలన అన్ని విషయాలూ తెలిశాయి. వసుధ, సుభద్ర శ్రుతి పైచదువు చదవదని తెలిసి విలవిలలా డారు. ఎవరెంతగా నచ్చచెప్పినా శ్రుతి తన నిర్ణయాన్ని మార్చుకోలేదు.

శ్రుతి పైచదువు చదవదని తెలుసుకొన్న స్వప్న గుండె బాదుకొంది. వెంటనే వచ్చి ఆమెను నిలదీసింది. శ్రుతిలాంటి తెలివైన పిల్ల చదవకపోతే కాలేజీలే దండగని వాదించింది. తండ్రికోరిక తీర్చడానికైనా శ్రుతి చదివితీరాలని తీర్మానించింది.

తనలాంటి మొద్దులే పడుతూ లేస్తూ చదు వుతోంటే శ్రుతిలాంటి వాళ్ళు చదవకపోవడం దేశ దౌర్భాగ్యం అని వాదించి అలసిపో యింది.

"మా ఇంటి పరిస్థితులు నీకు తెలుసును. మేము ముందు ఏదో ఒక మార్గం చూసుకొని బతకాలి. పట్టుదల ఉండాలేగాని పై చదువు చదవడం దుర్లభమేం కాదు. ముందు ఒక దారి ఏర్పరచుకొని, తర్వాత మిగిలినవి సాధి స్తాను" అని విశ్వాసంతో అంటున్న శ్రుతి మాటలకు స్వప్న ఆశ్చర్యపోయింది.

"అవును స్వప్నా! మనిషికి దేన్నయినా సరే సాధించాలని పట్టుదల ఉండాలి. దానివలన ఏదైనా సాధించగలడు. నాకు చదువంటే ఎంతో ఇష్టం. తర్వాత మా నాన్నగారి కోరిక కూడా తీర్చడం నావిధి. చదువుకి దూరమ వడం నా కంఠంలో ఊపిరి ఉండగా జరగదు. ప్రైవేటుగా నా చదువు సాగిస్తాను" అంటున్న శ్రుతి కళ్ళల్లోని పట్టుదలకి స్వప్న ముగ్ధురా లైంది.

స్నేహితురాళ్ళిద్దరూ కష్టసుఖాలు కాసేపు మాట్లాడుకొన్నారు. కలిసి కాలేజీ చదువు చదు వుకోలేకపోతున్నందుకు స్వప్న బాధపడింది. శ్రుతి మాత్రం ఆమెను అనునయించింది. కలిసి చదువుకోనంతమాత్రాన స్నేహం పోతుందా? నిజమైన స్నేహానికి ఏ అడ్డుగోడ లూ ఉండవని వాదించింది. ఎప్పటిలాగే తమ స్నేహం కొనసాగుతుందని హామీ ఇచ్చింది. శైలజ, కుమారి మొదలైన మిగిలిన స్నేహితు రాళ్ళు కూడా శ్రుతి నిర్ణయానికి బాధపడ్డారు. శైలజ ఆర్థికంగా శ్రుతి కుటుంబానికి తండ్రిని ఒప్పించి సహాయపడతానని, తమతో కలసి చదవమని అడిగినా శ్రుతి విన్పించుకోలేదు. సున్నితంగా వారి సహాయాన్ని త్రోసిపుచ్చింది.

శ్రుతి అభిప్రాయాన్ని రాఘవరావు బాగా అర్థంచేసుకోవడం వలన ఆమెను తన స్నే హితుడైన మురళీ ప్రెస్ యజమాని సోమ సుందరంగారి దగ్గరకి తీసికొని వెళ్ళారు. సోమసుందరంగారు మంచివాడు, కళాపోషకు డు, ఉదార హృదయుడు. విజయనగరంలో ఆయనంటే అందరికీ గౌరవమే. శ్రుతి తండ్రి భానుమూర్తితో ఆయనకి పెద్దగా పరిచయం లేదు.

శ్రుతి చేయబోతున్న ప్రయత్నానికి ఆయన ఎంతో సంతోషించారు. "నిజానికి వృత్తిలో మన మిద్దరం ప్రత్యర్థులం. అయినా ఆడపిల్లవని, సాహసంతో ఈ రంగంలోకి అడుగుపెడుతు న్నావని నా వ్యాపార రహస్యాలు నీకు చెపుతు




న్నాను. నీ సందేహాలు తీరుస్తున్నాను. అయినా ఆడపిల్లలు చేపట్టని రంగం ఇప్పుడు ఏముంది చెప్పు'' అంటూ శ్రుతిని ప్రోత్సాహప రిచారు.

యజమాని అన్నవాడికి తన వృత్తిమీద గౌరవం, భక్తి ఉండాలని, ప్రతిచిన్న పనీ చేయగల నేర్పును కలిగి ఉండాలనీ, అలా గుంటే వర్కర్స్ యజమానికి భయపడతారనీ, యజమానిని గౌరవిస్తారనీ చెప్పారు. తెలివైన భార్యవలన భర్తకి ఎంత సుఖముంటుందో అన్ని ఇబ్బందులూ ఉంటాయని, అలాగే తెలివైన వర్కర్స్ యజమానికి సమస్యలేనని ఆయన చెప్పారు. వర్కర్స్‌పై పని వదిలి భరోసా పడరాదని, యజమాని తెలివైన వాడనే విషయం అతడు తెలిసికొనేలాగ చూసుకోవాలని ఆయన వివరించారు.

''వర్కర్స్ వలన మనకేం తలనొప్పి అంకుల్'' అని అడిగిన శ్రుతిని చూసి ఆయన చిన్నగా నవ్వారు ''అదేమిటమ్మా! తెలివైనవాడు ఎప్పుడూ ఒక గుర్తింపుని కోరుకొంటాడు. నువ్వు వాడిని సరైన దారిలో ఉంచి, పని జరిపించుకోవాలి. వాళ్ళల్లో ఏ మాత్రం అసంతృప్తి కనిపించినా, నువ్వు గుర్తించి తృప్తి పరచాలి. వాళ్ళు మరొక ప్రెస్‌కి వెళ్ళిపోయినా మనకి నష్టమేకదా! నీకంటే అవతలివాళ్ళు పాతిక ఎక్కువ ఇస్తామన్నా వాళ్ళు అటే మొగ్గుతారు కనుక నీ ప్రవర్తనతో, మంచితనంతో నువ్వు వాళ్ళని ఆకట్టుకోవాలి'' అని ఎన్నో విషయాలు చెప్పారు.

పులిలాంటి సోమసుందరంగారు శ్రుతికి అన్నివిషయాలు వివరంగా చెపుతోంటే రాఘవరావుకి ఎంతో సంతోషం కలిగింది. సోమసుందరంగారిది నిండైన భారీ విగ్రహం. దానికితోడు బుగ్గలపై మీసాలతో ఆయన చూసేవారికి భయాన్ని కలిగిస్తారు. ఆకారం భయం కలిగించినా, ఆయన అంతరంగం వెన్నపూసని శ్రుతి గ్రహించింది. చమత్కారంగా మాట్లాడే ఆయన మాటలు ఆమెను ఆకట్టుకొన్నాయి.

''అంకుల్... ఎప్పుడు ఏ సందేహం కలిగినా మీ దగ్గరికి పరుగెత్తుకొని వచ్చేస్తాను'' అంటున్న శ్రుతిని ఆయన ప్రేమపూరితనయనాలతో చూశారు. రాఘవరావు కృతజ్ఞతలు చెప్పబోతోంటే ఆయన వారించారు. ''ఆడపిల్ల, తండ్రిపోయి తన కాళ్ళమీద నిలబడటానికి చేసే ప్రయత్నంలో సహకరించవద్దా? కృతజ్ఞతలు చెప్పి నన్ను పరాయివాడిని చేస్తావా?'' అని దెబ్బలాడారు.

తిరిగివస్తోంటే రాఘవరావు శ్రుతితో ఇంక ఆలస్యం వద్దని, ప్రెస్‌ను మంచిరోజు చూసికొని నడపమని, మొదటగా తన కొడుకు పెళ్ళి శుభలేఖలు వేయమని చెప్పారు. శ్రుతి సజలనయనాలతో ఆయనని చూసింది.



లక్ష్మమ్మ నెత్తి, నోరు కొట్టుకొని గోలపెట్టినా శ్రుతి లెక్కచేయలేదు. ఇప్పుడు ఆమె ముందున్నది ఒకటే సమస్య... డబ్బు సమస్య. కొంత డబ్బు చేతిలో ఉంటే కొత్త ఆర్డర్స్ అందుకొని పని ప్రారంభించవచ్చును.

లక్ష్మమ్మ శారదమ్మ దగ్గర శ్రుతి చేస్తున్న పని గురించి, చదువు మానడం గురించి ఏకరువు పెట్టింది. ప్రసాద్ కూడా వారి దగ్గర కూర్చుని వారి మాటలు విన్నాడు. బి.కామ్ పరీక్ష పాసై అతడు విశ్రాంతిగా ఉన్నాడు. శుభ్రంగా ఏదైనా ఉద్యోగం చూసుకోవాలని అతడు, పై చదువు చదవమని శారదమ్మ గొడవ పడుతున్నారు. అతడికి తల్లిని వదిలి వెళ్ళి, పై చదువులు చదవాలని ఎంత మాత్రం లేదు.

ఇన్నాళ్ళూ అతడికి జీవితంలో ఎలా సెటిల వ్వాలా అన్న ఆలోచన తినేస్తోంది. శ్రుతి వలన అతడికి ఆ ఆలోచన తీరిపోయింది. శ్రుతి తీసికొన్న నిర్ణయం విని మొదట ఆశ్చర్యపోయినా, బాగా ఆలోచించాక అది చాలా మంచి

నిర్ణయమని గ్రహించి, ఆమెను అభి నందించాడు మనసులోనే.

తర్వాత ఒకరోజు తల్లి దగ్గర కూర్చుని తన మనసులోని మాటను చెప్పాడు. పై చదువుపై కోరిక లేదని, ఎంత చదువు చదివినా ఈ రోజులలో ఉద్యోగాలు వెంటనే రావని, ఒకవేళ అవిటితనంవలన వచ్చినా, దూరంలో ఎక్కడో ఉండిపోవాలనీ, తల్లికి చెప్పాడు. పదిమందిలో కి వెళ్ళి బయట ఉద్యోగం చేసి, అందరి హేళనలూ పడటంకంటే స్వతంత్రంగా తన కాళ్ళపై తాను నిలబడటం మంచిదని చెప్పా డు.

శ్రుతి చేస్తున్న పని తనకి ఎంతో నచ్చిందని, తను కూడా శ్రుతితో సహకరించి ప్రెస్‌లో పని చేస్తానని, కొంత డబ్బు ఆమెకు ఇచ్చి ప్రెస్ నిర్వహణలో సాయపడదామని చెప్పాడు. కొడుకు మాటలకు శారదమ్మ అయోమయంగా చూసింది. బొడ్డూడని ఈ పిల్లలు ప్రెస్‌ను నిర్వహించలేరని ఆవిడ ఉద్దేశ్యం. శ్రుతి చేస్తున్న పనే మంచిది కాదేమోనని వాళ్ళవాళ్ళు భయపడుతోంటే, తన కొడుకు కూడా ఆ పాటే పాడటం ఆమెకి విసుగు తెప్పించింది.

లక్ష్మమ్మ చెప్పినట్లు ప్రెస్ అమ్మకంపెట్టి, ఆ డబ్బుతో ఆడపిల్ల పెళ్ళి జరిపించి ఒక అయ్య చేతిలో పెట్టడమే మంచి పనిలాగ ఆవిడకి అనిపించింది. ఒక పిల్ల బాధ్యతైనా వాళ్ళకి తెములుతుందని అనుకొంది. అలాంటిది కొడుకు శ్రుతిని సమర్థించి, ఆ పనిని మెచ్చుకొంటూంటే ఆవిడకి ఏమీ తోచలేదు. ప్రసాద్ ఆవిడ భయాలన్నింటినీ తేలికగా కొట్టిపారేశాడు.

అతడికి శ్రుతిపైగల నమ్మకం అలాంటిది. ఆమె ఏపనినైనాసరే సాధించగలదనీ, ఆమెకు ఆ పనిలో తను సహకరించాలని అతడి తపన. స్వతంత్రంగా బతకడంలో ఉండే గౌరవాన్ని అతడు పోగొట్టుకోదలచుకోలేదు. అందుకే తల్లికి ఎంతో నచ్చచెప్పి, ఒప్పించాడు. శారదమ్మ కొడుకు ఇంక వినడని తెలిసి ఊరుకొంది.

శ్రుతికి మొదట ప్రసాద్ అన్న మాటలు అర్థమవలేదు. తన ప్రెస్‌లో అతడు కూడా కొంత డబ్బు పెడతానని, అతడిని కూడా ప్రెస్‌లో పనికి తీసుకోమని అర్థిస్తోంటే శ్రుతికి నమ్మకం కలగలేదు. ఇంట్లోవాళ్ళే తనని ఎన్నో రకాలుగా వ్యతిరేకిస్తోంటే, స్నేహితుడు ప్రెస్ నిర్వహణలో తనకు చేదోడుగా నిలుస్తానంటూంటే ఆమెకి నోట మాట రాలేదు. అతడిని అపనమ్మకంగా చూసింది.

తర్వాత అతడివైపు ఆర్ద్రంగా చూసింది. తన భవిష్యత్తు ఎలా ఉంటుందో, ఎలా నిలద్రొక్కుకొంటుందో తనకే అర్థమవడంలేదు. ఇంక ఏ ధైర్యంతో అతడిని ఆహ్వానించగలదు? తనకు ఎదురవ్వబోయే సాధకబాధకాలు చెప్పి అతడిని ఎలాగైనా ఆపాలని చూసింది. అయితే ప్రసాద్ ఒప్పుకోలేదు.

"నేను నా గురించి బాగా ఆలోచించి ఈ నిర్ణయం తీసుకొన్నాను. ఈ అవిటివాడు నీకు జీవితంలో సహకరించలేడంటే చెప్పు, మానేస్తాను. అంతేకానీ ఇంక వేరే ఏ కారణాలు చెప్పినా నేను వినిపించుకోను" అంటూ ఖచ్చితంగా చెప్పేశాడు. శ్రుతి మనసుకి ఆ మాట సూటిగా తగిలి, ఇంక అడ్డుచెప్పలేకపోయింది.

తండ్రి ఉన్నప్పుడు ప్రెస్ పని చూసే గోవిందాన్ని పిలిపించింది. కొందరు వర్కర్స్ ఇతర ప్రెస్‌లలో కుదిరారని అతడు ఆమెకి చెప్పాడు. శ్రుతి గోవిందంతో తన నిర్ణయం గురించి చెప్పింది. తనకు తండ్రికి సహకరించినట్లు సహకరించమని కోరింది.

గోవిందానికి భానుమూర్తి అంటే ఇష్టం. అతడు వర్కర్స్‌ని ఎంతో గౌరవంగా, తన కుటుంబ సభ్యుల్లాగ చూసేవాడు. అందుకే మిగిలిన వారు బయటపనులకు కొందరు కుదిరిపోయినా, గోవిందం ఉండిపోయాడు. భానుమూర్తి పోయిన దుఃఖంలో నుండి తేరాక వాళ్ళే ఏవిషయం చెపుతారని ఆగాడు.

గోవిందం అసలు విషయం తెలియచేసేసరికి మాణిక్యం కూడా ఇక్కడికి రావడానికే మొగ్గు చూపి, అంగీకరించాడు. అవతలి ప్రెస్‌వాడు తిట్టినా అతడు లెక్కచేయలేదు. వాళ్ళిద్దరూ వచ్చాక వాసు, లక్ష్మణ్ అనే కుర్ర వాళ్ళని లెర్నర్స్‌గా చేర్చారు. వర్కర్స్ నలుగురు, తాము ఇద్దరు. ఇంక ఫర్వాలేదనుకుంది శ్రుతి.

ప్రెస్ శుభ్రం చేయించి, రాఘవరావుగారిని పిలిచి కొబ్బరికాయ కొట్టమని కోరింది. ఆయన




ఆనందంతో ప్రెస్‌ని ప్రారంభించి, కొడుకు పెళ్ళి శుభలేఖ వివరాలు చెప్పి వెళ్ళారు. ప్రసాద్ శ్రుతి ఎంత చెప్పినా వినకుండా ఇరవై వేలు తెచ్చి ఇచ్చాడు. కొంతకాలం ఆమె డబ్బు గురించి తడుముకోకూడదని. అతడి ఆలోచన ఆమెకి తీసుకోక తప్పలేదు. ప్రెస్ నిర్వహణకే దాన్ని ఉపయోగించాలని ఆమె అనుకొంది. పెళ్ళి శుభలేఖల భారం తనమీదే పెట్టడంవలన వంశీకృష్ణ పెళ్ళి శుభలేఖలు కొత్త పద్ధతిలో వేయాలని అనుకొంది. దానిగూర్చే ఆమె శ్రద్ధగా ఆలోచించింది.

మర్నాడు ఒక శుభలేఖ పట్టుకెళ్ళి రాఘవ రావుకి చూపించింది. 'సన్నాయి సందడి' అన్న నీలంరంగు అక్షరాలు కవరుపై అందంగా మెరిసిపోతూ కనిపించగానే ఆయన కళ్ళు సంతోషంతో మెరిశాయి. శ్రుతి పెట్టిన హెడ్డింగ్ ఆయనకి ఎంతో నచ్చింది. కవరు మీద హెడ్డింగ్ కింద ఒక పక్కగా సన్నాయి వాయిస్తున్న జంటవాయిద్యకారులని చక్కటి డిజైనులో ముద్రించింది. కవరు కింద రాఘవరావు ఎడ్రస్ రాసింది.

లోపలనున్న రెండు పేజీల వెడ్డింగ్ కార్డు అందంగా, ఆర్టిస్టిక్‌గా వచ్చింది.

ఒక పెళ్ళికార్డు ఎంత అందంగా, చక్కటి ఆహ్వానాన్ని అందించవచ్చునో తెలియచేయడానికి ఒక మచ్చుతునకలాగ, హృద్యంగా ఆ పెళ్ళి శుభలేఖ రాఘవరావు కళ్ళకి కన్పించింది. ఆయనకి ఒక్క నిముషం మాట్లాడటానికి మాటలు దొరకలేదు. కొడుకంటే ఆయనకి ప్రాణం. భార్య పోయిన తరువాత అతడే ఆయనకు జీవితమైపోయాడు. అతడికి సంబంధించిన ప్రతి పనిని ఆయన ఎంతో అపురూపంగా చేస్తారు. ఆయన చేసే ప్రతీ పనిలోను ఆ అబ్బాయంటే ఆయనకి ఎంత ప్రేమో ఇతరులకి తెలుస్తుంది.

తన మనసుని ఇంతలాగ అర్థంచేసుకొన్న వాళ్ళు ఇప్పటివరకూ ఆయనకి దొరకలేదు. శ్రుతి తన మనసుకి అద్దంపట్టి శుభలేఖ రూపంలో చూపుతోందా అని ఆయనకి అన్పించింది. తనకి ఎంతో అపురూపమైన వంశీకి సంబంధించిన పెళ్ళి ఘట్టానికి ఆ శుభలేఖ శుభాహ్వానం పలుకుతోందా అని ఆయనకి అన్పించింది. ఎంతో ప్రత్యేకత ఆ శుభలేఖలోని భాషలో, భావంలో, బొమ్మలలో కన్పిస్తోంది. ఆయన మరొకసారి అపురూపంగా దాన్ని చూసుకొన్నారు. తర్వాత నెమ్మదిగా శ్రుతి దగ్గరకి వచ్చి, ఆమె తలపై చేతిని వేసి ఆశీర్వదించారు.

"నాకు తెలుసును శ్రుతీ! నువ్వు అందరి ఆడపిల్లల్లాంటి దానివి కాదని. నువ్వొక నివురు కప్పిన నిప్పువి. నీలో ఏదో ప్రత్యేకత ఉందని ఎప్పుడో అనుకొన్నాను. దాన్ని ఈ శుభలేఖ రుజువుచేస్తోంది. నీకు చాలా మంచి భవిష్యత్తు ఉంది" అని ఆమె శిరస్సు నిమిరారు. శ్రుతికి ఎంతో ఆనందం అన్పించింది. ఒక్క క్షణం ఆమెకి తండ్రి గుర్తుకి వచ్చాడు.

"శ్రుతీ! మరొక మాట... ఈ కార్డులో విందు మనం ఇచ్చేది ఎప్పుడో ఎలాగో రాశావు. 'వీనుల విందు' అని డిన్నర్ రోజున నీ కచేరీ ఉంటుందని రాయి. నా మాట కాదనవద్దు. నా ఆనందం పాడుచేయవద్దు" అంటూ మరొక మాట మాట్లాడే అవకాశం ఆమెకివ్వకుండా బలవంతం చేశారు.

ప్రెస్‌కి వెళ్ళి, కొన్ని శుభలేఖలు అచ్చువేయించి, ఒకటి తీసికొని, తన ఇంటికి బయలు దేరింది. శుభలేఖను చూసిన ప్రీతి సంతోషంతో చప్పట్లుకొట్టింది. "అక్కా! నీ పెళ్ళికి ఇలాగే అపురూపంగా శుభలేఖలు తప్పక నేను వేయిస్తాను" అంటూ అందరికీ దాన్ని చూపించింది. వసుధ తన చెమ్మగిల్లిన కళ్లను శ్రుతి చూడకూడదని, శుభలేఖ ప్రీతి చేతిలో పెట్టి వెళ్ళిపోయింది.

ఏ చిన్న విషయం ఆ కుటుంబంలో జరిగినా భానుమూర్తి అలాగే ఆనందపడిపోయేవాడు. అందరికీ ఒక్క క్షణం ఆ విషయం గుర్తుకి వచ్చింది. సుభద్ర శ్రుతి నుదుటిపై ఆనందంతో ముద్దుపెట్టుకొంది.

ఆరాత్రి రాఘవరావు కొడుకు వచ్చాక, పెళ్ళి శుభలేఖ చూపించారు. అతడు కూడా దాన్ని చూసి ఎంతో ఆశ్చర్యపోయాడు. శ్రుతిలో ఉన్న కళాత్మక హృదయాన్ని శుభలేఖ చాటిచెపుతున్నట్లు అతడికి అన్పించింది. మనసులోనే ఆమెను ఎంతో అభినందించాడు. దాన్ని చూస్తూంటే, ఆలోచనకి అందని భావమేదో అతడికి కలిగింది.

వంశీకృష్ణ పెళ్ళి విందు రిసెప్షన్‌లో తన కచేరీ ఉండాలని పట్టుపట్టారని శ్రుతి ఇంట్లో వాళ్ళకి చెప్పింది. తల్లి ఆమె ఇష్టానికే విషయం వదిలేసింది. తండ్రి పోయాక ప్రాక్టీస్ మానేసింది. ఇంత స్వల్పవ్యవధిలో పాడగలనా అని భయపడింది.

సందిగ్ధపడుతున్న ఆమెకి సుభద్ర మాటలు ప్రోత్సాహాన్ని ఇచ్చాయి. అవకాశాలు అన్ని వేళల్లో రావని, వచ్చినవాటిని తప్పక ఉపయోగించుకోవాలని చెప్పింది. లక్ష్మమ్మకిలాంటివి పట్టవు. ప్రీతిమాత్రం పాడమనే చెప్పింది.

ప్రీతి వీణ చక్కగా వాయిస్తుంది కానీ పదిమందిలోకి వచ్చి వాయించడమంటే భయం. శ్రుతి వసంతకి, మురళికి కబురుపెట్టింది. వాళ్ళు డిప్లొమా పూర్తిచేసి, ఉద్యోగాన్వేషణలో ఉన్నవాళ్ళు. శ్రుతికి పక్కన వాయించడానికి వాళ్ళు ఒప్పుకొన్నారు.

ఒకవిధంగా వంశీకృష్ణ పెళ్ళి శ్రుతిని పదిమందిలోకి తీసికొని వచ్చింది. రాఘవరావు బలవంతంతో ముగ్గురు పిల్లలూ వైజాగ్ పెళ్ళికి వెళ్ళారు. పెళ్ళిలో శ్రుతిని చూసిన, తులసమ్మగారు రెప్పవేయడమే మరిచిపోయారు. అందరిలాగ ఆవిడ శ్రుతిని చూసి ఆనందించి ఊరుకోలేదు. ఎలాగైనా ఆమెను తన కోడలిని చేసుకోవాలనే స్థిరనిర్ణయానికి వచ్చారు.

తులసమ్మగారి భర్త డాక్టరు, కొడుకు డాక్టరు. భర్త స్వంతంగా నర్సింగ్ హోం పెట్టుకొని రెండు చేతులతో సంపాదిస్తున్నాడు. కొడుకు కూడా తండ్రి దగ్గర అసిస్టెంటుగా ఉన్నాడు. మధురవాడ ఏరియాలో వేరే హాస్పిటల్ పెట్టుకొని అది సగం సమయం చూసి వస్తాంటాడు. తులసమ్మకి ముగ్గురూ మగబిడ్డలే. రెండవ అబ్బాయి స్టేట్స్‌లో చదువుతున్నాడు. ఆఖరివాడు హైస్కూలు చదువులో ఉన్నాడు.

ఆడపిల్లలు లేని ఆవిడ శ్రుతిని చూసి ఆకర్షింపబడింది. రాఘవరావుగారి దగ్గరకి వచ్చి, శ్రుతి కుటుంబవిషయాలన్నీ కనుక్కొంది. మంచినీళ్ళు తాగితే కంఠంలోనుండి కన్పించే శ్రుతి అందం తనని ముగ్ధురాల్ని చేసిందని, శ్రుతిని చూస్తే చిదిమి దీపం పెట్టుకోవచ్చునని, తనకు అలాంటి కోడలు కావాలని ఆవిడ తన కోరికని ఆయనతో చెప్పింది. ఆవిడకి కట్నకానుకలు వద్దని, శ్రుతి కుటుంబంతో మాట్లాడమని ఆవిడ కోరింది. కొడుకు తన నిర్ణయానికే వివాహవిషయం వదిలేశాడని, శ్రుతే తనకి లక్షరూపాయల కట్నమని, ఎలాగైనా ఒప్పించమని కోరింది.

రాఘవరావుగారు ఏమనగలరు? ఈ విషయం శ్రుతి కుటుంబసభ్యులమీద ఆధారపడి ఉందని చెప్పారు. తమ ఇంటికి రిసెప్షన్‌కి ఆవిడని ఆయన ఆహ్వానించారు. వాళ్ళవాళ్ళకి విషయం తెలియచేస్తానని చెప్పారు.

పెళ్ళి జరుగుతున్నంతసేపూ ఆవిడ శ్రుతి పక్కనే కూర్చున్నారు. పెళ్ళినుండి వెళ్ళిపోయే ముందు శ్రుతి బుగ్గలు పుణికి ముద్దులాడారు. "అందం అడుక్కొని తినవచ్చునని అంటారు శ్రుతీ! భగవంతుడు చాలా తప్పుపని చేశాడు. ఇంత అందం నీకు ఒక్కదానికే ఇచ్చేబదులు కొంచెమైనా మరొకరికి పంచవచ్చును కదా!" అని ఆవిడ అంటూంటే అక్కడ ఉన్న అందరూ నవ్వేశారు. శ్రుతి మొహం సిగ్గుతో ఎర్రబడింది.

మన్మథరావుకి, భార్యకి తులసమ్మగారి వరస చూస్తే ఆప ఒంటికి రాసుకొన్నట్లు ఉంది. వీణని వాళ్ళ అబ్బాయికిస్తామని వెళ్ళి అడిగితే, ఇప్పట్లో కొడుక్కు పెళ్ళి చేయమని చెప్పినావిడ, సిగ్గులేని దానిలాగ శ్రుతి వెంటపడుతోంటే వాళ్ళకి ఎంతో అసహనంగా ఉంది.

పెళ్ళి చాలా వేడుకగా జరిగింది. రాఘవరావు పెళ్ళికూతురిని తీసికొని తిరుగు ప్రయాణమయ్యారు. ఆయన అణువణువులో కొడుకు పెళ్ళి చేసిన సంతృప్తి కన్పిస్తోంది. అన్నివిధాలుగా అండదండలుగా ఉండే అత్తవారు కొడుక్కి దొరికారని ఆయన సంతోషం.

కొడుకుచేత, కోడలిచేత సత్యనారాయణ వ్రతం చేయించారు. సాయంత్రం రిసెప్షన్ ఏర్పాట్లు బ్రహ్మాండంగా ఏర్పాటు చేశారు. ఎవరికైనా ఆడపెళ్ళివారికి డబ్బు పెళ్ళికి ఎక్కువ ఖర్చు అవుతుంది కానీ మగపెళ్ళివారైౖ ఆయనకి కూడా అంతఖర్చు అయింది. అయిదు గంటలయ్యేటప్పటికి కోడలిని, కొడుకుని అందంగా అలంకరింపచేయించి హాలులోకి తీసికెళ్ళారు.

డిన్నర్‌కి ముందే శ్రుతి సంగీత కచేరీ




# వెలిన ముత్యాలు

★ 'కవిత్వం' మేల్కొలపాలి, కానీ జోకొట్టకూడదు.

-శ్రీశ్రీ

★ సమర్థునికి అసమర్థుడు అందజేసే అభినందన ఈర్ష్య.

-- మేడమ్ డీఘ్యూపియన్స్

★ వస్త్రాన్ని చీడపురుగు తిన్నట్లు ఈర్ష్య మనిషిని పీల్చి పిప్పిచేస్తుంది.

సంత్‌క్రిసోస్తమ్

★ దయాపాత్రులు కావడంకన్నా ఈర్ష్యాపాత్రులు కావడం ఎంతో మంచిది.

హీరోడోటస్

★ ఉత్తమ గుణాలతో జనించినవాడనటానికి నిదర్శనం ఈర్ష్యలేనివాడుగా పుట్టడమే.

రోష్‌ఫోకాల్డ్

★ పిరికితనం, లజ్జలతో నిండిన భావమే అసూయ.

-- రోచెస్టర్

★ ఈర్ష్యాళుడు మరణవేదనతో సమానమైన దుఃఖాన్ని అనుభవిస్తాడు.

-- వేదవ్యాసుడు

★ ఉత్సాహశక్తి సాయంలేకుండా ఏ ఘనకార్యం సాధించలేం.

-- ఎమర్సన్

★ ఉత్సాహం అంటువ్యాధిలాంటిది.

-- బుల్వెర్ లిట్టన్

★ ఉత్సాహం మనిషి భాగ్యానికి కొలమానం వంటిది.

-- తిరువల్లువార్

★ ఏ పనిచేయడానికైనా ఉత్సాహం ఉండాలి. ఉత్సాహం కలవారికి ఈ లోకంలో అన్నీ సాధ్యమే.

-- సంస్కృతసూక్తి

★ నిజాయితీగల వర్తకుడు దేశానికి ఉత్తమపౌరుడు.

— డెఫో

★ శత్రువును గౌరవించగలిగినవాడే ఉత్తమ వీరుడు.

-- బ్యూమిల్

★ మోసగాళ్లతో మాట్లాడేటప్పుడు స్వవిషయాలు తక్కువగా మాట్లాడు. వాళ్లు చెప్పేది అంతా నమ్మకు.

— ఫ్రాన్సిస్ బేకన్

★ ఆరోగ్యకరమైన శరీరం ఆత్మకు అతిథిశాల వంటిది. అనారోగ్యకరమైన శరీరం బందిఖానాలాంటిది.

— బేకన్

★ శరీరంలో ఆత్మ ఉంటుంది కాబట్టి అది దేవాలయం వలె పవిత్రమైనది.

— గాంధీజీ

సేకరణ: **నలబెల్లి శ్రీమన్నారాయణ**

ఏర్పాటు చేశారు. ఆయన మైకుదగ్గర నిలబడి చెప్పారు ''డియర్ ఫ్రెండ్స్! మీరందరూ మా పెళ్ళి శుభలేఖ చూసి కొత్తపద్ధతిలో ఎంతో బావుందని చెప్పారు. నన్ను ప్రత్యేకంగా అభినందించారు. నిజానికి ఆ అభినందనలు నాకు కాదు చెందవలసినది'' అని ఆగి శ్రుతిని పిలిచారు.

''ఈ యంగ్ గర్ల్ నా స్నేహితుడి కూతురు. ప్రస్తుతం శ్రీనివాస ప్రెస్ ప్రొప్రయిటర్ ఈ అమ్మాయే. సాహిత్యంలో, సంగీతంలో ఈమెది అందెవేసిన చేయి. సాహిత్యం మా శుభలేఖ ద్వారా మీకు పరిచయమయింది. ఇప్పుడు సంగీతం మీకు రుచి చూపించి, వీనులవిందు కలిగిస్తాం'' అని చెప్పారు.

శ్రుతి బాగా సిగ్గుపడిపోయింది. ఆయన అంత గొప్పగా పరిచయం చేస్తారనుకోలేదు.

శ్రుతి ఆహూతులందరికీ వినయంగా నమస్కరించింది. ఆమెకి చప్పున గొంతుకనుండి మాట బయటకి రాలేదు. తనని తాను ఎలాగో నిలవరించుకొని చెప్పింది, ''రాఘవరావుగారు నాకు మా నాన్నగారితో సమానం. ఆయనకి నామీదగల అపార వాత్సల్యంవలన ఇంతదాన్ని అంతచేసి గొప్పగా చెప్పారు. నేను ఆయన మాటని కాదనలేక ఈ రోజు నాకు వచ్చిన విద్యని మీముందుంచాలని వచ్చాను. తప్పులేవైనా ఉంటే క్షమించమని ప్రార్థిస్తున్నాను'' అంటూ తన మృదువైన స్వరంతో ఆమె చెపుతోంటే ఆ ప్రదేశమంతా నిశ్శబ్దమైపోయింది.

ఆకుపచ్చరంగు చీర, చోళీలతో ఆకు సంపెంగలాగుంది శ్రుతి. తెల్లటి ఆమె శరీర రంగుకి ఆ చీర ఎంతో అందంగా ఉంది. తలంటు పోసుకోవడంవలన ముంగురులు ఆమె మాట వినడంలేదు. నుదిటిపై చేరి అల్లరిచేస్తున్నాయి. అలవోకగా ఆమె వాటిని సర్దుకొంటూంటే యువకులు చిత్తరువుల్లాగ చూస్తూ ఉండిపోయారు.

అతిథులందరికీ ముందుగా సోఫాలో కూర్చున్న వంశీకృష్ణ, వీణలపైకి వాలింది శ్రుతి దృష్టి. ఒక్కక్షణం వారిని చూస్తూ ఉండి




పోయింది. పెళ్ళి అలంకరణలో వాళ్ళిద్దరూ ఎంతో అందంగా ఉన్నారు. కళ్ళకి కాటుకతో, బుగ్గన చుక్కతో వీణ అందంగా ఉంది. పెళ్ళి అలంకరణతో వంశీకృష్ణ మరీ ఆకర్షణీయంగా ఉన్నాడు. ఏది ఏమైనా అతడి అందం దగ్గర వీణ కాస్త దిగదుడుపుగానే అందరికీ కన్పి స్తోంది.

శ్రుతి తన చూపులను మరల్చుకొని ప్రక్కవా యిద్యాల వారివైపు చూసింది. వాళ్లు శ్రుతి సరిచూసుకొంటున్నారు. ప్రారంభంలో "నవరా గమాలిక" వర్ణం అందుకొంది. "వలచి వచ్చి యున్న నాపై చలము సేయమేలా సామీ" అంటూ కేదారరాగం అందుకొంది. నవరాగా లూ ఆమె సన్నటి గొంతు మాధుర్యంలో ఊపిరి పోసుకుంటున్నాయా అన్పించింది శ్రోతలకు. "చెలువైన శ్రీ వేంకటేశా కలసిమెలసి కౌగ లించరా" అని శంకరాభరణంలో ఆమె ఆల పిస్తోంటే యువకులు మంత్రముగ్ధుల్లాగా వింటూ ఉండిపోయారు.

తర్వాత "వాతాపి గణపతింభజే" అంటూ హంసధ్వని రాగంలో వినాయకుని కొలిచింది. శుద్ధధన్యాసి రాగంలో "హిమగిరి తనయే హే మలతే", హిందోళరాగంలో "సామజవరగ మనా" కీర్తనలను ఆమె పాడుతోంటే సన్నటి, మధురమైన ఆమె గాత్రమాధుర్యానికి శ్రోతలు ఆనందపరవశులయ్యారు. వయోలిన్ సన్నగా కమానుతో మీటిన ధ్వనికగా సున్నితంగా పాడు తూ, గమకాలు అలవోకగా పలికిస్తూ, సంగతు లు వేస్తూ, స్వరకల్పనతో ఆమె చేసిన కచేరీ అందరినీ ఆహ్లాదపరచింది. అందరూ ఏవో తెలియని రసలోకాలలో విహరించారు కచేరీ సాగిన సమయంలో.

శ్రోతలు వ్రాసి పంపిన అన్నమాచార్యుల కీర్తనలను కూడా ఆలపించి, వారి కోరికను శ్రుతి తీర్చింది. కొందరు విద్వాంసులు కచేరీ చేసేటప్పుడు, ఎంతో హైరానాపడి, అలసిపో యినట్లు కన్పిస్తారు. కానీ ఈ అమ్మాయి మాత్రం సునాయాసంగా తన కచేరీని ము గించింది.

రాఘవరావు శ్రుతి సంగీతకచేరీని ప్ర శంసించి, ఆమెను అనేక విధాలుగా ఆశీర్వ దించి కవరు అందించారు. శ్రుతి తీసుకోవడా నికి నిరాకరిస్తే ఆయన గట్టిపట్టు పట్టి ఆమె చేతిలో ఉంచారు. జిల్లా జడ్జీ రంగనాధంగారు శ్రుతిని ప్రశంసించి నూటపదహార్లు కానుకగా చదివించారు.

"శ్రుతిలాంటి అమ్మాయిని మీరే కోడలుగా ఎందుకు చేసుకోలేదు?" అని రాఘవరావుని అడిగినప్పుడు ఆయన తెల్లబోయారు. జడ్జీగా రు మాటల సందర్భంలో అలా అడుగుతారని ఆయన అసలు అనుకోలేదు. అలాంటి ఆలో చనే తనకి రాలేదనీ, ఆమెకి కుటుంబ బాధ్య తలున్నాయని చెప్పి తప్పించుకొన్నారు. కానీ ఆ ప్రశ్న మాత్రం ఆయనను వెంటాడుతూనే ఉంది.

వీణకి ఆ రిసెప్షన్ ఏమీ సంతృప్తిగా అన్పించలేదు. కచేరీ మధ్యలో ఆమె తలనొ ప్పని లేవబోతూంటే వంశీకృష్ణ తెల్లబోయాడు. అందరూ చూస్తున్నారనీ, అలా వెళ్లిపోతే ఏమీ బాగుండదనీ అతడు నచ్చచెప్పి ఆమెను కూర్చోపెట్టాడు. కణతలు నొక్కుకుంటూ అటూ ఇటూ అసహనంగా కదులుతున్న ఆమెను చూసి కొందరు మనసులోనే ఏవగించుకొన్నా రు.

సుభద్ర ఇంటికి తిరిగి రాగానే శ్రుతికి దిష్టి తీసిపారేసింది. "ఇదంతా ఏమిటత్తయ్యా!" అని శ్రుతి వారిస్తున్నా ఆమె విన్పించుకోలేదు.

"అబ్బబ్బ... ఏం కళ్లు, ఏంకళ్ళు... అందరూ గుడ్లప్పగించి చూడటమే. పిల్ల చిన్నది, పొగి డితే ఆయుక్షీణమన్న ఆలోచన అయినా వాళ్లకి ఉందా?"అని వాళ్లమీద విసుక్కొంది. వసుధ వదిన చాదస్తానికి నవ్వుకొంది. "బావుందే! నువ్వేనా ఇంట్లో కూర్చున్న పిల్లని పనిమాలా పాడమని గొడవచేసి, ఇప్పుడు దిష్టి తగి లిందని గెంతుతున్నావా? నేను మొదటే చె ప్పాను వినిపించుకొన్నారా?" అంటూ లక్ష్మమ్మ కూతురిమీద గయ్యిమని లేచింది. సుభద్ర తల్లివైపు ఇంక ఆపమన్నట్లు ఉరిమిచూసింది. శ్రుతి బట్టలు మార్చుకొందుకు లోపలికి వెళ్ళి పోయింది.

శ్రుతి తన చేతిలో పెట్టిన కవరు తెరిచి చూసింది లక్ష్మమ్మ. అందులో వెయ్యినూటపద హార్లున్నాయి. "ఇదేమిటే అమ్మాయి, ఇంత డబ్బు ఇచ్చారు?" అంటూ శ్రుతిని పిలిచి చూపించింది. శ్రుతి ఆశ్చర్యంగా ఆ నోట్లని



లెక్కపెట్టింది. తను వద్దన్నా ఆయన కవరు చేతిలో బలవంతంగా ఎందుకు పెట్టారో ఆమె కి ఇప్పుడు బాగా అర్థమైంది. మిగిలిన ఇద్దరికీ కూడా తనే కవర్లు ఇచ్చారు. మరి వాళ్లకి ఎంత ఇచ్చారో! అని అనుకొని కవరులోని డబ్బు తీసి తల్లిచేతికి ఇచ్చింది. ఆమె వద్దని వారించినా శ్రుతి వినలేదు.

వసుధ కవరు తీసుకెళ్లి భర్త ఫొటో దగ్గర పెట్టి, కూతురిని దగ్గరకి తీసుకొని హృదయాని కి హత్తుకొంది. ప్రీతి, సుభద్ర వాళ్లకి కచేరీ విషయాలన్నీ వివరించారు. వసుధ శ్రుతి ను దిటిపై ముద్దు పెట్టుకొంది. "చిన్నూ! ఈరోజు మీ నాన్నగారు ఉంటే ఎంత సంతోషించేవారో! ఆయన ఎప్పుడూ మీ గురించే ఆలోచించేవా రు" రుద్ధకంఠంతో అంటూ కళ్లు ఒత్తుకొంది.

లక్ష్మమ్మ కూడా కోడలి పరిస్థితికి కళ్లనీళ్ళు పెట్టుకొంది. తన కొడుక్కిఆడపిల్లలంటేఎంతో ఇష్టం. అసలు ఈ పిల్లలని విడిచి ఉండలేకనే కొడుకు మెడికల్ రిప్రజింటేటివ్ ఉద్యోగం వదులుకొన్నాడు. నెలకి ఇరవైరోజులు ఊళ్లు పట్టుకొని ఉద్యోగరీత్యా తిరుగుతోంటే నా బిడ్డల ఆటపాటలు ఎప్పుడు చూసుకొంటాను అంటూ ప్రీతి పుట్టాక ఉద్యోగం మానేశాడు. ఇంతకీ ఆడపిల్లలకోసం అంత అవస్థపడ్డవా డు ఏ ముద్దూముచ్చట చూసుకొన్నాడు? పిల్లల అభివృద్ధి చూశాడా, పెళ్ళిళ్లు చూశాడా, అందుకే కాబోలు ఉన్న నాలుగురోజులూ బిడ్డ లకోసం వెంపర్లాడాడు. ఆవిడ మనసులోనే అతన్ని తలపోసుకుంటూ కూర్చుంది.

పడుకొన్నాసరే వసుధకి భర్త తలపులు వద లలేదు. పిల్లలన్నా, తనన్నా ఆయనకి ఎంత అపురూపమో! "వసూ" అంటూ చెవిలో గుస గుసలాడే అతడి మృదుస్వరమే ఆమెకి పదేప దే గుర్తువస్తోంది. ఆయన మనసులో ఏ ఆలోచ నైనా బయలుదేరడం భయం- అందరూ ఉన్నారనైనా సంకోచించేవాడు కాడు.

భానుమూర్తికి ముదురురంగులంటే ఎంతో ఇష్టం. ఏ కొట్టుమీదైనా కొత్త చీర చూశాడా, వెంటనే డబ్బుపోసి కొనుక్కొని రావలసిందే. అతడికి ఆ చీరలో వసుధ ఎలా ఉంటుందో అన్న ఆలోచన వచ్చిందంటే కొని తీరవల సిందే. పండుగలేవైనా దగ్గర్లో ఉన్నప్పుడు ఆ చీర పండుగకి దాచుకోమని లక్ష్మమ్మ చెప్పేది. భానుమూర్తి వెంటనే ఆ చీరకట్టుకొని చూ పించమని వసుధని పోరుపెట్టేవాడు. ఇటు భర్త మాట కాదనలేక, అటు అత్తగారిని ఒప్పించలేక వసుధ సతమతమయ్యేది.

మనకి ఎప్పుడు కోరిక పుడితే అప్పుడు తీర్చుకోవాలి. ఈ మనసు, కోరిక పండుగ వచ్చేవరకూ ఆగుతాయా అన్నది అతడి వాదన. కొత్త చీర కట్టుకొని వచ్చిన భార్యని చూసి మురిసిపోయేవాడు. "వసూ! ఇంత అందం నీకు భగవంతుడు ఎందుకు ఇచ్చా డు చెప్మా? ఇందులో సగమైనా నాకు ఇవ్వవ చ్చునుకదా!" అంటూ భార్య చుబుకం ఎత్తి ముద్దులాడేవాడు. ఆమెచేతి ప్రక్కన, తన చేతిని పెట్టి రంగు తేడా చూసేవాడు.

"మీకేం కాస్త చామనఛాయరంగైనా మీరు చాలా బావుంటారు. మీ ఉంగరాల జుట్టు, పెద్దకళ్ళు ఎంత అందంగా ఉంటాయో" అంటూ సిగ్గుగా అనేది. "ఏదీ... మరొకసారి చెప్పు. చెప్పాలి మరి. ఇంతకీ అయ్యగారు అందమైనవారేనంటావు. నాకు గట్టిగా చె పితేనే వినబడుతుంది" అంటూ ఆమెను ఆటపట్టించేవాడు. డబ్బంతా చీరలకి, నగలకి, సరదాలకు ఖర్చు చేసేస్తున్నాడని లక్ష్మమ్మ ఎప్పుడూ గొణుగుతూనే ఉండేది.

"అమ్మ పెద్దదికదా! చాదస్తం కాస్త ఎక్కు వైంది. నువ్వేం పట్టించుకోకు" అంటూ భార్యకి "అమ్మా! మనం పోతే ఈ డబ్బు మన వెనకాల వస్తుందా? ఉన్నన్నాళ్లూ హాయిగా, తృప్తిగా బతకాలి. ఈ రోజులే గొప్పవి. లక్ష్మీదేవిని ఇంట్లో బంధిస్తే పాపం వస్తుంది" అంటూ తల్లితో అనేవాడు. "అమ్మా... అమ్మా" అంటూ చిన్న పిల్లాడిలాగా కూడా కూడా తిరిగే భానుమూర్తిని చూస్తే ఆవిడకి గొప్ప. "పిచ్చిసన్నాసి. వీడికి అందరూ కావాలి" అని విసుక్కొనేది.

మర్నాడు ఉదయం శ్రుతి ప్రెస్‌కి వెళ్లడాని కి తయారవుతోంటే తులసమ్మ, ఆమె భర్త మూర్తిగారు వచ్చారు. శ్రుతికి వాళ్లరాక అంతగా రుచించలేదు. తప్పనిసరిగా నవ్వు మొహంతో వాళ్ళని లోపలికి ఆహ్వానించింది. తల్లిని, మామ్మని, అత్తని పిలిచి వాళ్లకి పరి చయం చేసింది. ప్రీతి వాళ్లతో ఉత్సాహంగా





మాట్లాడటం మొదలెట్టింది. తులసమ్మగారు తను తెచ్చిన పూలు, పళ్లు శ్రుతి చేతికిచ్చింది.

తులసమ్మగారు నిక్కచ్చిగా ఉండే మనిషి. ఆవిడకి ఎంత మాత్రం లౌక్యం అన్నది తెలియదు. అందుకే శ్రుతి అంటే తనకి ఎలా అభిమానం ఏర్పడిందో, ఎలాగా తనని శ్రుతి ఆకర్షించిందో చెప్పాక తను, భర్త కలిసి వచ్చిన కారణం చెప్పేసింది. మూర్తిగారికి శ్రుతిని చూశాక భార్య మనసు ఈ సంబంధం అంటే ఎందుకు మొగ్గుచూపిందో అర్థమైంది. ఆయన వెంటనే తమ కోరిక చెప్పేశారు.

శ్రుతి అన్నివిధాలుగా తమకి తగిన కోడలని, అటువంటి అమ్మాయి కోసమే భార్య ఎన్నోరోజులనుండి వెతుకుతున్నదని, ఇప్పటికి ఆమె ప్రయాస ఫలించిందని మూర్తిగారు చమత్కారంగా పెద్దవాళ్లతో అన్నారు. వైజాగ్‌లోని తమ ప్రాక్టీసు గురించి, కొడుకు హస్తవాసి గురించి, తమ ఇంటి గురించి అన్నీ వివరంగా చెప్పారు. లక్ష్మమ్మ నోరు వెళ్లబెట్టుకొని అన్నీ విన్నది.

డబ్బుపై తమకి కోరిక లేదని, తమకే కావలసినంత డబ్బు ఉందని, కనుక కట్నకానుకలనేవి తమకి వద్దని, పెళ్లిచూపులు జరిపించి శ్రుతిని తమ ఇంటికోడలుని చేయమని వాళ్లు కోరారు. తమ అభిప్రాయం స్వయంగా చెప్పాలని వచ్చామన్నారు. వాళ్ళ మాటలు వింటూంటే శ్రుతికి అరచేతిలో చెమటలు పోయసాగాయి. లక్ష్మమ్మ వాళ్లతో తమ కుటుంబం గురించి, కొడుకు మరణం గురించి, అస్తవ్యస్తమైన పరిస్థితుల గురించి వారికి చెపుతోంటే శ్రుతి లోపలికి వచ్చి కాఫీ కలపసాగింది.

"మీ అబ్బాయి పోయిన దుఃఖంలో ఉన్న మిమ్మల్ని ఇప్పుడు ఇటువంటి కోరిక కోరడం మా తప్పే. కానీ మా బాధకొద్దీ మేము వచ్చాం. దీపంలాంటి పిల్ల ఇంటికోడలు కావాలనే ఆశతో అర్థిస్తున్నాం.అయినా మీ అబ్బాయి పోయిన ఏడాదిలో పెళ్లిచేసేస్తే కన్యాదాన ఫలం ఆయనకే దక్కుతుంది" అని లక్ష్మమ్మకి మరొక పాడివేశారు. లక్ష్మమ్మని ఆ మాట బాగా ఆకట్టుకొంది.

వసుధకి, సుభద్రకి ఆ పరిస్థితి ఇబ్బందిగా ఉంది. ఏం చెప్పాలో, ఏం చేయాలో తోచడంలేదు. శ్రుతి కాఫీ తెచ్చి వారికిచ్చింది. ప్లేటులో ఉప్మాలు తెచ్చి అందించింది. వాళ్ళు టిఫిన్ తింటూంటే నెమ్మదిగా వారితో తన అభిప్రాయం చెప్పింది.

"చూడండి. నేను స్వతంత్రించి ఇలా మాట్లాడటం ఔచిత్యం కాదు. అయినా నా పరిస్థితి అలాంటిది. మీరు స్వయంగా వచ్చి ఇటువంటి వరం నాకు కల్పించినందుకు చాలా కృతజ్ఞురాలిని. ఇది నిజంగా నా అదృష్టమే. ఈ విషయం మీ గొప్పతన్నాన్ని, ఔన్నత్యాన్ని తెలియచేస్తోంది. మీరు కల్పిస్తున్న ఈ సువర్ణ అవకాశాన్ని అందుకోలేక పోతున్నందుకు నన్ను క్షమించండి. అందుకు నా కుటుంబపరిస్థితులే కారణం. నా స్వార్థం నేను చూసుకొని వీరినందర్నీ వదిలేయలేను" అంటూ నిష్కర్షగా తన అభిప్రాయం చెప్పింది.

కుటుంబాన్ని శ్రుతి వదలనవసరంలేదని, ఆమె స్వజనం తమకి కూడా ఆత్మీయులని, వారి బాధ్యత తమకీ ఉంటుందని మూర్తిగారు ఎంత నచ్చచెప్పినా శ్రుతి విన్పించుకోలేదు. ఆయనకి శ్రుతి అంటే ఇప్పుడు నిజంగానే మంచి అభిప్రాయం కలిగింది.

కానీ పెళ్లైతే తనలో స్వార్థం పెరిగిపోతుందని, తనూ అందరి ఆడపిల్లల్లాగా భర్త, పిల్లలకే ప్రాధాన్యతనిస్తుందని, కనుక బాధ్యతలు పూర్తి అయ్యేవరకూ పెళ్లి గురించి ఆలోచించనని ఖచ్చితంగా చెప్పి, అలా చెబుతున్నందుకు క్షమించమని కోరింది. ఆడపిల్ల అయినా, మగపిల్లవాడైనా సమర్థవంతంగా బతుకు గడపాలని, తన జీవితానికి ఒక లక్ష్యం ఉందని శ్రుతి వాళ్లకి అర్థమయ్యేలాగా వివరించింది. వాళ్లు ఏమీ మాట్లాడలేకపోయారు అది విని.

లక్ష్మమ్మకి మాత్రం శ్రుతిని నమిలి మింగేద్దామనుకున్నంత కోపం వచ్చింది. వాళ్ల ఎదురుగా ఏమీ అనలేక బాగుండదని తమాయించుకొంది. తన పెద్దకొడుకు రామచంద్రం ఉన్నాడని, ఆయనతో సంప్రదించి, రాఘవరావు ద్వారా వాళ్లకి కబురుపెడతామని చె

ప్పింది. లక్ష్మమ్మ మాటలు వారిలో పోయిన ఆశని తిరిగి కలిగించాయి. అయినా ఎవరి మాటలని నమ్మడమో వారికి అర్థమవలేదు. అందుకే వసుధతో వాళ్ళ నిర్ణయాన్ని తెలిపి, పెళ్ళిచూపులు ఏర్పాటు చేయమని, అలాగైతే అబ్బాయి, శ్రుతి ఒకరినొకరు చూసుకొంటారని చెప్పి బయలుదేరారు.

వాళ్ళు అలా ఇల్లు దాటారో లేదో లక్ష్మమ్మ శ్రుతిపైకి ఒంటికాలిమీద లేచింది. "వాళ్ళు నీ అదృష్టంకొద్దీ మనల్ని వెతుక్కొని వస్తే వద్దని కాలదన్నుతావా? పిలిచి పిల్లనిస్తానంటే నీలాంటివాడే కులం తక్కువని అన్నాడుట. అలాగుంది. నోరు మూసుకొని పడివుండు. పెద్దవాళ్లం. మా ఆలోచన మాది" అంటూ తిట్టింది.

"అదే మామ్మా! అంత గొప్ప సంబంధం చేసుకొందుకు మనకి ఉన్న అర్హత ఏమిటి? నువ్వేకదా సమానవియ్యం సమానకయ్యం ఉండాలంటావు" అని శ్రుతి వేళాకోళంగా విషయం తీసివేయబోయింది. లక్ష్మమ్మ కొరా కొరా చూసింది.

లక్ష్మమ్మ కోడలుతో ఆ సంబంధానికి ఎలాగైనా శ్రుతిని ఒప్పించాలని, ఒకపిల్ల తెమిలినా తమకి మంచిదేననీ నూరిపోసింది. అత్తగారి మాటమీద వసుధ శ్రుతికి ఎంతో నచ్చచెప్పింది. కానీ శ్రుతి విన్పించుకోలేదు. సుభద్ర ఏమీ పట్టించుకోలేదని కూడా లక్ష్మమ్మ గొణిగింది. శ్రుతి సంగతి వీళ్లందరికన్నా సుభద్రకి బాగా తెలుసును కనుకే ఊరుకొంది.

లక్ష్మమ్మ పెద్ద కొడుకు రామచంద్రం దగ్గరకి బయలుదేరింది. పెళ్లిఖర్చులకైనా డబ్బు సహాయం చేయమని అడగాలనుకొంది. శ్రుతికి వచ్చిన సంబంధం విషయం తెలుసుకొని రామచంద్రం, కామేశ్వరి మొహాలు ముడుచుకొన్నారు. తల్లి పెళ్లి కోసం డబ్బు అడిగితే తను అంత ఖర్చు పెట్టలేనని, ఏవో రెండువేలు సర్దుతానని చెప్పేశాడు.

అయినా శ్రుతి వద్దంటుంటే ఈవిడకి ఇంత తాపత్రయం ఎందుకని, ఆ పిల్ల పెళ్లి చేసుకొని వెళ్లిపోతే కుటుంబం పరిస్థితి ఏమిటని కామేశ్వరి మొహంమీదే అనేసింది. కుటుంబాన్ని ఉద్ధరిస్తానని కంకణం కట్టుకున్నవాళ్ళు ఎలా పెళ్లి చేసుకుంటారని ఎక్కసక్కెంగా అడిగింది.

కోడలికి కొడుకు ఆ రెండువేలు సహాయం చేయడం ఇష్టం లేదని లక్ష్మమ్మకి అర్థమైపోయింది. అయినా పని, అవసరం తనది. అందుకే మౌనం వహించింది. కొడుకు బీదఅరుపులు అరిచి, రెండువేలే ఇస్తాననా్న ఏమీ అనలేక చచ్చినవాడి పెళ్లికి వచ్చిందే కట్నమన్నట్లు వారినుండి అది రావడమే చాలన్నట్లు ఊరుకొంది. కూతురు మొదటే వాళ్ల గురించి చెప్పిన మాటలు గుర్తుకి వచ్చాయి. రెండురోజులైనా ఉండమని కొడుకు కోడలు బలవంతం చేయలేదని మనసులో బాధపడుతూ తిరుగుప్రయాణంకి సిద్ధమైంది.

శ్రుతికి లక్ష్మమ్మ గురించి, ఆవిడ ప్రయత్నాల గురించి బాగానే తెలుసును. అందుకే శ్రుతి తన మనసులోని మాటను వివరంగా తల్లికి చెప్పింది. ఆమెకి ఏం చెప్పాలో అర్థమవలేదు. వసుధకి ఎప్పుడు భర్త, అత్తగారు చెప్పినట్లు నడుచుకోవడమే తెలుసును. దానికి సాయంగా ఒక సంఘటన జరిగింది.

ఆరోజు రాత్రి భానుమూర్తి ఆమెకు కలలోకి వచ్చాడు. శ్రుతి తెలివైన పిల్ల అనీ, కుటుంబాన్ని తప్పక ఒక ఒడ్డుకి చేరుస్తుందనీ, శ్రుతి నిర్ణయానికే అన్ని విషయాలూ వదలమనీ, దిగులుపడవద్దనీ భార్యకి చెప్పాడు. అతడు కలలో కనబడేసరికే ఆమెకి ఏడుపువచ్చింది.

తెల్లవారిన తరువాత కూడా చాలాసేపు వసుధకి ఆ కలే మనసులో మెదిలింది. శ్రుతిని కష్టపెట్టి మనోవ్యథ ఎందుకు కలిగించాలని అనుకుంది. అందుకే సుభద్రతో చెప్పి, శ్రుతి మాట ప్రకారం రాఘవరావు చేత మూర్తిగారికి ఉత్తరం రాయించేసింది.

ఇంటికి వచ్చాక విషయం తెలుసుకొన్న లక్ష్మమ్మ తోకతొక్కిన త్రాచులాగా అయింది. ఎవరినడిగి పెళ్లివాళ్లకి ఉత్తరం రాయించావని కోడలిని నిలదీసింది. నీ ఇల్లు, నీ పిల్లలు, నీ ఇష్టం అనుకొంటే నేనెందుకిక్కడ అంటూ నిష్ఠూరాలు ఆడింది. శ్రుతి మాట కాదనలేక, మనసులో ఇష్టం లేకపోయినా తను ఉత్తరం రాయించానని, భర్త పోయిన వేడిలో ఉన్న తాను పిల్లని బాధపెట్టడం మంచిది కాదనుకొ




న్నానని, పిల్లలే ఇంక తన బతుకుకి ఆధార మని చెప్పింది వసుధ.

శ్రుతి సంబంధం వద్దనుకొన్నప్పుడు చేస్తే, ఏ అఘాయిత్యమైనా చేసుకుంటే తమకి మంచిదికాదని సుభద్ర తల్లికి చెప్పింది. ఎవ రెంతగా నచ్చచెప్పినా లక్ష్మమ్మ తన అలక మానలేదు.

ఇంటికి పెద్దావిడ, అలాగా మంకుపట్టుప ట్టి, ఇంక తను ఆ ఇంట్లో ఉండనని బట్టలు సర్దుకొంటూంటే ఏం చేయాలో ఎవరికీ తోచలే దు. సుభద్రని కూడా తనతో వచ్చెయ్యమని లక్ష్మమ్మ పట్టుపట్టింది.

పెద్దకొడుకు దగ్గర కలో, గంజో త్రాగి పడి ఉందామని చెపుతోంటే సుభద్ర దెబ్బలాడింది. పెద్దాడి దగ్గర నాలుగురోజులుంటే సరి కథ కంచికి వెళ్తుందనీ, నీ సంగతి, వాడి సంగతి ఎవరికి తెలియదనీ సుభద్ర అనడంతో లక్ష్మ మ్మకి మరీ కోపం వచ్చింది.

"సరే నీ సంగతి నాకెందుకు, నీదారి నీది, నా దారి నాది" అంటూ సుభద్రని వదిలి తనే బయలుదేరింది. ఆమెను ఆపడానికి అశక్తురా లిలాగా వసుధ చూస్తూ నిలబడింది. సుభద్రకి తల్లి మొండిపట్టుకి కోపం, మరదలి పరిస్థితికి జాలివేసింది. శ్రుతివైపు అర్థవంతంగా చూసి సౌంజ్ఞ చేసింది. శ్రుతి భరత్ దగ్గరికి వెళ్ళి ఏదో చెవిలో చెప్పింది.

భరత్ సంచి పట్టుకుని గబగబా బయలుదే రబోతున్న మామ్మ దగ్గరకు వెళ్లాడు. "మామ్మా నువ్వు నన్ను విడిచిపెట్టి వెళ్లిపోతే నేను ఉండ లేను. నువ్వు వెళ్లావా నేను కూడా బెంగతో నాన్నలాగా చచ్చిపోతాను" అంటూ ఆవిడ మెడచుట్టూ చేతులువేసి బంధించాడు. లక్ష్మ మ్మకి మనవడి మాటలకి ఏడుపు వచ్చింది.

"ఛీ... ఛీ... భడవా! ఎంత మాటన్నావురా! తప్పమ్మా! అలాంటి మాటలు నువ్వు అనకూడ దు. నా ఆయువు కూడా పోసికొని నిండుగా నూరేళ్లు బ్రతుకు" అంటూ లక్ష్మమ్మ వాడిని దగ్గరకు తీసుకొంది. "మరైతే నా కోసం మామ్మ ఇక్కడే ఉంటుంది. మామ్మ లేకపోతే భరత్‌కి ఎవరు స్వీట్సు చేసిపెడతారు? ఎవరు రాత్రి ళ్లు కబుర్లు చెపుతారు?" అంటూ ఆవిడ దగ్గర భరత్ గారాలుపోయాడు. "ఈ మగనలుసుని వదిలి నేనెక్కడికి వెళతాను" అని మనసులో అనుకొంది.

వాళ్ళందరూ ఎలా ఏడిస్తే తనకేం? చంటి వాడిచేత కన్నీళ్లు తను పెట్టించదు. వాడి కోసమైనా తను ఉంటుంది. అలాగనుకొని లక్ష్మ మ్మ ప్రయాణం మానుకొంది. భరత్ వెంటనే లేచి, ఆవిడ సంచీ లోపల దాచేశాడు. ఇంట్లోని వారందరూ తేలికగా ఊపిరి తీసుకొన్నారు.

ఆఫీసులకి, బ్యాంకులకి, కంపెనీలకి వెళ్లి వాళ్లకి తన ప్రెస్సుగురించి చెప్పి ఆఫర్లు తెచ్చుకోవడానికి శ్రుతి ఎక్కువగా తిరగవలసి వచ్చేది. కొన్నిచోట్లకి ప్రసాద్ ఆమె వెనకాల వచ్చేవాడు. శ్రుతిలో ఒక గుణముంది. ఇంటి కోసం అంటే ఎంతైనా ఖర్చుపెడుతుంది. కానీ తన కోసం అంటే ఎంతో పీనాసితనంగా ఉంటుంది. ఖర్చుపెట్టే ప్రతీ పైసాకి సరైన వినియోగం ఉండాలని ఆమె సిద్ధాంతం. చాలామటుకు ఈ ప్రాంతాలన్నీ కాలినడకనే నడిచేది.

ప్రసాద్‌కిది ఎంతో కష్టంగా ఉండేది. శ్రుతి ఆడపిల్ల. తనని ఒక్కదాన్ని పంపలేడు. అలా గని తాను నడవలేడు. తన అవిటితనం ఈ విషయంలో తనని వెక్కిరిస్తున్నట్లు అన్పించేది. శ్రుతి ఇది గమనించి రావద్దంటే అతడు వినేవాడు కాదు.

పోనీ ఏవో ఆహ్వానపత్రికలు వేసి ప్రెస్ విషయం ఊరిలోని పెద్దలకు, సంస్థలకు తెలి యచేస్తే సరిపోతుందికదా అని అతడి అభి ప్రాయం. లేదా సినిమాలో ఎడ్వర్టైజ్‌మెంట్ ఇప్పిస్తే, ప్రెస్ గురించి అందరికీ తెలు స్తుందని అతడు శ్రుతితో సూచిస్తే, శ్రుతి దానికి ఒప్పుకొనేది కాదు. తల అడ్డంగా ఊపి తన అయిష్టాన్ని తెలియచేసింది.

శ్రుతి ఉద్దేశంలో స్వయంగా వెళ్లి చెప్పిరావ డంవలన వారికి ఒకమంచి అభిప్రాయం తమ మీద ఉంటుంది. స్వయంగా వచ్చి అర్థించా మని, కొందరు సంతోషించి, ప్రెస్‌కి ఆర్డర్స్ ఇవ్వవచ్చును. ముఖాముఖిగా కలుసుకోవ డంవలన వాళ్లు చేయూత నీయడానికి ముందుకు వస్తారు. ఇవన్నీ శ్రుతి చెపుతోంటే ప్రసాద్ ఆశ్చర్యపోయేవాడు. ప్రారంభంలో కొంత కష్టపడితే తర్వాత ప్రెస్ దానంతట

అదే నడుస్తుందని శ్రుతి విశ్వాసం. పేపర్లవలన స్లైడువేయడంవలన ఇన్ని ప్రయోజనాలు ఉండేవుకదా!

ఆఫీసర్లందరూ శ్రుతికి మర్యాద ఇచ్చేవారు. ఆడపిల్ల వచ్చి స్వయంగా అడుగుతోందని తమ ఆఫర్లు స్వయంగా ప్రెస్‌కి పంపేవారు. శ్రుతి పడుతున్న శ్రమని చూడలేక ప్రసాద్ లూనా ఒకటి తీసుకొన్నాడు. మొదట రెండువేలు తల్లినడిగి కట్టి, మిగతావి ఇన్‌స్టాల్‌మెంటుమీద కొన్నాడు. లూనా చూసి శ్రుతి ఆశ్చర్యపోయింది.

తనకే ఒక స్వంత అన్నయ్య ఉంటే చెల్లెలి కష్టం తెలుసుకొని ఇలాగే ప్రవర్తించేవాడు కాబోలు అని అనుకొంది. రెండువేలు కట్టి తెచ్చినందుకు మాత్రం కోపగించింది. ప్రసాద్ తమకోసం చేస్తున్న ఈ ఖర్చు చూసి అత్తయ్య ఏమనుకొంటుందో అని బెంగ. వయసులో ఉన్నప్పుడు కష్టపడితే వచ్చే నష్టమేమిటి? ముందు జీవితంలో కష్టపడితే వెనుక తామే కదా సుఖపడతారు. అలాగనే దెబ్బలాడేది.

ప్రసాద్ ఆమె ఎన్ని అన్నా కిమ్మనకుండా భరించేవాడు. ఇతరులనుండి ఏదీ పుచ్చుకోవడం శ్రుతికి ఇష్టం ఉండదని అతడికి తెలుసును. లూనా డబ్బు తాను ఇస్తే ప్రసాద్ పుచ్చుకోవాలని, అలాగైతేనే తాను దానిని వాడతానని ఆంక్షపెట్టింది. చేసేదిలేక ప్రసాద్ అంగీకరించాడు.

ఇంటికి వస్తున్న లూనాని మొదట చూసినవాడు భరత్. అతడు ఎంతో సంతోషంతో ఎదురువస్తూ, ఇంట్లోవారినందరినీ పిలిచేశాడు. "అక్కా! ఇది నిజంగా మనదేనా! అబ్బా... ఎంత బావుందో! దీనిమీద నన్ను తీసికెళ్లు" అంటూ వాడు గొడవచేయడం మొదలెట్టాడు. వాడి హడావుడి చూస్తే శ్రుతికి నవ్వు వచ్చింది. వాడిని ముద్దులాడింది.

"మనదేరా చంటీ! బావుందా? నిన్ను తీసికెళ్లకపోతే ఇది ఎందుకు?" అంటూ తమ్ముడి జుట్టు ప్రేమగా పైకి తోసింది. ఇంట్లోనివారు బండిని చూసి ఆశ్చర్యపోయారు. ఆ పరిస్థితుల్లో ఆమె కొనదని వారి ఉద్దేశం. "నిజంగానే ఇది కొన్నావే?" అంటూ అడిగిన లక్ష్మమ్మకు శ్రుతి అవునంటూ తల ఊపింది.

ప్రీతి లూనా రంగు చూసి సరదాపడింది. అక్క సైకిలు తనదేనని భరత్, ప్రీతి వాదనలో పడ్డారు. ప్రీతి సైకిలు ఎలాగైనా కొట్టెయ్యాలని భరత్ ఆశ. ప్రీతి అక్క బండిమీదవెళితే సైకిలు తనదేకదా! ఇదివరకే స్నేహితురాలు దగ్గర లూనా నడపడం నేర్చుకొన్న శ్రుతికి ఇప్పుడు ఏమీ బెడద లేకపోయింది.

వసుధ శ్రుతిని అమ్మవారి కోవెలకి బండి తీసికొని వెళ్లి, కొబ్బరికాయ కొట్టి రమ్మంది. సుభద్ర మొదట కొత్తబండికి కొబ్బరికాయ కొట్టి అప్పుడు వెళ్లమంది. భరత్ వెనక కూర్చుంటానంటే శ్రుతి వాడిని వెంటపెట్టుకొని వెళ్లింది.

వాళ్లు తిరిగి వచ్చేసరికి ఇంట్లో అందరూ ప్రసాద్‌తో కబుర్లు చెప్పుకొంటూ సరదాగా ఉన్నారు. భరత్ అత్తతో కొత్త వస్తువు ఇంటికి వచ్చింది. కనుక స్వీట్ చేయమని అడిగాడు.

అది భానుమూర్తి చేసిన అలవాటు. వసుధ మనస్సు కొడుకు అడగగానే చివుక్కుమంది. సుభద్ర నవ్వుతూ తప్పక స్వీట్ చేస్తానని చెప్పి, ప్రసాద్‌ను కూడా ఆ పూట అక్కడ భోజనం చేయమంది. ఆ పూట అందరూ నవ్వుతూ కబుర్లు చెప్పుకొంటూ భోజనం చేశారు. శ్రుతి నవ్వుతూ కబుర్లాడుతున్న తమ్ముడిని, చెల్లెలిని అభిమానంగా చూసుకొంది.

తండ్రి పోయిన తర్వాత అందరూ సరదాగా గడపడం, మామూలు రొటీన్‌లో పడటం ఇదే మొదలు. ఏదో ఆలోచిస్తున్న శ్రుతి అందరూ గట్టిగా నవ్వుతూంటే, సర్దుకుని అటువైపు చూసింది. భరత్ కంచంలోకి వంగి నోటితోనే అత్త చేసిన ప్రసాదం అందుకొని తింటున్నాడు. అతడి అల్లరిచూసి ప్రీతి "అందుకే నాన్నగారు నిన్ను 'కుక్క' అని పిలిచేవారు" అని నవ్వింది.

"కుక్క విశ్వాసమైన జంతువు. పోనీలే నాన్నగారు మంచి జంతువుతోనే పోల్చారు" అని సమర్థించుకొన్నాడు భరత్ నవ్వుతూ. భరత్ బాగా అల్లరి చేస్తాడు. ఆఖరున పుట్టిన మగపిల్లవాడని అందరికీ అతడంటే ఇష్టం. చిన్నప్పుడు తెల్లగా, బొద్దుగా ఉండే అతడిని ముద్దుచేసి ఎత్తుకోనివారు లేరు. కొడుకు చేసే అల్లరికి భానుమూర్తి నవ్వుకొనేవాడే కానీ ఏనా





డూ వినుక్కొనేవాడు కాడు. పిల్లలంటే అతడి దృష్టిలో అల్లరిచేయాలి. తోడు పెట్టిన పెరుగు లాగా ఒకేచోట ఉండమంటే ఉంటారా?

ఒకసారి మండ్రగబ్బ ఇంట్లోకి వచ్చింది. ఇంక భరత్ హడావుడి చూడాలి. ఎలాగో దానిని పురుకొనతో బంధించాడు. ఈ విషయంలో అతడికి తండ్రి ఎప్పుడూ సహాయం చేస్తాడు. పాపం ఆ మండ్రగబ్బ ఇంక ఎటూ తప్పించుకోవడానికి వీలులేక చావుకి సిద్ధపడినట్లు వాళ్ల చేతికి చిక్కింది.

దాన్ని తాడుకి వేలాడదీసి, అందరి దగ్గరికి తీసుకెళ్లి బెదిరించాడు. లక్ష్మమ్మ దగ్గర ఎప్పుడూ కొడుకు ఇచ్చిన డబ్బు ఉంటుంది. ఆవిడ దాన్ని ఎప్పుడూ బయటికి తీయదు. తనకి కావలసిన ఖర్చులన్నీ కొడుకుచేతనే పెట్టిస్తుంది. ఎవరన్నా సరదాకి ఏమన్నా అంటే నా కొడుకు సొమ్ము, నా ఇష్టం అంటుంది. ఎప్పుడూ కొనుక్కొందుకి ఏమీ ఇవ్వదని భరత్ కోపం.

అందుకే భరత్ మండ్రగబ్బని లక్ష్మమ్మ దగ్గరకి తీసికెళ్లాడు. ఆవిడ మంచం మీద నుండి దాన్ని చూసి గబుక్కున పక్కకి లేవబోయింది. భరత్ అటువైపు వరుగెత్తాడు. "నాకు స్వీట్సు కొనుక్కొందుకు పాతికరూపాయలిస్తావా? లేక దీన్ని నీమీద వడేయనా?" అని అడిగాడు, లక్ష్మమ్మ ఒకటే అరుపులు. అసలే ఆవిడకి పాములు, తేళ్లు అంటే భయం.

"వాడేం చేయడులేమ్మా! వట్టినే అల్లరి చేస్తాడు" అని కొడుకు అంటున్నా ఆవిడ అరుపులు మానలేదు. "అలా ఇల్లు ఎగిరిపోయేలాగా అరవకపోతే నాకు ఇరవైరూపాయలన్నా ఇచ్చెయ్యకూడదూ? ఎప్పుడూ నాచేత కాళ్లు పట్టించుకొంటావు. కొనుక్కొందుకి ఇస్తానని ఆశపెట్టి అరువులు పెడతావు. ఈరోజు మాత్రం నిన్ను వదలను" అని అల్లరి మొదలెట్టాడు. భానుమూర్తి ఆ గొడవ నవ్వుతూ చూస్తున్నాడే తప్ప ఆపలేదు. చివరికి ఎలాగైతేనేం లక్ష్మమ్మ ఇరవైరూపాయలూ ఇచ్చాకే భరత్ ఆమెను వదిలాడు.

పూర్వం భానుమూర్తి ప్రసక్తి వస్తే అందరూ ఏడ్చేసేవారు. అందుకని సాధారణంగా అతడి మాట రాకుండా చూసుకొనేవారు పెద్దవాళ్లు. ఇప్పుడు శ్రుతి చేసిన అలవాటు కొత్తది. ఆయనని గుర్తుచేసుకోవడం, ఆయన తమతో ఉన్నట్లే మాట్లాడుకోవడం వాళ్లకి అలవాటైపోయింది. ఏ మనిషి అయినా మంచిగా నలుగురిచేతా స్మరింపబడాలని శ్రుతి ఉద్దేశం.

ప్రీతి చదువు మానేస్తానంటే శ్రుతి ఒప్పుకోకుండా ఇంటర్ రెండవ సంవత్సరంలో చేర్పింది. అందరూ చదువుమానేసి చేసేది ఏమిటి? భరత్ తొమ్మిదవ తరగతికి వచ్చాడు. వాళ్లకి కావలసిన బుక్స్‌కొని, అవసరమనుకొన్న ప్రైవేట్లు పెట్టించింది.



శ్రుతికి సోమసుందరంగారి మాటలు బాగా గుర్తుండిపోయాయి. యజమాని అన్నవాడికి అన్నిపనులూ వస్తే, వర్కర్స్ గౌరవిస్తారు, భయపడతారు. ప్రెస్‌లోని ప్రింటింగ్ సెక్షనంతా గోవిందం చూసుకొనేవాడు. తండ్రి ఉన్నప్పుడు అప్పుడప్పుడు శ్రుతి ప్రెస్‌కి వచ్చి, గోవిందం దగ్గర నిల్చుని అతడి పనిని గమనించేది. అవేమిటి, ఇదేమిటి అని అడిగే శ్రుతంటే గోవిందంకి ముద్దు. అన్నీ వివరంగా చెప్పేవాడు. భానుమూర్తి కూతురి జిజ్ఞాసకి మురిసిపోయేవాడు. అది ఇప్పుడు శ్రుతికి బాగా పనికి వచ్చింది. ప్రెస్ అంటే ఇష్టం ఏర్పడటానికి అది కూడా కొంత కారణం.

మాణిక్యం బైండింగ్ సెక్షన్ చూసేవాడు. గోవిందం బాగా అనుభవజ్ఞుడు. చాలా అలవోకగా కంపోజింగ్ చేయడం, ప్రింటింగ్ చేయడం చేసేవాడు. శ్రుతి వాళ్ల కష్టసుఖాలు

కనుక్కొంటూ, కబుర్లు చెప్తూ వాళ్ల పనిని గమనించేది. ప్రెస్‌కి వచ్చినవాళ్లతో మాట్లాడటం, ఆర్డర్లు తీసుకోవడం, తిరిగి సకాలంలో అందించడం శ్రుతి చూసుకొనేది. ప్రసాద్ బైండింగ్ సెక్షన్ చూడటంలో, మెటీరియల్ వచ్చినవారికి ఇవ్వడంలో సహాయం చేసేవాడు.

గృహప్రవేశం ఆహ్వాన పత్రికలు వేయమని శ్రుతికి సంగీత కాలేజీ ప్రిన్సిపాల్‌గారు కబురు పెట్టారు. శ్రుతికి సంగీతకాలేజీ అన్నా ప్రిన్సిపాల్‌గారు అన్నా ఎంతో ఇష్టం. తనే స్వయంగా వాటిని వేద్దామనుకొంది.

బాగా ఆలోచించి ''పాలపొంగు'' అని గృహప్రవేశ ఆహ్వానపత్రికకి పేరుపెట్టింది. కవరు పై ఇల్లు, మంగళతోరణాలు ముద్రించింది. చక్కటి కార్డులను ముద్రించింది. కార్డుల రంగు, మేటరురంగు ఒక దానితో ఒకటి పోటీపడుతున్నాయా అని అన్పించేట్టు ఉన్నాయా శుభలేఖలు.

మోడల్ శుభలేఖని చూపించేందుకు ప్రిన్సిపాల్‌గారి ఇంటికి వెళ్తే శ్రుతిని చూసి ఎంతో ఆనందించారాయన. శుభలేఖ చూసి మరీ పొంగిపోయారు. ''శ్రుతీ! నీకు సంగీతంలో, సాహిత్యంలో మంచి ప్రవేశం ఉంది. ఇంకా దాన్ని అభివృద్ధి చేసుకొని రాణించాలి'' అని ఆశీర్వదించారు. ''ఒక మంచి పాట వింటే మనసు ఎలా పరవశిస్తుందో, ఒక మంచి మాట విన్నా అలాగే పరవశిస్తుంది. సరస్వతిదేవికి సంగీత సాహిత్యాలు రెండూ రెండు కళ్లు'' అని అన్నారు. ప్రిన్సిపాల్‌గారి మాటలకు శ్రుతి పులకించిపోయింది.

ప్రిన్సిపాల్‌గారు గాత్రంలో నిష్ణాతులు. శ్రుతికి ఆయనను చూస్తే ప్రాణం లేచివస్తుంది. ఎంతో సుకుమారంగా, సౌమ్యంగా ఉండే ఆయన ఆకారం లాగే ఆయన పాట కూడా అతిమృదువుగా, మధురంగా ఉంటుంది. శ్రుతికి గాత్రం నేర్పిన గురువు వేరే ఉన్నా సంగీతంలోని మెలకువలు నేర్పినవారు ప్రిన్సిపాల్‌గారే. ఆయన ప్రాక్టీసు చేసుకొనేటప్పుడు సాయంత్రం వేళల్లో ఆమె వెళ్లి కూర్చుని వినేది.





డిప్లొమా పరీక్షలు పొడిగించారని, శ్రుతిని తప్పక ఎటెండవమని ఆయన హెచ్చరించారు. డిప్లొమా అయిపోవడం మంచిదని ఆయన ఉద్దేశం. శ్రుతి అలాగేనని చెప్పి, ఇల్లు చేరింది. ప్రీతిని కూడా పరీక్షలకి రమ్మని చెప్పింది.

ప్రెస్‌కి వెళ్లేటప్పటికి గోవిందంకి జ్వరం ఎక్కువగా రావడంవలన ఇంటికి పంపించేశానని ప్రసాద్ చెప్పాడు. మాణిక్యం బైండింగ్ వర్క్ చేస్తోంటే ఆపి మొదట బిల్‌బుక్స్ చేయమంది. అతడు ఆపని చూడసాగాడు.

ఆ ఊరులోని ఒక టాప్ హెూటల్ తాలూకు బిల్‌బుక్స్ అవి. ఒక బుక్‌కి అయిదేసి రూపాయల లెక్కన ఇస్తారు. వాటిలో రెండువేలు అయినా సాయంత్రానికి హెూటల్‌వాళ్లకి ఇవ్వాలి. మిగిలినవి మర్నాడు ఇవ్వవచ్చును. శ్రుతి పెండింగ్‌లో ఉన్న వర్కు చూసుకొంది. నలుగురికి ఆరోజు శుభలేఖలు అందించాలి.

ఇంకవాళ్లు సాయంత్రం వస్తారు. గోవిందంకి ఇప్పుడే జ్వరం. సరే ఏం చేస్తాం? అనుకొంటూ తనే పనికి ఉపక్రమించింది. మొదట జాగ్రత్తగా తనకి కావలసిన లెటర్స్‌ను తీసికొని కంపోజింగ్ చేసింది. గేలి తీసుకెళ్లి మిషన్ దగ్గర ఉంచి పిన్‌రెడీ చేసుకొంది. మిషన్ స్టార్ట్‌చేసి శుభలేఖలు ప్రింట్ చేయడం మొదలెట్టింది. రెండుగంటలలో మొత్తం కావలసిన శుభలేఖలు అన్నీ అమరిపోయాయి. వాటిని ప్రసాద్‌కొస్తే కవర్లలో పెట్టి, కష్టమర్‌కి ఇవ్వడానికి సిద్ధంచేశాడు.

సాయంత్రానికి బిల్‌బుక్స్ పని, శుభలేఖలు పని పూర్తయింది. ఒక్కొక్కరే వచ్చి, వాళ్లవి వాళ్లు తీసుకెళ్లిపోయారు. శ్రుతి పని సిస్టమేటిక్‌గా ఉండాలని అనుకొంటుంది. అందుకే ఆర్డర్స్ ఇచ్చినప్పుడు కొంత డబ్బు అడ్వాన్స్ తీసుకొని, నోట్‌చేసి ఉంచి, తిరిగి వాటిని ఇచ్చేటప్పుడు మిగిలిన డబ్బు వసూలు చేస్తుంది.

కొందరు తమ వర్క్ మర్నాటికి అవుతుందని తెలిసినా, ముందుగా దగ్గరలో ఏదైనా పనిఉంటే వచ్చేస్తారు. అదీ ఇదీ పూర్తి

చేసేనుకోవాలని వారి ఆత్రుత. అందుకని శ్రుతి సాధారణంగా ఒకరోజుముందే వాళ్ల వర్క్ పూర్తిచేసి ఉంచుతుంది. రేపని, ఎల్లుండని కష్టమర్స్ని త్రిప్పితే ప్రెస్‌మీద వాళ్లకి సదభిప్రాయం ఉండదనీ, మరొక ప్రెస్‌కి వెళ్లిపోవచ్చుననీ శ్రుతి ఉద్దేశం. అందుకే అన్న రోజుకు ముందే వర్క్ సిద్ధంచేస్తుంది.

అలాగే వర్క్ విషయంలో ఏ చిన్నపనీ ఆమె మరిచిపోదు. కవర్లు, కార్డులు, కాగితాలు వేస్ట్ చేయడం కూడా ఉండదు. ప్రింట్ చేయడం పూర్తవగానే మేటర్‌ను కుర్రవాళ్లచేత దగ్గరుండి శుభ్రంగా కిరసనాయిలువేసి కడిగించింది.

తను దగ్గరుండి మిషన్స్‌కి ఆయిల్ వేయిస్తుంది. శ్రుతి అంత హడావుడితో వర్క్ పూర్తి చేయడం ప్రసాద్‌కి కాస్త కష్టం కలిగిస్తుంది. నిలబడి అంతపనీ పూర్తిచేయడమంటే అతడి వలన అవదు. మర్నాటినుండీ ఎత్తయిన స్టూల్‌ను తెచ్చుకోవాలని, శ్రుతిలాగే అన్నిపనులూ చేసుకోవాలని అనుకొన్నాడు. శ్రుతి అన్నట్లు పట్టుదల ఉంటే ఏపని అయినా తప్పక వస్తుంది. శ్రుతికి కాస్తయినా శ్రమ తగ్గించాలని అనుకొన్నాడు.

ప్రెస్‌కి తాళంవేశాక ఇద్దరూ ఇంటికి బయలుదేరారు. అలసటగా ఇల్లు చేరిన శ్రుతిని చూస్తే వసుధ తల్లి ప్రాణం ఉస్సూరుమంది. శ్రుతిలాంటి సున్నితమైన ఆడపిల్ల ఇంత శ్రమను ఎలా తట్టుకోగలుగుతోందో అనుకొంది.

చెల్లెలి వీణావాయిద్యం వినగానే శ్రుతిలో సగం అలసట మాయమైపోయింది. స్నానంచేసి, టిఫిన్ తీసికొని ప్రీతి దగ్గరికి వచ్చింది. తనూ ఆమె వీణ వాయిస్తోంటే కాసేపు పాడింది. మేనకోడళ్లిద్దరూ అపరసరస్వతులలాగా సంగీతసాధన చేస్తోంటే సుభద్ర పొంగిపోయింది.

ఇంటికి వచ్చి కాళ్లు కడుక్కొంటున్న భరత్‌ను లక్ష్మమ్మ సాధించింది. "అందరూ అన్నీ నేర్చుకుంటారు. నువ్వు మాత్రం ఏమీ నేర్చుకోవు. ఊరుమీద బలాదూర్‌గా తిరగడం, క్రికెట్ ఆడటం తప్ప మరేంరాదు. మీ అక్కలని చూసైనా నువ్వు సిగ్గుపడవేమిటిరా?" అంటూ ఆవిడ అతడితో దెబ్బలాడింది. భరత్ తువ్వాలుతో మొహం తుడుచుకొని ఆవిడ పక్కలో కూర్చున్నాడు. ఒకసారి లక్ష్మమ్మని తేరిపార చూశాడు.

"ఏమిటీ! ఈరోజు కాళ్లు పీకులు, ముడుకులు నొప్పులు మనకి లేవులాగా ఉంది. మరీ ధాటీగా నన్ను సాధించేస్తున్నావు. చూడు మామ్మా! కొందరు కొన్ని పనులు చేయడానికి సమర్థులు. సపోజ్ నీ విషయమే చూడు. నువ్వు, నేను పరుగెట్టమంటే పి.టి. ఉషలాగా పరుగుపెట్టగలమా? ఆహా... అడిగాను చెప్పు. నీలాగా ధాటీగా, తిట్టిన తిట్టు తిట్టకుండా గంటలు గంటలు ఆవిడ ఎదుటివారిని తిట్టగలదా? అబ్బే... లేదే... ఎవరిరంగంలో వారే నిష్ణాతులు"అని పెద్ద ఉపన్యాసం ఇచ్చాడు.

లక్ష్మమ్మకి ఒళ్లు మండిపోయింది. "ఏం వచ్చినా రాకపోయినా ఈ అడ్డసుడి వాదన మాత్రం బాగా వచ్చును. ఏ మృదంగమో వెళ్లి నేర్చుకోవచ్చునుకదా! అబ్బే... అవేంలేవు. 'కూత కొంచెం పిట్ట ఘనం' అని అన్నారు అందుకే నీలాంటివాళ్లని చూసి" అని మళ్లీ విసనకర్రతో విసరడంలో మునిగిపోయింది.

"మామ్మా! నీ వాయింపులు వినివిని మృదంగం నీముందు బలాదూర్ అని మానేశాను. అయినా నిద్రవస్తున్న దానివి హాయిగా పడుకోక నా గొడవ ఎందుకే? సామెతలైనా సరిగ్గా రావు. 'పిట్ట కొంచెం కూత ఘనం' అనాలి. రాకపోతే శుశ్రూష నా దగ్గరచేయి నేర్పిస్తాను" కొంటెగా బదులిచ్చాడు.

పెద్దవాళ్లతో ఏమిటా మాటలని తల్లి కేకలు వేయడంతో భరత్ లోపలికి వెళ్లిపోయాడు. "మామ్మకి కాస్త అన్నం పెట్టండర్రా ఆకలితో చుట్టలు చుట్టుకొనిపోతోంది." అంటున్న భరత్‌ను ప్రీతి చూసింది.

"మామ్మ పేరు చెప్పి నువ్వు కూడా భోజనం చేసేసి నిద్రపోదామనా? అదేం కుదరదు. నువ్వు మాత్రం చదువుకోవాలి. తర్వాతే భోజనం" అంటూ వీణ తీసికెళ్లి లోపల భద్రపరిచింది ప్రీతి.

"ఏం చేస్తాం? ఇంట్లో ఆడవాళ్ల మెజారిటీ ఎక్కువైపోయింది" అంటూ పుస్తకాలు ముందేసుకొని కూర్చున్నాడు. రాత్రిళ్లు ఉండలేక లక్ష్మ





మ్మ మొదట అన్నం తినేస్తుంది. మిగిలినవాళ్లు తర్వాత తింటారు.

భరత్‌కి ఏమాత్రం ఖాళీదొరికినా లక్ష్మమ్మను ఆటపట్టిస్తాడు. ''పెద్దావిడతో నీకు ఏమిటిరా?'' అని తల్లి కేకలువేస్తే ''బాగుంది నాకేం తమ్ముడా, చెల్లెలా? నేను మాత్రం ఎవరితో ఆడుకోవాలి? ఎవరితో దెబ్బలాడాలి? మామ్మే నాకు అన్నీ'' అంటూ నవ్వుతాడు. కొంటెగా నవ్వే వాడి నవ్వు చూస్తే అందరికీ సరదాయే.

అతడు దేనికీ తడుముకోకుండా జవాబు చెప్పేస్తాడు. అతడి మాటలు విని అందరూ నవ్వుకొంటారు. భరత్‌కి పిల్లులన్నా, కుక్కలన్నా ఎంతో ఇష్టం. ఎన్నోసార్లు పిల్లిపిల్లల్ని పెంచుకొందామని తెచ్చుకొన్నాడు. పిల్లులు పిండం కోరతాయిరా అని లక్ష్మమ్మ కేకలు వేయడంతో వాటిని మానేసి కుక్కపిల్లని పెంచడం మొదలుపెట్టాడు.

అతడు కుక్కపిల్లకి 'టామీ' అని పేరు పెట్టుకున్నాడు. తెల్లటి ఆ బొచ్చుకుక్కపిల్లకి బంతాట నేర్పాడు. దానికి అతడు నేర్పని వన్నెలు, చిన్నెలు లేవు. ఇంట్లో ఉన్న టైమంతా దానితోనే గడుపుతాడు.

భరత్‌కి పెద్దక్క దగ్గరకన్నా చిన్నక్క దగ్గర చనువు ఎక్కువ. ఇద్దరూ కలిసి టిఫిన్ తినడం, కేరమ్స్, ఛెస్ ఆడటం చేస్తారు. శ్రుతి అంటే కొంచెం భయం. తండ్రిపోయాక, మరీ గంభీరంగా ఉండే శ్రుతి అంటే భయం పట్టుకొంది. ఎక్కువగా పలకరించడు.

అయితే శ్రుతికి మాత్రం తమ్ముడంటే ఎంతో ప్రేమ. ప్రీతిలాగా ఆమె బయటకి ప్రకటించలేదు. తీరికలేని జీవితం అవడం మరొక కారణం. కాలేజీనుండి రాగానే తమ్ముడిని ముద్దుపెట్టుకొని, అతడి కబుర్లు వినందే ప్రీతికి తోచదు. తమ్ముడిని స్కూలునుండి రాగానే దగ్గరకు తీసుకొన్నప్పుడు ఒకటే చెమటకంపు వస్తే ''ఏమిటిరా చంటి... స్కూల్లో కూడా మధ్యాహ్నం ఆడేస్తున్నావా? ఇంటికి రాగానే ఫ్రెష్‌గా స్నానమైనా చేసి ఉండవు ముద్దులాడటానికి'' అని విసుక్కొనేది.

భరత్ అంతకన్నా గడుసుగా ''ఏమిటి చిన్నక్కా! కాలేజీనుండి వచ్చి ఫ్రెష్‌గా స్నానం చేసైనా ముద్దులాడవు. చన్నున్నాను? ఒకటే చెమటకంపు'' అని ముక్కుమూసుకునేవాడు.

అందరూ అతడి మాటలకు నవ్వేవారు. ప్రీతి, శ్రుతి అలాగ ఎప్పుడు మాటకిమాట జవాబు చెప్పరు.

భరత్‌కి అలకలు కూడా ఎక్కువే. ఒకసారి భరత్ దసరా ధనుస్సు, బాణం కావాలన్ని పేచీ మొదలుపెట్టాడు. శ్రుతి మర్నాడు కొంటానని చెప్పి మరిపించింది.

మర్నాడు బజారు వెళ్లినా తేవడం మరిచిపోయింది. ఇంక చూడాలి భరత్ పేచీ. అప్పటికప్పుడే వెళ్లి కొనితెమ్మని పేచీ. 'మరిచిపోయాము రా, తర్వాత తెస్తాం' అంటే వినడు. ఎంత బతిమిలాడినా లాభం లేకపోయింది.

''మామ్మ చెప్పిన మిరియాలు మరిచిపోరు. అమ్మ చెప్పిన ఉప్పుడునూక మరిచిపోరు. మీకు కావలసిన గాజులు తెచ్చుకోవడం మరిచిపోరు. నా బాణమే మరిచిపోవాలా?'' అంటూ అలిగాడు. శ్రుతికి ఒళ్లుమండి రెండు వేసింది.

దానితో భరత్ అటక ఎక్కి కూర్చున్నాడు. ఎవరూ చూడలేదు. భానుమూర్తి ఇంటికి వచ్చాక ఇల్లంతా వెతికారు. భరత్ ఎక్కడా కన్పించలేదు. భరత్ స్నేహితుల ఇంటికి కూడా వెళ్లి అడిగారు. వాళ్లు తెలియదన్నారు. అందరికీ నీరసం వచ్చేసింది. లక్ష్మమ్మ శ్రుతిని నానాతిట్లు తిట్టింది.

చివరికి భానుమూర్తే ఒకవేళ కొడుకు అటక మీద ఉన్నాడేమో అని లైటువేసి, అటక ఎక్కాడు. భరత్ నిద్రపోతూ కన్పించాడు. వాడి ఒంటిమీదనుండి చెమటలు కారుతున్నాయి. కొడుకును ఆ స్థితిలో చూసేసరికి భానుమూర్తికి కడుపులో దేవినట్లయింది. కొడుకుని నిద్రలేపి, క్రిందకి తీసుకొని వచ్చి స్నానం చేయించి అప్పటికప్పుడు బజారుకు తీసుకెళ్లి, బాణాలు కొనిచ్చి తీసికొచ్చాడు.

అప్పటినుండి భరత్ కనబడకపోతే అందరూ బీరువా వెనకాల, మంచంకింద, అటక మీద వెదుకుతారు. అవన్నీ అతడికి అలకాగృహాలే. ప్రసాద్ వస్తే అతడికి బోలెడు కాలక్షేపం. ఎన్నో కబుర్లు ప్రసాద్‌తో చెప్తాడు.

ఒకసారి ప్రసాద్, అతడి స్నేహితుడు

పందెంలో ఓడిపోయినందుకు భరత్‌ను సినిమాకి తీసుకెళ్ళమన్నారు. భరత్ ఒప్పుకొని, వాళ్లని బయలుదేరతీశాడు. తీరా సినిమాహాలు వచ్చాక "ఇదిగో సినిమాకి తీసుకెళ్లాలన్నారు. తీసుకొచ్చాను. నావంతు అయిపోయింది" అని తేల్చేశాడు. ప్రసాద్ అదేమిటని వాదిస్తే "సినిమాకి తీసుకెళ్లాలన్నావు కానీ టిక్కెట్లు కొని చూపించమని అన్నావా? అనలేదు కనుక నువ్వే టిక్కెట్లుకొని చూపించు" అంటూంటే అతడి తెలివితేటలకి నవ్వుకొని వాళ్లే టిక్కెట్లు తీశారు. ఇప్పటికీ వాళ్లు ఆ విషయం చెప్పుకొని నవ్వుకొంటారు.

అల్లరిలో ఎంత ఘటికుడో చదువులో కూడా అంతే దిట్ట. ఎవ్వరికీ ఫస్టుమార్కు పోనివ్వడు. అలాగని ఎక్కువ కష్టపడడు. వాడి తెలివితేటలకు ఇంకాస్త కష్టపడితే ఎంత బావుంటుందో అని అక్కలనుకొంటారు.

వాడు బట్టలు మాపేస్తే అక్కలు ఇద్దరూ ఒప్పుకోరు. ఎక్కువగా వాడి బట్టలు ప్రీతే ఉతుకుతుంది. పూటకో డ్రెస్ వాడుతాడని గోలపెడుతుంది. ఒక్కొక్కసారి కోపం వస్తే ప్రీతి ఉతకనని మొండికేస్తుంది. భరత్ ఇంక బ్రతిమాలాడటం మొదలుపెడతాడు.

"అసలు ఇద్దరు అక్కల తర్వాత నేను ఎందుకు పుట్టానో తెలుసా? హాయిగా నా పనులు అక్కలు చేస్తారనే" అంటూ దబాయిస్తాడు. ప్రీతి అయినా లొంగదు. "నా తల్లివికదూ! బంగారు బొమ్మవుకదూ! నా మంచి ప్రీతక్కవికదూ! ఇప్పుడు నా బట్టలన్నీ ఉతికేస్తుందట" అంటూ ఆమెను ముద్దులాడతాడు.

ప్రీతి వస్తున్న నవ్వునాపుకొని తల త్రిప్పుకొంటే ఇంక అప్పుడు సాధింపు మొదలెడతాడు, "పోనీ లేమ్మా! నేనే ఉతుక్కొంటాను. కాస్త నవ్వు. అంతదానికి మొహం తిప్పుకోవడం ఎందుకు? అసలు నీకు నేను కాకుండా ఏ చెల్లెలో పుట్టివుంటే తెలిసేది" అని ఉక్రోషంగా అనేవాడు.

"ఏం తమ్ముడైతే ఇప్పుడు నాకేం లాభం కలుగుతోంది? చెల్లి అయినా ఇంతేకదా!" అని ప్రీతి అంటే వాడు ఒప్పుకోడు. "ఆహా... అలాగా చెల్లెలైతే నీతో అన్నింటికీ వంతు వచ్చేది. నీ గొలుసు, ఉంగరం అన్నీ చచ్చినట్లు దానికి ఇవ్వాలి. అసలు అప్పుడు నీకు ఉంటాయేమిటి? బట్టలు కూడా నీవు అది ఉంటే తగ్గించుకోవలసివచ్చేది. నీవన్నీ అది హాయిగా, చక్కగా తొడుక్కొంటుంది. అదే నేను కనుక వాటికి వంతురాకుండా బిస్కట్లతో, చాక్లెట్లతో సర్దుకొంటున్నాను" అని తల ఎగురవేసి ఉడుకుమోతుతనంతో అంటూంటే ప్రీతి నవ్వునాపుకోలేక, తమ్ముడిని దగ్గరకి తీసుకొని ముద్దులాడేది. అతడి పనులు చేసిపెట్టేది.

శ్రుతి ఒకనాడు ప్రెస్‌నుండి వస్తోంటే వంశీకృష్ణ కన్పించాడు. అతడిని శ్రుతి మొదట చూడలేదు. అతడే చూసి నవ్వుతూ పలకరించాడు. "మీ ప్రెస్ బాగానే రన్ అవుతోందని నాన్నగారు చెప్పారు. ఏమైనా మీరు అసాధ్యులు" అని చనువుగా అంటూంటే శ్రుతి నమ్మలేనట్లు అతడిని చూసింది. పెళ్లయ్యాక అతడిలో కాస్త బెరుకుతనం పోయినట్లనిపించింది. కొద్దిగా ఒళ్లు వచ్చినట్లనిపించింది.

స్కూటర్ ఆమె పక్కగా నడిపిస్తూ, ఇంటి విషయాలు అడిగి తెలుసుకొన్నాడు. ఆమె వద్దన్నా వినకుండా కూల్‌డ్రింక్స్ తీసుకొని ఆమెకు ఇచ్చాడు. "మా పెళ్లిలో మీరు అద్భుతంగా పాడారు. చాలా థాంక్సు" అంటూంటే శ్రుతికి ఆశ్చర్యం వేసింది. వాళ్ల పెళ్లైన ఇన్నాళ్లకా అతడు కృతజ్ఞతలు చెప్పడం, ఏదో సామెత చెప్పినట్లు దొంగపడ్డ ఆరునెలలకి కుక్క అరచినట్లుంది. అలాగుందేమిటబ్బా అనుకొంది.

ఆమె కళ్లల్లోని అభిప్రాయం తెలిసిందో ఏమిటో "ఏదీ ఈమధ్య మీరు మా ఇంటికే రావడంలేదు. మరి ఎలా, ఎప్పుడు నేను చెప్పగలను?" అని అంటూంటే శ్రుతి కళ్లు వాల్చుకొంది. ఇంకా అతడు ఏం మాట్లాడతాడో అన్నట్లు సంభాషణని తప్పిస్తూ "వీణగారు బాగున్నారా? మీరిద్దరూ కలిసి మా ఇంటికి రండి" అని పిలిచింది.

"ఆ... బాగానే ఉంది. ఆవిడకేం. మహిళామండలులు, సినిమాలు, ఫ్రెండ్స్‌తో బోలెడు కాలక్షేపం. వస్తాను. ఉండండి" అంటూ వెంటనే వెళ్లిపోయాడు. ఏమిటితడి స్వభావం? చనువుగా తనంతటతను పలకరించి, భార్య గురించి ఎత్తగానే పారిపోయాడు అని శ్రుతి మనసులో అనుకొంది. ఏమైనా అతడిలో




మార్పు వచ్చినట్లు అన్పించింది శ్రుతికి.

వీణ స్వభావం శ్రుతికి బాగానే తెలుసు. పెళ్లిలో అయితే కొత్త అనుకొంది. కానీ ఒకసారి రాఘవరావుగారి కోసం పనివుండి వెళితే పుల్ల విరుపుగా మాట్లాడింది. డబ్బుందనే అహంకారం ఆమెలో కన్పిస్తుంది. అంతేకాదు ఎదుటివాళ్లను తేలికగా చూస్తుంది. ఆమె సంభాషణవలన తనరాక అంతగా ఇష్టం లేదని కూడా గ్రహించింది. కానీ కొన్ని సలహా లకి ఆయన దగ్గరకు రాక తప్పదు.

శ్రుతికి ఎవరినీ బాధపెట్టడం ఇష్టం ఉండ దు. తీరికలేని తన దినచర్యలో ఇవన్నీ పట్టించుకోవడానికి తీరిక ఎక్కడిది? శ్రుతి వెళ్ల కపోతే రాఘవరావు వారానికి రెండుసార్లయినా వాళ్ల ఇంటికి వెళ్లి, మాట్లాడివస్తారు. శ్రుతి ఇంట్లో లేకపోతే ప్రెస్‌కి వెళ్లి అయినా చూసివ స్తారు.

ఆయన వస్తే శ్రుతి చేస్తున్నపని ఏదైనాసరే మానేసి, ఆయన దగ్గర వచ్చి కూర్చుని ఆయన చెప్పేవన్నీ శ్రద్ధగా వింటుంది. తన వృత్తిలోని కష్టం, సుఖం అన్నీ ఆయనకి చెపు తుంది. ఆయనకు శ్రుతిని చూస్తే సంతోషం. వృత్తిలో నిలద్రొక్కుకొంటోందని అభిమానం.

వంశీకృష్ణ ఇంటికి వెళ్లాక తండ్రితో శ్రుతి కన్పించిందని చెప్పాడు. ఆయన శ్రుతిని మెచ్చుకొంటూ ఆడపిల్ల అయినా చక్కగా, బాధ్యతగా ఉంటుందనీ, ఇల్లు చక్కదిద్దు కొంటోందనీ గొప్పగా చెప్పారు. శ్రుతి తెలివితే టల గురించి, అవగాహన గురించి ఆయన చెప్పుకుపోతూంటే వీణకి ఒళ్లుమండిపో యింది. డైరెక్టుగా మామగారికి ఏమీ అనలేక మొహం గంటుపెట్టుకొని కూర్చుంది.

భోజనాలయ్యాక వంశీకృష్ణ తన గదిలోకి వెళ్లాడు. వీణ అతని వెనకాలే దూకుడుగా గదిలోకి వచ్చింది. "మీ తండ్రీకొడుకులకు వేరే ఏం పనేలేదా? మాట్లాడుకోవడానికి ఇంక విషయాలే ఉండవా? ఏదో ఆకాశంనుండి ఊడిపడ్డట్లు ఆవిడని ఎప్పుడూ ఎందుకు పొగుడుతారు?" అంటూ దెబ్బలాడింది. వంశీ కృష్ణ తల దువ్వుకుంటూ ఏమీ మాట్లాడలేదు.

"మీ నాన్నగారితో అయితే గంటలు గంట లు కబుర్లు చెపుతారు. నేను అడిగేది విన్పి స్తోందా?" అని అడిగింది అసహనంగా. "విన్పి స్తోంది. విన్పించకేం? జవాబు చెప్పడానికి ఏం ఉంది?" అంటూ ఆమెవైపు తిరిగాడు. కో పంతో ఆమె మొహం ఎర్రబడింది.

"శ్రుతి గురించి ఈ ఇంట్లో విన్పిస్తే నేను ఊరుకోను" అంటున్న ఆమెను ఒక్కక్షణం పరిశీలనగా చూశాడు. "వీణా! నువ్వు అకార ణంగా శ్రుతిని ద్వేషిస్తున్నావు. అంతే. పడు కొందాం. పద" అంటూ మంచంవైపు నడిచా డు. "నాకు తలనొప్పిగా ఉంది. మీరు పడు కోండి" అంటూ కుర్చీలో కూర్చున్న భార్యవైపు ఒకసారి చూసి, వేరొక ప్రక్కకి తిరిగి పడుకొన్నా డు.

అతడికి మనసు ఉసూరుమంది. పెళ్లంటే అతడికి పెద్దగా ఏవో ఆశలు లేకపోయినా ప్రశాంతంగా బతకవచ్చునని అనుకొన్నాడు. తండ్రికి, తనకి ఆలన, పాలన చూసేవాళ్లు వస్తారని ఆశపడ్డాడు. తండ్రి మాటని అతడు ఏనాడూ కాదనలేదు. తండ్రికి నచ్చిన సంబంధమని, వంకపెట్టడానికి ఏం ఉందని అనుకొని చేసుకొన్నాడు. అతడి ఊహలే తారు మారయ్యాయి.

ఇప్పుడు మాత్రం అనుకొంటున్నాడు. పెళ్లి చేసుకొనేటప్పుడు ఒకరిగూర్చి మరొకరు తప్పక తెలుసుకొని మరీ జీవితంలోకి ఆహ్వానించాలి అని.

అతడికి తమ శోభనంనాటి విషయం గు ర్తుకు వచ్చింది. గదిలో తనని దగ్గరగా తీసుకో బోయిన భర్తను వీణ అడిగిన మొదటివి షయం శ్రుతి గురించి. "మీరు శ్రుతిని ఎందుకు పెళ్లి చేసుకోలేదు?" అని ఆమె అడిగేసరికి అతడు బిత్తరపోయాడు. తను గాని, తండ్రిగాని ఏనాడూ శ్రుతి గురించి అనుకోలేదు. పెళ్లయిన వెంటనే అలా అడుగు తున్న భార్య మనస్తత్వం అతడికి విచిత్రంగా అన్పించింది. వీణకి అసలే అసహనం ఎక్కువ.

భర్త జవాబు చెప్పకుండా ఆలోచనలో పడే టప్పటికి ఆమెకి ఒళ్లుమండింది. "మాలాగా కట్నకానుకలు ఇవ్వలేరని మానేశారా?" అని మళ్లీ మరొక బాణం గుచ్చుతూ అడిగింది.

వంశీకృష్ణకి జవాబు చెప్పక తప్పలేదు. నవ్వు తూ "ఇంతకీ నువ్వు నన్ను ఇష్టపడే చేసుకొన్నావా?" అని అడిగాడు. ఆ విషయాన్ని తేలికగా తీసిపారేయాలని అతడికన్పించింది.

"మీలో వంకపెట్టడానికి నాకు ఏమీ కన్పించలేదు" అంటూ నిజాయితీగానే ఆమె జవాబు చెప్పింది. "నా విషయమూ అంతే. అయినా ఇంత అందమైన భార్యను పక్కన ఉంచుకొని, మొదటిరాత్రి ఈ కాలక్షేపం కబుర్లేమిటీ?" అంటూ ఆమెను దగ్గరకు తీసుకొన్నాడు. వీణ మనసు అతడి మాటలతో కాస్త శాంతించింది.

నిజంగానే వంశీకృష్ణకి ఆడపిల్లలంటే భయం, బెరుకు. అతడికి తండ్రి గురించి, తన చదువు గురించి తప్ప ఏమీ పట్టదు. భార్యతో ఆ రాత్రి తల్లిపోయిన తర్వాత తండ్రి తనని ఎంత కష్టపడి పెంచాడో, ఎలా తన కోసం పెళ్లి మానుకొన్నాడో చెప్పాడు. తండ్రిని విడిచి తాను ఉండలేనని, ఆయనని కంటికి రెప్పలాగా చూసుకోవడం వీణ బాధ్యతని, అంతకుమించి తనకి ఇంక ఏమీ అక్కరలేదని చెప్పాడు.

వీణకి బరువులు, బాధ్యతలు అంటే చిరాకు. అసలు పదిమందిలేని పాడిగా ఉన్న కుటుంబమని ఆమె పెళ్లికి ఒప్పుకొంది. వంశీకృష్ణ సరదాగా ఇంకే కబుర్లు చెప్పకుండా, తన ఇంటి గురించి, తండ్రి గురించి చెప్పడం కొంత విసుగు తెప్పించింది. అయినా అతడి దగ్గర ఇంకా చనువు ఏర్పడలేదు కనుక బయటపడి ఏమీ అనకుండా ఊరుకొంది.

రోజులు గడిచేకొద్దీ వీణ అంటే ఏమిటో వారికి బాగా తెలిసింది. రాఘవరావు వీణ తనంతటతానే వంటమనిషిని మాన్పించి, వంట బాధ్యత, ఇంటి బాధ్యత చేపడుతుందని ఆశపడ్డారు. కానీ వీణ అసలు ఆ ప్రయత్నం చేయలేదు. ఆయన మాత్రం కొత్త కోడలుని ఏమనగలరు? చిన్నపిల్ల. తనంతట తానే తెలుసుకొంటుందని అనుకొన్నారు. అదే ఆయన చేసిన పొరపాటైంది.

అసలు వీణ తన గదిలోనే ఎక్కువ సమయం గడుపుతుంది. కోడలు వస్తే ఇల్లు సందడిగా ఉంటుందని, కొడుకు, కోడలు తను సరదాగా ఉండవచ్చని అనుకొన్న ఆయన ఆశలు ఏమీ నెరవేరలేదు. వీణ స్వభావం ఆయనకేమీ అర్థమవలేదు.

భర్త ఉన్నంతసేపూ కాస్త ఇంట్లో అటూ ఇటూ తిరుగుతుంది. మామగారితో, భర్తతో కలిసి తప్పనిసరిగా టిఫిన్ తింటుంది. అతడు ఉద్యోగానికి వెళ్లిపోగానే తన గదిలోకి వెళ్లిపోతుంది.

వంటావిడ వచ్చి అడిగేవరకూ ఆపూట ఏంచేయాలో తనంతట తను చెప్పదు. ఆయన భోజనం చేసే సమయానికి పగలు రాదు. తను వేరే వడ్డించుకొని తింటుంది. ఇవన్నీ ఆయనకి కష్టంగానే ఉన్నాయి. కొడుకు బాధపడతాడని ఆయన ఏమీ అనరు. టి.వి. చూడటం, పుస్తకాలు చదువుకోవడం మాత్రమే ఆమె పని.

వీణకి భర్త, మావగారు అంతసేపు కబుర్లు చెప్పుకోవడం నచ్చదు. అతడు మాత్రం ఇంట్లో ఉంటే తండ్రిని వదలడు. వంశీకృష్ణతో ఎవరు సరదాగా మాట్లాడినా ఆమెకి నచ్చదు. భార్యలో అసూయ ఎక్కువే అని అతడు ఎప్పుడో గ్రహించాడు. అతడు మాట్లాడకపోయినా, శ్రీవల్లి ఇక్కడికి వస్తే, బోలెడు కబుర్లు తనంతటతనే చెపుతుంది. అక్కగారు రుసరుసలాడినా ఆమె పట్టించుకోదు. ఆమె వస్తే ఇంట్లో అందరికీ తోచదనే భయం పోతుంది.

చివరికి వీణతో తండ్రిపనులు తానే చూడమనీ, ఆయన పెద్దవారనీ స్వయంగా తండ్రికి వడ్డించమనీ వంశీకృష్ణ చెప్పేవాడు.

"వంటామె ఉన్నారుకదా! మీ నాన్నగారికి ఆవిడ కొత్తా?" అనే భార్యకి ఏం చెప్పాలో అతడికి తోచేదికాదు. "వంటామెను మాన్పించి నువ్వు వంటచేస్తే బావుంటుంది" అన్న అతడి మాట ఆమె వెంటనే కొట్టిపారేసింది.

"డబ్బులేనివాళ్లు కష్టపడాలి. భగవంతుడి దయవలన తమకి బోలెడు డబ్బు వుంది. హాయిగా సుఖపడక వంటని, పనని ఎందుకు బాధపడాలి?" అనే మాటలు భార్య నోటివెంట వింటూంటే అతడికి భయం వేసేది. ఇంకా గట్టిగా అంటే అసలు వంటేరాదని మొండికే





సింది. ఇవన్నీ ఆలోచిస్తూ ఎప్పటికో నిద్రపోయే వాడు.

భరత్ పేచీపెడితే శ్రుతి, ప్రీతి సినిమాకి బయలుదేరారు. సినిమాలో తమముందు కూర్చున్న జంట ఒకరిపై ఒకరు వాలిపోవడం, ఒకటే నవ్వుకోవడం, కబుర్లు చెప్పుకోవడం శ్రుతి కంటబడ్డాయి. వచ్చి వచ్చి ఇక్కడే తమకి సీట్లు నెంబరింగ్ రావాలా-అని బాధపడింది. తమ్ముడు, చెల్లి ఎదురుగా వాళ్లు అలాగా ఉండటం ఆమెకి నచ్చలేదు.

ఇంటర్వెల్‌లో లైట్లు వెలిశాయి. ఆ అబ్బాయి మృదువుగా తన ఒళ్లో ఉన్న అమ్మాయి చేతిని తీసి, బయటకు వెళ్లాడు. ఆ అమ్మాయివైపు చూసిన శ్రుతి ఉలిక్కిపడింది. ఆ అమ్మాయి మరెవరో కాదు స్వప్న.

శ్రుతిని చూసి స్వప్న కూడా ఉలిక్కిపడింది. తెచ్చి పెట్టుకొన్న నవ్వుతో పలకరించింది. ఆ అబ్బాయి బయటనుండి సినిమా మొదలుపెట్టాక వచ్చాడు. అతడు పూర్వపు చనువు చూపబోతే స్వప్న అతడితో ఏదో చిన్నగా మాట్లాడటం, అతడు వెనుకకు తిరిగి చూడటం శ్రుతి గమనించింది.

సినిమా అయ్యాక అతడిని శ్రుతికి పరిచయం చేసింది. "సారథి శ్రుతీ! ఇతడు బి.ఇడి. అవుతున్నాడు" అని చెప్పి "నీకు ఎప్పుడూ చెపుతూ ఉంటానే మా స్నేహితురాలు శ్రుతి" అంటూ పరిచయం చేసింది. సారథి, శ్రుతి ఒకరికొకరు నమస్కారం చేసుకొన్నాక "ఇంక మనం వెడదామా" అంటూ అతడు స్వప్నను తొందరపెట్టి బయలుదేరదీశాడు. వాళ్లిద్దరూ బండిమీద వెళుతోంటే శ్రుతి అయోమయంగా చూస్తూ నిలబడిపోయింది.

మర్నాడు స్వప్న ఎలాగో తన దగ్గరకు వస్తుందని తెలిసినా శ్రుతికి చెప్పలేని అసంతృప్తిగా ఉంది. ఈమధ్య స్వప్న ఇదివరకటిలాగా ఎందుకు కలవలేకపోతోందో బాగా అర్థమైంది. చాలా రోజులకి సినిమాకి వెళ్లామన్న తృప్తి కూడా ఆమెకి ఆరోజు కలగలేదు. స్వప్న అలంకరణ, అతడితో ఆ అమ్మాయి చనువు, అతడితో ఉన్నప్పుడు కళ్లల్లో కనబడ్డ మెరుపు ఇవే శ్రుతికి భయాన్ని కలిగిస్తున్నాయి.

స్వప్నకి తండ్రంటే భయంలేదు. సవతితల్లి ఎప్పుడూ దేనికో ఒకదానికి స్వప్నని సాధిస్తూనే ఉంటుంది. కనుక ఆమె అంటే లెక్కలేదు. తండ్రి చేతకానివాడిలాగా ఆవిడకి భయపడతాడని స్వప్నకి ఆయనంటే కోపం. స్వప్నకి ఇల్లంటే ఎప్పుడూ గిట్టదు.

స్వప్న సవతి తల్లికి ముగ్గురూ కొడుకులే. అయినా ఆవిడకి స్వప్న అంటే పడదు. ఈ పిల్లకి పెళ్లి, పేరంటం చేస్తే తన కొడుకులకి ఏమీ ఇంక మిగలదని ఆవిడ ఉద్దేశం. అందుకే స్వప్నని నిరంతరం సాధించి తృప్తిపడుతుంది. ఈ వాతావరణంలో స్వప్న రాటుతేలిపోయి ఎవరినీ ఖాతరు చేయడం మానేసింది. ఆమె దారి ఆమెది. ఎవరితోనూ ఎక్కువ మాట్లాడదు.

స్వప్నది అసలే చురుకైన స్వభావం. ఏ తప్పటడుగు ఆమె జీవితంలో వేస్తుందో అని శ్రుతికి భయం. ఏమైనా స్వప్నని గట్టిగా హెచ్చరించడం తన విధని అనుకొన్నాక మనస్సుకి తృప్తికలిగింది.

మర్నాడు శ్రుతి ప్రెస్‌పని చూసుకొంటూంటే భరత్ హడావుడిగా వచ్చాడు. భోజనం చేశావా అని అడిగింది శ్రుతి, ఆరోజు పని ఎక్కువగా ఉండి, ఆమె ఇంకా భోజనానికి వెళ్లలేదు. భరత్ లేదని తల ఊపాడు.

తమ్ముడు డబ్బుకోసం వచ్చాడేమో అనుకొని అడిగింది. భరత్ డబ్బుకోసం కాదనీ, అత్తయ్య, నాన్నమ్మ, అమ్మ అందరూ ఎందుకోగానీ ఏడుస్తున్నారనీ అక్కని ఇంటికి రమ్మనీ అడిగాడు. శ్రుతి వెంటనే వాడిని తీసుకొని ఇంటికి బయలుదేరింది. వాడు వాళ్ల ఏడుపుకి కారణం ఇదని చెప్పలేకపోయాడు.

లక్ష్మమ్మ ఏడుపు ఇంటి బయటికే వినిపించింది. ఆమెను చూస్తూనే మరింత గట్టిగా ఏడ్చింది. "ఏమయింది మామ్మా! ఏమయిందో చెప్పు" అంటూ శ్రుతి బుజ్జగింపుగా అడిగింది. సుభద్ర ముక్కు చీదుతూ ఏడుస్తోంది.

"శ్రుతీ! మీ నాన్న బతికి ఉండగా అన్నగారిని అక్కని ఎంత బాగా చూసుకొన్నాడే. ఈరోజు వాడు వాడి పిల్లలు మీ పెదనాన్నకి బరువయ్యారు. బంధువులంటే మీ నాన్న



ఎంత డబ్బు ఖర్చుపెట్టేవాడే. ఆ విశ్వాసం అయిన వాళ్ళకి లేదు. చివరికి ఈరోజు వాడు అందరికీ తేలికైపోయాడు'' అంటూ ఏడ్చింది.

''అత్తయ్యా! నువ్వయినా అసలు విషయం చెప్పు. ఈ విషయాలన్నీ ఇప్పుడు ఎందుకు వచ్చాయి? నాన్నని ఎవరైనా ఏమైనా అన్నారా? మన ఇంటికి అసలు ఎవరు వచ్చారు?'' అంటూ శ్రుతి సుభద్రను గట్టిగా అడిగింది. వసుధ మొహం ఏడ్చి ఉబ్బిపోయింది. సుభద్ర మౌనంగా శ్రుతి చేతికి ఒక కవరు ఇచ్చింది.

అది భానుమూర్తి మాసికాలు పెట్టడం తనకి కష్టంగా ఉందనీ, తన భార్యకి ఒంట్లో నీరసంగా ఉండి చెయ్యలేకపోతోందనీ రామచంద్రం రాశాడు. వంటబ్రాహ్మణులు దొరకడంలేదని, కనుక విజయనగరంలోనే మిగిలినవి పెడతానని, అక్కడైతే మీరందరూ ఉన్నారుకదా అని రాశాడు.

తన నిర్ణయం కష్టం కలిగిస్తే క్షమించమని రాశాడు. శ్రుతికి మనసంతా బరువుగా అయింది. తనని తాను సంభాళించుకోవాలని చూసింది. మనిషికి ప్రాణం ఉన్నంతసేపే కాబోలు ఈ మమకారాలు, బంధాలు. తర్వాత ఎవరికి ఎవరూ ఏమీ కాకుండాపోతారు కాబోలు అనుకొంది.

''వాడు అసలు మనిషా? మనిషైతే అలాగ రాస్తాడా? పెళ్ళాం చేతిలో వాడు కీలుబొమ్మ. ఆడమంటే ఆడతాడు. గెంతమంటే గెంతుతాడు. స్వంత తమ్ముడు పోతే మాసికాలు పెట్టలేడా? ఉత్తరం రాసేస్తాడా? వాడసలు అన్నం తింటున్నాడా?'' అంటూ లక్ష్మమ్మ కోపంతో, బాధతో పెద్దకొడుకుని దుమ్మెత్తిపోసింది.

''ఇప్పుడు ఏమైంది మామ్మా! నాన్న మాసికాలు ఇంక మనకి బరువా? ఆయనకోసం ఏదీ చేయలేము?'' అంటూ శ్రుతి ఆవిడని ఓదార్చింది. లక్ష్మమ్మ బాధ అది కాదు. కోడలు, పిల్లలు తండ్రి మాసికాలు ఎదురుగుండా అవుతూంటే గుండెదిటవు చేసుకోలేరని ఆవిడ ఉద్దేశం. అసలే వసుధ భర్తపోయాక జీవచ్ఛవంలాగ బతుకుతోంది. వారికి సాయం ఇప్పుడు మంత్రాలు, బ్రాహ్మణులు, భోజనాలు కళ్ళ ఎదురుగా అవుతోంటే ఎలా తట్టుకొంటుంది?

పెద్దకొడుకు ఇవన్నీ ఆలోచించవద్దూ? భార్య రాయమంటే వెనుకా, ముందూ చూడకుండా రాయడమేనా? ఇవన్నీ లక్ష్మమ్మ చెపుతూ బాధపడితే శ్రుతి గుండె పిండినట్లయింది. లక్ష్మమ్మ కోడలిని దగ్గరకి తీసికొని బాధపడింది. ఏనాడూ నోరు విప్పని ఆమె అంటేనే ఆవిడకి ఇప్పుడు బెంగ. శ్రుతే వాళ్ళని సమాధానపరిచింది. కవరు తీసి దాచింది.

''ఏం చేస్తాం మామ్మా! మనుమలం రాళ్ళమైపోవాలి. అలాగైతేనే బతకగలం. ఏదో ఇంతవరకూ చేశారు. పెదనాన్నకి ఇంక ఏం ఇబ్బందులున్నాయో?'' అంటూ శ్రుతి అనగానే లక్ష్మమ్మ ఒంటికాలిమీద లేచింది.

''ఇబ్బందులా? పాడా? అయిదు నెలలు దాటితే సంవత్సరీకాలు పెట్టాలి. అంత ఖర్చు వాడికి భరించడం ఇష్టంలేదు. ఆవిడా ఒప్పుకోదు. అందుకే ఇప్పటినుండీ తప్పుకొంటే ఏ గొడవాలేదు. వాడి స్వభావం అదే'' అంటూ లక్ష్మమ్మ తేల్చేసింది.

మేనకోడలు చెప్పాక సుభద్రకీ ఆ ఆలోచనే వచ్చింది. అన్నగారిని వచ్చి నాలుగు రోజులలో ఉన్న మాసికం ఇక్కడే పెట్టవలసినదిగా రాయమని శ్రుతికి చెప్పింది. భరత్‌కి ఒడుగైపోయిఉంటే ఈ సమస్య ఉండేది కాదు అని అనుకొంది. అంతవరకూ ఇది తప్పదు. శ్రుతి ఉద్దేశంకూడా అదే.

తన తండ్రి ముగ్గురు బిడ్డల్ని కన్నాడు ఆయనకేంలోటు? మాసికం అవనీ, తద్దినం అవనీ ఏడుస్తూ ఎందుకు వచ్చింది రా అన్నట్లు పెట్టకూడదు. కనుక పెదనాన్నకి తను ఆరోజే ఉత్తరం రాస్తానని తల్లికి చెప్పింది.

శ్రుతి మళ్ళీ ప్రెస్‌కి వెళ్ళిపోతుందని సుభద్ర అందరినీ భోజనాలకి లేవదీసింది. ఏదో నాలుగు మెతుకులు తిని ప్రెస్‌కి వచ్చిన శ్రుతిని, ప్రసాద్ ఏమైందని అడిగాడు. శ్రుతి అసలు సంగతి చెప్పాక ఆశ్చర్యపోయాడు. శ్రుతి ఒక కవరు తీసికొని పెదతండ్రికి రాసింది. ఇన్నాళ్ళూ అతడు ఆ శ్రమనంతా పడినందుకు కృతజ్ఞతలు చెపుతూ, ఇంక ముందు ఇక్కడే పెట్టవచ్చునని, ఆయనని తప్పక రెండు రోజులు ముందు రమ్మని రాసివేసింది.

రామచంద్రం ముందురోజే ఎలమంచిలి



నుండి వచ్చాడు. కొందరు తాము చేసిన పని తప్పని తెలుసుకొంటే సిగ్గుపడతారు. రామ చంద్రానికి ఆ అలవాటులేదు. ఏమీ జరగనట్లే వచ్చాడు. అందరినీ పలకరించాడు నవ్వుతూ. లక్ష్మమ్మ మాత్రం కొడుకుతో ముభావంగానే ఉంది.

ఉత్తరం అలా రాసినందుకు తల్లి అతడిని నాలుగు దులిపేసింది. తన భార్యకి బి.పి. ఎక్కువైందనీ, ఏ పనీ చేయలేకపోతోందనీ, మగవాడైన తనవలన ఏమవుతుందనీ అతడు దెబ్బలాడాడు. కోడలుకి ఒంట్లో బాగుండకపోతే పనులు జరగడం లేదా? వంటవాళ్ళు కరువ య్యారా? అని లక్ష్మమ్మ వాదించింది. శ్రుతి ఇంట్లో కన్పించకపోయేసరికి అతడు ఆమెగూ ర్చి అడిగాడు.

తండ్రి ప్రెస్ శ్రుతి నడుపుతోందని తెలిసి రామచంద్రం అదిరిపోయాడు. ఇంట్లో ఉన్న తన ముగ్గురు ఆడపిల్లలూ బట్టలకోసం, నగల కోసం వేధించటం తప్ప ఏ ఒక్కపనీ స్వంతంగా చేయరు. వాళ్ళ బద్ధకం అతడికి ఆక్షణంలో వద్దన్నా గుర్తుకి వచ్చి, నిట్టూర్చాడు.

అసలు ఆడపిల్లల్ని ఏమన్నా తన భార్య ఒప్పుకోదు. ఉదయం ఏడైనా పక్కలమీద నుండి లేవరు. అన్ని పనులకీ పనిమనిషిమీద ఆధారపడటమే. డబ్బంటే లక్ష్యం లేదు. తండ్రి అంటే భయం ఉన్నా తల్లివలన పాడైపోతున్నారు.

భార్య కామేశ్వరికి అక్కరలేని ఆడంబరాలు ఎక్కువ. పని చేసుకొనే ఖర్మ తన పిల్లలకి లేదని ఆమె ఉద్దేశం. తన బిడ్డలు రాజకుమా ర్తెలు. వాళ్ళని అలాగే అపురూపంగా పెంచు తోంది. చూసినవన్నీ కొనడం, ఫ్యాషన్‌గా అలంకరించుకోవడం, ఏదో చదువుతున్నామ న్నట్లు కాలక్షేపంగా చదవడం చూస్తే అతడికి కోపం. ఆఖరుపిల్ల కాస్త నయం. చదువైనా కాస్త శ్రద్ధగా చదువుతోంది.

భార్య నోరు చూస్తే అతడికి భయం. ఆవిడ కి భర్తకన్నా అతడి సంపాదన ఎక్కువ ఇష్టం. భార్య పెత్తనానికి ఎదురుచెప్పలేక అలాగే అలవాటుపడ్డాడు. ఇలాగ ఎప్పుడైనా బయటకి వచ్చినప్పుడు తనకుటుంబ తీరు గుర్తు వచ్చి బాధపడతాడు.

శ్రుతి మర్నాటికి కావలసిన కూరలన్నీ తెచ్చి, ముందు రోజే సిద్ధం చేసింది. బ్రాహ్మ ణులకి వెళ్ళి చెప్పి వచ్చింది. శ్రుతి ఇంటికి వచ్చాక తనతో బాగా దెబ్బలాడుతుందనుకొ న్నాడు. దానికి విరుద్ధంగా ఆమె నవ్వుతూ అతడిని పలకరించింది. మొహం ఎంతో అల సటగా ఉన్నా, దాన్ని పారద్రోలుతూ శ్రుతి పెదవులపై చిరునవ్వు వెలుగుతోంది.

కాళ్ళు కడుక్కొని వచ్చి పెదతండ్రి దగ్గర కూర్చుని పేరు పేరున అందరి గూర్చి అడి గింది. భరత్ స్కూలునుండి వచ్చి ఆయన వీపుమీద వాలాడు. రామచంద్రానికి ఒక్క క్షణం ఒళ్ళు గగుర్పొడిచింది. అచ్చమైన ఆ అనురాగానికి అతడు ఒక్కక్షణం నివ్వెరపో యాడు.

పిల్లలందరూ దగ్గర కూర్చుని భోజనాలు చేస్తోంటే, అతడు వాళ్ళతో కలిసి ఫలహారం చేశాడు. చంద్రవంకలాగ చిక్కిపోయిన మరద లిని చూసి బాధపడి, బెంగపడవద్దనీ, ధై ర్యంగా ఉండమనీ చెప్పాడు. మాసికం వంట లక్ష్మమ్మ, సుభద్ర పూర్తిచేశారు. శ్రుతి వంటవా డిని పెడతానంటే వాళ్ళు ఒప్పుకోలేదు. బ్రా హ్మణులు వచ్చేసరికి వంట పూర్తిచేసేశారు.

శ్రుతి ఎంతో శ్రద్ధతో చక్రకేళీ అరటిపళ్ళు తెచ్చి అత్తచేత బ్రాహ్మణులకి వేయిస్తోంటే రామచంద్రం నివ్వెరపోయాడు. తమ్ముడు పిల్లలను ఎంత బాగా పెంచాడో అతడికి ఇప్పుడు అర్థమవుతోంది.

సాయంత్రం ఆయన వెళ్ళిపోతూంటే శ్రుతి, ప్రీతి బస్టాండుకి దిగబెట్టడానికి బయలుదేరా రు. బస్సు బయలుదేరేవరకూ వాళ్ళు కబుర్లు చెపుతూనే ఉన్నారు. బస్సులోకి కండక్టరు వచ్చి, బయలుదేరబోతూంటే శ్రుతి అతడిచే తిలో డబ్బుపెట్టి టిక్కెట్టుకి ఇవ్వమని చెప్పి దిగిపోయింది. రామచంద్రం ఆమెను వారించ బోయేలోపే బస్సు బయలుదేరింది.

భార్య రాయమని ననపెట్టడంవలన వాళ్ళ కి తను రాసిన ఉత్తరం గురించి ఆయన అప్పుడు ఆలోచిస్తున్నాడు. తను చేసిన పని తల్లిని ఎంత బాధపెట్టిందో ఆయన స్వ యంగా చూశాడు. ఈరోజు తమ్ముడి మాసికాల



కి పసిపిల్లలపై వంతులు పోయావు, రేపు నేను పోతే ఇంక ఎవరితో వంతుపడతావురా అన్న మాటలు సూదుల్లాగ మనసుని గుచ్చుతు న్నాయి.



శ్రుతి సినిమా అయిన మర్నాడు స్వప్న తన దగ్గరకి వస్తుందనుకొంది. అమె రాకపోయేసరికి భరత్‌తో కబురుపెట్టింది. ఆ సాయంత్రమే ఆమె శ్రుతి ఇల్లు చేరుకొంది. ఊరు వెళ్ళక పోతే ఆమెకి అప్పుడూ తీరదు.

స్వప్న ఫలహారం చేశాక శ్రుతి సూటిగానే రంగంలోకి వచ్చేసింది. ''స్వప్నా! స్నేహితురాలు అంటే నీ హితమునుకోరే మనిషి. చదువుకొందుకు కాలేజీలో చేరి, ప్రేమపాఠాలు వల్లించడం మంచిదా?'' అంటూ సూటిగా అడిగింది.

అక్కరలేని చనువు ఎవరికీ ఇవ్వరాదని, జీవితం చాలా విలువైనదని, కాలుజారితే చాలా కష్టమని, దయచేసి ఈ స్నేహాలు మానుకొని, బాగా చదువుకోమని శ్రుతి హితవుచెప్పింది. స్వప్న బుద్ధిగా ఎదురు చెప్పకుండా అన్నీ వింది.

స్వప్న వెంటనే శ్రుతికి జవాబు చెప్పలేకపోయింది. మెడలో వేలాడుతున్న గొలుసును అటూ, ఇటూ కదుపుతూ ఆలోచనలో పడింది. మెడని అంటిపెట్టుకొని ఒక వరుస, పొడుగ్గా బొడ్డువరకూ మరొక వరుస వేసుకొన్న గొలుసుతో, చెవులకి పెట్టుకొన్న వేలాడుతున్న జూంకాలతో మెరిసిపోతోంది. శ్రుతి ఆమె ఆలోచనను చదవబోయింది.

''మగవాళ్ళ గురించి నీకేం తెలుసును స్వప్నా! ఏమగవాడైనా ఒకటే. గొప్పకోసం మగపిల్లలు ఆడపిల్లల్ని ఆకర్షించి, ప్రేమ, దోమ అని కబుర్లు చెపుతారు. పెళ్ళివరకూ వచ్చేసరికి జారిపోతారు. కాదనగలవా'' అంటూ సాలోచనగా ఆమెవైపు చూసింది. శ్రుతి విశ్లేషణకి స్వప్న తెల్లబోయింది. ఎంత సూటిగా అడిగిందో, స్వప్న కూడా సూటిగానే సమాధానం చెప్పింది. ''నాకు అవన్నీ తెలియవు శ్రుతీ! సారథంటే నాకు ఇష్టం. సారథి నాకు కావాలి. అతడికీ నేనంటే ఇష్టం. మేమిద్దరం పెళ్ళి చేసుకొందామనుకొంటున్నాం'' అని బదులిచ్చింది. ''డబ్బు చూసి సారథిని ఇష్టపడుతున్నావా స్వప్నా?'' అని అడిగితే అవునని వెంటనే బదులిచ్చింది.

పేదరికం అంటే స్వప్నకి అయిష్టం. ఎప్పుడూ అప్పులు, ఆడిపోసుకోవడాలు, బరువులూ, బాధ్యతలూ తప్ప మధ్య తరగతి బతుకులో మజా ఏం ఉంది? ఒక సరదా లేదు, సంతోషంలేదు. జీవితంలో ఎన్నో సుఖాలు అనుభవించడానికి ఉన్నాయి. ఏవీ లేకుండా బతకడం స్వప్నవల్ల అవడంలేదు. సారథిని చేసుకొంటే అన్నీ నెరవేరుతాయి. అందుకే స్వప్న తన మనసుని శ్రుతి దగ్గర దాచదలచుకోలేదు. అన్నీ చెప్పింది.

శ్రుతి తన స్నేహితురాలికి ఎన్నోవిధాలుగా నచ్చచెప్పబోయింది. స్వప్న వింటే కదా! సారథి ఇచ్చిన ఉంగరం, వాచీ గొప్పగా చూపించింది. సారథి పరిచయం స్వప్నని ఎంత మైమరుపులో పడేసిందో శ్రుతికి బాగానే అర్థమైంది. మధ్యతరగతి బతుకులంటేనే అంత రోత పనికిరాదని శ్రుతి ఉద్దేశం. తల్లిదండ్రుల ద్వారా అయినా మాట్లాడించి, సారథిని పెళ్ళిచేసుకోమని సలహాఇవ్వడం తప్ప శ్రుతి ఏమీ చేయలేకపోయింది.

జీవితంలో వాస్తవాన్ని మరిచి, కలలలో విహరించేవాళ్ళంటే శ్రుతికి అసహ్యం. స్వప్నని చూస్తూంటే ఏం చేయాలో అర్థమవడం లేదు. ఇప్పుడు స్వప్నకి చదువుపై ఆసక్తిలేదు. సారథితో పరిచయం నిలుపుకోవడమే ఆమెకు ఇప్పుడు ప్రపంచంలాగ కన్పిస్తోందని శ్రుతి గ్రహించింది. నేలను విడిచి సాముచేయడం ఎంత అవివేకమో చెప్పినా ఇప్పుడు ఆమె తలకి ఎక్కడంలేదు.




మంచి సమయంచూసి సారథి గురించి తండ్రికి చెపుతానని స్వప్న అన్నా శ్రుతి నమ్మలేదు. రేవతి, వాసవి స్వప్నకి కాలేజీ మిత్రురాళ్ళు. శ్రుతికీ వాళ్ళు తెలుసును. వాళ్ళద్వారా అన్ని విషయాలూ శ్రుతికి తెలుస్తున్నాయి. స్నేహితురాలిగా స్వప్న గురించి, ఆమె తండ్రికి చెప్పడం తన బాధ్యత అనుకొని, వాళ్ళ ఇంటికి వెళ్లింది.

సమయానికి స్వప్న తండ్రిలేరు. ఊరు వెళ్ళారని తెలిసి శ్రుతి ఉసూరుమంది. సవతి తల్లికి చెప్పి స్వప్నని మరింత అల్లరి చేయించడం ఇష్టంలేక ఇంటికి తిరిగి వచ్చేసింది. ట్యూషన్‌కి వెళ్ళడంవలన అక్క ఇంటికి ఆలస్యంగా వస్తోందని ఆమె తమ్ముళ్ళు చెవుతోంటే శ్రుతి ఏమీ మాట్లాడలేకపోయింది. స్వప్న బద్ధకం శ్రుతికి బాగానే తెలుసును.

సినిమాలు, షికార్లతో కాలంగడిపే స్వప్న ట్యూషన్ చదువు కోవడమా? నమ్మడమా, మానడమా? అంతరాంతరాలలో సారథితో కాలం గడుపుతోందా అనే సందేహం శ్రుతికి రాసాగింది. అయినా ఏం చేయగలదు?

స్వప్న గొడవ స్వప్న తండ్రికి చెప్పడం ఆ వారంలో కుదరనేలేదు. బొబ్బిలి నుండి ఒక సంగీత సంస్థవారు శ్రుతి దగ్గరకు వచ్చారు. ఆమెను బొబ్బిలిలో సంస్థ పండుగకోసం కచేరి ఇవ్వమని ఒకటే గొడవ. వార్షికోత్సవంకోసం పొరుగూరు వెళ్ళడం శ్రుతికి ఇష్టంలేదు.

అసలు ఇంతవరకు ఎప్పుడూ బయటి కచేరీలకు వెళ్ళనేలేదు. తండ్రి సరదాకొద్దీ గణపతి నవరాత్రుల్లో రెండుసార్లు పాడటం అయింది. రాఘవరావువలన అందరికీ ఇప్పుడు ఆమె గురించి తెలిసింది. కొత్తవారిని ప్రోత్సహించాలని సెక్రటరీ గొడవ. చివరికి శ్రుతికి అంగీకరించక తప్పలేదు.

సెక్రటరీ శ్రుతికి ఆరాత్రి బొబ్బిలిలో మకాం ఏర్పాటుచేస్తానని, తప్పక రమ్మని చెప్పాడు. ఒక సంస్థ తరపున ఆయన అంతలాగ అభ్యర్థిస్తోంటే శ్రుతి కాదనలేపోయింది. ఇంట్లో చూస్తే మగదక్షతలేదు. ఒంటరిగా రాత్రి రావడానికి అవదు. బొబ్బిలిలో ఉండటానికైనా సాయంకాలి కదా! చెల్లి, తను వెళ్ళివచ్చెయ్యాలనుకొన్నారు. కానీ ఇద్దరూ ఎదిగిన ఆడపిల్లలని లక్ష్మమ్మ ఒప్పుకోలేదు. రోజులు చూస్తే అసలే బాగుండలేదు. ఆవిడ భయం ఆవిడది.

శ్రుతికి ఏం చేయడానికీ పాలుపోలేదు. ప్రోగ్రాం కాన్సిలు చేసుకొంటే బాగుండదు. సుభద్రే శ్రుతికి దారిచూపించింది. "నీతో ప్రీతి వద్దులే. దాని చదువు పాడవుతుంది. నేను వస్తానులే" అని అంది. లక్ష్మమ్మ కూడా సుభద్ర వెళతానంటే మరేమీ అభ్యంతరం పెట్టలేదు. శ్రుతికి, మేనత్తకి వాళ్ళు ఎంతో గౌరవం చేశారు.

ప్రోగ్రాం ప్రారంభం అవుతోంటే విఘ్నేశ్వరుడికి నమస్కరించి, తండ్రిని మనసులో తలచుకొని నమస్కరించింది. కళ్ళు తెరవగానే ఎదురుగా పార్వతీదేవిలాగ మేనత్త కన్పించింది. సిగలో నిండుగా పెట్టుకొన్న సన్నజాజుల దండ, కట్టుకొన్న సన్నంచు గుంటూరు జరీ చీర, మెడలో తాడు, నల్లపూసలతో, నుదుట కాసంత కుంకుమ బొట్టుతో అత్త ఎప్పుడూ లేనంత అందంగా కన్పించింది. మేనత్తను ఆవిధంగా చూడడం శ్రుతికి ఎంతో ఆనందంగా అన్పించింది. మనసు ప్రశాంతంగా ఉండగా కచేరి ప్రారంభించింది.

కచేరీ చాలా తృప్తిగా జరిగింది. వచ్చినవారు చివరివరకూ ఉండటం శ్రుతికి ఆనందాన్నిచ్చింది. శ్రుతి గొంతు మాధుర్యం వారిని అలాగ కట్టిపడేసింది. సెక్రటరీ చీర, జాకెట్టు గుడ్డ, అయిదొందల రూపాయలు సభాముఖంగా ఇప్పించాడు. సుభద్రకి మేనకోడలు తమ్ముడు దాచుకొన్న ధనంలాగ అన్పించింది. ఈనాడు వాడు ఉంటే కూతురిని ఇలాగ పది మందీ పొగుడుతోంటే ఎంత సంతోషించేవాడు అనుకొంది. ఇంట్లో తమ వెనకగా తిరిగే శ్రుతికి, వేదిక ఎక్కాక పాడే శ్రుతికీ ఎంతో వ్యత్యాసం ఉందన్పించింది. ఇంట్లో చిన్నపిల్లగా ఉండే మేనకోడలు, వేదిక ఎక్కితే ఎలాగ సరస్వతీ మూర్తిగా అన్పించిందో ఆమెకి అర్థమవలేదు. సుభద్రకి మేనకోడలిని అలాగ చూస్తూంటే కళ్ళు చెమ్మగిల్లాయి. మర్నాడు తిరిగి క్షేమంగా ఇల్లుచేరుకొన్నారు. సుభద్ర చెప్పిన కబుర్లు, మర్నాడు పేపర్లో వచ్చిన విషయాలు ఇంట్లోవాళ్ళని సంతోషపరిచాయి.

పేపర్లో వచ్చ శ్రుతి ఫొటోని, మేటరుని జాగ్రత్తగా కత్తిరించి ప్రీతి ఆల్బమ్‌లో దాచింది.



శ్రుతి జీవితం ఒక రొటీన్‌లో పడింది. తమ్ముడు చదువుతున్నాడో లేదో చూడటం, తను ఖాళీ చేసికొని చదువుకోవడం, ప్రెస్ పని ఎడతెరిపిలేని దినచర్య అయిపోయింది. మేనత్తను కష్టపెట్టడం ఇష్టంలేక గ్రైండర్ తిరిగి ఇచ్చెయ్యాలనుకొంది.

మేనత్తతో ఆ విషయమే చెప్పింది. తల్లికి ఆరోగ్యం సరిగా ఉండదు. వంటలో ఆమెకి సాయంచేయాలి. పైగా ఈ పని. అందుకే మానేద్దామని చెప్పింది. ప్రెస్‌వలన ఇల్లు బాగానే నడుస్తోంది.

సుభద్ర శృతిని పరిశీలనగా చూసింది.

"చిన్నపిల్లవి. ఇటు చదువుకొంటూ, అటు మా అందరికోసం కష్టపడుతున్నావు. మేము కేవలం ఇంట్లో ఉండి తిని కూర్చోవాలా? ఈ మాత్రం సాయంచేయకూడదా?" అని సూటిగా అడిగింది. మేనత్త ఆరోగ్యం బాగుండదని శ్రుతి భయం. అదేవిషయం అంటే శ్రుతిని ప్రేమగా కసిరింది సుభద్ర.

"శ్రుతీ! మీరు నాకు వేరుగా అన్పించరు. నాపిల్లలే అన్పిస్తారు. నిన్ను చూస్తే నేనూ కష్టపడాలని, నా బతుకు నేను బతకాలని అన్పిస్తుంది. నాకు తోచినవిధంగా నీకు సాయపడుతున్నానన్పిస్తోంది. నాకు ఈ తృప్తిని దూరం చేయకు" అంటూ చెప్పేసింది.

ఆరోగ్య విషయం హెచ్చరిద్దామంటే మునుపటికన్నా ఇప్పుడే ఆరోగ్యం బాగుందని, ఇంక తనకి మాత్రలు వద్దని చెప్పేసింది. మందులు తిని తిని విసుగు వస్తోందని చెప్పింది. శ్రుతి ఇంక ఏమీ మాట్లాడలేకపోయింది.

సుభద్ర చేసే సాయంవలన కూర ఖర్చు, పైఖర్చులు వెళ్ళిపోతున్నాయి. అందరికీ ఫీజులు కట్టింది. సంగీత కచేరీలు ఇవ్వమని ఇరుగు, పొరుగు ఊళ్ళ వారు వాళ్ళ ఊళ్ళకి పిలుస్తున్నారు. వీలైనపుడు వెళ్ళివచ్చేది.

భరత్ ఒకరోజు బుంగమూతి పెట్టుకొని చెప్పాడు, ప్రీతక్కకి జాకట్లు చిరిగిపోయాయని. ఈమధ్య అక్క తమకి బట్టలు తీయలేదని వాడు చెపుతోంటే శ్రుతికి సిగ్గువేసింది. ఏం చేసింది తను? తన జీవన పోరాటంలోపడి అతి ముఖ్యమైన విషయాలు అశ్రద్ధ చేసింది. పాపం చెల్లి తనకి చెప్పలేక ఎంత ఇబ్బంది పడిందో?

వెంటనే వెళ్ళి ఇంట్లో అందరికీ కావలసిన బట్టలు కొని తీసికొని వచ్చింది. తల్లికి, అత్తకి కట్టుడు చీరలు లేవని కొన్నది. లక్ష్మమ్మ మొదట దెబ్బలాడినా తర్వాత అవసరమైనవేనని ఊరుకొంది. ప్రీతికి వెంటనే చెప్పింది ఏది కావలసినా తనని వచ్చి అడగాలని, లేదా తనే వెళ్ళి కొని అందరికీ తీసికొని రావాలని చెప్పింది.

ఇల్లుఅంటే అందరిదీ. కనీస అవసరాలకి ఇబ్బంది పడటం ఎంత కష్టం? అందుకే ఆనాటినుండీ అందరి బట్టలు గురించి, దుప్పట్ల గురించి జాగ్రత్తగా చూడటం అలవాటు చేసుకొంది. శ్రుతికి తండ్రి మాటలు గుర్తు వచ్చాయి. ఇంట్లో వాళ్ళ అవసరాలు చూడని యజమానియజమాని కాదని అనేవారు. ఇంట్లోవాళ్ళని ఇబ్బందిపెట్టి తాను సుఖాలలో మునిగినవాడిని ఆ కుటుంబం క్షమించినా భగవంతుడు క్షమించడని అనేవారు. ఎంత నిజాన్ని ఎంత చిన్న మాటలలో నాన్నగారు చెప్పారో కదా! అని అనుకొంది.

ఒకరోజు తండ్రి బీరువా సర్దుతోంటే ఒక ఫిక్స్‌డ్ డిపాజిట్ కవరు శ్రుతికి కన్పించింది. దాన్ని తెరిచి చూసి ఆ నెలలోనే అది మెచ్యూర్ అవుతుందని ఆమె గ్రహించింది. ఆమెకి కళ్ళనీళ్ళు తిరిగాయి. తమ చదువుల కోసం తండ్రి దాన్ని చేసి ఉంటాడు. దాన్ని తీసికొచ్చి ఇంట్లో వాళ్ళకి చూపించింది.

ఇంట్లో వాళ్ళందరికీ అదొక కల్పవృక్షంలాగ కన్పించింది. లక్ష్మమ్మ ఆ ముప్పైవేలతో ప్రీతికైనా పెళ్ళిచేద్దామని కూర్చుంది. తులసమ్మ మాట ఆవిడ తలలోని నరనరానికి బాగా ఎక్కినట్టుంది. కొడుకు సంవత్సరీకాలు సరిగ్గా రెండు నెలలలో ఉన్నాయి. ఈలోపు చెయ్యాలని పట్టుపట్టింది.

శ్రుతి ఆలోచన వేరు. ఈ డబ్బు పట్టుకెళ్ళి రమేష్‌కి ఇస్తే అప్పు సగం తీరిపోతుంది. మిగిలిన ఇరవైవేలు నెమ్మదిగా తీర్చవచ్చును. ఇంక అప్పుడు ప్రెస్ తమదే అవుతుంది. మాట ఆయన దగ్గర నిలబడుతుంది.

శ్రుతి తన ఆలోచనని చెప్పినా లక్ష్మమ్మ





అర్థంచేసుకొంటే కదా! నిరాహారదీక్ష ప్రారంభించింది. శ్రుతికి మింగలేనట్లు కక్కలేనట్లు అయింది. చనిపోయిన కొడుక్కి కన్యాదాన ఫలం దక్కి తీరాలని ఆవిడ పట్టు. ఆవిడ మూర్ఖత్వంమీద, తన అసహాయతమీద శ్రుతికి కోపంగా ఉంది. ఈలోపే సంబంధాలు ఎలా వెతకడమవుతుంది? ఎలా ఈ డబ్బుతో పెళ్ళవుతుంది? చదువు మధ్యలో ఆపి చిన్నపిల్లకి పెళ్ళిచేయడం భావ్యమా?

వసుధ భయం వేరే ఉంది. ప్రీతికి ఇప్పుడు పెళ్ళిచేసేస్తే శ్రుతి ఇంక అలాగే ఉండిపోతుంది. ఈ బాధ్యతలనుండి ఆమె ఎప్పుడు తప్పుకొంటుంది? శ్రుతి జీవితం అలాగ అవడం ఆవిడకి ఇష్టంలేదు. లక్ష్మమ్మ చూస్తే ఎవరి మాటా వినడం లేదు. తన బంగారం కూడా మనవరాలి పెళ్ళికి అవసరమైతే ఇస్తానని పట్టుదల. ఈ గోల ఇంట్లో భరించలేనిదిగా ఉంది.

తండ్రి సంవత్సరీకాలు దగ్గర్లో ఉన్నాయని కాస్తకాస్త డబ్బు దానికోసం వెనక్కి పెట్టి శ్రుతి దాస్తోంది. పెళ్ళి, సంవత్సరీకాలు అన్నీ ఎలా జరిపించడం? మామ్మ తమ కష్టం ఆలోచించకపోవడం శ్రుతికి బాధగా ఉంది.

రాఘవరావుగారింటికి వెళ్ళి విషయమంతా చెప్పింది. ఆయన ఆవిడ కోరిక కూడా సహజమైనదేనన్నారు. పదివేలైనా రమేష్‌కి ఇద్దామంటే కుదిరేలాగ లేదు. చివరికి ఏమైతే అయిందని రాఘవరావుగారిని ప్రీతికి మంచి సంబంధం చూడమని చెప్పింది. ప్రీతి కూడా మామ్మబాధ పడలేక ఒప్పుకొందని చెప్పింది.

అన్ని కబుర్లూ అయ్యాక ఇంట్లో ఏమీ సందడి కన్పించకపోయేసరికి వీణ గురించి అడిగింది. ఆయన నిట్టూరుస్తూ ఆయన బాధ చెప్పారు. వీణ భర్తని పోరుపెట్టి, అలక సాగించి వైజాగ్‌లో కాపురం పెట్టించింది. కొడుకు భార్య పోరు పడలేక, తనతో ఆ మాట చెప్పలేక అవస్థపడుతోంటే ఆయన తండ్రి ప్రాణం ఉసూరు మంది. కొడుకు ఎటువంటి పరిస్థితులలో తనని విడిచిపెట్టనంటాడు. వీణ తన పట్టు వదటడంలేదు. అటూ ఇటూ తిరిగితే కొడుకు ఆరోగ్యం పాడవుతుంది.

ఆయనే ఒక నిర్ణయానికి వచ్చి, కొడుకుని వైజాగ్‌లో కాపురం పెట్టమన్నారు. తనకి వీలైనపుడు తను, అతడికి వీలైనపుడు అతడు అటూ ఇటూ తిరుగుదామని చెప్పారు. అంతకన్నా పరిష్కారం ఆయనకి కన్పించలేదు.

ఆయన ఇదంతా చెపుతోంటే శ్రుతికి ఎంతో కష్టంగా అన్పించింది. శ్రుతి ఈ విషయాలు తనకెందుకు చెప్పలేదని దెబ్బలాడింది. అసలే ఆ అమ్మాయి తన గొడవలతో సతమతమవుతోంటే ఇవన్నీ ఎందుకు చెప్పడమని ఆయన మానేశారు. శ్రుతి ఆ పూట ఆయనతోనే భోజనం చేసింది.

వంశీకృష్ణ వాళ్ళు వెళ్ళేముందు తమ ఇంటికైనా వచ్చి చెప్పలేదని శ్రుతి మనసులో బాధపడింది. తమ రెండు కుటుంబాలమధ్య స్నేహం ఎక్కువ కదా! ఆడపిల్లయి వీణ అయినా మర్యాద పాటించవద్దా?

ఇంట్లో లక్ష్మమ్మ గొడవ ఎక్కువగా ఉంది. పెళ్ళికొడుకులంటే బొందలదిబ్బ దగ్గర దొరికే కూరలు కారు కదా! ఆవిడకి అర్థమవదు. తల్లిని నువ్వైనా ఆవిడకి నచ్చచెప్పమ్మా అంది శ్రుతి. కష్టంగా ఆవిడ తను కాపురానికి వచ్చినప్పటినుండీ చూస్తున్నాననీ, ఆవిడ పట్టిన పట్టు ఏనాడూ విడవలేదని, ఎవరు చెప్పినా మానరని తల్లి అంటూంటే శ్రుతి మనసు తల్లిపట్ల జాలిపడింది. ఇటు బిడ్డల బాధ చూడలేదు. ఆవిడకి నచ్చచెప్పలేదు. శ్రుతి తల్లిని ఇంక ఏమీ అనలేకపోయింది.

ఆరోజు సెలవవడంవలన ఇంట్లో అందరూ మధ్యాహ్నంవేళ పడుకున్నారు. భరత్‌కి మాత్రం ఎప్పుడూ మధ్యాహ్నం నిద్రపట్టదు. అందుకే ఏవో మెకానిక్ పనులు చేసుకొంటూ కాసేపు గడిపాడు. అయినా ఇంకా ఎవరూ నిద్ర లేవలేదు. అందరూ గాఢనిద్రే. అతడికి ఒంటరిగా ఉండటానికి విసుగు వచ్చేసింది. ఏం చేయాలో పాలుపోలేదు.

పడుకొన్న లక్ష్మమ్మని చూస్తే అతడిలో చిలిపి ఆలోచన బయలుదేరింది. లక్ష్మమ్మ జుట్టు పెద్దదే. కానీ ఆవిడ భర్త పోయిన దగ్గరనుండీ వేలు ముడితోనే ఉంది. భరత్ ఆవిడకి నిద్రాభంగం కలగకుండా ఆవిడ జుట్టుని రెండు భాగాలుగా చేశాడు. దువ్వెనతో

దాన్ని బాగా దువ్వాడు. మళ్ళీ లేచి ఇల్లంతా వెతికి ఏవో వస్తువులు పట్టుకొని వచ్చాడు. ఒక భాగం జాగ్రత్తగా దువ్వి జడవేసి రిబ్బన్ పెట్టాడు.

లక్ష్మమ్మ ఒకపక్కనుండి అవతలి పక్కకి తిరిగి పడుకొంది. మనవడు అప్పుడప్పుడు పేలు చూడటం మామూలే కనుక "మధ్యాహ్న వేళ కాసేపు పడుకోరాదుటరా" అని మళ్ళీ నిద్రలోకి జారుకొంది.

భరత్ నెమ్మదిగా అటువైపు జడకూడా పూర్తి చేశాడు. రెండు జడలూ మడిచి శ్రుతి కట్టుకొనే టట్లు పైకి కట్టాడు. పెరట్లోకి వెళ్ళి చేతులు తోముకొని వచ్చి, ఆవిడ మొహానికి నెమ్మదిగా పౌడరు రాసి, నల్ల స్టిక్కర్ అంటించాడు. మామ్మను ఆ అలంకరణలో చూస్తుంటే అతడి కి ఎంతో సరదాగా ఉంది. అక్కలేస్తే లెక్కలు చెయ్యలేదని తిడుతుందని, లెక్కలు చేస్తూ ఉండిపోయాడు.

కరెంటు పోగానే లక్ష్మమ్మ కరెంటు వాళ్ళని తిట్టుకొంటూ నిద్రలేచింది. ఆవిడ పెరట్లోకి వెళుతోంటే చూసి ప్రీతి ఒకటే నవ్వసాగింది.

ప్రీతి అంతలాగ ఎందుకు నవ్వుతోందో ఆవి డకి అర్థమవలేదు. ప్రీతి గొడవకి అందరూ ఇవతలికి వచ్చారు. ప్రీతి కారణం చెప్పక పోయినా, ఎదురుగానున్న లక్ష్మమ్మను చూస్తే వాళ్ళకి నవ్వువచ్చింది. వాళ్ళందరూ అలాగ కలిసి నవ్వుతోంటే ఆవిడకి గంగ వెర్రులె త్తింది. "విషయం చెప్పి చావండర్రా, ఏమిటా వెకిలి నవ్వులు" అంటూ ఆవిడ అందరినీ కేకలేసింది.

ప్రీతి వస్తున్న నవ్వునాపుకొని ఆవిడని డ్రె స్సింగ్ టేబుల్ దగ్గరకి తీసికొని వెళ్ళింది. ఆవిడకి తన రెండు జడలు, అలంకరణ చూసిన తరువాత కోపం వచ్చింది. "అమ్మనా డు, అబ్బనాడే ఎరుగను. ఇప్పుడా ఈ అలంక రణ. ఏమైనా నా కొడుకు పోయాక నేనంటే మీకందరికీ చులకనైపోయాను" అంటూ ఎగ రడం మొదలుపెట్టింది. శ్రుతికి విషయం అర్థమైంది. ఆవిడ అసలే ఈమధ్య ఇంట్లో గొడవ చేస్తోంటే ఇంకా ఇలాంటివి ఒకటా?

లోపలకి వెళ్ళి రెక్కపట్టుకొని భరత్‌ను ఇవ తలికి తీసికొని వచ్చింది. నవ్వుతున్న వాడి మొహంలో అప్పటికే భయం చోటు చేసుకొంది. లోపల తన గదిలో ఉన్న బెత్తం తీసికొని వచ్చి, రెండు తగిలించింది. "రోజు రోజుకి నీ అల్లరి ఎక్కువవుతోంది. చదువు ధ్యాస ఉందా నీకు? పెద్దావిడనైనా చూడకుండా ఇలాంటి అల్లరి చేస్తావా?" అంటూ సుభద్ర వద్దన్నా వినకుండా కొట్టింది. శ్రుతికి వాడిమీద అంతకోపం ఎప్పు డూ రాలేదు.

"మామ్మా చూడవే! నన్ను ఎలా కొడుతున్నా రో చూడు" అంటూ వాడు ఇల్లు ఎగిరిపోయే లాగ లక్ష్మమ్మని కేకలు వేశాడు. ఆవిడకి భరత్ అంటే ఇష్టం. మనవరాలు వాడిని కొడుతోంటే చూస్తూ ఊరుకోలేక అడ్డుపడింది. "నా మనవ డు. వాడిష్టం. మామ్మను గనుక నాతో ఆడతా డు. మధ్య మీరెవరు వాడిని కొట్టడానికి. ఉన్న ఒక్క మగ నలుసుని చంపేస్తారా?" అంటూ వాడిని లోపలకి తీసికొని వెళ్ళిపోయింది.

భరత్ అల్లరి తగ్గించడానికి ఏం చేయాలా అని ఆలోచిస్తూ శ్రుతి కూర్చుంది. వాడి తీరే అంత. అల్లరి బాగా చేస్తాడు. వాడిని బెదిరించ డానికని కాస్త మాట్లాడటం మానేస్తే, మళ్ళీ వాళ్ళు తనతో మాట్లాడే వరకూ "అక్కా, అక్కా" అంటూ పదిసార్లు పిలిచి వెనకనే తిరుగుతాడు. ఒక్కొక్కసారి ఇంట్లో సంద డంతా వాడేనేమోనని అన్పిస్తుంది.

రాఘవరావు రెండు పెళ్ళి సంబంధాలు తెచ్చాడు. ఒకతను డి.ఇ.ఓ ఆఫీసులో గుమ స్తాగా కొత్తగా చేరాడు. మరొకరు టీచరు. పెళ్ళి చూపులకి వచ్చిన గుమస్తా పెళ్ళికొడుకు ము ప్ఫైవేలు కట్నం, అయిదువేలు లాంఛనాలు, బండి ఒకటి కోరాడు. శ్రుతికి ఆ కోరికలు వింటూంటే ఒళ్ళు మండింది. కానీ ఏం చేయ గలదు? దానితో ఆ సంబంధం వదులుకొన్నా రు.

ఇంక టీచర్‌కి కాస్త ఆస్తి ఉంది. చెల్లెళ్ళు ముగ్గురున్నారుట. వాళ్ళ బాధ్యత అతడిదే. కనుక నలభైవేలు కట్నంకి తగ్గనని కూర్చున్నా డు. టీచర్ పెళ్ళికొడుకు బావున్నా అతడి కోరికలు ఆకాశానికి ఉన్నాయి. ఇంటిమీద అప్పుతెచ్చి పెళ్ళి సంబంధం కుదర్చమని లక్ష్మమ్మ గొడవ.

కట్నంతో అయిపోదుకదా! పెళ్ళి ఖర్చులకి




వేరే పాతికవేలైనా అవుతుంది. ఇంకా పండుగలు, సారెలు ఉండనే ఉన్నాయి. పిల్లని మంచి చోట ఇవ్వాలని శ్రుతి కోరిక. దానికి సాయం శ్రుతి చెల్లిని డిగ్రీ చదువు పూర్తయితే, కానీ అత్తవారింటికి పంపనని మొదటే చెప్పేసింది. పై చదువు చదవడానికి టీచరు సంబంధం వాళ్ళు ఒప్పుకోలేను. చదువుదేముంది? ఆడపిల్ల ఎంత చదివినా ఒకటే అంటుంది లక్ష్మమ్మ. మిగిలిన విషయాలలోనూ వాళ్ళు వెనక్కి తగ్గలేదు.

శ్రుతికి అసలు తనమీద, ఈ లోక ఆచారాల మీద ఒళ్ళు మండిపోతోంది. తమ స్వయం కృషితో, తమ డబ్బుతో తమకి కావలసినవి పొందాలని ఎవరూ అనుకోరు. ఈనాటి యువకులు తమకి కావలసిన కోరికలు తీర్చుకోవడాని 'పెళ్ళి'ని ఒక సాధనంగా తీసుకొంటున్నారు. పెళ్ళి పేరు చెప్పి చేతికి పెట్టుకొనే వాచీ దగ్గర్నుండీ, స్పేర్ ప్యాంట్లు, సూట్లవరకు అన్నీ మామగారినుండి గుంజాలని చూస్తున్నారు. ఇది అభిలషించదగిన పరిణామం కాదు. సమాజం ఎక్కడికి వెళుతోంది? ఎప్పటికి ఈ సంఘం బాగుపడుతుంది? శ్రుతికి ఇవన్నీ నిరుత్సాహంగా ఉన్నాయి.

ఇంక వీటితో అయ్యాయా? పెళ్ళి చూపులకి వచ్చిన వాళ్ళు యక్ష ప్రశ్నలు వేయడం ఒకటి ఉంది. "అక్కకి అవకుండా చెల్లికి ఎందుకు చేయాలనుకొంటున్నారు", "ఇల్లు మీదే కదా! ఇది అమ్మి ఇద్దరికీ ఒకేసారి చెయ్యవచ్చును కదా" ఇలాగ అన్ని గొడవలూ వాళ్ళకే కావాలి. మళ్ళీ కుటుంబ పరిస్థితంతా వారిదగ్గర ఏకరువు పెట్టాలి. ఇది అడగవచ్చును. ఇది అడగకూడదు అన్న సందేహం వారికి లేదు. తపీమని అడిగెయ్యడమే. సుభద్ర ఓపికగా వాళ్ళకి జవాబులు చెప్పేది.

ప్రీతి తన ఆలోచనలేమిటో అసలు పైకి తెలియనీయదు కదా! పెళ్ళి ఇప్పుడే చేసుకోవడం ఇష్టం లేకపోయినా ఇంట్లో పరిస్థితులకి ప్రీతి తలవంచింది. ప్రీతికున్న సహనం తనలో ఉందా అనుకొంది.

రాఘవరావు డబ్బుకోసం చూడవద్దని, అవసరమైతే తను సర్దుతానని శ్రుతికి చెప్పారు. లక్ష్మమ్మ స్నేహితురాలు మరొక సంబంధం చెప్పింది. వరుడు ఎల్.ఐ.సి ఆఫీసులో సబ్ స్టాఫ్‌గా చేస్తున్నాడు. ఇంటర్ పాసయ్యాడు. మామ్మ బాధపడలేక వాళ్ళని పెళ్ళి చూపులకి పిలిచింది.

వరుడు బొత్తిగా నోట్లో నాలుక లేనట్టు ఉన్నాడు. అతడి తల్లి ఒక్కలాగ పెళ్ళిచూపుల్లోనే దడదడలాడించింది. కట్నం పాతికవేలకి తగ్గనని చెప్పింది. ఆవిడదే ఇంట్లో పెత్తనం. భర్తపోయాక బిడ్డలని ఎలా పెంచుకొచ్చిందో ఒక గంట చెప్పింది. పిల్లకి బంగారం మూడు తులాలైనా పెట్టాలని చెప్పింది.

శ్రుతి తన ఇంటి పరిస్థితులు చెప్పబోతే ఆవిడ సరిగా విన్పించుకోలేదు. ఇల్లు ప్రీతి కోసం అమ్మినా అక్క, తమ్ముడు బతకడానికి ప్రెస్ చాలదా అని అడిగింది. రాఘవరావు శ్రుతి కుటుంబ సాంప్రదాయం గూర్చి చెప్పినా ఆవిడ చెవికి ఎక్కలేదు.

ఆవిడ అధికారంలో, మెతక మొగుడితో ప్రీతి జీవితాన్ని శ్రుతి బాగానే ఊహించింది. ఆవిడ ప్రీతిని సమంగా చూడదని, ఒట్టి డబ్బు మనిషని శ్రుతి నమ్మకం. "అసలు నీకు చెల్లికి పెళ్ళి చేయాలని లేదు. ఏదో నా కంటితుడుపు కోసం సంబంధాలు చూస్తున్నావు" అని లక్ష్మమ్మ సాధింపు.

"నీకు డబ్బు ఖర్చుపెట్టడం ఇష్టంలేకపోతే ఏ రెండవ పెళ్ళివాడికైనా ఇచ్చిచేసెయ్యి" అంటూ ఒక బాణం కూడా విసిరింది. శ్రుతి నివ్వెరపోయి మామ్మవైపు చూసింది. సుభద్ర లక్ష్మమ్మ మీదికి గయ్యిమని లేచింది. చిన్నపిల్లని, మనవరాలిని అలాగ సాధించడం ఆమెకి నచ్చలేదు. వసుధ గుడ్లనీరు కుక్కుకుంటూ వాళ్ళవైపు చూసింది. శ్రుతి పని మింగలేక, కక్కలేక ఉంది.

ఆరోజు మధ్యాహ్నం శ్రుతి ప్రెస్‌కి బయలుదేరుతూంటే ప్రీతి అక్క దగ్గరకి వచ్చింది. "అక్కా! మనం సాయంత్రం ఎక్కడికైనా వెడదాం. నేను నీతో మాట్లాడాలి" అంది. శ్రుతి అలాగే అని తల ఊపితే ప్రెస్ దగ్గరకు అయిదు గంటలకు వస్తానని చెప్పింది ప్రీతి.

ప్రీతి తనతో మాట్లాడబోయే విషయం ఏమిటా అని శ్రుతి మనసులో తర్జనపడింది.

ఎల్ఐసి అబ్బాయి సంబంధం వద్దని చెపుతుందేమో! ఆ విషయం తను ఎప్పుడో మనసులో నిర్ణయించేసుకొంది. పెళ్ళికాకపోతే ఫర్వాలేదుకానీ అలాంటి ఇంట్లోకి తను ప్రీతిని పంపి దుఃఖపెట్టలేదు.

అయితే ఆ పెళ్ళి కొడుకు తల్లి ఘటికురాలు. లక్ష్మమ్మను పట్టుకొంటే పని సానుకూలపడుతుందని ఆవిడ పెళ్ళిచూపులలోనే గ్రహించింది. ఆవిడకి పెళ్ళి చూపులలో ప్రీతి చాలా అమాయకంగా కన్పించింది. అలాంటి పిల్లయితే తన చెప్పుచేతలలో ఉంటుందని అనుకొంది. అయినా ఎలాగో సాధ్యమైనంత డబ్బు వాళ్ళనుండి గుంజాలని మధ్యవర్తులతో కబుర్లు పెడుతోంది. శ్రుతికి ఈ రభస చిరాకు అన్పిస్తోంది. చెల్లెలు ఆ విషయమే మాట్లాడుతుందని అనుకొంది.

సాయంత్రం ప్రీతి ప్రెస్‌కి వచ్చింది. లేత పసుపు రంగు పరికిణీ, జాకట్లు, నలుపు ఓణీ, రెండు జడలు, మెడలో ముత్యాల దండతో ఎంతో అందంగా ఉంది. ఒక జడలో నుండి మరువం, కనకాంబరం కలిపిన మాల వయ్యారంగా ముందుకి పడుతోంది. శ్రుతి చెల్లెలిని ప్రేమగా చూసుకొంది.

మొదట ప్రీతి వచ్చి పిలిచే వరకూ పనిలో మునిగిన శ్రుతి ఆమెను చూడలేదు. ఒక్కసారి ఉలిక్కిపడి అప్పుడే అయిదు గంటలు అవబోతోందా అని అనుకొంది. ప్రీతిని ప్రెస్‌లో చూస్తూనే ప్రసాద్ కళ్ళు మెరిశాయి. అతడు బైండింగ్ పుస్తకాలు సరిగా రాకపోతే, సరిచేస్తున్నాడు.

శ్రుతి నుదురంతా స్వేదబిందువులతో మెరుస్తోంది. అక్కగారిని అలాగ చూస్తూంటే ప్రీతికి మనసు పిండినట్లయింది. తండ్రి ఉన్నప్పుడు ఎంత ముద్దుగా పెరిగింది. ఈనాడు ఎంత కష్టపడుతోంది. శ్రుతి చెల్లెలితో అంది ''అయిపోయింది ప్రీతీ! ఒక్కపావు గంటలో వచ్చేస్తాను. ఈరోజు పనుందని మన వాళ్ళు కాస్త ముందుగా వెళ్ళారు. ఈ మీటింగ్ పేపర్లు అచ్చయిపోతే ఈ పూట పనిఅయిన




ప్లే'' అని చెప్పింది. ప్రీతి అలాగే అని తలూపి, ప్రసాద్ చూపించిన కుర్చీలో కూర్చుంది.

చకచక కదులుతున్న అక్కగారి చేతివేళ్ళను చూస్తూ కూర్చుంది. ప్రింటయిన పేపరు ఒకటి తీసికొని చదవసాగింది. తప్పులు లేకుండా బావుంది. అమధ్య ఒకసారి పని ఉండి ప్రెస్‌కి వచ్చినప్పుడు కూడా వీళ్ళిద్దరూ ఇలాగే పనితో కుస్తీ పడుతున్నారు. వాళ్ళ శ్రమలో పాలు పంచుకోవడం తన బాధ్యతకాదా అనిఅనుకొంది.

సాయంత్రం అలసటతో ఇల్లు చేరే అక్కగారి మొహం గుర్తుకి వచ్చింది. తమ ఇద్దరికీ వయసుతేడా ఏడాదిన్నర. అంత దగ్గరగా తామిద్దరూ పుట్టారు. అయినా అక్క ఈ బరువు బాధ్యతలు తనకి తెలియనీయకుండా పెంచాలని తాపత్రయపడుతోంది. తన అక్క ఎంత మంచి అక్క.

''ఏమిటే అప్పుడే ఆలోచనలో పడ్డట్లున్నావు. వద పోదాం'' అంటూ శ్రుతి వచ్చింది.

ప్రసాద్‌తో ఎవరెవరు వస్తే ఏమిటేమిటివ్వాలో చెప్పి, చెల్లెలుతో కలిసి బయలుదేరింది. ''పని ఎక్కువగా ఉంటే మరొక మనిషిని పెట్టుకోవచ్చు కదక్కా'' అని నుదుట పట్టిన చెమటను రుమాలుతో తుడుచుకుంటున్న అక్కతో అంది.

''వాను మరొక ప్రెస్‌లో కుదిరిపోయాడు. అందుకే కాస్త ఇబ్బంది'' అంటూ చెప్పింది.

''మరివాడు వెళ్ళిపోతే ఎందుకుచూస్తూ ఊరుకొన్నావు?'' అని అడిగితే

''ఏం చేయను? చిన్న వెధవ కనుక డబ్బు కాస్త ఎక్కువ ఇస్తారని వెళ్ళిపోయాడు. మిగిలిన వాళ్ళకి ఏ ఆశ చూపినా వెళ్ళరు. అయినా మన రిక్షా రాములు రేపు మరొక అబ్బాయిని తెస్తానన్నాడు'' అని చెప్పి ''ఈ గొడవలకేం ఇప్పుడు మనం ఎక్కడికి వెళదాం'' అని అడిగింది.

''ఆంజనేయస్వామి కోవెలకి మొదట వెళదాం. తర్వాత అక్కడనుండి మనం ఒంటరిగా మాట్లాడటానికి వీలుండే చోటుకు వెళదాం'' అంటున్న ప్రీతిని ''అలాగే'' అని చూస్తూ బయలుదేరింది. కోవెలలో స్వామికి నమస్కరించి, ప్రసాదం తీసికొని, అటునుండి ఆ పక్కగానున్న పొలాలవైపు నడిచారు.

ఇంక నడిచే ఓపిక లేదని శ్రుతి అక్కడే మధ్యలో కూర్చుండిపోయింది. ప్రీతి పక్కనే కూర్చుంది. చుట్టూ ఉన్న పరిసరాలు చాలా ఆహ్లాదంగా ఉన్నాయి. చల్లనిగాలి వాళ్ళని సేదతీరుస్తోంది.

''ఎందుకు రమ్మన్నావు? నా దగ్గర చెప్పడానికి నీకు సంకోచం ఎందుకు?'' అని చెల్లిని మృదువుగా అడిగింది.

''నేను ఇలాగ ధైర్యంగా చెపుతున్నందుకు నన్ను సిగ్గులేని దానిగా భావించవద్దు. నా ఆలోచన సరైనదోకాదో నువ్వే చెప్పు. నీ మాట ఏదైనా నాకు వేదవాక్కు'' అంటూ శ్రుతితో జరిగిన విషయం చెప్పింది.

చెల్లెలి మాటలు వింటూంటే శ్రుతికి ఆశ్చర్యం, ఆనందం కలిగాయి. తన చిన్నారి చెల్లి ఇంత ఎదిగిందా? ఆనందంతో శ్రుతికి మాట రావడంలేదు. చెల్లెలిని మౌనంగా ఒళ్ళోకి తీసుకొంది.

''ప్రీతీ! నేను నీ నిర్ణయాన్ని గౌరవించగలను. కానీ బంగారు బొమ్మలాంటి చెల్లెలిని ఒక అవకరం ఉన్న వ్యక్తికి ఈయగలనా?'' అని, ''వద్దు... మా కోసం నువ్వు ఇలాంటి నిర్ణయం తీసుకోవద్దు. ఎంత డబ్బు ఖర్చు అయినా ఫర్వాలేదు. మంచి సంబంధం చూసి నీకు చేస్తాం'' అంటున్న అక్కగారిని ప్రీతి వారించింది. ''అక్కా... ఆవేశం వద్దు. ఈ పెళ్ళి నాకూ ప్రసాద్‌కూ ఇష్టం. శారదత్తయ్యా కూడా ఇష్టపడింది. నువ్వు కూడా ఆలోచించు'' అంటున్న ప్రీతిని సాలోచనగా చూసింది.

చీకటిపడిందని అక్కాచెల్లెళ్ళిద్దరూ ఇంటికి బయలుదేరారు. ప్రసాద్‌కి శరీరానికీ అవకరంకానీ మనసుకి లేదక్కా! మనని ఇష్టపడేవాళ్ళ దగ్గర మనం ఎక్కువ సుఖపడతాం మిమ్మల్ని వదిలి నేను ఎక్కడికీ దూరం వెళ్ళనవసరం ఉండదు. అందరం కలిసి కష్టం, సుఖం పంచుకోవచ్చును. దయచేసి కాదనవద్దు'' అంటూ దారిలో ప్రీతి వేడికోలుగా అంది.

అసలు మామ్మ కోరికని తను ఎందుకు తీర్చాలి! ఇంత హైరానా పడి ఇప్పుడే

ఎందుకు చెల్లెలి పెళ్ళి చేయాలని శ్రుతి అనుకొంది 'ఆశలు ఏవో పెట్టుకొన్నవాళ్ళకి, కలలు కనేవాళ్ళకి జీవితంలో ఏదో చేదు అనుభవాలు ఎదురైతే భయంకానీ నాలాంటి ఏ ఆశలు, కలలు లేనివాళ్ళకి జీవితంలో తృప్తే ఉంటుంది' అన్న చెల్లెలి మాటలు శ్రుతిలో ఆలోచనలని లేపాయి. మర్నాడు అక్కే తమ వాళ్ళందరికీ అన్ని విషయాలూ చెపుతుందని ప్రీతి అనుకొంది.

చీకటి పడినా పిల్లలు ఇల్లు చేరలేదని అప్పటికే ఇంట్లోవాళ్ళు కంగారుపడుతున్నారు. ఆ రాత్రి ఏదో తిన్నాననిపించి పడకచేరింది శ్రుతి.

"చిన్నక్కా! శ్రుతక్క ఈ రోజు అముదం త్రాగిన దానిలాగ ఉందేమిటి? మనలో మన మాట. ఏ బంధువులైనా ప్రెస్‌కి వచ్చి అల్లరి పెట్టారా?" అని ప్రీతి చెవిలో గుసగుసలాడాడు భరత్. వాడి మాటలకు ఆమె నవ్వుకొంది. అప్పులవాళ్ళని భరత్ బంధువులంటాడు.

పడుకుందన్న మాటేగానీ ప్రీతికి నిద్రరావ డంలేదు. అక్క నిర్ణయం ఎలా ఉంటుందో? ఆ అమ్మాయికి తన గుండెల చప్పుడు తనకే విన్పించింది. శారదత్తయ్య ఇది వింటే ఎంతో సంతోషిస్తుంది. అసలు ప్రసాద్‌కి ఉన్న మంచి మనసు ఈ కాలంలో ఎంత మందికి ఉంటుంది? అందమైన ప్రసాద్ మొహం గుర్తుకి వచ్చింది.

పచ్చటి పసిమిరంగు, తీరైన ముక్కు, చక్కటి క్రాపు ఒక్కొక్కటి ప్రీతికి గుర్తువచ్చింది. కాళ్ళు అందరిలాగ లేకపోతేనేం? బంగారంలాంటి ఆ మనిషి, ఆ మనసు తనకి కావాలి. అసలు ప్రసాద్‌లో అంత ధైర్యముందని ప్రీతికి తెలియదు. ఎల్ఐసి పెళ్ళి కొడుకు వచ్చి చూసి వెళ్ళాక ఒక రోజు ప్రసాద్ తనకి కాలేజీ నుండి వస్తొంటే దారిలో కన్పించాడు. అతడితో మాట్లాడాలంటే తనకి భయం, కంగారు కలిగాయి. ఇద్దరూ పార్కుకి వెళ్ళి కూర్చున్నాక చెప్పాడు. తనంటే అతడికి చాలా ఇష్టం అని, తనకి పెళ్ళి సంబంధాలు చూస్తున్నారంటే అతడికి చాలా కష్టంగా ఉందని, ఏది కుదిరిపోతుందో తను ఎవరి సొత్తు అవుతుందో అని భయంగా ఉందని చెప్పాడు.

అవిటివాడైన అతడు తనవాళ్ళను ధైర్యంగా పిల్లనివ్వమని అడగలేక, తనను వదులుకోలేక ఎంతో సతమతమయ్యాడట. చివరికి తెగించి తన దగ్గర ఇలాగ బయటపడ్డాడుట. అక్కంటే అతడికి గౌరవం. తనంటే మాత్రం ఎంతో ఇష్టంట. నెమ్మదిగా, ఓర్పుతో ఉండే తన వలన అతడి జీవితం సుఖమయం అవుతుందిట. అతడు ఒక్కొక్క విషయం చెపుతోంటే తను మూగదై కూర్చుంది. ఏం మాట్లాడాలో తెలియని స్థితి అది.

"ఈ అవిటివాడికి నాతో జీవితం గడిపే అదృష్టమెక్కడిది? అనా నీ ఆలోచన ప్రీతీ! నేను అవిటివాడినైనా నా కోరికలకి, మనసుకి అవిటి తనం లేదుకదా! ఈ దేవతను ప్రణయ భిక్ష అర్థిస్తున్నాను. అనర్హుడినైనా సరే నీ ప్రేమ అందలం ఎక్కించగలవా?" అని అతడు అడుగుతోంటే "ఛా... ఎందుకు మాటకి పది సార్లు అవిటివాడినని మిమ్మల్ని మీరు కించపరుచుకొంటారు" అంటూ తను వారించింది. తర్వాత నాలుక కొరుక్కొని ఇదా తన మనసు అని అనుకొంది.

"అమ్మయ్యా... ఇంక అక్కకి తన మనసులోని ఆలోచనను చెప్పేసింది. ఇంక అక్కే చూసుకుంటుంది" అంటూ నిశ్చింతగా నిద్రపోయింది.

శ్రుతికీ ఆ రాత్రి ఆలోచనలు ఎంతకీ తెగలేదు. అత్త ఏమనుకొంటుంది? ప్రసాద్ మంచి మనసుని సొమ్ము చేసుకొంటున్నామని అనుకోదుకదా! అవిటితనం తప్ప ప్రసాద్‌లో ఎంచడానికి ఏ వంకాలేదు. తనతో సమానంగా ప్రెస్‌లో పనిచేస్తాడు. అత్త, ప్రసాద్‌ల నీడలో ప్రీతి సుఖపడగలదు. అవిటివాడిని చేసుకొన్నానని, తొందరపడ్డానని తన చెల్లెలు తర్వాత జీవితంలో అనుకోకూడదు. అప్పుడు ప్రసాద్‌కి అన్యాయం జరిగినట్లవుతుంది.

మర్నాడు ఉదయం శ్రుతి నిద్ర లేవగానే ప్రీతి నిర్మలంగా నవ్వింది. ఎర్రగా ఉన్న అక్క కళ్ళని చూసి అక్కకి తనపైగల ప్రేమకి గర్వపడింది. "అంత ఆలోచన దేనికక్కా! నీకు జీవితంలో ప్రసాద్, నేనూ కుడి, ఎడమ భుజ ల్లాగ ఉంటాం" అని నమ్మకంగా అంటున్న చెల్లెలినిచూసి శ్రుతి నవ్వింది.




నవ్వితే కన్పించీ కన్పించని అక్క అంద మైన పలువరుసనని పరవశంగా చూసింది ప్రీతి. "అక్కా! మరి నువ్వు ఎప్పుడు పెళ్ళి చేసుకొంటావు?" అని నవ్వుతూ అడుగుతోంటే శ్రుతి ముద్దుగా చెల్లెలి నెత్తిమీద మొట్టింది.

"ఈరోజు మన ఇంటికి ప్రీతిని చూడటానికి పెళ్ళివారు వస్తున్నారు" అంటూ పది గంటల ప్పుడు బయటకి వెళ్ళివచ్చిన శ్రుతి ఇంట్లో వాళ్ళతో అంది. స్వీటు, హాటు చెయ్యమని అత్తకి చెప్పింది. రాఘవరావుని రమ్మని పిల్చింది.

శారదమ్మ, ప్రసాద్ లోపలకు అడుగుపెడు తోంటే వాళ్ళు ఏదో మామూలుగా తమకి సాయంగా వచ్చారని అనుకొన్నారు. శ్రుతి మాత్రం నవ్వుతూ ఎదురొచ్చి లోపలికి తీసికె ళ్ళి కుర్చీలలో కూర్చోపెట్టింది. వాళ్ళు కబుర్లలో పడ్డారు.

రాఘవరావు వచ్చాక అందరికీ శ్రుతి ఫలహా రాలు తెమ్మని అంటే సుభద్ర పెళ్ళివారు వచ్చాక అందరూ కలిసి తీసుకోవచ్చునని చెప్పింది. శ్రుతికి అత్త మాటలకి నవ్వు వచ్చింది. లక్ష్మమ్మ మాత్రం నాలుగు గంటలు దాటినా ఎవరూ రాకపోయేసరికి శ్రుతి తమని ఆటపట్టిస్తోందని కసిరింది. పెళ్ళివారు ఇంకా రాలేదేమిటని వాళ్ళ ఆందోళన.

"చూడు మామ్మా! ఇప్పటివరకూ ఎవరితో అయితే నువ్వు ఆప్యాయంగా కబుర్లు చెవుతు న్నావో వాళ్ళే మన పెళ్ళివారు. మన శారదత్త య్యా, ప్రసాద్‌లే ఈ రోజు ప్రీతిని చూడడానికి వచ్చిన పెళ్ళివారు" అని శ్రుతి అంటుంటే వసుధ, సుభద్ర ఆశ్చర్యపోయారు. లక్ష్మమ్మకి చిర్రెత్తుకొచ్చింది. అన్ని విషయాలలో వేళా కోళం పనికిరాదని మనవరాలిని మంద లించింది.

"అయ్యో! పిచ్చి మామ్మా! వేళాకోళం కాదు. నిజంగా మన ప్రీతిని చూసుకోవడానికి నేను రమ్మన్న పెళ్ళివారు వీళ్ళే. ప్రీతి, ప్రసాద్ ఒకరినొకరు బాగా కోరుకొన్నారు. నా జీవితంలో ఇంతమంచి పెళ్ళి కొడుకుని, మనసున్న పెళ్ళి కొడుకును చూడలేదు. మనల్ని బంధువుల న్న వాళ్ళందరూ భయపడి వదిలేస్తే వాళ్ళు మాత్రం మంచి మనసుతో మనకి బంధువుల వ్వాలని వచ్చారు. అత్తయ్య ఋణం ఎలా తీర్చుకోను?" ఉద్వేగంతో కళ్ళనీళ్ళతో అంటు న్న శ్రుతిని శారదమ్మ పొదివి పట్టుకొని దగ్గరకి తీసుకొంది.

శారదమ్మ వసుధతో, లక్ష్మమ్మతో ప్రసాద్ కోరిక గురించి చెప్పింది. శ్రుతి దగ్గరుండి చెల్లెలిని నడిపించుకొని వచ్చింది. అందరూ సరదాగా కబుర్లు చెప్పుకొంటూ ఫలహారాలు పూర్తి చేశారు. లక్ష్మమ్మ మాత్రం కాస్త ముభా వంగానే ఉంది.

రాఘవరావు ఎదురుగానే తమకి కట్నకాను కలేవీ వద్దని, ప్రీతే తమకి కట్నమని, పెళ్ళి క్లుప్తంగా చేసుకోవడమే ప్రసాద్‌కి ఇష్టమని శారదమ్మ చెప్పింది. ఏ కోవెలలో పెళ్ళి జరి పించినా తమకి అభ్యంతరం లేదంది. శ్రుతి కూడా చెల్లెలిని గ్రాడ్యుయేట్ చేయాలనే తన కోరికను వాళ్ళకి చెప్పింది. పెళ్ళైనా డిగ్రీ పూర్తిచేశాకే అత్తవారింటికి పంపుతానని సూ టిగా చెప్పింది. దానికి వారు అంగీకరించాలని కోరింది.

ఆడపిల్లలు లేని తనకి ప్రీతే కూతురనీ, తమ ఇంట్లో అయినా ప్రీతి చదువు కోవచ్చు ననీ, తనకీ ప్రసాద్‌కీ చదువంటే ఇష్టమని శారదమ్మ చెప్పింది. శ్రుతి మనసు అప్పటికి కుదుటపడింది. చదువు పూర్తయ్యేవరకూ అక్క దగ్గరే ప్రీతి ఉంటుందని రాఘవరావు చెప్పాడు.

భరత్ ఆనందానికి అవధులులేవు. ప్రసాద్ బావ అయితే తనకి మరీ లాభం. చాక్లెట్లు, సినిమాలు ఒకటేమిటి అన్నీ ఉంటాయి.

"ఏ కొత్త బావగారు వస్తారో? ఉడికించడాని కి, ఏడిపించడానికి అవుతుందో అవదో అని తెగబెంగపడుతున్నాను. ఇప్పుడు ఆ భయంలేదు" అంటున్నవాడి మాటలకు అందరూ నవ్వుకొన్నారు.

"ప్రసాద్ ఊరుకున్నా మీ ప్రీతక్క ఏమైనా అతడినంటే ఊరుకోదు. వీపు వాయిస్తుంది" అన్న రాఘవరావు మాటలకు అవునా అన్నట్లు వాడు అక్కవైపు చూశాడు.

వాళ్ళు వెళ్ళిపోయాక కొంతసేపు అవిటివా డితో పెళ్ళేమిటని లక్ష్మమ్మ గొణిగింది. తల్లిని,

అత్తను పిలిచి వారి అభిప్రాయం అడిగింది శ్రుతి. వసుధ కూతురు ఇష్టానికే వదిలేసింది. అసలు తన భర్త ఉంటే ఇలాంటి పరిస్థితులే ఎదురవ్వవు. ఇంక తనకి కావలసినది పిల్లలు జీవితంలో సుఖంగా ఉండటంమే అనుకొన్నది. అంతకన్నా ఏం చెప్పలేక కళ్ళనీళ్ళు పెట్టుకొంది.

మంచిరోజు చూసి రాఘవరావు పెళ్లి ముహూర్తం పెట్టించుకొని వచ్చారు. సింహాచలంలోనో, అన్నవరంలోనో పెళ్ళి జరిపించమని, ఎక్కువ డబ్బు ఖర్చు చేయవద్దని ప్రసాద్ చెప్పినా శ్రుతి విన్పించుకోలేదు. పెళ్ళి అనేది ఒక మధురఘట్టం. జీవితంలో మధురంగా నెమరు వేసుకొనే దివ్యమైన అనుభవం కావాలి. కనుకే వైభవంగా జరిపించాలని శ్రుతి నిర్ణయించుకొంది.

ఆనందంగా పెళ్ళి ఏర్పాట్లు జరుగుతోంటే స్వప్న స్నేహితురాలు తెచ్చిన వార్తతో శ్రుతి క్రుంగిపోయింది. స్వప్న ఇంట్లోంచి వెళ్ళిపోవడమా? సారథిని నమ్మి అతడితో జీవితం పంచుకొందుకు వెళ్ళడం శ్రుతికి నచ్చలేదు. కనీసం తనతో మాటమాత్రమైనా చెప్పకుండా స్వప్న అలాంటి నిర్ణయం తీసుకోవడం చాలా కష్టం కలిగించింది.

శ్రుతి స్వప్న ఇంటికి వెళితే వాళ్ళ నాన్నగారు ఒకటే గోల. ఆయన అరవై ఏళ్ళుపైబడ్డవాడిలాగ అయిపోయారు. మరొకవక్క స్వప్న పినతల్లి సాధింపు, తమ్ముళ్ళ ఏడుపు. శ్రుతికి చాలా బాధనిపించాయి. ఆయనను చూస్తే శ్రుతికి నోట మాటరాలేదు. ఇంక ఏమని ఓదార్చగలదు?

స్వప్న ప్రవర్తనలో మార్పు, తను ఆయనతో చెప్పాలనుకోవడం, తామిద్దరూ కలవలేకపోవడం శ్రుతి ఆయనకి చెప్పింది. శ్రుతిలోని బాధ చూసి ఆయన తేరుకొని ఆమెను ఓదార్చాడు. స్నేహితురాలిగా తన బాధ్యత తాను సక్రమంగా నిర్వహించలేకపోయానని శ్రుతి బాధ. స్వప్న ఆమెకి ఆ టైము ఇవ్వలేదు.

స్వప్నకి డబ్బు మీద ఉండే కోరిక, తను ఎన్నిసార్లో కూతురిని మందలించడం, ఆమె తన అభిప్రాయాలు మార్చుకోకపోవడం ఆయన శ్రుతికి చెప్పారు. "డబ్బు ఉండటమే జీవితానికి గొప్పని మీ స్నేహితురాలు అనుకొంటుంది. అంతకన్నా విలువైనవి ఉన్నాయని ఆమెకి ఎప్పుడు తెలుస్తుందో?" అని ఆయన ఆవేదనగా అంటోంటే శ్రుతి బాధపడింది. స్వప్నను మరి ఇంటికి రానివ్వనని సవతితల్లి తెగేసి చెప్పేసింది.

సారథితో స్వప్న పరిచయం ఆమెకి ఒక మైమరుపుని తెచ్చి పెట్టింది. సారథి తనను పెళ్ళి చేసుకొంటాడనీ, తనకి మామూలుగా బతకడం ఇష్టం ఉండదనీ, ఐశ్వర్యమైన జీవితం కోరి వెళుతున్నాననీ తండ్రికి ఉత్తరం రాసిందిట. ఆయన ఆ విషయాలన్నీ చెప్పి గోల పెట్టారు.

రెండు రోజులు పోయాక శ్రుతికి ఒక కవరు వచ్చింది. అంత పెద్ద ఉత్తరం రాసిన వాళ్ళు ఎవరా అని ఆశ్చర్యపోయిన శ్రుతికి దస్తూరిని చూడగానే అర్థమైపోయింది. అది స్వప్న రాసిన ఉత్తరం. అందులో తను అన్ని విషయాలూ రాసింది. ఏ కళనుందో ఈ స్నేహితురాలు గుర్తుకి వచ్చిందనుకొంది.

మొదట నుండి తనకి డబ్బంటే మోజుని, డబ్బు ఉంటే కొండమీది కోతి అయినా వస్తుందనీ, సారథికి తనంటే ఇష్టమనీ, అందుకే తాము పెళ్ళి చేసుకొంటామనిరాసింది. దరిద్రంతో వేగడం చాలా కష్టమని, మనిషి జన్మ ఎత్తినందుకు సుఖపడాలనుకొన్నానీ రాసింది. చాలీచాలని బతుకులు గడపడం తనవల్ల అవదుట. తండ్రి అంతకన్నా గొప్ప సంబంధం తేలేడు. కాకిలాగ కలకాలం బతకడంకన్నా హంసలాగ ఆరునెలలు బతికినా గొప్ప అని ఆమె ఉద్దేశం. కోరికలను అణచుకోవడం తన వల్లకాదుట.

శ్రుతీ! నువ్వు, నేను ఎంత ప్రాణ స్నేహితులమో నీకు తెలుసును. కానీ నువ్వంటే నాకు భయం. నువ్వూ, నీ అభిప్రాయాలూ ఎలాంటివో నాకు తెలుసును. నీతికి నువ్వు ఇచ్చే విలువ నాకు అర్థం లేనిదిగా అన్పిస్తుంది. ఏవేవో ఆదర్శాల కోసం నీ సుఖాన్ని వదులుకొంటున్నావు. ఒక డాక్టరు నీ అందం చూసి వివాహం చేసుకోవడానికి ముందుకు వస్తే కాదన్నావు. అందుకే నువ్వంటే భయం. నా నిర్ణయాన్ని అందుకే తెలియచేయలేదు.




సారథి సిరిసంపదల మధ్య అపురూపంగా పెరిగాడు. అతడంటే నాకు ఇష్టం. అతడితో జీవితం మరీ ఇష్టం. నేను అనుకొన్న విధంగా జీవితాన్ని హాయిగా అనుభవిస్తాను. నామీద కోపం పెట్టుకోకు. నీ కోపాన్ని నేను భరించలేను. జీవితంలో ఎప్పుడో కలుసుకొంటామని నా నమ్మకం. నా స్థితిగతులను చూసి ఆనాడు నువ్వే నన్ను అభినందిస్తావు'' అంటూ స్వప్న రాసిన ఉత్తరం చదువు తోంటే శ్రుతికి ఏడుపూ, ఆవేశమూ రెండూ కలిగాయి.

''ఫూల్... ఫూల్... ఎలాంటి పనిచేసింది. ఎంత ఇడియట్‌లాగ ప్రవర్తించింది. సారథి దాన్ని ఏం చేస్తాడో? నా గొడవలలో దాన్ని పట్టించుకోలేకోయాను. దాన్ని కాపాడుకోలేకపోయాను. స్నేహానికే నేను అన్‌ఫిట్. భగవంతుడు నన్ను క్షమించడు'' అని శ్రుతి ఏడుస్తూంటే ఎవరూ ఆపలేకపోయారు.

స్వప్న అతడి మాటలు ఎంత త్వరగా నమ్మింది? అయ్యో! ఎండమావుల వెంట పరుగెత్తిందే? అతడు మంచివాడైతే ఇక్కడే ఉండి పెళ్లి చేసుకోడా? అని శ్రుతి మనసులో బాధపడింది. శ్రుతిని చూసి ఆరోజు భరత్, ప్రీతి భయపడిపోయారు. శారదమ్మ, ప్రసాద్ ఎందరు వచ్చి నచ్చజెప్పినా శ్రుతి ఆవేదన తగ్గలేదు. మనసును సమాధాన పరచుకోలేకపోయింది.

శ్రుతితో వచ్చిన చిక్కే ఇది. ఏ పని చేసినా ఎంతో ఆత్మీయంగా చేస్తుంది స్నేహమైనా అంతే. ప్రాణం పెడుతుంది. లక్ష్మమ్మ మాత్రం ఆ పిల్ల ఎప్పుడో ఇలాంటి పనిచేస్తుందని అనుకొన్నానంది. స్వప్న వేషం, పోకడలు లక్ష్మమ్మకి అసలు నచ్చవు. అటువంటి దానికోసం ఈ రాగాలేమిటని ఆవిడ ఉద్దేశ్యం. అసలు దానితో స్నేహమే ఆవిడ వద్దనేది. లక్ష్మమ్మ స్వప్న గురించి ఏవేవో అంటూంటే శ్రుతి భరించలేక ఒక్కమాట స్నేహితురాలినన్నా ఊరుకోనని అరిచింది. సుభద్ర వచ్చి తల్లిని కేకలువేసింది. లక్ష్మమ్మకి సమయాసమయాలు తెలియవు.

సుభద్రకి తల్లిని చూస్తే అందుకే కోపం. శ్రుతిది సున్నితమైన మనసు అని కూడా అనుకోదు. ఆ రాత్రి తల్లి, సుభద్ర ఎంతో నచ్చచెప్పి శ్రుతి చేత నాలుగు మెతుకులు తినిపించారు. స్నేహితురాలి కోసం మనసు పరితపిస్తున్నా పెళ్ళి పనులలో చొరపడక తప్పలేదు. అలాగే వెళ్ళి మామయ్యని, పెద తండ్రిని పెళ్ళికి రమ్మని చెప్పి, అన్ని విషయాలు తెలియచేసి వచ్చింది.

కామేశ్వరి శ్రుతితో మనసు విప్పి మాట్లాడలేదు. రామచంద్రం మాత్రం నిజంగా సంతోషించాడు. తమ్ముడి కూతురు తనను పెద్ద చేసి, తన పేరు మీదే శుభలేఖలు వేసినందుకు, స్వయంగా వచ్చి పిలిచినందుకు పొంగిపోయాడు. డబ్బు ఆయన చేతిది అవకపోతే చాలు ఆయనకి. డబ్బు అంటే ఆయన చూపే అతి శ్రద్ధకి భానుమూర్తి అప్పుడప్పుడు విసుక్కొనేవాడు.

సాధారణంగా అన్నదమ్ములు కలిసినపుడు భానుమూర్తే అన్ని ఖర్చులూ పెట్టేవాడు. మొహమాటానికైనా వద్దని తమ్ముడిని అతడు వారించే వాడుకాదు. తమ్ముడు ఎందరికో బయటివాళ్ళకు ఖర్చుపెడతాడు. ఆ మాత్రం తనకి ఖర్చుపెట్టడం అతడి బాధ్యత అని అనుకొనేవాడు.

పెళ్ళి దగ్గరుండి వాళ్ళిద్దరే చేయాలని శ్రుతి చెప్పినప్పుడు అతడికి మనసులో ఏ మూలో కలుక్కుమంది. తువ్వాలుతో కళ్ళు తుడుచుకొంటూ తప్పక రెండు రోజులు ముందు వస్తానన్నాడు.

ఇప్పుడు బంగారం కొనడం అవదని శ్రుతి చెల్లెలికి తన చేతి గాజులు ఇచ్చేసింది. ఎవరు ఎంత చెప్పినా ఆమె వినలేదు. ప్రసాద్‌కి ఒక ఉంగరం, పట్టుబట్టలు కొన్నది. ఉన్నంతలో వాళ్ళకి గౌరవంగా చేయాలని అనుకొంది.

పెళ్ళి ఘనంగా అయిపోయింది.

శారదమ్మ కోడలుకి అయిదు తులాల బంగారం పెట్టింది. పట్టు చీరలు, మామూలుగా పెళ్ళిలో పెట్టే చీరలూ అన్నీ ఖరీదైనవే తీసింది. ఆమె పెట్టుపోతలు చూసి కామేశ్వరి మొహం ముడుచుకొని పోయింది.

బంధువులందరిలో తమ్ముడి పిల్లలు తనని పెద్ద చేసి నిలబెట్టినందుకు రామచంద్రం నిజంగా సంతోషించాడు. ఎంత

యినా తన వాళ్ళు. తన రక్తం.

భార్యకి తెలియకుండా వెళ్ళి ప్రీతికి ఉంగరం, పట్టుచీర కొని తెచ్చాడు. పది మందిలో తనకి చూపిస్తున్న భర్తను కామేశ్వరి ఏమీ అనలేకపోయింది. ప్రకాశం చెల్లెలి చేతిలో మూడు వేలు పెట్టి పెళ్ళి ఖర్చులకి ఉంచమన్నాడు. వసుధ వద్దని సున్నితంగా తిరస్కరించింది. జానకి, ప్రకాశాల మొహాలు మాడిపోయాయి. వాళ్ళు ఆవిడ అలాగ చేస్తుందని అనుకోలేదు.

పెళ్ళి సరదాగా జరిగినా, చెల్లెలు ఇంక అత్తవారింటికి వెళ్ళి పోతుందంటే శ్రుతి తట్టుకోలేకపోయింది. ఒక అయ్యచేతిలో పెట్టాక పంపక తప్పదుకదా! ఎలాగ చూసినా మనసుని నిలవరించలేకపోతోంది.

ప్రీతంటే శ్రుతికి ప్రాణం. చిన్ననాటినుండీ మనసులో మనసై ప్రవర్తించిన చెల్లి. తండ్రిపోయినప్పుడు బంధువులు ఒంటరిగా తమను తీసికెళతామంటే వణికిపోయి ఎలా కౌగలించుకొంది? ఆ చేతికంపన తనకి ఏనాటికీ గుర్తే. తల్లి ఏం చేస్తోంది? ఎలా తట్టుకొంటుంది?

శ్రుతి ఒక్కసారి తల్లి ఉన్నవైపు చూసింది. అప్పగింతలు అయిపోయినట్లున్నాయి. తల్లి శారదమ్మ రెండు చేతులనూ పట్టుకొని ఏడుస్తోంది. ప్రీతి తల్లి ఒడిలో చేరి కుమిలికుమిలి ఏడుస్తోంది. మామ్మ, అత్త కళ్ళు వత్తుకొంటూ చెరొక మూల చేరబడ్డారు.

శ్రుతి ఒక్కసారి తెలివి తెచ్చుకొని కన్నీళ్ళు తుడుచుకొని, తల్లిని ఆపబోయింది. సాధ్యమవలేదు. శారదమ్మ వసుధకి ధైర్యం చెపుతోంది. పిల్లలను వాళ్ళు ఎంత అపురూపంగా పెంచారో తనకి తెలుసునంది. పసిపిల్ల ప్రీతిని కన్నబిడ్డలాగ చూసుకొంటాననీ, దేనికీ లోటు చేయననీ చెప్పింది. లోకాచారం ఇది. పిల్లలకు పెళ్ళి చేసి పంపడం ధర్మం. ఆమె దూరంలో లేదు. మీకుదగ్గరలో ఉంది, అని అనేక విధాల ధైర్యం చెప్పింది.

ప్రీతి అక్కగారిదగ్గరికి వచ్చి ఒక్కసారిగా బావురుమంది. ఒకళ్ళనొకళ్ళు కౌగలించుకొని ఏడుస్తున్న వాళ్ళ దగ్గరకు ప్రసాద్ వచ్చాడు. వాళ్ళని అలాగ చూస్తుంటే అతడికి మొదట ఏం చెప్పాలో తోచలేదు.

"శ్రుతీ! మీరిద్దరూ ఇలాగ ఏడిస్తే ఎలాగ? మనమందరం కలిసి ఉండవచ్చునినికదా అనుకొన్నాం. నామీద మీకు నమ్మకం లేదా? మీతో కలిసి కష్టసుఖాలు కలుపుకొందామని నేను ఈ పెళ్లి చేసుకొంటున్నాను. ప్రీతి మీకు ఎప్పుడూ దూరం అవదు" అని ఓదారుస్తున్న అతడి మాటలకు వాళ్లు కొంత దుఃఖం అణచుకొన్నారు.

మూడు నిద్రలకని శాస్త్రానికి ప్రీతిని శారదమ్మ తన ఇంటికి తీసికెళ్లింది. సత్యనారాయణ వ్రతం మర్నాడు చేయిస్తాననీ, బంధువులందరినీ ఉండిపొమ్మనీ చెప్పింది. భరత్‌కి వడ్డనలంటే సరదా! అవి చేస్తూ ఇవతల గొడవ చూసుకోలేదు. శారదమ్మ ప్రీతిని తీసుకొని వెళుతోంటే వాడు ఒకటే ఏడుపు. అక్కని మీతో తీసుకొని వెళ్లవద్దు. బావే ఇక్కడ ఉంటాడు" అని. వాడిని సముదాయించడం అందరికీ కష్టమైపోయింది. ప్రీతి వాడిని తనతో తీసికొని వెళ్లింది.

శ్రుతి ముఖ్యమైన వాళ్లకి బట్టలు పెట్టింది. పెదతండ్రి, మావయ్యవాళ్లు మరో నాలుగురోజులు ఉండమన్నా వినకుండా వెళ్లిపోయారు. ప్రసాద్ పట్టుపట్టి పెళ్లికిముందే రమేష్‌కి కొంత అప్పు తీర్చమన్నా శ్రుతి వినలేదు. శుభకార్యం ఎదుట పెట్టుకొని డబ్బు వదిలేస్తే ఎలాగనుకొంది. పెళ్లి అయ్యాక ఉన్న పదివేలుకి, తన దగ్గర ఉన్న మూడువేలు కలిపి రాఘవరావుగారిని తీసుకెళ్లి మొదటిసారిగా పదమూడువేలు అప్పు తీర్చింది. మిగిలినవి వీలు చూసుకొని తీరుస్తానని చెప్పింది.

శారదమ్మగారి బంధువులు పెళ్లి అవగానే వెళ్లిపోలేదు. శారదమ్మ వదిన ప్రీతిని చూసి ఎంతో అసూయపడింది. శారదమ్మ కోడలుకి పెళ్లిలో పెట్టిన నగలు, బట్టలు చూసి ఆవిడకి కళ్లు కుట్టినట్లయింది. భర్తతో చేతులు త్రిప్పుతూ అననే అంది. "ఉందని బడాయి కాకపోతే మీ చెల్లెలు కోడలుకి గొలుసు, ఉంగరం, నల్లపూసలు అన్నీ ఇప్పుడే చేయించి పెట్టాలా? ఎవరైనా ఒక పట్టుచీర పెడతారు. మీ చెల్లెలు రెండు పట్టుచీరలు కొంది. మనతో




కలిసి ఉంటే తన ఆస్తి మనకింత ఖర్చయిపో తుందని ఇలాగా కొడుకుతో వేరు వచ్చేసింది'' అని తన అక్కను తీర్చుకొంది.

ఆవిడ పేరు అనసూయ. కానీ ఒళ్ళంతా అసూయే. పెళ్ళికి వచ్చిన ఆడంగులు ఎవరో, "మీ దగ్గర ఆడపిల్లలిద్దరున్నారుకదా! మరి మీ మేనల్లుడిని ఎందుకు కలుపుకోలేదు'' అని అడిగారు. అనసూయకి ఒళ్లంతా కారం రానుకొన్నట్లు అయింది. పైకి మాత్రం నవ్వు తూ "ఎంత ఆస్తి ఉంటే ఏం లాభం? మా పిల్లలు అవిటివాడిని చేసుకొంటారా? జీవి తాంతం అవిటివాడితో ఎలా అవస్థ పడతా రు?'' అని గట్టిగానే అంది. అటువైపు వస్తున్న శారదమ్మ, ప్రసాద్ ఆవిడ మాటలు విన్నారు. శారదమ్మ మొహం వివర్ణమైపోయింది.

"పాపం పెళ్లికూతుర్ను చక్కనిపిల్లే. అయినా ఏమిటో ఇలాంటి సంబంధం చేశారు'' అని మరొక అమ్మలక్క సానుభూతి ప్రకటించింది.

"ఆ... వాళ్ల ఇంట్లో తండ్రి ఈమధ్యే పోయా డుట. ఎవరు నడుంకట్టి ఈ కాలంలో ఆడ పిల్లల పెళ్లిళ్లు చేస్తారు. ఏదో గంతకుతగ్గ బొంతని చేశారు'' అని జానకి తనతో చెప్పిన మరో నాలుగు విషయాలు జోడించి చెబుతే కానీ అనసూయకి తృప్తి కలగలేదు. ప్రీతికి వాళ్ల మాటలు కష్టమన్పించాయి.

గదిలోనుండి వాళ్ల దగ్గరకి వెళ్లబోతూంటే అప్పుడే అటు వచ్చిన ప్రసాద్ చెయ్యిపట్టుకొని ఆమెను ఆపాడు. ఒకక్షణం ఇద్దరూ ఒకరినొక రు చూసుకొంటూ ఉండిపోయారు. నెమ్మదిగా ఆమె చేతిని పైకిలేపి ముద్దుపెట్టుకొన్నాడు. ప్రీతి సిగ్గులమొగ్గే అయింది.

మెడలోకి కొత్తగా వచ్చి చేరిన పసుపుతాడు, నల్లపూసలమధ్య బంగారునగలతో, ఎరుపు పట్టుచీరలో కుందనపు బొమ్మలాగా ఉన్న ప్రీ తిని కళ్ళారా చూసుకొన్నాడు. "ప్రీతీ! మనకి నిజంగానే పెళ్లి అయిందికదూ! ఇది కల కాదుకదూ'' అని అతడు అంటూంటే ప్రీతికి తను చేరవలసిన తీరం ఏదో చేరినట్లని పించింది. ఏదో పనిమీద గదిలోకి రాబోయిన శారదమ్మ వాళ్లిద్దరినీ చూసి తప్పుకొంది.

బంధువులను శారదమ్మ ఘనంగానే సత్క రించింది. ప్రీతిని పిలిచి వదినగారికి పట్టు చీర పెట్టించింది. ఇప్పుడు అవన్నీ ఎందుకనీ అన్నగారు వారిస్తున్నా వినలేదు. వాళ్లే తనకి పెద్దవాళ్లని, ఇంతవరకూ వాళ్లు ఆదుకొని చే సిన సహాయానికి ఏం చేసినా తక్కువేనని అంది. శారదమ్మ సున్నితంగా చెప్పినప్పటికీ అనసూయకి అందులో ఎగతాళే కన్పించింది.

వాళ్లని ఉండమంటే ఇంకా ఎక్కువరోజులే ఉంటారని శారదమ్మకి తెలుసు. ఇంకా వాళ్లను ఉంచుకొని ప్రీతి స్వచ్ఛమైన మనసుని బాధపె ట్టదలచుకోలేదు.

శారదమ్మ ఉండమని బలవంతం చేయలే దని వాళ్లు గింజుకొన్నారు.

చిన్నక్క అత్తవారింటికి వెళ్లిపోయింది. తను రాత్రి ఎవరి దగ్గర పడుకోవాలో భరత్‌కి తోచలేదు. వాడు రాత్రంతా కాళ్లతో కుమ్ముతా డని ఎవరూ దగ్గర పడుకోపెట్టుకోరు. అయినా పిల్లలకి ఎవరి మంచంవారికి ఉండాలని భానుమూర్తి ఏర్పాటు చేశాడు. అతడు పోయిన దగ్గర్నుండీ ప్రీతి దగ్గరే వాడి పడక.

భరత్‌కి నిద్ర వస్తోంది. ఒక్కడూ పడుకోలే డు. చిన్నక్క మంచంవైపు చూస్తూ కూర్చున్న వాడిని చూస్తే శ్రుతికి జాలేసింది. తన దగ్గరికి వచ్చి పడుకోమంది. వాడు ఒక్క గెంతువేసి వచ్చి ఆమె మంచంమీద పడుకొన్నాడు, ఇంకా ఏదో పుస్తకం చదువుకొంటున్న అక్కని కూడా పడుకోమన్నాడు. శ్రుతి నవ్వుకొని వాడి పక్కన వాలింది. చెల్లెలు గూర్చి ఆలోచనలు చుట్టుముట్టాయి.

ప్రీతి, ప్రసాద్ నాలుగవరోజున రాగానే భరత్ ప్రీతిని అల్లుకొని పోయాడు. ఊళ్లో ఇల్లు. రోజుకి నాలుగుసార్లు వెళ్లి వచ్చేవాడు. అయినా సరే వాడికి అది బాగుండలేదు. మరి అక్కను అత్తవారింటికి వెళ్లవద్దనీ, అత్తయ్యని, బావను తాము తెచ్చేసుకొందామనీ చెప్పాడు. శారదమ్మ వాడి అవస్థకి నవ్వుకొంది.

ప్రసాద్ అని పిలవకూడదని సుభద్ర వాడి కి నచ్చచెప్పింది. బావగారని పిలవడానికి వాడు నానాతంటాలు పడుతున్నాడు. ఇంట్లో కూతురు అల్లుడు తిరుగుతోంటే వసుధకి ఎంతో తృప్తిగా అన్పించింది. లక్ష్మమ్మకి మరీ సంబరంగా ఉంది. శారదమ్మని పిలిచి మంచి రోజు చూసి కార్యంకి కూడా ముహూర్తం పె

ట్టించమంది.

శారదమ్మ వసుధతో మాట్లాడుతోంటే ప్రసాద్ తల్లిని పిలిచి మందలించాడు. పెళ్లికి ముందు శ్రుతితో ప్రీతిని చదివిస్తామని చెప్పాంకదా, ఇప్పుడు మళ్లీ ఈ గొడవేమిటని అడిగాడు. శారదమ్మ మాట్లాడలేకపోయింది.

శ్రుతి ప్రీతి చదువు గురించి ఎంతో ఆశపడుతోంది. "వివాహం విద్యనాశాయ" పెళ్లి, కాపురం వీటితో చదువుసాగదని ఆమె ఆలోచన. తను, తన తల్లి ఈనాడు మాట తప్పారనుకొంటుంది. అందుకే లక్ష్మమ్మ విషయం పట్టించుకోవద్దని శ్రుతి శారదమ్మకి చెప్పేసింది. వాళ్లు కూడా చెల్లెలి చదువు పూర్తవ్వాలని అనుకోవడం ఆమెకి సంతోషం కలిగించింది. లక్ష్మమ్మకి మునిమనవలని ఎత్తుకోవాలని సరదా. వసుధను సాధించడం మొదలుపెట్టింది. శ్రుతి తల్లిని ఆవిడ మాటలు విని వదిలెయ్యమంది.

చివరికి శ్రుతే ఆవిడ దగ్గర కూర్చుని కుటుంబ సాధకబాధకాలన్నీ చెప్పింది. తండ్రి సంవత్సరీకాలు దగ్గర్లో ఉన్నాయి. వాటి గూర్చి మానేసి ఈ విషయంమీద ఎందుకు ఇంత ఆలోచనని అడిగింది. డబ్బు సర్దుబాటు చేసుకోవాలి. ప్రీతి పిల్లల్ని తప్పక ఆవిడ చూస్తుందని, అందాక చదువుకోవడం ముఖ్యమని నచ్చచెప్పింది. సుభద్ర కూడా తల్లిని అన్నింటికీ సాధించడం మంచిదని కాదని చెప్పింది. ఇప్పుడు పెళ్లి చేయడమే ఆవిడ కోరిక అన్న విషయం మరిచిపోవద్దంది. అందరూ కలిసి తనకి కట్టకట్టుకొని హితోక్తులు చెపుతోంటే ఆవిడకి కాస్త కష్టమన్పించింది.

సంవత్సరీకాలు శ్రుతికి ఒక సమస్య అయ్యాయి. పెళ్లైన ఇంట్లో ఏడాదివరకూ ఇలాంటివి పెట్టకూడదన్నారు. తమ ఇల్లు, శారదమ్మ ఇల్లు పనికిరావు. అక్కడికీ రామచంద్రం తన ఇంట్లో పెట్టుకొందామని రాశాడు. శ్రుతికే ఇష్టమనిపించలేదు. ఏం చేయాలి?

చివరికి డబ్బు ఖర్చయితే అయింది. రాజమండ్రీలో జరిపించాలని అనుకొంది. తడిపిమోపెడు ఖర్చవుతుంది. నీకేమైనా మతిపో





యిందా అని సుభద్ర కేకలు వేసింది. అయినాసరే పెదతండ్రి ఇంట జరిపించడానికి శ్రుతి ఒప్పుకోలేదు. డబ్బు ఎలాగో ఒకలాగా సర్దుకొనో, అప్పుచేసో వాటిని జరిపించాలని ఆమె ఉద్దేశం.

రామచంద్రం, భార్య, వసుధ, పిల్లలు, లక్ష్మమ్మ, ప్రకాశం రాజమండ్రి బయలుదేరారు. సుభద్ర ఇల్లు చూసుకొంటానని, ప్రసాద్ ప్రెస్ చూడాలని ఉండిపోయారు. రాఘవరావుగారి దగ్గర డబ్బు కొంత అప్పుచేసి, తను దాచినది అదీ కలిపి జరిపించింది. ఇంతమంది వెళ్లడంవలన ఛార్జీలు, ఖర్చులు బోలెడైనా అన్నీ తృప్తిగా జరిగాయి.

ఆ సంవత్సరీకాలు ఎక్కడ తమ ఇంట్లో పెట్టి, ఖర్చు తమనెత్తిన రుద్దుతారో అని ఉత్తరం అయినా రాయవద్దని కామేశ్వరి గొడవ చేసింది. పెళ్లిలో అతడు గొప్పకి పోయాడనే ఇంటికి వచ్చాక వంద గొణిగింది. కానీ శ్రుతి ఖర్చు ఉంచుకోదని తెలిసి రామచంద్రం ఉత్తరం రాశాడు. ఇప్పుడు రాజమండ్రిలో పెట్టడం ఆవిడ ప్రాణానికి తెరిపినిచ్చింది.

పెళ్లిలో భరత్ ఒడుగు చేయడానికి ముహూర్తాలు నప్పలేదు. ఒడుగుకి మంచి ముహూర్తాలు నప్పాలి. అందుకని అవలేదు. ఈ ఏడాది ఎలాగైనా మంచి ముహూర్తం చూసి తమ్ముడి ఒడుగు చేయించమని శ్రుతి అయనకి చెప్పింది. ఆయన సరేనన్నాడు. తమ్ముడి ఒడుగైతే ఇంక తండ్రి తద్దినాలు వాడే పెడతాడు. రామచంద్రంకి లక్ష్మమ్మ కూడా అదే విషయం చెప్పింది. వటువుగా, పంచశిఖలతో వాడిని చూడాలని ఉందని చెప్పింది.

భరత్ నాయనమ్మవైపు చూశాడు. ఈవిడకి ఇదేం కోరిక? పంచశిఖలు పెట్టిస్తాను, గుండు చేయిస్తాను అంటూ. ఆ రూపంలో చూడాలని ఏమిటి? అసలే అతడికి జుట్టంటే మహాప్రీతి. ''మామ్మా! ఇలాగే రోజూ ప్రాణం తినేసేదానివి కాబోలు తాతగారు నిన్ను వదిలివెళ్లిపోయారు. పంచశిఖలంటావేమిటే నాకు బాగుండవు. నామీద, నా జుట్టుమీద నీకెందుకంత కసి' అని గొడవ చేశాడు.

లక్ష్మమ్మ మాత్రం తక్కువతిందా? పంచశిఖలు పెట్టించుకొని శాస్త్రోక్తంగా ఒడుగు చేయించుకొంటే తన వేలిన ఉన్న ఉంగరం ఇచ్చేస్తానంది.

ఎలాగూ నీ తర్వాత ఉంగరం నాదే. దాని కోసం ఎందుకు ఈ ఏర్పాటు'' అని కొట్టిపారేశాడు. ఎప్పటి గొడవో ఇప్పుడెందుకని శ్రుతి ఊరుకోబెట్టింది.

సాలూరునుండి సంగీత సభవారు శ్రుతిని అన్నమాచార్యుల కీర్తనలు పాడమని పిలవడానికి వచ్చారు. శ్రుతి వాళ్లతో మాట్లాడుతోంది. రేడియోలో రాయబారం సీను పద్యాల బ్రహ్మాండంగా వస్తున్నాయి. లక్ష్మమ్మ రేడియో విందంటే మరి ఆ వీధిలో ఎవరూ పెట్టుకొని విననక్కరలేదు. ఆవిడ తాదాత్మ్యంగా వాటిని వింటోంది.

శ్రుతికి, వచ్చినాయనకి మాట్లాడుకోవడం కుదరడంలేదు. భరత్ అక్క అవస్థ చూశాడు. వచ్చి రేడియో కట్టేసి ఇంట్లోకి తీసికొనిపోయాడు. లక్ష్మమ్మ రేడియో తెమ్మని గొడవ. ''ఒక్క పద్యం అయినా చదవడం రాదు. వాళ్ళు చూడు ఎంత బాగా చదువుతున్నారో? వింటోంటే కడతావా?'' అని ఆవిడ దెబ్బలాటకి దిగింది.

''ఏమిటీ! నాకు ఒక్క పద్యం చదవడం రాదా? ఏదీ... ఎలా అన్నావే ఆ మాట మామ్మా... చూడు చదివేస్తున్నాను అంటూ ''ఉప్పు కప్పురంబు ఒక్కపోలికనుండు'' అంటూ రాగంతో చదవడం మొదలుపెట్టాడు. లక్ష్మమ్మకి ఒళ్ళుమండింది. ''చదివావులే మా గొప్ప పద్యం. ఇలాంటివి వంద చదువుతాను'' అని సవాలు చేసింది. భరత్ అంత త్వరగా ఓటమిని ఒప్పుకొంటాడా?

''ఏదీ! నాలాగ కవిత్వం చెప్పు చూస్తాను'' అంటూ ''వెళ్లింది పిట్ట వేసింది రెట్ట'' అని అన్నాడు. ఎంత సునాయాసంగా చెప్పానో చూడు. నువ్వు అంత త్వరగా చెప్పు చూస్తాను అంటూ లేని మీసాలు దువ్వుకొన్నాడు. ఈలోపు వచ్చినతను మాట్లాడటం పూర్తయి వెళ్లిపోయాడు. వంటింట్లోనుండి మామ్మ, మనవడి గొడవ వింటున్న ప్రీతి నవ్వుకొంటూ వచ్చి అక్కగారికి చెప్పింది.

లక్ష్మమ్మ ప్రీతిచేత రేడియో తెప్పించి పెట్టుకొన్నా అప్పటికి పద్యాలు అయిపోనే అయిపోయాయి. ఆవిడ నెమ్మదిగా పెట్టుకొంటే ఏ గొడవా ఉండదుకదా అనుకొంది ప్రీతి.

తల్లిని తనతో వచ్చెయ్యమని అడిగాడు రామచంద్రం. ఆవిడ భరత్‌ని, కోడలిని వదిలి రాలేనంది. ''మాకు మాత్రం పొరుషాలు లేవా?'' అని చెప్పేసింది కూడాను. అతడికి లోకంబాధ ఎక్కువగా ఉంది. అందరూ మీ తమ్ముడి కుటుంబాన్ని మీరే చూస్తున్నారు కాబోలు అనీ, అమ్మగారు మీ తమ్ముడు లేకపోయినా అక్కడే ఉన్నారెందుకనో అనీ ఏవో ఒకటి అంటున్నారు. శ్రుతి సంగతి సరేసరి. ప్రేమగా, స్నేహంగా సంబంధాలు కొనసాగిస్తోనే ఉంది. దీనికన్నా తనని రానివ్వకపోయినా, నాలుగు మాటలన్నా సుఖంగా ఉండేది.

తల్లి రానని మొండిపట్టు. అతడికి ఎంతో చిరాకుగా ఉంటోంది. వీళ్లందరూ అక్కడే ఎందుకు తిష్టవేసి కూర్చుంటారో అని రోతగా అనుకొన్నాడు. భార్య మాత్రం తేలికగా తీసిపారేసింది. ''చాల్లెండి సంబడం. పిచ్చి కుదిరింది, తలకి రోకలి చుట్టమన్నాడుట అలాగుంది. మీ వాళ్లమీద ఏమిటి ప్రేమ ఈమధ్య మరీ కారిపోతోంది. నా పిల్లలు, నేను అడుక్కుతినాలా?'' అని దులిపేసింది.

శ్రుతికి కాలం ఎలా నడుస్తోందో తెలియడంలేదు. పని, చదువు, ఇల్లు వీటితోనే అయిపోతోంది. ఓరోజు లక్ష్మమ్మ గబగబా వచ్చి ''శ్రుతీ! ఇది విన్నావులే వంశీకృష్ణకి గుడ్డికొడుకు పుట్టాడుట. పాపం. రాఘవరావు ఫోను రాగానే పరుగుపరుగున వెళ్ళాడుట'' అంటూ కబురు చేరవేసింది.

''మామ్మా! ఇది నిజమా?'' అంటూ బ్రాన్పడిపోయి శ్రుతి కూర్చుండిపోయింది. ఎందుకో ఆమెకి నమ్మబుద్ధికాలేదు.

''నిజమేనే, నేనెందుకు అబద్ధం చెపుతాను.? రమణమ్మగారింటికి వెళితే ఆవిడ చెప్పింది. ఇందాక'' అంటూ వివరాలన్నీ చెప్పింది. శ్రుతికి ఎలాగో అన్పించింది. ఇంట్లోని వారందరూ ఆశ్చర్యంగా వింటున్నారు.




అంత పెద్ద అందమైన కళ్లు ఉండే వంశీ కృష్ణకి కళ్లులేని కొడుకా? ఇదెలా సంభవం? ఏ జన్మలో చేసిన పాపం? అంకుల్, వీణ ఎంత బాధపడుతున్నారో? అసలే సున్నిత మనస్కుడు అతడు ఎలా ఉన్నాడో?

వసుధ వీణ గురించి ఎలా ఉందో అని బాధపడింది. ఈ విషయాన్ని ఆమె ఎలా తీసుకొంటుందో శ్రుతికి భయమే. అంకుల్ కొడుకుకి జరిగిన ఈ అన్యాయానికి ఎంత బాధపడుతున్నారో? అసలు అంతమంచి వాళ్లకి ఇంత శిక్షేమిటి? శ్రుతి మనసు పరిపరివిధాల పోతోంది.

"చేసుకొన్నవాళ్లకి చేసుకొన్నంత అని పెద్దవాళ్లు ఊరికే అన్నారా? అసలు ఆయన కోడలు భూమిమీద నడిచిందా? ప్రీతి పెళ్లికి పిలవడానికి వెళ్లినప్పుడు కుంటివాడికి ఇస్తున్నారా అని ఎంత హేళన చేసిందో మన సుభద్ర అక్కడనుండి వచ్చి చెప్పి ఎంత బాధపడింది. శ్రుతికి మొహమాటం కనుక అన్నీ పడివచ్చేసింది. ఇప్పుడు గ్రుడ్డి కొడుకుని ఏం చేస్తుందో చూస్తాను" అంటున్న లక్ష్మమ్మని శ్రుతి కోపంగా చూసింది.

"మామ్మా! ఆవిడ నోరు పారేసుకొందని మనం పారేసుకోవాలా? అయినా ఇప్పుడు ఆ గొడవలెందుకు? నువ్వు అలా అనకూడదు. అంకుల్ మనకి కావలసినవారు. మనల్ని అన్నివిధాలుగా ఆదుకొన్నవారు. ఆయనకి ఈ ఆపద వచ్చిందని మనం బాధపడాలి. ఈ సమయంలో ధైర్యం చెప్పాలి" అంటూ గట్టిగా మందలించింది. శ్రుతి మాటలకు లక్ష్మమ్మ నోరు నొక్కుకొంది. "బయటచూస్తే పులి. అయినవాళ్ల దగ్గర మాత్రం పిల్లి" అంటూ కోపంగా మనవరాలిని తిట్టుకొంది.

శ్రుతికి ఆ సంఘటన గుర్తుకి వచ్చింది. శ్రుతి, సుభద్ర, భరత్ పెళ్లి శుభలేఖలు పంచడానికి వాళ్ళ ఇంటికి వెళ్ళారు. ప్రీతిని ప్రసాద్‌కి ఇస్తున్నారని వీణ చాలా వేళాకోళం చేసింది. అక్కగారిలాగ బాగా అందం ఉంటే ఎవరో ఒకరు పెళ్లి చేసుకొంటామని వచ్చేవారంది. ప్రీతికి అందం లేదు కనుక ఇలాంటిది ఏదో ఒకటి చేసుకొంటున్నారా అని అడిగింది.

"మీ కుటుంబం కోసం మీరు ఎంతో త్యాగం చేస్తున్నారని మామగారు ఎప్పుడూ అంటారు. చెల్లెలికి కుంటి భర్తని చూడటమే త్యాగమా?" అని వేళాకోళం చేసింది. శ్రుతి చాలా కష్టపడి తనని తాను కంట్రోల్ చేసుకొంది.

కనీసం ఇంటికి వచ్చిన వాళ్లని కూర్చోమనడం, ఏ కాఫీయో ఇవ్వడం ఈ మర్యాదలు ఏవీలేవు సరికదా వ్యంగ్యోక్తులు. చెల్లెలు ఈ పెళ్లి చేసుకోవడం కూడా పేరుకోసం, గొప్పకోసమని అంది. ఆదర్శ వివాహమని అందరూ అనుకోవాలని తమ కోరికట. నోటికి ఏది వస్తే అది నిస్సంకోచంగా అంది.

సుభద్ర మాత్రం ఇంక ఊరుకోలేకపోయింది. "చూడమ్మా! ఎంత పుణ్యం చేసుకొంటే అంతే ఈ జన్మలో పొందుతారు. ఎవరి ఖర్మకి ఎవరు కర్తలు?" అని చురకగా అంటూంటే రాఘవరావుగారు స్నానం ముగించుకొని వచ్చారు. నిల్చోపెట్టి మాట్లాడుతున్న వీణని కేకలు వేశారు. ఇంటికి వచ్చిన వారిని మర్యాద చేయడం గృహిణీ ధర్మమని వచ్చినవాళ్ల ఎదురుగా తనని మావగారు మందలిస్తోంటే వీణ భరించలేక విసురుగా లోపలకు వెళ్లింది. కోడలి ప్రవర్తనకి ఆయన చాలా సిగ్గుపడ్డారు.

లక్ష్మమ్మ మాటలతో మళ్లీ ఆ గొడవంతా శ్రుతికి గుర్తుకు వచ్చింది. ఇంత మర్యాదగా పిలిచినా వీణ పెళ్లికి రానేలేదు. శ్రుతి రాఘవరావుకే బట్టలు పెట్టి ఊరుకొంది.

శ్రుతి సాధారణంగా ఏ అవమానాన్నీ భరించదు. అసలు అటువంటి మనుషులకు ఆమడదూరంలో ఉంటుంది. కానీ తండ్రి స్నేహితులవడంవలన ఆయన పెద్దరికం చూసి తగ్గిపోవలసివస్తోంది.

ఒకసారి మహిళామండలివారు ఏదో రేడియో ప్రోగ్రాం ఉందని, శ్రుతిని వచ్చి పాల్గొమని అడిగారు. "మహిళాభ్యుదయమే జాతీయాభ్యుదయం" అన్న అంశంపై మాట్లాడాలన్నారు. రేడియోవాళ్లు రికార్డు చేసుకొన్నారు. ఊళ్ళోని సంస్థకదా అని శ్రుతి ఒప్పుకొంది. వీణ కూడా అప్పుడే కదంబ కార్యక్రమంలో వాళ్ళతో పాల్గొంది. శ్రుతిని వాళ్లు పిలుస్తారని ఆమె అనుకోలేదు.



ఇంక అక్కడ ఉన్న ఇంజనీరుగారి భార్యతో ఏదేదో మాట్లాడటం మొదలుపెట్టింది. డబ్బు లేనివాళ్లు ఉన్నవాళ్ల చుట్టూ తిరుగుతారుట. పనులు జరిపించుకోవడమే వాళ్ల లక్ష్యమట. ఏం చూసుకొని వీణకి అంత అహంకారం? ఆ డబ్బు తను సంపాదించినదా? డబ్బు ఉంటే మరికొన్ని సౌఖ్యాలు వాళ్లు అనుభవిస్తారు. లేనివాళ్లకి ఏం ఇవ్వరుకదా? మనిషి బ్రతికేది నాలుగురోజులు. ఈ నాలుగురోజుల బతుకుకే ఇంత అహంకారమా? ఇదివరకు మరొకసారి వంశీకృష్ణ ఎదురుగానూ అలాగే మాట్లాడింది.

రాఘవరావు ఏవో కాగితాలు ఇచ్చి ప్రింట్ చేసి తెమ్మంటే, తనే ఎలాగో ఇంటికి బయలు దేరానుకదా అని వాటిని అందచేయడానికి వెళ్లింది. వీణ, వంశీకృష్ణ కేరమ్స్ ఆడుతున్నారు. రాఘవరావుగారు లేరు. అప్పుడూ అలాగే చేసిందిగానీ తను కూర్చునేవరకూ వంశీకృష్ణ ఒప్పుకోలేదు.

ఆరోజు ఎందుకో సరదాపడి ప్రీతి కొత్తచీర కట్టుకోమంటే తను కట్టుకొంది. తలంటుపోసి, అల్లుకొన్న జుట్టు, తలలో పువ్వులు. చెల్లి బలవంతంగా మాల అల్లిపెట్టింది. అలంకరణ ఆడపిల్లకి సహజం. సాటి ఆడపిల్లయి ఉండి వీణ భర్తతో "చాలామంది లోకంలో డబ్బు లేనట్లు పేదవారిమని చెప్పుకొని తిరుగుతారు. అలాగని వాళ్ల బట్టలు, వేషం, పోకు చూస్తే ఆశ్చర్యం వేస్తుంది. అవి మాత్రం తగ్గించుకోరు. ఎందుకని?" అంటూ నవ్వడం చూస్తే శ్రుతికి కష్టం కలిగింది.

వంశీకృష్ణ ఏమిటా మాటలని భార్యను మందలించాడు. "అయ్యో! మీ గురించి కాదు. మీ గురించి కాదు. జనరల్‌గా అంటున్నాను. మీరు కాఫీ త్రాగుతారా?" అంటూ పనిమనిషికి పురమాయించింది.

వంశీకృష్ణ శ్రుతివైపు చూశాడు. శ్రుతి మొహం వాడిపోయి ఉంది. "లోకంలో కొందరు ఆడవాళ్లు తాము చేసుకోవలసిన పనులు కూడా చేసుకోరు. పరాన్నజీవులుగా ఇతరులపై ఆధారపడతారు. ఎందువలన శ్రుతీ?" అంటూ "అహా... నేను నీ గురించి అనలేదు. వీణా! లోకంలోని సంగతి చెప్పాను" అంటూ నవ్వాడు. వీణ మొహం ముడుచుకొని, భర్తను కోపంగా చూసింది. శ్రుతి బావుండదని కాసేపు కూర్చుని, పేపర్లు ఇచ్చేసి వచ్చింది.

ఇంటికి వచ్చి బాధపడింది. అంతకన్నా ఏం చేయగలదు? రాఘవరావు శ్రుతి గురించి ఇంట్లో ఎప్పుడూ మాట్లాడకుండా ఉండరు. ఆయనకి అంత ప్రాణమైపోయింది. వీణకి తనని ఏదో వాళ్లు తక్కువ చేస్తున్నారని, బయటివాళ్లకి ప్రాముఖ్యతనిస్తున్నారని అన్పిస్తుంది. శ్రుతి వాళ్ళింటికి వెళ్లడమే తగ్గించుకొంది. వాళ్ళు వైజాగ్ వెళ్లిపోయాక మళ్ళీ ఆయన కోసం వెళ్లవలసివస్తోంది.

వసుధ రెండు రోజులనుండి వైజాగ్ వెళ్ళిరమ్మనీ, రాఘవరావుగారిని చూసిరమ్మనీ, లేకపోతే బావుండదనీ తినేస్తోంది. శ్రుతికి వైజాగ్ వెళ్లాలంటే ఏదో వెరపు. ఇటువంటి ఒదార్పులు అలవాటులేవు. మామ్మ ప్రయాణం చేయలేదు. అత్తని ఒంటరిగా వెళ్లమంటే బావుండదు. తల్లి చూస్తే వెళ్లక తప్పదంటోంది. ప్రసాద్ కూడా వెళ్ళాలని చెప్పడంతో ప్రీతి, తను బయలుదేరారు.

ఇంటికి వెళ్ళేసరికి వీణ చెల్లెలు శ్రీవల్లి మొదట కన్పించింది. అమ్మయ్య అనుకొన్నారు. అక్కగారు ఇంకా హాస్పిటల్‌లోనే ఉందనీ, మెంటల్‌గా ఈ విషయాన్ని తట్టుకోలేకపోతోందనీ చెప్పింది. రాఘవరావుగారూ, కొడుకూ హాస్పిటల్‌లోనే ఉన్నారుట. శ్రీవల్లి తల్లికి, అక్కకి కేరేజీ పట్టుకొని వీళ్ళతో బయలుదేరింది.

దూరంనుండే వాళ్లను చూసి రాఘవరావుగారు ఎదురువచ్చారు. ఆయన మొహం చాలా అలసటగా ఉంది. శ్రుతి ఎప్పుడూ ఆయనను అలాగ చూడలేదు. ఆయనతో ఏం మాట్లాడాలో తెలియలేదు. ఆయనే అన్నీ చెపుతూ వీణ పడుకొన్న రూంల్లోకి తీసికెళ్లారు.

వంశీకృష్ణ భార్య మంచం దగ్గర స్టూలు మీద కూర్చుని ఉన్నాడు. భార్యను సముదాయిస్తూ, హార్లిక్సు త్రాగమంటున్నాడు. ఆమె తాగనంటోంది. వీణ తల్లి దూరంగా కూర్చుని స్నానం చేసి తీసికొని వచ్చిన మనవడికి ఒళ్లుతుడుస్తోంది.

"అమ్మా! వాడిని అవతలపారెయ్యి. ఆ కళ్లులేని వెధవ నాకొద్దు. నేను వాడిని చూడలేను. వాడు మనకి వద్దు. ఇంకా వాడిని ఎందుకు




ఉంచావు. నన్ను ఏడ్పించడానికే వాడు పుట్టాడు'' అంటూ తల్లివైపు తిరిగి కేకలు వేసింది. శ్రుతికి ఆమె గొంతు, దానిలోని తీవ్రత చూస్తే భయంవేసింది.

వంశీకృష్ణ భార్య మొహం తనవైపు తిప్పుకొని సముదాయిస్తున్నాడు. భార్యని వాడివైపు చూడవద్దని, వాడు ఇప్పుడు ముఖ్యంకాదని ఆవిడ ఆరోగ్యం తనకి ముఖ్యమని నచ్చచెప్తున్నాడు. శ్రుతీ వాళ్లను చూసి బలవంతంగా నవ్వాడు. ఎవరో వచ్చిన అలికిడికి వీణ కూడా ఇటువైపు తిరిగింది.

''చూడమ్మా! వీళ్లు నిన్ను చూడటానికి వచ్చారు. ఆ హార్లిక్సు తాగి వాళ్లతో నువ్వు కబుర్లు చెప్పాలి'' అంటూ రాఘవరావు కోడలితో అన్నారు.

''వద్దు... నన్నెవరూ చూడొద్దు. నన్ను హేళన చేయడానికే వచ్చారు. నేను ఎవరితోనూ మాట్లాడను'' అంటూ దోసిలిలో మొహం దాచుకొంది.

రాఘవరావు కోడలిని మందలించారు. ''ఛ... ఛ.... ఏమిటది. మనవాళ్ళు మనల్ని ఎగతాళి చేస్తారా? తప్పమ్మా! అసలు బాలింతరాలు ఏడవకూడదు. ముందు హార్లిక్సు తాగు'' అంటూ బలవంతం చేయగా, వంశీకృష్ణ ఆమె చేత తాగించాడు.

రాఘవరావు దిగులుగా శ్రుతితో కోడలి ఆరోగ్యం గురించి బెంగపడుతున్నానని చెప్పారు. ఎవరేం చేయగలరు?

''అవునుమరి. మా ఇంటా వంటా ఏనాడూ ఇలాంటిది జరుగలేదు. ఎవరిననుకొని ఏం ప్రయోజనం? పండంటి మనవడు పుడతాడనుకొన్నాం. ఇలాగ అయింది. పోనీ దాని కోసమైనా ఆ గ్రుడ్డివాడిని అనాధశరణాలయంలో ఇచ్చెయ్యమంటే అల్లుడుగారు వినరు. నా కూతురువాడిని చూస్తూ ఎలా బతుకుతుంది? ఎలా పెంచుతుంది? ఇలాంటి వెధవ పుట్టినా పురిట్లో పోయివుంటే ఒక ఏడుపు ఏడ్చి ఊరుకొనేవాళ్లం'' అంటూ వీణ తల్లి ముక్కుచీదింది.

ఆంత పెద్దావిడ అలా మాట్లాడుతుందని శ్రుతి అనుకోలేదు. వంశీకృష్ణ ఆ మాటలు భరించలేనట్లు ''అత్తయ్యగారూ'' అని అన్నాడు. అతడు ఆవిడని వారించి ఉయ్యాల దగ్గరికి వెళ్లి బాబును దీక్షగా చూడసాగాడు.

కొంతసేపటికి మాట పెగల్చుకొని ''పిన్నిగారూ! మీ అమ్మాయికి ధైర్యం చెప్పవలసినవారు. మీరు ఇలాగ మాట్లాడవచ్చునా? భగవంతుని దృష్టిలో అనవసరమైనదేదీలేదు. అటువంటిది మనిషిని అనవసరంగా సృష్టిస్తాడా? ఒక లోపం ఉన్నవారు మరొక విషయంలో ఎంతో ఉన్నతిని పొందుతారు. ఇది సత్యం. బాబువలన భగవంతుడు ఏం సాధించదలచాడో?'' అని శ్రుతి అనగానే వంశీకృష్ణ వెనక్కి చివ్వున తిరిగి చూశాడు. అతడి కళ్ళు సజలమైఉన్నాయి.

''ఎంత బాగా చెప్పావమ్మా! వాడు ఎలాంటి వాడైనా నా మనవడు. నా కొడుకు రక్తం. వాడు మాకు బరువా?'' అంటూ రాఘవరావు కండువాతో కళ్లు తుడుచుకొన్నారు.

వీణకి ధైర్యం చెప్పి, బాబుని ఉయ్యాలవద్దకి వెళ్లి చూసి, ఇద్దరూ ఇంటిమొహం పట్టారు. ప్రీతి బస్సు ఎక్కాక ఆవిడ మాటలు తలచుకొని బాధపడింది. ఏదో పురిటిలోనున్న నీరసంతో, కష్టం వచ్చిందన్న బాధతో వీణ ఏదో మాట్లాడవచ్చును కానీ పెద్దావిడ కూడా మనవడిని అలాగ అనడమా? లోకంలో అందరూ ఏ అవకరం లేకుండానే ఉన్నారా?

శ్రుతి కళ్ళముందు తెల్లటి ఆరోగ్యమైన అందమైన బాబు మొహం కన్పించింది. ఎంత వత్తయిన జుట్టో. కళ్లు లేవన్నమాటేగానీ దబ్బపండులాగా ఉన్నాడు. మరుక్షణమే కొడుకుని జాలిగా చూసుకొంటున్న వంశీకృష్ణ రూపం శ్రుతి కళ్లముందు నిలిచింది. విధి లీలలు ఎంత విచిత్రమైనవి.

ఇంటికి తిరిగి వచ్చాక కూడా అన్యమనస్కంగానే గడిపింది. కంచంలోని అన్నం సరిగ్గా తినకుండా కెలుకుతున్న మేనకోడల్ని చూసి సుభద్ర దెబ్బలాడింది. ఏది చూసినా మరుపన్నది ఉండాలి. ప్రతీదానికి తలక్రింద వరాదు. అంటూ ఎన్నిసార్లు చెప్పినా శ్రుతి తలకి ఎక్కలేదు. ప్రతిదానికి బాధపడటం బలహీనతని సుభద్ర ఉద్దేశం.

శ్రుతి బి.ఏ. పూర్తిచేసింది. ప్రైవేటుగా చదివినా ఫస్టుక్లాసులో పాసయింది. బి.ఇడిలో సీటు

వచ్చింది. వెళ్ళడమా, మానడమా శ్రుతి ఏదీ నిర్ధారించుకోలేకపోతోంది. ప్రసాద్ మాత్రం బి.ఇడి చేయమనే చెప్పాడు.

"మరొక ఏడాదిపోతే ప్రీతి చదువు పూర్తవుతుంది. అంతవరకూ ప్రెస్‌పని తను చూసుకొంటానని, ఊళ్లో కాలేజీ కనుక శ్రుతిని ట్రైనింగ్ పూర్తిచేయమని అతడు గొడవ. ఎందుకు సీటు వదులుకోవాలని అతడి వాదన.

ఏడాది ప్రెస్‌పని అతడు చేసుకోవాలి. ఇంటిఖర్చు, తన చదువు అయ్యేపనేనా? ప్రీతి అప్పుడప్పుడూ ఖాళీదొరికితే వచ్చి భర్తకి ప్రెస్‌లో సాయం చేసేది. ఇప్పుడు కూడా తను సాయం చేస్తానని, అక్కని చదువుకోమని అంది. ట్రైనింగ్ అయితే ఉద్యోగం చూసుకోవచ్చును. కేవలం ప్రెస్‌మీదే అందరూ ఆధారపడి ఉండటం కష్టంకదా! అని శ్రుతి ఆలోచన.

ప్రీతి అక్కగారి భయాలన్నీ అవలీలగా తోసేసింది. అక్క సలహాతో, సహాయంతో ప్రెస్ నడుస్తుంది. కనుక బెంగలేదు.

పెళ్లయ్యాక ప్రీతికి బాగా చురుకుతనం వచ్చింది. ప్రసాద్, ప్రీతీ కలిసి సినిమాలకు, షికార్లకు వెళుతూఉంటారు. ఇద్దరూ అప్పుడప్పుడు చిలిపిగా వాదించుకొంటారు. వాళ్ళిద్దరినీ అలాగా చూస్తే శ్రుతికి ఎంత సంతోషమో? వాళ్ళిద్దరూ కలిసి తిరుగుతోంటే ఆమెకి కన్నులపండుగలాగా ఉంటుంది.

తన ట్రైనింగ్, చెల్లెలి చదువు, భరత్ ఇంటర్, ఎలా ఇవన్నీ పూర్తిచేయగలనని శ్రుతి భయం. ప్రెస్‌పని మిగిలిపోతే రాత్రి షిప్టుపెట్టి చేయువచ్చునని ప్రీతి ఆలోచన. ఇప్పుడు ప్రీతికి కూడా పనంతా తెలుసు. ప్రీతి ప్రెస్‌కి వచ్చి పని సాయంచేస్తే మేనత్త వేళాకోళం చేసేది.

శ్రుతి ఒక్కర్తీ కష్టపడిన రోజుల్లో చెల్లెలు ప్రెస్‌లో అసలు అడుగే పెట్టలేదనీ, ఇప్పుడు భర్త ఒక్కడూ అలసిపోతున్నాడని ప్రెస్ వదలడంలేదనీ మేనత్త చేసే వేళాకోళానికి ప్రీతి నవ్వేస్తుంది. కానీ ప్రెస్‌కి వెళ్లి సాయం చేయడం మానదు.

ఊళ్లోనే అత్తవారిల్లు కనుక శారదమ్మ పూజలకనీ దేనికోదానికి కోడలుని పిలుస్తూనే ఉంటుంది. అత్తగారి కోరికమేరకు నోములూ, వ్రతాలు దీక్షగా చేస్తుంది ప్రీతి. శారదమ్మకి కోడలంటే మరీ అపురూపం. ఏది చేసినా ఆమెకి బాక్సులో పెట్టి తెస్తుంది.

ప్రసాద్ ప్రీతిని "కాస్త ఫలహారం అయినా పెట్టకూడదా" అని వేళాకోళం చేసి వెనకే అడిగేవాడు. అతడు అలా అంటూంటే ఒకనాడు శారదమ్మ వినేసింది. "ఫలహారాలు ఎప్పుడు పడితే అప్పుడు తినడంగాని పెట్టడంగాని మా ఇంటివాళ్లకి నప్పదు. కడుపునిండా ఆకలి వేసినప్పుడు భోజనం తినడమే మా అలవాటు" అంటూ ప్రీతి అతడికి కొంటెగా . జవాబు చెపుతోంటే శారదమ్మ కల్పించుకొంది.

"పాపం. వాడు టిఫిన్ అని సరదా పడుతోంటే చెయ్యకూడదే. నువ్వుచేసి పెట్టకపోతే వాడికి ఎవరు పెడతారు" అంటూ కొడుకుని వెనక వేసుకొని కోడలితో అంది. ప్రీతి అత్త తమ మాటలు వింటుందనుకోలేదు. ప్రసాద్ కూడా తల్లి కల్పించుకొనేసరికి సిగ్గుపడి బయటికి జారుకొన్నాడు. ప్రీతి నవ్వుకోవడం, కొడుకు పారిపోవడం ఆవిడకి అర్థమవలేదు.

ప్రసాద్ సాయంత్రం ప్రీతి వంటరిగా ఉండగా చెవి మెలేశాడు. "అమ్మ ఎదురుగా ఉపన్యాసం చెపుతావా? ఫలహారం అంటే నీకు తెలియదూ? ఒక్క చిన్నముద్దు ఇస్తే అరిగిపోతావా? ఇన్నాళ్లు ఆగానని జాలి అయినా నీకులేదు" అంటూ పోట్లాడాడు. ప్రీతి అదిగో అక్క అనగానే ఉలిక్కిపడి వదిలేశాడు. ప్రీతి పరుగున లోపలికి పోయింది.

కాలచక్రం గిర్రున తిరుగుతోంది. శ్రుతికి ఎన్నో ఏళ్ళుగా కుటుంబ సాధకబాధకాలు అనుభవిస్తున్నట్టుగా అన్పిస్తోంది. రమేష్ బాకీ పూర్తిగా తీర్చింది. ప్రీతి వీణలో డిప్లొమా తీసుకొంది. కానీ భరత్‌కి ఏ విద్యానేర్పించలేకపోయానని బాధపడుతోంది. వాడు ప్రెస్‌లో బైండింగ్ పని అప్పుడప్పుడూ చేస్తాడు. ఎక్కువ మెకానిక్ పనులంటే ఇష్టం.

తండ్రి కవుల గురించి, తనకిష్టమైన కావ్యాలగురించి వ్యాసాల్లాగ రాసుకొనేవాడు. ఆ డైరీలను అచ్చువేసింది. తండ్రి లైబ్రరీ అంటే ఆమెకి ప్రాణం. తండ్రి మాటలు ఎప్పుడూ




ఆమె చెవులలో మారుమోగుతాయి. రోజూ పడుకొనేటప్పుడు ఏదో ఒక పుస్తకం చదవందే నిద్రపట్టని స్థితికి చేరుకొంది. సంగీత కచేరీలు చేయడం వలన డబ్బు, కీర్తి రెండూ లభిస్తున్నాయి.

డబ్బు వట్టినేరాదు. అక్కరలేని అవసరాలు కూడా దానితో వస్తాయి. లక్ష్మమ్మకి జ్వరం, ఒళ్ళంతా పొంగులు రావడంతో నెలరోజులు మంచం దిగలేదు. మామ్మ మరి బతకదనే అనుకొంది. రామచంద్రం వచ్చి తీసుకెళతానన్నా ఆవిడ రాననేసింది. తన ప్రాణం ఈ ఇంట్లోనే పోవాలంది. ఒకవైపు మామ్మ జబ్బు, మరొకవైపు ప్రెస్ పనితో శ్రుతి క్షణం తీరికలేకుండా అయింది. లక్ష్మమ్మ మరి బతకనని డీలాపడి భరత్ ఒడుగుచేయమని గొడవ లేవదీసింది.

శ్రుతికి ఇంతవరకూ ఊపిరాడక దానిగూర్చి అనుకోలేదు. లక్ష్మమ్మ జబ్బువలన ఇప్పుడు తప్పనిసరైంది. తమ దగ్గర కుటుంబాల వాళ్ళని మాత్రమే పిలిచి క్లుప్తంగా ఒడుగు జరిపించేసింది. భరత్ కూడా మామ్మ నిజంగా చచ్చిపోతుందనుకొని బుద్ధిగా పంచశిఖలు పెట్టించేసుకొన్నాడు. వాడిని చూసి ఆవిడ పొంగిపోయింది. అక్కడికి ఆవిడ కోరిక తీర్చామని అందరూ ఊపిరిపీల్చుకొన్నారు.

లక్ష్మమ్మ మంచాన పడటంతో ఇంట్లో వసుధకి, సుభద్రకి ఆవిడ పనులు కూడా చేయవలసివచ్చేది. శ్రుతి ఒక్క నిముషం ఇంటికి రావడం ఆలస్యం చేస్తే ఆమెకోసం గోలపెట్టేసేది. పులిలాంటి లక్ష్మమ్మ మంచం ఎక్కడంతో ఇంట్లో సందడి లేకుండా పోయింది. ఇంటికి సంబంధించిన అన్ని విషయాలూ ఆమెకే కావాలి. లేవలేకపోయినా ప్రీతిని అడిగి పట్టించుకొనేది.

స్వప్న దగ్గర్నుండి చాలా రోజులకి ఉత్తరం రావడంతో శ్రుతి ఆశ్చర్యపోయింది. ఎంతో ఆత్రుతతో కవరు చింపి చదవసాగింది. కవరు చదవడం పూర్తిచేసిన శ్రుతి బొమ్మలాగ నిల్చుండిపోయింది. ప్రీతి వచ్చి నాలుగుసార్లు పిలిచేవరకూ ఈలోకంలోకి రాలేదు. ఉత్తరంలో ఏమిటి ఉందో అని ప్రీతి తీసుకొని చదవసాగింది.

ప్రియమైన శ్రుతికి,

నీ ప్రాణమిత్రురాలు రాయునది. సారథి నుండి వచ్చేశాక ఇన్నిరోజులకు, అందులో ఇలాంటి పరిస్థితుల్లో రాయవలసిరావడం బాధగా ఉంది. సారథి జీవితాంతం నాకు అండగా ఉంటాడనుకొన్నాను. కానీ విధి నన్ను గేలిచేసింది. దాని ముందు తల వంచవలసి వచ్చింది.

మీదగ్గర్నుండీ వచ్చాక రెండేళ్ళు బాగానే గడిచింది. నేను అనుకొన్న సుఖాలన్నీ నా ముంగిటిలో వాలాయి. సారథి నన్ను గుడిలో పెళ్ళిచేసుకొన్నాడని విన్నా, వాళ్ళవాళ్ళు ఏమీ అనలేదంటే నాకు ఆశ్చర్యం కలిగింది. సారథికి ఉద్యోగం అంటే విసుగు. డబ్బు ఇంటి నుండి తెప్పించుకొని జల్సాగా ఖర్చుపెట్టేవాడు. గారాల బిడ్డడు కనుక ఎంత పంపమంటే అంత పంపేవారు. మొదట కొన్ని రోజులు నేనూ ఈ విషయం పట్టించుకోలేదు. నాకూ ఆ సరదాలు తీరడమేకదా కావాల్సింది.

రెండేళ్ళు గడిచాక వాళ్ళ వాళ్ళు ఒక్కొక్కరూ హైదారాబాద్ రావడం మొదలుపెట్టారు. అన్నగారు, తమ్ముడు మేనమామ ఎవరెవరో బంధువులంటూ వచ్చి, గంటలు గంటలు అతడితో మాట్లాడేవారు. వాళ్ళు మా ఇంట్లో ఉండేవాళ్ళు కారు. ఎక్కడో హోటల్‌లో దిగేవారు. మొదటి సారిగా సారథి నన్ను విడిచిపెట్టి నెలరోజులు వాళ్ళ ఇంటికి వెళ్ళి వచ్చాడు. తిరిగి వచ్చిన సారథి మాత్రం ఎప్పుడూ ఆలోచనలో ఉండేవాడు.

తండ్రికి ఒంట్లో బాగుండక పోవడంవలన అన్నగారు ఒక్కడే అన్ని వ్యాపారాలూ చూసుకోలేకపోతున్నాడుట. వైజాగ్‌లోని వ్యాపారం సారథిని చూడమన్నారుట. వాళ్ళ మాట కాదనలేక అతడు అటూ, ఇటూ తిరిగేవాడు. నేను అన్నీ అతడి ఇష్టానికే వదిలేశాను.

నాలుగునెలల తర్వాత వచ్చినప్పుడు చెప్పాడు. తల్లి బాధ చూడలేక మేనమావకూతురిని పెళ్ళిచేసుకోవలసివచ్చిందని. మేనమావకి ఒక్కగానొక్క కూతురు. చిన్నప్పటి నుండీ అనుకొన్న సంబంధంట. ఈ విషయాలు విని

నేను మ్రాన్పడిపోయాను. తను చేసిన పని తప్పేనంటాడు. అయితే తన కుటుంబంకోసం చేసుకొన్నానంటాడు.

నన్ను ఇదివరకటిలాగే చూస్తానని, నాకేం లోటుచేయనని అంటాడు. నాకు కడుపు మండిపోయి నాలుగు తిట్టాను. నా పరిస్థితి ఏమిటో నాకు తెలియడంలేదు. నా అజాగ్రత్త వలన నేను నెల తప్పాను.

ఇప్పుడే సారథి రాకపోకలు ఇలాగ ఉన్నాయి. రేపు అతడికి పిల్లలు పుడితే కన్నిస్తాడా? శ్రుతీ! నువ్వన్నట్లు కుటుంబ జీవితం కోసం ఆడదే కాదు మగవాడు కూడా ఆశపడతాడు. దాన్ని అతడు కూడా వదులుకోవాలనుకోడు. ఏ సుఖాలకోసం, డబ్బుకోసం పరుగుపెట్టానో అది నాకు ఇప్పుడు తృప్తినివ్వడంలేదు.

నాచుట్టూ సందడి కావాలి. నా అన్న వాళ్ళు కావాలి. నేను వాళ్ళవాళ్ళతో పోట్లాడినా లాభం ఏమిటి? అందుకే ఆ పని చేయలేదు. నేను ఒక్కదాన్ని. వాళ్ళు పదిమంది. నువ్వు వెంటనే బయలుదేరిరా! నువ్వు రాకపోతే నేను ఏమవుతానో నాకే తెలియదు. దయచేసి వస్తావు కదూ! నీకోసం ఎదురు చూస్తాను.

నీ

స్వప్న.

ఉత్తరం చదివిన ప్రీతి బరువుగా నిట్టూర్చింది. ఆసంధ్యా సమయంలో వెలుగు నీడల కలయికలో ప్రకృతి ఒక సందేశాన్ని ఇస్తున్నట్లు అన్పించింది. హాలులో నుండి భరత్ గొంతుక వినబడుతోంది.

"బావా! నేను ఒకటి అడుగుతాను. చెప్పగలవా? సరైన సమాధానం నువ్వు చెప్పలేకపోతే నాకు పది రూపాయిలు ఇచ్చుకోవాలి. చెప్పావనుకో నేను నీకు అయిదు రూపాయిలు ఇస్తాను" అంటున్న భరత్‌ను ప్రసాద్ ఆపాడు. "అబ్బబ్బ... ఆగరా నాయనా! ముందు నన్ను కూర్చోనియ్యి" అని ప్రసాద్ కుర్చీలో కూర్చున్నాడు. భరత్ మళ్ళీ మొదలుపెట్టాడు.

"అవునుగానీ నేను ఓడిపోతే పదిరూపాయలు ఇచ్చుకోవాలా? నువ్వయితే అయిదా? అదేం పందెం? న్యాయం ఉండవద్దా?" అంటూ నిలదీశాడు.

"నువ్వు ఉద్యోగస్థుడివి. పది కాయవచ్చును. నేను అక్క చాటుపిందెను" అంటున్న వాడి మాటలకు నవ్వాడు.

"ఇంతకీ బావా! నువ్వు ఎటువంటి పరిస్థితులోనూ నెగ్గవులే. కనుక అసలు ఆ ప్రోబ్లమే రాదు" అంటున్న వాడివైపు అనుమానంగా చూశాడు.

ఆ చూపులకి "అబ్బే... అలాగని మోసం ఏమీ లేదు. జవాబు చెప్పలేని జటిలప్రశ్నలు ఈ అయ్యగారు వేస్తారని అర్థం" అని ఆగాడు.

"చిరంజీవి... అదే బావా హీరో చిరంజీవి స్నానం చేస్తోంటే ఈ వేలు తడవలేదుట. కారణం ఏమిటి?" అని చిటికెనవేలు చూపిస్తూ సీరియస్‌గా అడిగాడు భరత్.

"అబ్బే... అదేమిటి? స్నానం చేస్తోంటే ఒళ్ళంతా తడిసి వేలు తడవకపోవడమేమిటి"? అంటూ సాలోచనగా పైకే అనేశాడు ప్రసాద్.

"ఆ... ఒకవేళ వేలుకి దెబ్బ తగిలి కట్టుకట్టారేమో! అందుకే తడవలేదు" అన్నాడు ధీమాగా.

అబ్బే... అదికాదన్నాడు భరత్.

"ఒకవేళ చిరంజీవికి ఆవేలు పెట్టుడువేలేమో... అబ్బే... కాదు అదే తొడుగులాంటిదేమో తీసి దాచేశాడేమో" అంటున్న బావగారి మాటలకు భరత్ నవ్వాడు.

చివరికి తను చెప్పలేనని ప్రసాద్ ఒప్పుకొన్నాడు. "అయ్యో... బావగారూ! అక్కడెక్కడో చిరంజీవి స్నానం చేస్తే ఇక్కడ ఈ వేలు... అదే నాచిటికెన వేలు ఎందుకు తడుస్తుందీ?" తన చిటికెనవేలు చూపిస్తూ వెక్కిరించాడు భరత్.

ప్రసాద్ ఓడిపోయానని గింజుకొంటూ పది రూపాయిలు తీసి ఇచ్చాడు.

భరత్ నవ్వుతూ "మరొక ప్రశ్న అడుగుతాను. ఈసారి ఇద్దరం పదేసి రూపాయిలే పందెం కాద్దాం" అన్నాడు.

"మీరు ఈసారి తప్పక గెలుస్తారు" అంటూంటే ప్రసాద్ కూడా "ఈసారి తప్పక గెలుస్తాను" అన్నాడు. భరత్ చెప్పడం మొదలుపెట్టాడు.

"నీళ్ళల్లో ఒక రాయిని వేశాను. అది





ఎందుకు మునిగిపోయింది. నేను అనుకొంటు న్న కారణమే మీరు చెప్పాలి'' అని భరత్ ఆగాడు. ప్రసాద్ ఉత్సాహంగా ముందుకి వంగొని ''ఓస్... ఇంతేనా నీ ప్రశ్న. రాయి బరువు కనుక నీళ్ళల్లో వెయ్యగానే అది మునిగి పోయింది'' అంటూ ఆగాడు.

''బావగారు పప్పులో కాలేశారు. ఓడిపోయా రు. ఈ పూట నాకు ఇరవై రూపాయిలు వచ్చాయి'' అంటూ భరత్ గెంతాడు. ప్రసాద్ క్షణం ఆలోచించి మళ్ళీ అన్నాడు.

''నీటి బరువుకన్నా రాయి బరువు ఎక్కువ కనుక మునిగిపోయింది. నేను చెప్పింది కరక్టే నేనేం ఓడిపోలేదు'' అని భరత్‌తో పోటీగా అన్నాడు ప్రసాద్.

''అదేం కాదండీ! సమాధానం వెరీ సింపుల్. రాయికి ఈత రాదుకనుక మునిగిపో యింది. ఈత వస్తే మునిగిపోతుందేమిటి?'' భరత్ కొంటెగా నవ్వుతూ, బావగారి జేబులోని మరోపదినోటు తీసికొని వీధిలోకి పారి పోయాడు.

శ్రుతి, ప్రీతి ఇవతలకు నవ్వుతూ వచ్చారు. ''చిన్నచిన్న ప్రశ్నలకు జవాబు చెప్పలేనివారు అసలు మా తమ్ముడితో పందెం ఎందుకు కాయాలి?'' ప్రీతి నవ్వుతూ అడిగింది. ''పోనీ! నీకు ఆ సమాధానాలు తెలుసా?'' అంటే ప్రీతి తెలుసనన్నట్లు తల ఊపింది.

''అన్యాయం కిటికీలోనుండి కాగితంమీద రాసి వడెయ్యవచ్చును కదా! అసలు భర్తనని నామీద నీకు ప్రేమలేదు'' అంటూ బుంగమూ తిపెట్టాడు ప్రసాద్. శ్రుతి నవ్వుతూ తల్లి దగ్గర కి వెళ్ళింది. ఒకక్షణం దుఃఖం, మరుక్షణం సంతోషం. మానవ జీవితాలు ఎంత విచిత్రమై నవో కదా! అని తనలోతాను అనుకొంది.

ఇంట్లో వాళ్ళతో చెప్పి మర్నాడే గోదావరి ఎక్స్‌ప్రెస్‌కి బయలుదేరింది. సుభద్ర ఉద యమే లేచి శ్రుతికి గారెలు, కాజాలు, దద్దో జనం చేసి కేరేజీ సర్దింది. అసలే లక్ష్మమ్మ జబ్బుపడి లేవడంతో ఆకలో అని గొడవచే స్తోంది. ఏమాత్రం వంట ఆలస్యం అయినా ఊరుకోదు. అత్త కష్టపడి ఇవన్నీ ఎందుకు చెయ్యాలని శ్రుతి బాధ. ట్రైన్‌లో ఏ వళ్ళో కొనుక్కొని తినేస్తే సరిపోదా?

సుభద్ర ఒకపక్క వంటపని చూస్తూనే వీటిని పూర్తిచేసింది. మరదలిని తల్లికి అన్నం పెట్టమని, శ్రుతి జుట్టు చిక్కు విప్పి జడవే సింది. పెరట్లోని మరువం, కనకాంబరాలు మాల కట్టి తెచ్చి తలలో తురిమింది. మళ్ళీ బయలుదేరేటప్పుడు అడగరాదని శ్రుతి హై దరాబాద్ నుండి ఎప్పుడు వస్తుందో అడిగింది. శ్రుతి నవ్వుతూ నాలుగు రోజులలో వస్తానంది. ''స్వప్నని నీతో తీసికొని వస్తావా?'' అని కుతూ హలంగా అడిగింది. అత్తవైపు నవ్వుతూ చూ స్తూ ''ఏం చెయ్యమన్నావో నువ్వే ఆలోచించి చెప్పు'' అంది శ్రుతి. ''నువ్వు నాకన్నా బాగా ఆలోచిస్తావు. బలవంతంతో జీవితాన్ని చాలించుకొనే ప్రయత్నాలు చెయ్యవద్దని చె ప్పు. ఎటువంటి పరిస్థితులెదురైనా బతకడం గొప్ప. చావడంలో ఏం ఉంది?'' అని అంటున్న అత్తవైపు శ్రుతి ఆశ్చర్యంగా చూసింది.

దగ్గర కూర్చుని కొసరికొసరి వడ్డిస్తున్న అత్తని శ్రుతి ప్రేమగా చూసింది. ''ఇంత అన్నం పెట్టేస్తే వెళ్ళి ట్రైన్ ఎక్కలేను. నిద్రపో వాలనిపిస్తుంది'' అంటున్న శ్రుతిని ప్రేమగా కసిరింది. శ్రుతి స్నేహితురాళ్ళు అందరూ ఒళ్ళు బాగా చేశావే అంటారు. అత్త ఏమో తగిన ఒళ్ళు ఉంటేనే ఆడపిల్ల అందం అంటుంది. ఈ కాలం పిల్లలందరూ డైటింగ్ పేరుతో నక్కల్లాగ తయారవుతున్నారని అంటుంది. అత్తతో వాదించలేక ఆవిడ పెట్టి నది తినేసి వచ్చేస్తుంది.

ప్రసాద్ తనకి తోడు వస్తానంటే ఇద్దరికీ డబ్బు దండుగని వద్దని తనే బయలుదేరింది. శ్రుతి అనుకొన్నట్లు హైదరాబాద్‌లో పని రెండు రోజులలో తెమలలేదు. స్వప్నకి వస్తున్నట్లు టెలిగ్రాం ఇవ్వకపోవడంవలన ఇల్లు కష్టపడి పట్టుకోవలసి వచ్చింది.

స్వప్నని చూసిన శ్రుతి ఆశ్చర్యపోయింది. ఇప్పటి మనిషిలో ఆ కళలేదు. సన్నగా, కంప లాగ తయారైనది. స్నేహితురాలిని చూసి స్వప్న అల్లుకొని పోయింది. స్వప్న వట్టిమనిషికా దని గ్రహించింది.

కష్టసుఖాలు చెప్పుకొంటూ ఆ రాత్రి అంతా గడిపారు. స్వప్నకి డబ్బుకి లోటులేదు.

బంగారం, డబ్బు సారథి బాగానే అమర్చాడు. దానితోనే బతుకు వెళ్ళిపోదు కానీ ప్రస్తుతం హాయిగా బతకవచ్చును. నిరాశతో కుమిలిపోతున్న స్వప్నకి శ్రుతి బతుకుమీద ఆశ కలిగించింది.

బాధలతో, బెంగతో కుమిలిపోవడం, చావు నాహ్వానించడం గొప్ప కాదని చెప్పింది. "చావడం తెలివైన పనికాదు. భగవంతుడిచ్చిన బతుకుని సార్థకం చేసుకోవాలి. సారథికోసం ఎదురు చూపులు చూస్తూ కూర్చోవడం కంటే నీకంటూ ఒక వ్యాపకం కల్పించుకో. పనిలో ప్రశాంతత ఉంటుంది" అని స్వప్నకి హిత బోధ చేసింది.

స్వప్నకి ఇప్పుడు కావలసినది చేతినిండా పని. ఆమెకి చెప్పవలసినది ధైర్యంగా బతకడం. శ్రుతి ఆ రెండు పనులే చేసింది. మనిషి సంఘజీవి. నా అన్న వాళ్ళ కోసం ఎలా వెంపర్లాడతాడో స్వప్నని చూస్తే అర్థమౌతోంది. అబార్షన్ చేసుకొంటానన్న స్వప్నను వారించింది.

శ్రుతి మాటలు స్వప్నకి జీవంపోశాయి. నిజమే... సారథి తల్లిని వదులుకోలేడు. మేనమావ ఏడుపు చూడలేడు. ఆయన ఆస్థినీ, కూతురినీ ఇతడు చూసుకోవలసినదే. ఆ కుటుంబంతో బతకవలసినదే. చుట్టపుచూపుగా వచ్చే అతడు తనకి ఏం ఆసరాకాగలడు. బిడ్డని పెంచుకొంటూ స్వతంత్రంగా శ్రుతి చెప్పినట్లు బతకడమే ఉత్తమం. ఇంక ఒంటరిగా, జీవచ్ఛవంలాగ బతకడం తన వలన కాదు.

శ్రుతి సేహితురాలు కనుక తనని ఆదరిస్తోంది. మరిలోకం. లోకం తన బిడ్డను ఆదరిస్తుందా? పోనీ శ్రుతి చెప్పినట్లు ఈ లోకాన్ని తను కేర్ చెయ్యదు. తన బాబుతో తను హాయిగా బతుకుతుంది. బిడ్డను పెంచడంలో తృప్తిపడుతుంది.

శ్రుతి చెప్పినట్లు మాతృత్వం ఒక దివ్యమైన వరం. దాన్ని తను దూరం చేసుకోకూడదు. మిత్రురాలు రాకపోతే తను, తనబిడ్డ ఆవేశంలో ఎప్పుడో ప్రాణాలు కోల్పోయేవారు. ఇప్పు

డు చావాలని లేదు. అందమైన ఈ లోకంలో ఎలాగైనా బతకాలని ఉంది. నాలుగు రోజుల క్రితమున్న ఆలోచనలకి, ఇప్పటివాటికి పోలికే లేదు. స్వప్న వంట చేస్తున్న శ్రుతివైపు ఆప్యాయంగా చూసింది.

"ఏయ్ ఒకసారి ఇలా వచ్చి కూర్చో" అంటూన్న స్నేహితురాలిని శ్రుతి అనుమానంగా చూసింది. రమ్మంటే అంటూ శ్రుతిని లాక్కెళ్ళి మంచంమీద కూర్చోపెట్టి, కింద కూర్చుని శ్రుతి ఒళ్ళో మొహం దాచుకొంది. రెండు చేతులనీ ఆమె నడుం చుట్టూ పెనవేసింది. శ్రుతికి స్వప్న చర్య చూస్తే గొంతుకకి ఏదో అడ్డుపడ్డట్లయింది.

ఇంతదూరంలో ఉన్న మిత్రురాలిని తను ఓదార్చలేదు. అవసరమైనపుడు సహాయపడలేదు. కనుక తన దగ్గరలో స్వప్న ఉంటే నయం. సారథి కూడా వైజాగ్‌లో ఉన్నాడు కనుక ఫర్వాలేదు. ఆమెకిష్టమైతే వాళ్ళిద్దరూ కలిసి బతకవచ్చును. స్వప్న ఆలోచనలు కూడా అలాగే ఉన్నాయి.

శ్రుతి సారథి మాట ఎత్తితే స్వప్న అడ్డుపడింది. అతడి కుటుంబజీవనానికి తను అడ్డు రాకూడదు. తన బతుకు తను బతకాలి. ఇంటర్‌లో సెకండ్ క్లాసు ఉండటం వలన శ్రుతి స్వప్నని సెకండరీ ట్రైనింగ్‌కి వెళ్ళమంది. లేదా హెల్త్‌విజిటర్ ట్రైనింగ్‌కి వెళ్ళమంది.

టీచరైతే పిల్లలతో చచ్చినట్లు అరవాలి. తనకి అంత ఓపిక, ఉత్సాహం లేవు. అందుకే స్వప్న కొట్టి పారేసింది. ఇంక రెండోదయితే, పల్లెటూళ్ళల్లో పని చేయాలి. గ్రామస్థులు అగౌరవంగా చూస్తారేమో అనే భయం. శ్రుతి స్నేహితురాలి భయాలు అర్థంలేనివంది. ఏ వృత్తి అయినా పవిత్రమైనదే. కొందరి మనుషుల ప్రవర్తన వలననే ఆ వృత్తులకు కళంకం వస్తోంది. మనలోనే అంతా ఉంది అని అంటున్న స్నేహితురాలి మాటలను స్వప్న ఆకళింపు చేసుకొంది.

సారథికి కబురుపెట్టి, తన నిర్ణయం చెప్పి వస్తానని, మెడికల్ ట్రైనింగ్ అవుతానని స్వప్న చెప్పింది. స్వప్న తండ్రి ఉద్యోగం నుండి రిటైరవడంవలన కొడుకులతో స్వగ్రామం వెళ్ళిపోయారు. స్వప్న శ్రుతి దగ్గరే సెటిలవ్వాలనుకొంది. స్వప్నని త్వరలో రమ్మని, తను అన్ని ఏర్పాట్లు చేస్తానని చెప్పి శ్రుతి బయలుదేరింది.



నాలుగు రోజులనుకొన్న ప్రయాణం ఆరురోజులైంది. శ్రుతి ఆరవ రోజున అలసటతో ఊళ్ళోకి దిగింది. ఆమెకు ఇల్లు సమీపిస్తోంటే ఏదో తెలియని కంగారు కలిగింది. అసలు రాత్రి కూడా నిద్రపట్టలేదు. ఏదో చెప్పలేని బాధననుభవించింది. తండ్రిపోయాక ఇన్ని రోజులుగా ఎక్కడికీ వెళ్ళలేదు. స్వప్నకి ధైర్యం కలిగించేటప్పటికి మరొక రెండురోజులు అయిపోయాయని దిగులుగా అనుకొంది. తమ వీధి వైపు రిక్షా తిరగగానే శ్రుతి ఆత్రుతగా ఇల్లు వైపు చూసింది. ఎంత త్వరగా ఇంటికి వెళ్ళిపోవాలా అని ఉంది.

ఇల్లంటే తనకి ఎంతో ఇష్టం. ఇంటిదగ్గర తనకి ముందుగా ఎవరు ఎదురవుతారు? ఇంకెవరు? భరత్‌గాడు ఎదురవుతాడు. వాడే కదా ఇంట్లోకి, బయటికి ఎప్పుడూ తిరుగుతూ ఉంటాడు. వెధవకి కాలు క్షణం ఊరుకోదు. శ్రుతి చేతులు తన సూట్‌కేసుమీదకి వెళ్ళాయి. వాడికి కొన్న చెస్ బోర్డు చూపిస్తే ఎంతో గెంతుతాడు. చెల్లెలుకి ముత్యాలు కొంది. అమ్మకి, శారదమ్మకి, మామ్మకి చీరలు కొంది. అత్తకి చీరలు కొనాలన్పించలేదు. అపురూపంగా ఏదైనా కొనాలి.

శ్రుతి పెదవులపై చిరునవ్వు వెలిసింది. "నా బిడ్డలు దూరంగా ఉన్నారని అన్పించడంలేదు. నీలో నా బిడ్డలు కన్పిస్తున్నారు.

దురదృష్టంలో అదృష్టం కదూ ఇది'' అని పేలవంగా నవ్వే అత్త కళ్ళముందు కన్పించింది. ప్రేమగా అక్కున చేర్చుకొనే అత్తకి ఏమి కొనాలి? ఆత్రుతగా గుండెలకు హత్తుకొనే ఆ చేతులకు ప్రేమతో తన తలనిమిరే ఆ చేతులకు పాళ్ళ గాజులు కొంటే... ఆలోచన వచ్చిందే తడవుగా తెలుపు ఆకుపచ్చ పాళ్ళు ఉన్న గాజులను నాలుగు కొని పేక్ చేయించింది.

ఏవో ఆలోచనలు చుట్టుముట్టిన శ్రుతి ఇంటికి రిక్షా దగ్గరవడంతో అటువైపు చూసి ఆశ్చర్యపోయింది. తమ ఇంటిముందు అంత జనం ఏమిటి? ఎవరికీ ఏమీ అవలేదు కదా! ఒక్క ఉదుటన రిక్షాలోనుండి దిగిపోయింది.

ఇంటిముందు ఆగిన జనాన్ని తోసుకొంటూ లోపలికి వెళ్ళడానికి ప్రయత్నించింది. కాళ్ళు వణికిపోతున్నాయి. ఆమెను చూసిన కొంత మంది తప్పుకొని చోటు ఇచ్చారు. ఎదురుగుండా చూసిన శ్రుతికి గుండె ఆగినట్లయింది. ఏడుస్తూ ఒక్క పరుగున అత్తమీద వాలిపోయింది. ఆమె రాకతో ఇంట్లో వాళ్ళ ఏడుపులు తారాస్థాయినందుకొన్నాయి.

''ఆయమ్మ మేనకోడలట. పాపం ఏదో ఊరెళ్ళి ఇప్పుడే వస్తోందిట. నిన్నరాత్రంతా ఈ అమ్మ కోసమే అనుకొన్నారుట'' అని ఒకళ్ళు ''పాపం... చాలా మంచి అమ్మట. తమ్ముడింట్లోనే చాన్నాళ్ళ ఉంటోందిట'' అని ఒకళ్ళు ''భర్త పిచ్చని వదిలేస్తే తమ్ముడు తెచ్చి ఇంట్లో ఉంచి పెంచుతున్నాడుట'' అని మరొకళ్ళు ఏవేవో అంటున్నారు. శ్రుతి చెవులకు ఆ మాటలు వినీ వినబడనట్లు అవుతున్నాయి.

''నేను నమ్మను... ఇది నేను నమ్మను. అత్తను ఇక్కడ ఎందుకు పడుకోపెట్టారు? లోపలకు తీసికొని పోదాం పదండి'' అంటూ శ్రుతి గోలగోలగా ఏడ్చింది. ''నాన్న తీసికొని వచ్చాక ఒక్కపూట అయినా ఎక్కడికీ వెళ్ళలేదే. మాకు ఎవ్వరికీ చెప్పకుండా ఎలా వెళ్ళిపోయావు? ఇప్పుడు ఎందుకు వెళ్ళిపోయావు? నాకెవరున్నారు? నేను లేకుండా చూసి దొంగలాగ వెళ్ళిపోయావా? ఇది నీకు న్యాయమా? వీల్లేదు, నువ్వు వెళ్ళిపోతే నేను ఉండలేను'' అంటూ ఏడుస్తున్న శ్రుతిని ఎవరూ ఆపలేకపోయారు.

శ్రుతి అరుపులూ, ఏడుపు చూసి అక్కడున్న అందరూ కళ్ళనీళ్ళు పెట్టుకొన్నారు. వసుధ శ్రుతిని ఎంత ఇవతలకి తీసికొని వద్దామనుకొన్నా కుదరలేదు. శారదమ్మ, రాఘవరావు కలిసి బలవంతంగా ఇంట్లోకి తెచ్చారు. మళ్ళీ ఎలా పరుగెత్తుకొని వచ్చిందోగాని అత్త శవం దగ్గరకి వచ్చేసింది.

''నాన్న కలలో కన్పిస్తే అందరినీ బాగా చూస్తానని మాట ఇచ్చాను. నాకు ఎందుకు ఇంత శిక్ష వేశావు? నీ తమ్ముడికి నేను ఏం జవాబు చెప్పాలి? చెప్పు అత్తా! కేరేజీ ఎంత ప్రేమగా కట్టి నన్ను ఊరుపంపావు? అదే నీ చేతి ఆఖరి భోజనం అనుకోలేదు. అందుకనా అంత ప్రేమగా కొసరికొసరి నాకు పెట్టావు. వెర్రిదాన్ని ఏమీ తెలుసుకోలేకపోయాను'' అంటూ శ్రుతి ఏదేదో మాట్లాడుతూ, సుభద్ర మీద పడి ఒకటే ఏడుపు. ఎవరూ ఆమె ఏడుపును మాన్పించి ఇంట్లోకి తీసుకెళ్ళలేకపోయారు. తను తెచ్చిన గాజులు అత్త చేతులకి తొడిగి, అవి పట్టుకొని ఒకటే ఏడుపు.

మరొక గంట గడిచాక రామచంద్రం వచ్చాడు. ఒక్కసారైనా తన గుమ్మం తొక్కని చెల్లెలి అభిమానానికి బాధపడ్డాడు. లక్ష్మమ్మ కడుపు శోకానికి అంతులేదు. ఘెట్టంత కొడుకు, కూతురు కళ్ళ ముందే వెళ్ళిపోతే, తను ఇంకా ఆయువు పోసుకొని బతుకుతున్నందుకు కుమిలిపోయింది.

పెద్దకొడుక్కి సాయంత్రం అసలు విషయం లక్ష్మమ్మ చెపుతోంటే విని శ్రుతి నిశ్చేష్టురాలైంది. తల్లిని పిలవకుండా భర్త కూతురి పెళ్ళి చేయడమా? ఎంతదారుణం. అత్తగారికి కోడలి అవసరం లేకపోవచ్చును. పిల్లలకు తల్లినిగూర్చి దూరం అవడం వలన తెలియక పోవచ్చును. కానీ భర్తకి జ్ఞానం ఉండవద్దా? భార్య గుండె ఇది వింటే బద్దలవుతుందని తెలియదా?

నవమాసాలు మోసి, కని పెంచిన తల్లి ఉండగా ఆమెని పిలవకుండా, కనీసం ఆమెకు తెలియచేయకుండా ఆడపిల్ల పెళ్ళి జరిపిస్తే ఏ తల్లి ఇంకా ప్రాణం పోసికొని ఉండగలదు? అవును. అందుకే అత్తయ్యకి

హార్ట్‌ఎటాక్ వచ్చింది. తమని విడిచి వెళ్ళిపోయింది. శ్రుతి అత్తచూసిన పేపర్లోని పెళ్ళి ఫొటోను చూసింది.

శ్రుతి మనసు అత్తపట్ల ప్రేమతో, జాలితో నిండిపోయింది. జీవితాలు ఎంత క్షణభంగురాలు. జీవితంలో అత్త ఏం పొందగలిగింది? ఎప్పుడూ ఆవిడ అనేది. "మీనాన్న నాకంటూ ఇల్లు, ఇంత నీడ చూపించాడు. నువ్వు నాకు బిడ్డలు లేనిలోటు తీరుస్తున్నావు. ఈ బతుకు మీద అనురక్తిని కలిగిస్తున్నావు. మాతృత్వాన్ని మరిచిపోయిన నాకు దాన్ని మళ్ళీ రుచి చూపిస్తున్నావు" అని ఆమె అంటుంటే తన గుండె తరుక్కుపోయేది.

శ్రుతి వద్దన్నా వినకుండా రామచంద్రం బావగారికి టెలిగ్రాం ఇచ్చాడు. కానీ ఏం లాభం? ఆయన తన తల్లిని తీసికొని యాత్రలు వెళ్ళి వచ్చేటప్పటికి ఆలస్యం అయిపోయింది. బిడ్డల్ని తీసికొని పదకొండో రోజుకి వచ్చాడు. పదవరోజున రామచంద్రం వాళ్ళ కోసం చాలాసేపు ఎదురుచూశాడు.

శ్రుతికి మాత్రం వాళ్ళు పదవరోజుకి రానందుకు ఆనందమే కలిగింది. "అత్తకి వాళ్ళు వదిలే నీళ్ళు కూడా తీసుకోవడం ఇష్టంలేదు" అంటున్న శ్రుతి నోరు నొక్కేసింది శారదమ్మ. పదకొండవరోజున వాళ్ళు రాగానే శ్రుతి ఆయనని, పిల్లల్ని చూడగానే పులిలాగ మీదపడిపోయింది.

"ఇప్పుడు మాత్రం ఎందుకు వచ్చారు? ఇంకా ఏం మిగిలి ఉందని వచ్చారు? మా అత్తని మీరు చిత్రహింస పెట్టారు. ఆమె ఉసురు మీకు తగలకపోదు" అంటూ శ్రుతి నానా మాటలూ అంటూంటే రామచంద్రం, ప్రకాశం లోపలకి లాక్కువెళ్ళారు. శ్రుతి ఆవేదనకి అంతేలేదు.

రామచంద్రం వలన విషయాలు తెలిసికొని మాధవరావు ఖిన్నుడయ్యాడు. ఈ వార్ధక్యంలో భార్యలేని లోటు ఆయనకి బాగా తెలుస్తోంది. వద్దామంటే ఇన్నాళ్ళూ పట్టించుకోలేదని ఆమె అన్నదమ్ములు ఏం అంటారో అని భయం, మరొకపక్క తన చేతకానితనానికి సిగ్గూ కలిగాయి.

కూతురి పెళ్ళి నిశ్చయమయ్యాక భార్యను తీసికొని వద్దామనుకొన్నాడు. కానీ ఆయనకి అక్కడా చుక్కెదురే. ఎంత చెప్పినా ఆయనే తల్లి విన్పించుకోలేదు. కూతురిని పెద్ద ఆస్తి ఉన్న కుటుంబములో ఇస్తున్నామని, పిల్ల తల్లి పిచ్చిదని వాళ్ళకి తెలిస్తే పెళ్ళి ఆగిపోతుందని తల్లి అడ్డుపెట్టింది. ఆయనకీ ఆ భయమే మనసులో మెదిలి ఊరుకొన్నాడు. తల్లి పడనివ్వనందుకు బాధపడటం తప్ప ఏం చేయలేకపోయాడు. లేవలేని తనను కోడలు ఇప్పుడు వచ్చి ఏ బాధలు పెడుతుందో అని తాయారమ్మ చేసిన పని అది.

కావలసిన పనులన్నీ ప్రసాద్ స్వయంగా నిర్వహించాడు. శ్రుతి మనస్థితి అతడికి బాగానే తెలుస్తోంది. భానుమూర్తి పోయినప్పుడు పులి పిల్లలాగ ఉన్న శ్రుతికి, ఈమెకి తేడా ఎంతో! అత్తకి జరిగిన అన్యాయమే ఆమెను బాధిస్తోంది.

సాయంత్రం ఒంటరిగా మంచంలో పడుకొని శూన్యంలోకి చూస్తున్న శ్రుతి దగ్గరకు వచ్చాడు మాధవరావు. శ్రుతి ఆయనవైపు చూసి మౌనంగా తలవంచుకొంది. "శ్రుతీ! నేను తప్పే చేశాను. పిరికితనంతో బతికి నా భార్యను చేతులారా బాధపెట్టాను. చివరికి ఆమె చావుకి కారకుడనయ్యాను. నువ్వు చిన్నపిల్లవైనా సరే నన్ను క్షమించు" అని ఆయన అంటూంటే శ్రుతి ఏడ్చింది.

"మావయ్యా! మిమ్మల్ని క్షమించవలసింది మేము కాదు అత్తయ్య. ఆమె ఒక అసిధారావ్రతంలాగ బతుకు వెళ్ళదీసింది. ఆమెకి బతుకంతా ఎదురుచూపే అయింది. పీటలమీద కూర్చుని మీతోపాటు కన్యాదానం చేయవలసిన అత్తని మీరు అవమానపరిచారు. ఆడది అవమానాన్ని భరించలేదు. బిడ్డలకోసం అత్త పడిన తపన ఎన్నివిధాలుగా చెపితే మీకు, ఆపిల్లలికి అర్థమవుతుంది?" అంటున్న శ్రుతి కంఠం రుద్ధమైపోయింది. ఆయన నిట్టూర్చి, తల వంచుకొన్నాడు.

బిడ్డలను కళ్లారా చూసుకోవడానికైనా నోచని అత్త ఆవేదన ఎన్ని రకాలుగా చెప్పినా వీళ్ళకి అర్థమవదు. లక్ష్మమ్మ, మనవడిని, మనవరాలిని చూసి ఏడ్చింది. కనీసం వాళ్ళయినా పట్టుపట్టి తల్లిని చూడటానికి రాలేదని దుమ్మె

త్తిపోసింది. వాళ్ళు సిగ్గుతో తలలు వంచుకొన్నారు.

సుభద్ర మరణం శ్రుతిని బాగా దెబ్బతీసింది. ఆమెలో మునుపటి ఉత్సాహమేలేదు. శ్రుతిని అలాగ చూసి వసుధ భయపడింది. ఏం చేస్తే మళ్ళీ ఆమె మామూలు మనిషవుతుందో ఆమెకి తెలియలేదు. అసలు ఎక్కువగా మాట్లాడటమే ఆవిడకి తెలియదు. అక్కడికీ శ్రుతిని దగ్గరకి తీసికొని ఓదార్చింది.

పోయిన వాళ్ళు తిరిగి రారనీ, శ్రుతి తనకి మగబిడ్డే అనుకొని బతుకుతున్నాననీ శ్రుతి అలాగ అయిపోతూంటే తను చూడలేకపోతున్నాననీ . వసుధ బాధపడింది. ఆడపడుచు మరణం ఆవిడని మరీ క్రుంగదీసింది. ఇటు అత్తగారి పని, అటు ఇంట్లో పని, మరొకపక్క శ్రుతి గురించి బెంగలతో వసుధ సతమతమవుతోంది. శ్రుతికి తల్లి ఆవేదన బాగానే అర్థమవుతోంది. కానీ అత్తని మరిచిపోలేకపోతోంది. అత్త మాటలు, జ్ఞాపకాలు ఆమెను వదలడం లేదు.

అత్త ఎంత బాగా తమను చూసింది. ఎంత మమకారాన్ని పంచిఇచ్చింది. తండ్రి పోయాక తనకి ఎలాగ స్ఫూర్తిని నిచ్చింది. ఆవిడని మరిచిపోవడం తనవల్ల అయ్యేపనా? ఇంట్లోని అణువణువూ ఆమెను గుర్తుకి తెస్తున్నాయి. ఇంటిని అమ్మేద్దామనుకొంది. లక్ష్మమ్మ, వసుధ శ్రుతి మాటలకి గొల్లుమన్నారు. కొడుకు కట్టిన ఇంట్లోనే తన తనువుపోవాలంది లక్ష్మమ్మ. శ్రుతిలో అంతవైరాగ్యం రాకూడదని శారదమ్మ కేకలు వేసింది. అక్కను అన్నివేళల్లో ప్రీతి అంటిపెట్టుకొని తిరిగేది.

తల్లికోసం శ్రుతి మామూలు మనిషి కాక తప్పలేదు. ఇప్పుడు ఆమెలో ఒకవిధమైన వేదాంతం ప్రవేశించింది. ఎవరి జీవితాలు ఎలా రాసిపెడతాడో అలాగ జరగక మానవు. ప్రసాద్ మాత్రం ఈ వేదాంతం ఏమిటని దెబ్బలాడేవాడు.

శ్రుతికి ఏదో చెయ్యాలని ఉంది. ఏం చేయాలో తోచని అయోమయస్థితి. అత్తను అనుక్షణం గుర్తుతెచ్చే తోట. గ్రైండర్ అయితే పట్టుకెళ్ళి ఒక పేద వితంతువుకి ఇచ్చేసింది. తోటను ఏం చేయగలదు? క్రమేపీ ఆ తోట ఆమెకి మనశ్శాంతి కలిగించేది. అత్త ఆత్మ చెట్టు చెట్టులో, పువ్వు పువ్వులో ఆమెకి దర్శనమిచ్చేది.

గోరుచుట్టుమీద రోకటిపోటులాగ ఈ పరిస్థితులలో స్వప్న వచ్చింది. శ్రుతి ఇంటి పరిస్థితులు చూసి ఆమె బాధపడింది. శ్రుతికున్న ఓర్పుకి, ధైర్యానికి ఆమె ఆశ్చర్యపోయింది. తన సమస్య తనది. స్వప్నకి దారి చూపించడం తన ధర్మం. అందుకే శ్రుతి రాఘవరావుగారిని కలిసి స్వప్న విషయం చెప్పి, ట్రైనింగ్ కోర్సులో చేర్చమంది. ఆయన శ్రుతి మాట ప్రకారం స్వప్నని చీపురుపల్లిలో చేర్పి వచ్చారు.

తను అప్పుడప్పుడు వచ్చి చూస్తానని, ఎటువంటి బెంగ పడకుండా ఉండమని శ్రుతి చెప్పివచ్చింది. ట్రైనింగ్ అవుతున్న పిల్లలతో చేరాక స్వప్నలో వంటరితనం పోయింది. కొంత ఉత్సాహం కూడా వచ్చింది.

వీటన్నింటికీతోడు రాఘవరావుగారి విషయం కూడా శ్రుతికి కష్టంగా ఉంటోంది. ఆయనకి తనేమీ సాయం చేయలేదు. అలాగని బాధపడకుండా ఉండలేదు. కొడుకును ఎంతో కళ్ళల్లో పెట్టుకొని పెంచుకొన్న ఆయన కొడుకు జీవితాన్ని చూసి ఇప్పుడు బాధపడుతున్నాడు. కొన్నాళ్ళు పోయాక వీణలో మార్పు వస్తుందనీ, తల్లిప్రేమతో పసివాడిని అక్కున చేర్చుకొంటుందని అనుకొన్న వారి ఆశలు అడియాసలయ్యాయి.

వీణ చంటివాడిని దగ్గరకే తీసుకోదు. వాడిని శరణాలయంలో చేర్చమని నిత్యం గొడవట. ఈసడింపు మాటలతో ఇల్లు నరకం చేస్తోందిట. వంశీకృష్ణకి కొడుకంటే ప్రేమ. వాడిని వదలనంటాడు. వాళ్ళ సమస్యతో ఈయన ప్రాణానికి సుఖంలేదు.

శ్రుతి బి.ఇడి ఫస్టుక్లాసులో పాసయింది. ఆరోజు వసుధ వియ్యాలవారిని కూడా భోజనానికి పిలిచింది. శ్రుతి అత్త ఫొటోకి, తండ్రి ఫొటోకి దండలు వేసి నమస్కరించింది. ఎంత అసాధారణమైన వ్యక్తులో అనిపిస్తుంది ఆమెకి వాళ్ళని చూస్తే.

శారదమ్మ లక్ష్మమ్మదగ్గరా, వసుధ దగ్గరా




ప్రీతి విషయం కదిపింది. ప్రీతి పరీక్షలు ఎలాగో రాసేసింది. కనుక మంచిరోజు చూసి శుభకార్యం జరిపితే బావుంటుందని సూచించింది. నిజమే... దేనికదే జరిగిపోవాలి. ఇంకా తమ మనసు సర్దుకోలేదని ఆపడం ఏం బావుంటుంది? అందుకే శ్రుతి తల్లిఇష్టానికే విషయం వదిలేసింది.

తల్లి చెప్పిన బట్టలు కొని, ముఖ్యమని అనుకొన్నవారిని సత్యనారాయణ వ్రతానికి రమ్మని పిలిచింది. సాయంత్రం ప్రీతి వీణ కచేరీ ఏర్పాటు చేసింది. అందరూ ఇంట్లోవాళ్ళే కనుక ప్రీతి ధైర్యంగా వాయించింది. శారదమ్మ ఆరోజు ప్రీతికి కొత్తమోడలు నెక్లెను చేయించి పెట్టింది.

ఆ రాత్రి తన గదిలోకి వెళ్ళబోతున్న ప్రసాద్‌ను భరత్ ఆపాడు. ''బావా! చిన్నదే ఒక ప్రశ్న అడుగుతాను. చెప్పావా నీకు, మా అక్కకి నేను సినిమా చూపిస్తాను. లేదా నువ్వు నాకు ఇరవై రూపాయిలు ఇవ్వాలి. సరేనా? అడగనా?'' అంటున్న భరత్‌ను ప్రసాద్ అసహనంగా చూశాడు. అతడికి ప్రీతితో ఎప్పుడెప్పుడు మాట్లాడుదామా అని ఉంది. ఈ బావమరిది వదలడు.

''నువ్వు అలాగ నన్ను మింగేసేలాగ చూస్తే లాభంలేదు. త్వరగా నా ప్రశ్నకి సమాధానం చెపితే నేను వెళ్ళిపోతాను'' అన్నాడు.

''త్వరగా అడుగు'' అన్నాడు ప్రసాద్.

''ఏమిటా తొందర? పావు పాలలో ఎన్ని పాలు ఉంటాయి?''

''నీ మొహం. ఇ... అడిగే ప్రశ్న. పావు పాలలో పావే పాలు ఉంటాయి'' అన్నాడు ప్రసాద్. కాదన్నాడు భరత్.

''పోనీ 1/4 పాలు ఉంటాయి'' అన్నాడు ప్రసాద్.

''అబ్బ... బావగారివి ఏం తెలివితేటలురా?'' అని ఎగతాళిగా అంటున్న భరత్‌ను కోపంగా చూస్తూ ''నీకు తెలిస్తే చెప్పవచ్చును కదా!'' అని అన్నాడు. నా మొదటి రాత్రి వీడి ప్రశ్నలతోనే తెల్లవారిపోతుంది కాబోలు అని గొణుక్కున్నాడు.

''సర్లే... ఓడిపోయానుకదా! ఇదిగో ఇరవై'' అని ఇచ్చాడు.

డబ్బు తీసి ఇచ్చి తన గదివైపు పారిపోబోతున్న అతడిని భరత్ రెక్కపట్టుకొని ఆపాడు. ''ఏమిటా తొందర? ఇరవై తీసి ఇచ్చేస్తే పుచ్చుకోవడానికి నేనేం ముష్టివాడిననుకొన్నావా? సమాధానం విని, అభినందించి ఇవ్వాలి. ఇది నేను నా తెలివితేటలతో అడుగుతున్న ప్రశ్న అని తెలుసుకోవద్దా?'' అంటున్న భరత్ గడ్డంపుచ్చుకుని పొరపాటైపోయిందిరా అంటూ బతిమాలాడు.

ఈలోపు శ్రుతి భరత్‌ని పిల్చింది. అక్కగారి పిలుపుకి వెళ్ళబోతున్నవాడిని, ''సమాధానం చెప్పి వెళ్ళు'' అని ప్రసాద్ ఆపాడు. లేకపోతే వాడు తన గది తలుపులు కొట్టి సమాధానం చెప్పడానికి ఎక్కడ మళ్ళీ వస్తాడో అన్న భయం కలిగింది.

భరత్ ఆగి కొంటెగా చూస్తూ, ''పావు పాలలో ఎన్ని పాలు ఉంటాయి?... రెండు 'పా'లు ఉంటాయి'' అన్నాడు.

ప్రసాద్ తెల్లబోయి ''రెండు పాలా?'' అని అడిగాడు.

''అవును... పావులో ఒక 'పా', పాలలో ఒక 'పా'... కలిపితే రెండు 'పా'లు కావా?'' అని, మళ్ళీ శ్రుతి కేక వేయడంతో లోపలకి పారిపోయాడు.

''నేను, శారదత్తయ్య సినిమాకి వెళుతున్నాము. నువ్వు వస్తావేమో అని పిలిచాను'' అని అంటున్న అక్కగారివైపు సంతోషంగా చూస్తూ భరత్ వాళ్ళతో సెకండ్‌షోకి బయలుదేరాడు.

''మా తమ్ముడి చేతిలో ఓడిపోవడం, డబ్బులివ్వడం తప్ప మీకు వేరే పని లేదా? ఎంత చిన్న ప్రశ్న అయినా మరొకరకంగా ఆలోచించరేం?'' అని ప్రీతి అడిగింది. తనే మళ్ళీ ''పోనీ! నేను కూడా ఒక ప్రశ్న అడుగుతాను. మీరు చెప్పాలి'' అంటున్న ప్రీతిని ప్రసాద్ గబుక్కున కౌగిలిలోకి తీసుకున్నాడు. ''ఒకపక్క మీ తమ్ముడి ప్రశ్నలతోనే చస్తొంటే నువ్వు కూడానా?'' అంటూ ప్రసాద్ ఆమెను మరి మాట్లాడనీయలేదు.

మర్నాడు ప్రీతిని, ప్రసాద్‌ను కూర్చోపెట్టుకొని శారదమ్మతో అంతా కలిసి ఉందామని చెప్పింది శ్రుతి. శారదమ్మ ఊరుకొన్నా ప్రసాద్

ఒప్పుకోలేదు. దగ్గర దగ్గర ఇళ్ళేకదా... సమస్యే మిటి అని సున్నితంగా తోసిపుచ్చాడు.

రిటన్‌టెస్టులో, వేరల్ టెస్టులో పాసైన శ్రుతి కి బి.ఇడి అసిస్టెంటుగా మున్సిపల్ హైస్కూలులో పోష్టు ఇచ్చారు. శ్రుతికి చెప్పలేనంత ఆనందంగా అన్పించింది. ఇంట్లో వాళ్ళంద రినీ సినిమాకి తీసికెళ్ళాలని భరత్ డిమాండ్ చేశాడు. అలాగేనని ఆనందంగా ఒప్పుకొంది. మొదటిసారిగా ఇంట్లోవాళ్ళందరూ కలిసి సిని మాకి వెళ్ళారు. లక్ష్మమ్మమాత్రం ఇంట్లో ఉండి పోయింది.

మర్నాడు రాఘవరావు వైజాగ్‌నుండి వచ్చా రని తెలిసి ఆయనకి చెప్పడానికి వెళ్ళింది శ్రుతి. ఉన్న ఊళ్ళో ఉద్యోగం వచ్చినందుకు ఆయన ఎంతో సంతోషించారు. వాళ్ళ బాధలు చాలావరకూ వదిలినట్లే అనుకొన్నారు. ఆయన కి శ్రుతిని చూశాక కొడుకు విషయం గుర్తుకి వచ్చింది. కొడుకు గుర్తుకు రాగానే అతడిమీద కోపం వస్తోంది. మగవాడై ఉండి అతను సుఖపడటంలేదు. తనని సుఖపెట్టడంలేదు. ఏం బతుకులో ఆయనకి అర్థమవలేదు.

కాసేపు శ్రుతి, ఆయన కష్టం, సుఖం మాట్లా డుకున్నారు. శ్రుతి ఆయనతో అంది, ''మీతో మాట్లాడి నేను ఒక నిర్ణయం తీసుకోవాలను కొంటున్నాను'' అంది.

ఆయన శ్రుతి పెళ్ళి విషయమేమో అనుకొ న్నారు.

ఆయన మాటలకు శ్రుతి నవ్వేసింది. ''పె ళ్ళికి ఇంకా టైము ఉంది అంకుల్. అదికాదు, మా ఇంట్లో కుడిచేతివైపు చాలా ఖాళీస్థలం ఉంది. అందులో పాక వేసి రెండు గదులు పెద్దవి వేద్దామనుకొంటున్నాను. వెనకగా ఒక హాలులాంటిది ఉంచాలని నా ఉద్దేశం. ఇన్నా ళ్ళూ ఉద్యోగం ఎక్కడ వస్తుందో అని భయప డ్డాను. ఊళ్ళోనే భగవంతుడు చూపించాడు. ఆ పాకలో ఒక సంగీత కళాశాల పెట్టాలని అనుకొంటున్నాను'' అని ఆగింది శ్రుతి. ఆయన ఆశ్చర్యంగా వింటున్నారు.

''మా అత్త జీవితం నాకు స్ఫూర్తి అంకుల్. విధి ఎన్ని దెబ్బలు తినిపించినా ఆవిడ జీవితంతో పోరాటమే చేసింది. మరెవరైనా ఆమె పరిస్థితుల్లో ఉంటే ఆత్మహత్య నిర భ్యంతరంగా చేసుకొనేవారు. అన్న బిడ్డలను కన్నబిడ్డలుగా చూసుకొనే విశాలహృదయం ఎందరికి ఉంటుంది? అందుకే అత్తపేరు పదిమందికీ గుర్తు ఉండేలాగ, పది కాలాలు నిలిచేలాగ 'సుభద్రా సంగీత కళాశాల' పెట్ట లని నా ఉద్దేశం. నేను, ప్రీతి మరికొంతమంది పిల్లలకు సంగీతం నేర్పిస్తాము'' అని అంటు న్న శ్రుతిని విస్ఫారిత నయనాలతో చూశారు రాఘవరావుగారు.

ఆయనకి ఆ అమ్మాయి నిర్ణయం వింటే ఎంతో ఆనందం కలిగింది. కానీ ఆడపిల్ల అలిసిపోతోందే అని అన్పించింది. ప్రెస్, ఉద్యోగం, సంగీత కాలేజీ చూసుకోవడం కష్టం కదా అని అడిగారు. శ్రుతి ఆయనతో అన్నీ మాట్లాడింది.

ప్రసాద్, ప్రీతి ఇక్కడే ఉండేవాళ్ళు. ప్రెస్ పని వాళ్ళకి వదిలేస్తే బావుంటుందని శ్రుతి అనుకొంటోంది. వాళ్ళకి మంచి అవకాశం కల్పించినట్లు కూడా అవుతుంది. ఇంక తనకి ఉద్యోగం ఉంది. సాయంత్రంవేళల్లో తను, ఉదయంవేళల్లో సంగీతం అభిరుచి ఉన్న ఇతర కళాకారులు సంగీత కళాశాలలో విద్యా ర్థులకు పాఠాలు చెపుతారు అని శ్రుతి ఆలో చన. ప్రసాద్‌కి అవసరమన్పించినపుడు తన సహాయం ఎలాగో ఉంటుంది. అతడూ జీవి తంలో బాగా ఎదుగుతాడు.

శ్రుతి మాటలు వింటోంటే వీటన్నింటి గు రించి ఎప్పుడో ఒక అవగాహనకి వచ్చి నిర్ణ యించుకొన్నట్లు అన్పిస్తోంది. ఆయన ఆమె నిర్ణయాలను అభినందించి ఆమోదించారు.

ఆయనకి ఒక విషయం బాధగా అన్పించింది. తన భార్య చాలా చిన్నతనంలో పోయింది. ఎప్పుడూ ఆవిడని తలచుకొని బాధపడటంతప్ప శ్రుతిలాగ ఆవిడ పేరు పది కాలాలపాటు నిలిచే పని చేయలేకపోయానే అని హఠాత్తుగా అన్పించింది. మనిషి ఈరోజు ఉంటాడు. రేపు ఉండడు. వాళ్ళు చేసిన మంచి పనులవలననో, లేక వాళ్ళ పేరున జరిగే మంచిపనులవలననో వాళ్ళ పేరు నిలి చివుండాలి. అప్పుడే ఆ జీవితానికి సార్థకం అని అనుకొన్నారు.

ఇంటికి వచ్చాక అందరినీ పిలిచి తన





మనసులోని ఉద్దేశం చెప్పింది. వసుధ కూతురు పెళ్ళిమాట ఎత్తుకోకపోవడం చూసి బాధపడుతోంది. లక్ష్మమ్మ అయితే పైకే అనేస్తుంది. లక్ష్మమ్మకి శ్రుతి ఎప్పుడూ ఒకేమాట చెపుతుంది, భరత్ చదువు అవ్వాలని.

ప్రసాద్, ప్రీతి ఆమె తీసుకొన్న నిర్ణయాలు విని ఆశ్చర్యపోయారు. తమ భవిష్యత్ గురించి కన్నతల్లికంటే ఎక్కువగా ఆలోచించే ఆమెకోసం తాము ఏంచేయాలి? అన్పించింది. తండ్రి ప్రెస్ అంటే శ్రుతికి ఎంత ప్రీతిపాత్రమైనదో ప్రసాద్‌కు తెలుసును. శ్రుతి తనమీద ఎటువంటి బాధ్యత ఉంచిందో అతడికి బాగా అర్థమైంది.

శ్రుతి స్కూలులో చేరింది. సోషల్ స్టడీస్ అసిస్టెంటు కనుక ఆమెకి తొమ్మిది, పది తరగతులు ఒక సెక్షన్ సోషల్, ఎనిమిదవ తరగతి ఇంగ్లీషు, తొమ్మిదవ తరగతి ఇంగ్లీషు ఇచ్చారు. శ్రుతికి స్కూలు ఎంతో నచ్చింది. అందులో గ్రేడ్ ఒన్ పండితులు కృష్ణమాచార్యులుగారిని చూడగానే మరీ ఆనందం కలిగింది. ఆయనతో కలిసి పనిచేసే అవకాశం కలిగినందుకు ఎంతో సంతోషించింది. సెకండరీ అసిస్టెంటు సువత్సల శ్రుతికి బాగా నచ్చింది. అసలు నచ్చనిది డ్రిల్లు మేస్టారు సురేష్.

అతడి అహంకారం అతడి ప్రవర్తనలో అణువణువూ కన్పిస్తూనే ఉంటుంది. స్కూలులోని అందరినీ డామినేట్ చేయాలనే మనస్తత్వం. అతడి స్టైలు, బట్టలు, మాటలు చూస్తే శ్రుతికి నవ్వు వచ్చేది. మిగిలినవారందరూ శ్రుతికి స్నేహపూర్వకంగానే కన్పించారు.

పదవ తరగతి క్లాసుకి తీసికెళ్ళి హెడ్‌మేస్టారుగారు ఆమెను పరిచయం చేశారు. శ్రుతి స్కూలుకి రాగానే అంతకుపూర్వమే పిల్లలు ఎప్పుడో కుతూహలంగా చూశారు. అసలు అందమైన టీచర్లంటే పిల్లలకి కూడా ఆరాధనేమో?

శ్రుతి తనని తాను పరిచయం చేసికొని, వారందరినీ తమ గురించి చెప్పమంది. ఒక ఉపాధ్యాయినిగా మొదటిసారిగా అంతమంది పిల్లలకు పాఠం చెప్పడం థ్రిల్‌గా అన్పించింది. ఎవరెవరికి ఏయే సబ్జెక్టులు ఇష్టమో అడిగింది. సోషల్ అంటే ఇష్టమైనవాళ్ళు చాలా తక్కువమంది కన్పించారు. అప్పుడు సాంఘికశాస్త్రముయొక్క ప్రాముఖ్యతను వాళ్ళకి చెప్పింది.

సాయంత్రం తొమ్మిదవ తరగతికి 'భారతదేశం' గురించి పాఠం చెప్పింది. బోర్డుమీద స్వయంగా భారతదేశం పటం గీసి, మన దేశపు గొప్పతనాన్ని గూర్చి చెపుతోంటే విద్యార్థులు ఉత్సాహంగా విన్నారు. ఆమె పాఠం చెపుతూ వేసే ప్రశ్నలకి పోటీలుపడి సమాధానాలిచ్చారు.

చేరిన రెండురోజుల తర్వాత ఒకరోజు సాయంత్రం సురేష్ ఇంటికి వెళ్ళేటప్పుడు శ్రుతి దగ్గరకి వచ్చాడు. "మీరు ఆవిడతో కలిసి ఎందుకు కష్టపడి నడవడం? మీకు అభ్యంతరం లేకపోతే నా స్కూటర్‌మీద రండి, డ్రాప్ చేస్తాను" అని ఆహ్వానించాడు.

శ్రుతి సున్నితంగా నిరాకరించింది. సువత్సలగారు, తాను కలిసి రిక్షా మాట్లాడుకొంటామని, బజారులో పని ఉండి మొన్న రెండు రోజులూ నడిచామని, అవసరమైనప్పుడు తప్పక ఆయనని అడుగుతానని చెప్పి తప్పించుకొంది. సురేష్ మొహం ఆవగింజంత అయింది.

సువత్సలమాత్రం శ్రుతి ధైర్యానికి ఆశ్చర్యపోయింది. "ఆయన ఏదైనా ఆఫర్ చేస్తే మనం తిరస్కరిస్తే ఊరుకోరు. ఎన్నో మాటలంటారు. పోతే... మీరు చాలా అందంగా ఉంటారు కనుక డ్రాప్ చేస్తానన్నారు. నాలాంటి వాళ్ళను అయితే పలకరించడానికే ఇష్టపడరు" అంటూ చెప్పింది. సువత్సల నలుపైనా చాలా కళగా ఉండే మొహం. మొదటి పరిచయంలోనే వాళ్ళిద్దరూ బాగా ఆత్మీయులైపోయారు.

సాయంత్రం ఇల్లు చేరిన అక్కగారికి ప్రీతి బోర్నవిటా ఇచ్చి స్కూలు విషయాలు అడిగేది. 'పిల్లలంటే భయం వేయలేదా? పాఠాలు చెప్పగలుగుతున్నావా" అని అన్నీ అడుగుతుంది. "అక్కకి పిల్లలంటే భయమా? ఛా... హిట్లర్‌ని చూస్తే పిల్లలే భయపడాలి" అని భరత్ పెరట్లోకి పారిపోయేవాడు. వాడి మాటలు విని నవ్వుకుంది.

శ్రుతికి ఉద్యోగం తృప్తిగా ఉంది. కృష్ణమాచార్యులు గారికి శ్రుతికి రెండు లీజర్లు కలుస్తాయి. ఒక పీరియడ్ ఆయనతో తెలుగు సాహిత్యానికి సంబంధించిన విషయాలు చర్చించేది. ఆయన ఎప్పుడూ ఏదో ఒక గ్రంథం చదువుతూనే ఉంటారు. ఏది అడిగినా ఓపికగా సమాధానాలు ఇస్తారు. శ్రుతికి గల భాషాపరిజ్ఞానానికి ఆయన ఆశ్చర్యపడేవారు.

ఆయన మంచి వక్త. ఆయన ఉపన్యాసం ఎక్కడ ఉన్నా శ్రుతి వెళ్ళేది. కృష్ణమాచార్యులు గారికి ఇద్దరు పిల్లలు. అబ్బాయి డాక్టరుగా మంచి పేరుప్రతిష్టలు పొందాడు. పెళ్ళైన అమ్మాయిమాత్రం మొదటికాన్పులోనే పోయింది. దానితో ఆయన భార్య అనారోగ్యంతో మంచానపడ్డారు. ఆయన బాధలేమిటో పరమేశ్వరుడికే తెలియాలి. ఇన్ని బాధలున్నా ఆయన అలాగ ఉండగలిగినందులకు శ్రుతి ఆశ్చర్యపోయేది.

శ్రుతి ఆ విషయమే ఆయనదగ్గర అన్నప్పుడు ఆయన నిర్లిప్తంగా నవ్వేశారు. "చూడమ్మా! 'వేదనము లేని బ్రతుకు దూదికంటె తేలికాను, వేదనలోనే పుట్టెను వేదమ్ములు నాదమ్ములు' అన్నారు. ఎవరి ఖర్మ వారనుభవించాలి. మా ఆవిడ అమాయకత్వంకానీ, చూస్తే ఎవరిలో నా బిడ్డ కన్పించదు గనుకా! చెప్పమ్మా! నువ్వు నా కాత్యాయనివి కాదా?" అని అడిగే ఆయన గొప్ప మనసుకి శ్రుతి చేతులు జోడించేది.

కృష్ణమాచార్యులుగారు ఇచ్చిన ప్రోత్సాహంతో శ్రుతి తెలుగు ఎం.ఏ. పరీక్షకు కట్టింది. తెలుగు సాహిత్యంపై ఉన్న ప్రీతి ఆమెను మొదట దానివైపుకే పురికొల్పింది. పాకను, గదులను తయారుచేయించింది. దసరాకి ప్రారంభించాలని ప్రయత్నాలు మొదలెట్టింది.

ఒకరోజు శ్రుతి స్కూలునుండి వచ్చేసరికి మాధవరావు, రామచంద్రం ఇంట్లో కనిపించారు. "ఏమే అమ్మాయి... ఉద్యోగం వచ్చిందని కవరు రాసి పడెయ్యకపోతే వచ్చి చెప్పి నాలుగు రోజులుండి రావచ్చునుకదా" అని రామచంద్రం అడిగాడు. వాళ్ళని పలకరించి, వంటింట్లోకి వెళ్ళింది. వంటింట్లో తల్లి, ప్రీతి పడుతున్న హడావుడి చూసి కేకలేసింది. తల్లి వారికోసం అన్ని తయారుచేయడం శ్రుతికి నచ్చలేదు.

ఎంతయినా ఇంటి అల్లుడు కదా అని ఆవిడ ఉద్దేశం.

సుభద్రతోనే ఆ బాంధవ్యాలు పోయాయని శ్రుతి నమ్మకం. లక్ష్మమ్మ, రామచంద్రం 'నువ్వు చెప్పు' అంటే 'నువ్వు చెప్పు' అని విషయాన్ని వంతులేసుకొంటున్నారు. శ్రుతికి ఏమీ అర్థమవలేదు. చివరికి ఆ రాత్రి రామచంద్రమే శ్రుతిని వాళ్ళదగ్గరికి పిలిచాడు. వాళ్ళ రాకలోని ఆంతర్యాన్ని చెప్పాడు. విషయం విన్న శ్రుతి స్టన్నయిపోయింది. మరుక్షణమే ఆమెకి ఒళ్ళంతా కోపంతో ఆవిరులు వచ్చాయి.

మాధవరావు తన కొడుకు వేణుకి శ్రుతిని చేసుకొంటానని అడగడానికి వచ్చాడుట. రామచంద్రానికి విషయం రాసి సహాయంకొరకు రమ్మన్నాడుట. వేణు కూడా శ్రుతంటే ఇష్టపడ్డాడుట. అందువలన ఆయన వచ్చారు.

శ్రుతికి వాళ్ళంటే చెప్పలేనంత అసహ్యం వేసింది. ఏమిటి ఈ మనుష్యులు? వీళ్ళ నిర్ణయాలు చెప్పడానికైనా బిడియపడరేం? కనీసం అభిమానమైనా ఉండవద్దా? వాళ్ళ కోరిక విని ఎగిరి గంతేస్తాననుకొన్నారా?

"మనం మనం ఒకటి కాకపోతామా చెప్పు తల్లీ! వేణుకేం తక్కువ. లెక్చరర్‌గా ఉద్యోగం చేస్తున్నాడు. మీ అత్తంటే నీకు చాలా ఇష్టం. మీ అత్త ఇంట్లో దీపం వెలిగించినదానివి అవుతావు" అంటున్న లక్ష్మమ్మని చేయెత్తి మరి మాట్లాడవద్దన్నట్లు శ్రుతి చూసింది. శ్రుతి సూటిగా మాధవరావు మొహంలోకి చూసింది.

"శ్రుతీ! నువ్వు మీ అత్త జ్ఞాపకార్థం ఏం చేయబోతున్నావో ప్రసాద్ చెప్పాడు. చాలా సంతోషం. నేను కూడా చేసిన తప్పు సరిదిద్దుకోవాలని అనుకొంటున్నాను. మీ అత్తకి ఎంతో ఇష్టమైన నిన్ను మా కుటుంబంలోకి ఆహ్వానించడానికి వచ్చాను. వేణుకి నువ్వంటే ఇష్టమే. నువ్వే నీ అభిప్రాయం చెప్పాలి" అని మాధవరావు నవ్వాడు. పదేళ్ళు పైబడినట్లు అయిన ఆయనను చూసినా శ్రుతి మనసు కరుగలేదు.

"ఆపండి... ఇంకేం చెప్పవద్దు. మీ ఇంటికి





ఎన్నో ఆశలతో మా అత్త ఒకనాడు వచ్చింది. మీరు ఆమెను నిర్లక్ష్యం చేశారు. ఇంట్లోనుండి వెళ్ళిపోయే పరిస్థితులు కల్పించారు. నా అత్త కి స్థానం కరువైన ఆ ఇంటికి నేను మళ్ళీ వెళ్ళడమా? కోడలుగా అడుగు పెట్టడమా? అవదు... ఈ జన్మలో అవదు. నేను అలా చేస్తే మా అత్త ఆత్మ క్షోభిస్తుంది.

ఎక్కడ స్త్రీ గౌరవంగా చూడబడుతుందో అక్కడ లక్ష్మి తప్పక నివసిస్తుందని ఆర్యోక్తి. మీరు మీ గృహలక్ష్మిని అలక్ష్యం చేశారు. నేను మిమ్మల్ని బతికిఉండగా ఎన్నటికీ క్షమించలేను. దయచేసి పెళ్ళిమాట మరిచిపోండి'' అని శ్రుతి ఆవేశంగా చెప్పి లోపలికి వెళ్ళిపోయింది.

రామచంద్రంమాటపై వసుధ చెప్పబోయినా శ్రుతి విన్పించుకోలేదు. రాఘవరావుతో చెప్పిద్దామని వాళ్ళు ఆ పూట ఉండిపోయారు. ''ఎప్పుడో ఏదో జరిగిందని ఇప్పుడు వచ్చినవాళ్లను పొమ్మంటామా?'' అని అంటున్న లక్ష్మమ్మను శ్రుతి ఏహ్యాభావంతో చూసింది.

రామచంద్రం మర్నాడు రాఘవరావుని పిలిచి విషయం చెప్పి శ్రుతిని ఒప్పించమన్నారు. శ్రుతి స్కూలుకి తయారవుతోంది. రాఘవరావు వచ్చిన అలికిడికి ఇవతలికి వచ్చింది. ఆయనను చూసి నవ్వి తనే చెప్పేసింది. ''అంకుల్... ఈ విషయంలో నా మనసు మీకు బాగాతెలుసును. పెళ్ళంటే వధూవరులిద్దరూ ఇష్టంతో చేసుకోవాలి. వేణు అంటే నాకు అయిష్టం. పిచ్చిదవనీండి, వెర్రిదవనీండి, తల్లి తల్లే. తల్లి పంచిన ఆ మమకారాన్ని అయినా గుర్తుపెట్టుకొని అతడు ప్రవర్తించలేదు. నాకు అటువంటివాళ్ళని భరించే శక్తి లేదు'' అంటూ చేతులు జోడించి చెప్పింది.

మాధవరావు మరొకసారి తాపీగా ఆలోచించుకొని చెప్పమన్నా శ్రుతి అవదని తేల్చి చెప్పేసింది. వాళ్ళిద్దరూ నిరుత్సాహంగా వెళ్ళిపోయారు. పదిరోజులు గడిచాక స్కూలు నుండి వచ్చిన శ్రుతిపై లక్ష్మమ్మ సాధింపు మొదలెట్టింది.

''కోరి వచ్చిన సంబంధాన్ని కాదన్నావు. ఇంతోటి ఆడపిల్లవాళ్ళకి దొరకనట్లు ఛీకొట్టావు. చూడు ఇప్పుడు ఏమయిందో? మీ పెదనాన్న తన బిడ్డని వాళ్ళకి ఇచ్చుకొంటున్నాడుట. అందరూ మనలాగ తెలివితక్కువ దద్దమ్మలు కారు'' అంటూ రామచంద్రం రాసిన ఉత్తరం శ్రుతిపైకి విసిరింది. ఉత్తరం చదివిన శ్రుతి కించిత్తు కూడా బాధపడక, మామూలుగా టేబుల్‌పై పడేసి వెళ్ళిపోయింది.

''అసలు నీ మొహానికి ఆ భగవంతుడు పెళ్ళిరాత రాసి ఉండడు. మగరాయుడులాగ ఇలాగ సంపాదించుకొని బతకమని రాశాడు కాబోలు. నేనుమాత్రం ఏం చేస్తాను?'' అంటున్న లక్ష్మమ్మకు శ్రుతి అడ్డువచ్చింది. ''మామ్మా! పెద్దవయసు వచ్చినా నీకు ఈ హైరానా ఎందుకే? నువ్వే అంటావుకదా, కళ్యాణమొచ్చినా కక్కొచ్చినా ఆగదని. ఆరోజు వస్తే అదే అవుతుంది. నువ్వు కృష్ణా, రామా అనుకొంటూ కూర్చో'' అని సలహా ఇచ్చింది.

తనకి భర్త కావలసినవాడు ఎక్కడో పుట్టే వుంటాడని, ఆ సమయం వచ్చినప్పుడు తనే అతడిని తీసుకొచ్చి కాళ్ళకి నమస్కారం చేయిస్తానని ధీమాగా అంటూంటే లక్ష్మమ్మ బుగ్గలు నొక్కుకొంది. మామ్మని చూసి శ్రుతి నవ్వింది.

''నవ్వడానికి సిగ్గయినా లేదుటే. నీకన్నా చిన్నది రేపో మాపో బిడ్డను ఎత్తుకోబోతోంది. నీకుమాత్రం ఏ కోరికా లేదు'' అని లక్ష్మమ్మ తిట్టింది. ''నిజమా...'' అంటూ శ్రుతి ఇంట్లోకి పరుగెత్తింది. సంతోషంతో ప్రీతిని పట్టుకొని తిప్పేసింది. వసుధ వచ్చి శ్రుతిని ఆపింది.

తన తండ్రే మళ్ళీ చెల్లెలి కడుపున పుడతాడని శ్రుతి నమ్మకం. శ్రుతికి ఎంతో ఆనందంగా ఉంది. చెల్లెలిని కాలు కింద పెట్టనివ్వడంలేదు. శ్రుతికి మహా సందడిగా ఉంది.

స్వప్నకి ట్రైనింగ్ అవగానే వచ్చేసింది.

ఒకపక్క స్వప్న కూతురు సుధతో కాలం గడిపెయ్యాలన్పిస్తుంది. ప్రీతి నెల తప్పిన పిల్లని ప్రెస్ పని మళ్ళీ తను అందుకొంది. ఉదయం, సాయంత్రం పనులతో తీరిక లేదు. జీవితం బిజీగా ఉండటం మంచిదే కానీ అమ్మ బాబోయ్... ఇంత బిజీయా అని ప్రసాద్ వేళాకోళం చేస్తూ ఉంటాడు. ప్రెస్ పని తను ఒక్కడూ చేసుకొంటానని మందలిస్తాడు.

ప్రీతికి మగబిడ్డ కలిగాడు. బాలసారెనాడు

'భానుమూర్తి' అనే నామకరణం చేశాడు ప్రసాద్. వసుధ చెమ్మగిల్లిన కళ్ళతో మనవడిని చూసుకొంది. శ్రుతి ఒక బంగారు గొలుసు వాడికి చేయించి పెట్టింది. పురుడు పుట్టింట్లో అన్నమాటేకానీ కోడలుకోసం శారదమ్మ ఇక్కడికి వచ్చి అన్ని పనులూ చూసేది. మనవడంటే ఆవిడకి అపురూపం. భరత్ చంటివాడిని ఒక్క క్షణం వదలడంలేదు.

"చెల్లెలి కొడుకును, స్నేహితురాలి కూతురిని ఎత్తుకొని మురిసిపోవడమేనేమిటే నీ పని. నీ ఖర్మ... హాయిగా పెళ్ళి చేసుకొని పండంటి మునిమనవడిని ఇద్దామని ఎందుకనుకోవే" అంటూ లక్ష్మమ్మ నెత్తి బాదుకొనేది.

"ఇదిగో చూశావా! ఎం.ఎ. డిగ్రీ తెచ్చి నీ చేతికి ఇచ్చాను. ఇదీ నా బిడ్డే. మా నాన్న ఉంటే నా చదువు చూసి నిజంగా పొంగిపోయేవాడు. నీకు దీని విలువ ఏం తెలుసును?" అంటూ శ్రుతి ఎదురు సాధించేది.

సరస్వతీ కటాక్షముంది కనుక శ్రుతి అంత చదువు చదివిందని శారదమ్మకి సంతోషం కలిగినా ఏ వయస్సులో జరగవలసిన ముచ్చట ఆ వయసులో జరగాలని, జీవితానికి ఒక తోడు అవసరమని శ్రుతికి నచ్చచెప్పేది. వసుధ వాళ్ళందరూ చెప్పినప్పుడైనా శ్రుతికి బుద్ధి మారుతుందని అనుకొనేది.

"పి.హెచ్.డి. అయ్యాక పెళ్ళి చేసుకొంటాను. మామ్మ కోరిక తీరుస్తాను" అంటున్న శ్రుతిని లక్ష్మమ్మ కోపంగా చూసేది. "అప్పుడు ఎవరు దీన్ని పెళ్ళిచేసుకొందుకి ముందుకి వస్తారు. పళ్లూడిపోయి, తల ముగ్గుబుట్ట అయ్యాక ఇదెవరికి కావాలి?" అని గొణిగేది.

ఆహ్వానపత్రికలు పంపి ఊళ్ళోని పెద్దలను నలుగురినీ పిలిచి, శ్రుతి సంగీత కళాశాల ప్రారంభించింది. ప్రారంభోత్సవానికి సుభద్ర కుటుంబం కూడా వచ్చింది. రాఘవరావు, కృష్ణమాచార్యులు తమ ఉపన్యాసాల్లో ఈనాటి యువతరానికి శ్రుతి ఒక స్ఫూర్తని పేర్కొన్నారు.

శ్రుతి ఏపని చేసినా ఆలోచించి చేస్తుంది. ప్రభుత్వ సంగీత కళాశాల ఉన్నా ఊరికి చాలా దూరంగా ఉండటంవలన ఇటువైపువాళ్ళు దానికి వెళ్ళలేకపోతున్నారు. కళలు నేర్చుకోవాలన్పించినా, అవకాశం లభించని ఆ చుట్టుపక్కల ప్రజలకి ఈ కళాశాల కల్పతరువులాగ కన్పించింది.

ఉద్యోగం రాక, డిప్లొమా పాసై ఖాళీగా ఉన్న ఉత్సాహవంతులు కొందరు ఈ కళాశాలలో పని చేయడానికి వచ్చారు. శ్రుతి అడగకుండానే బాగా తెలిసిన రాఘవరావువంటివాళ్ళు చందాలు పంపారు.

సంగీత కాలేజీకి సంబంధించిన వీణ, వయొలిన్ వగైరా చవకగా వైజాగ్‌నుండిగాని, బొబ్బిలినుండిగానీ తెప్పించి పెట్టమని అడుగుదామని శ్రుతి రాఘవరావుగారి ఇంటికి వెళ్ళింది. ఆయనకైతే అందరూ తెలుసు.

తేలికగా పనవుతుందని అర్థించడానికి వెళ్ళిన శ్రుతికి ఇంట్లో నాలుగేళ్ళ శరత్ కన్పించాడు.

"ఎవరు వచ్చారండీ! తాతగారు వస్తారు. సోఫాలో కూర్చోండి" అంటున్న అతడిని దగ్గరికి తీసుకొని "నువ్వు ఎప్పుడు వచ్చావు బాబూ" అని అడిగింది.

"నాలుగైదురోజులైందండీ" అన్నాడు.

"మీ అమ్మగారు, నాన్నగారు కూడా వచ్చారా?" అని అడిగింది.

"అమ్మ నన్ను వైజాగ్‌లో ఉండవద్దంది. అందుకే తాతగారితో వచ్చేశాను" అంటూ ఏడుస్తూ చెప్పాడు. శ్రుతి అనవసరంగా అడిగి బిడ్డను ఏడిపించానా అని బాధపడింది.

అతడి ఏడుపు మాన్పించడానికి అతడిని ఎత్తుకొంది. తాతగారు పాపం ఇక్కడ ఒక్కరూ ఉన్నారని, బాబు నాన్నగారు ఉద్యోగం కనుక తాతగారి దగ్గర ఉండలేరని, మరి బాబే తాతగారి దగ్గర ఉండి, ఆయన్ని బాగా చూసుకోవాలని శ్రుతి వాడికి అర్థమయ్యేలాగ చెప్పింది. "తాతగారికోసం ఉండిపోతావు కదూ" అని అంటే వాడు "ఊ" అంటూ తల ఊపాడు.

"ఇక్కడ మనకి బోలెడుమంది ఉన్నారు భరత్ ఉన్నాడు. బోలెడు అల్లరి చేస్తాడు. చిన్నబాబు భాను, ప్రీతి అందరూ ఉన్నారు. నువ్వు అందరితో ఆడుకోవచ్చును. మా ఇంటికి




రావచ్చును'' అని వాడిని మరిపిస్తూ కబుర్లు చెప్పింది. ఈలోపు రాఘవరావు వచ్చాడు. ''ఇప్పుడే వద్దామని స్నానానికి వెళ్ళాను. చాలాసేపయిందా నువ్వు వచ్చి'' అని అడిగారు.

''ఇప్పుడే వచ్చానండీ! బాబుతో కబుర్లు చెపుతున్నాను'' అంటూ వాడిని దింపింది.

''బాబూ! రాజుతో వెళ్ళి స్నానం చేసిరా'' అంటూ వాడిని ఆయన స్నానానికి పంపారు. ''మరి ఆంటీ'' అంటున్న బాబుతో ''ఆంటీ ఇక్కడే ఉంటారు. నువ్వు వెళ్ళిరా'' అని పంపారు.

''ఈమధ్య మీరు అసలు కన్పించలేదు'' అనడిగింది శ్రుతి.

ఆయన బాగా నీరసంగా ఉన్నారు. శ్రుతికి అన్ని విషయాలూ చెప్పారు. వీణ భర్తని అసలు ఖాతరు చేయడంలేదుట. వాడిని బోర్డింగ్ బ్లైండ్ స్కూల్లో చేర్పమంటుంది. వంశీకృష్ణ బిడ్డని వదిలి ఉండలేనంటాడు. ఇద్దరికీ గొడవ. తల్లివై, వాడికి ప్రేమ పంచి ఇవ్వవద్దా అని తను వాదిస్తాడు. అందరిలాగ పుట్టకపోవడం వాడి నేరమా? అందరిలాగ పుట్టిఉంటే నువ్వు ఈ మాట అంటావా అని అతడు దెబ్బలాడతాడుట.

ఆమెకి సాయం తల్లిదండ్రుల వత్తాసు. ఆమె స్నేహితులు కూడా బిడ్డలు తల్లిదండ్రుల దగ్గర పెరగకూడదని, డిసిప్లిన్ ఉండదని లెక్చర్లుట. ఎప్పుడూ భార్యతో గొడవపడని వంశీకృష్ణ ఈ విషయంలోమాత్రం ఆమె మాట వినడంలేదుట. వైజాగ్ వెళ్ళినప్పటి నుండీ ఇద్దరిమధ్యా గొడవలే.

వీణ ఎప్పుడూ పుట్టింటి దగ్గరే ఉంటుందిట. పేరుకే వేరు కాపురం. ఒకపూట కూతురు వెళ్లకపోతే తల్లి ఫోనుచేసేస్తుంది. పనులు చేయడమంటే బద్ధకం. నౌకర్లమీదే ఇల్లు వదిలేస్తుంది. భర్త పనులన్నా స్వయంగా చూడదు. భర్తని, బిడ్డను నౌకర్ల దయాదాక్షిణ్యాలకు వదిలి క్లబ్బులకి, సినిమాలకి తిరుగుతుంది. వంశీకృష్ణ విసుగు వచ్చి ఏమన్నా అన్నాడో వెంటనే మాటకిమాట చెపుతుంది. అలక సాగిస్తుంది. ఆపూటకి ఎక్కడికీ వెళ్ళక ఇంట్లో ఉంటుంది. ఆ వెంటనే అత్తగారు వచ్చి తాము కూతురుని ఎలా పెంచారో ఒక చిన్న లెక్చర్ ఇస్తుందిట. ఇదీ భాగోతం.

ఏ చిన్న విషయంలోనూ వీణ భర్తమాట వినదు. గుడ్డికొడుకు ఉన్నాడంటే తనకి పరువుతక్కువ. స్నేహితురాళ్ళు నవ్వుతారట. తమ బిడ్డని తమ బిడ్డగా చెప్పుకొంటే ఎవరైనా ఎందుకు నవ్వుతారో అతడికి అర్థమవదు. ఏది చెప్పినా అర్థంచేసుకోదు. భార్యాభర్తల రహస్యం అన్నది లేదు. గట్టిగా అందరూ వినేలాగా చేసి గొడవ పెడుతుంది. అందుకే అతడు సిగ్గుపడి ఊరుకొంటాడుట.

బయట ఎంతో కష్టపడి ఇంటికి వచ్చే కొడుక్కి ఇంట్లో సుఖంలేదు. వీణ గురించి ఆమె తండ్రితో రాఘవరావు చెప్పబోతే ఆయన తప్పంతా అల్లుడిదేనన్నట్లు మాట్లాడారుట. అంధుడైన బిడ్డను తన బిడ్డ కళ్ళఎదురుగా ఉంచుకొని భరించలేకపోతోందని, అల్లుడికి దాని బాధే పట్టదని ఎదురు వాదించాడుట. పసిపిల్లాడిని దూరంగా ఉంచి తండ్రిగా వాడికి అన్యాయం చేయలేనని కొడుకు బాధపడుతున్నాడుట.

అందుకే రాఘవరావుగారు మనవడిని తీసికొని వచ్చేశారుట. ఆయనకి ఇదే పరిష్కార మార్గంలాగ తోచిందిట. ఆవేదనతో ఆయన అన్నీ చెపుతోంటే శ్రుతి జాలిగా విన్నది. ఆయనకి పెద్ద వయసు వచ్చినా సుఖం లేదు. మనవడు బెంగపడతాడేమోనని ఆయన భయం.

ఈలోపు శరత్ స్నానం చేసి వచ్చాడు. శ్రుతి వాడికి పౌడరు రాసి తల దువ్వింది. పసిపిల్లాడిని తీసుకొని తమ ఇంటికి రమ్మని చెప్పి వచ్చేసింది. ఇంటికి వచ్చినా శరత్ దిగులు మొహమే ఆమెకు కన్పించసాగింది. పాపం ఈ వయసులో ఆయన చిన్నపిల్లవాడిని ఎలా సాకగలరు? అనుకొంది.

తనకి తోచిన సహాయం ఆయనకి చేయాలని శ్రుతికి అన్పిస్తుంది. వార్ధక్యంలో హాయిగా చీకూ చింతా లేకుండా ఉండవలసిన ఆయన ఇలా ఉంటే ఆమెకి బాధగా ఉంటుంది. శరత్ శ్రుతి దినచర్యలో ఒకభాగమైపోయాడు. శ్రుతి సాయంత్రం ఇంటికి వచ్చేసరికి ''ఆంటీ'' అంటూ వాడు వచ్చేశాడు.

వాడికోసమని సంగీతం ఉదయంవేళల్లో తను చెప్పి సాయంత్రం ప్రీతికి అప్పచెపుతుంది. ఒక్కొక్కసారి వాడుకూడా ఆమెను అనుసరిస్తాడు. శ్రుతి వాడితో రోజుకి ఒక గంటయినా కబుర్లు చెప్పి నవ్విస్తుంది. ఎన్నో విషయాలు నేర్పుతుంది. వాడు ఎప్పుడూ ఒకరిపై ఆధారపడకుండా తన పనులు తను చేసుకోవాలని చెపుతుంది. ఏ సామానులు ఎక్కడ ఉన్నాయో తడిమి చూపించి గుర్తుపెట్టుకోమని చెపుతుంది. తనంతట తానుగా ఇంట్లో తిరగడం అలవాటు చేసింది.

శ్రుతి ఇంట్లో అన్ని గదులని ఎంతో వివరంగా వర్ణించి చెపుతుంది. ఏ సామాను ఎక్కడ ఉందో కళ్ళకి కన్పించేటట్లు చెపుతుంది. వాడు శ్రుతివలన బాత్‌రూంకి ఒక్కడూ వెళ్ళడం, స్నానంచేసి రావడం నేర్చుకొన్నాడు. బట్టలు బీరువాలోనుండి తీసుకొంటాడు.

మంచి పని ఏదో చేసి శ్రుతిని మెప్పించాలని వాడి తాపత్రయం. ఎప్పుడూ ఆమె ఇంటికి వచ్చెయ్యాలని ఆరాటపడతాడు. తన వెంట కుర్రవాడిని రావద్దంటాడు. రాఘవరావు దెబ్బలాడి పంపుతాడు. శ్రుతి శరత్‌కి పద్యాలు, కథలు, రైమ్సు చెపుతుంది. ఎక్కాలు చదివి, తనతో అనమంటుంది. వాడు అన్నీ తెలుసుకోవాలని అన్నీ చెపుతుంది.

ఇప్పుడు వాడిలో వెనుకటి పిరికితనం పోయింది. భయం కూడా లేదు. దానిస్థానంలో ఉత్సాహం చోటుచేసుకొంది. వాడు శ్రుతి ఒళ్ళో కూర్చుని రామచిలుకలాగ అన్నీ వల్లిస్తాడు. వాడి తెలివితేటలు, చురుకుదనం చూస్తే శ్రుతికి ఆశ్చర్యం కలుగుతుంది.

వాడు తాతగారిని ఎప్పుడూ అడిగే ప్రశ్న "శ్రుతి ఆంటీ ఎలా ఉంటుందని?" ఆయనేం చెప్పగలడు? శ్రుతిని చూడాలని వాడికి కోరిక.

పనికుర్రాడుమాత్రం చెపుతాడు, శ్రుతమ్మగారు చాలా బావుంటారని. వాడు వర్ణించి చెపుతోంటే శరత్ ఆసక్తిగా వింటాడు. అన్నింటికన్నా వాడికి శ్రుతి గొంతుక మరీ ఇష్టం.

ఒక్కొక్కసారి దిగులుగా ఉంటాడు. శ్రుతి వెంటనే అలా ఎందుకున్నావని అడుగుతుంది. డాడీ ఈ వారం రాలేదెందుకని అంటాడు. శ్రుతి బాధపడుతుంది. వంశీకృష్ణ తరచుగా వచ్చి కొడుకుని చూస్తాడు.

"కళ్ళులేనివాళ్ళు ఎందుకూ పనికిరారుకదూ ఆంటీ" అని వాడు అనేటప్పుడు శ్రుతి మనస్సు చివుక్కుమంటుంది. వెంటనే తనని తాను నిలవరించుకొని "ఎందుకు పనికిరారు? నీకు ఎవరు ఈ మాట చెప్పారు?" అని అంటుంది. "వంట మామ్మగారితో మా పక్క ఇంటి ఆవిడ అన్నారు" అని చెప్పేవాడు. శ్రుతికి వళ్ళుమండేది. ఏం పెద్దవాళ్ళు? పిల్లలదగ్గర కొన్ని మాట్లాడకూడదనైనా అనుకోరు.

శ్రుతి వాడికి చక్కగా విడమరిచి చెపుతుంది. మనిషికి పట్టుదల ఉంటే ఏద్రైనా సాధించగలడు? కళ్ళు, కాళ్ళు, చేతులు ఇవి లేనంతమాత్రాన మనిషి డీలాపడకూడదు. అవి ఉన్నవాళ్ళు చేయలేని పనులు వీళ్ళు చేసి సాధించినపుడు గొప్ప' అని చెపుతుంది. "కళ్ళు లేకపోయినా బాగా బతకవచ్చును. బోలెడు పనులు చేయవచ్చునుకదూ ఆంటీ" అని కుతూహలంగా అడిగేవాడు.

"ఊ... బాలసుబ్రమణ్యంగారు కళ్ళులేనివారే. అయినా సంగీతంలో ఎంతో గొప్పవారు. అంతెందుకు... ఒక చిన్న అమ్మాయి కళ్ళులేని పాపే. లక్ష్మీసరసమ్మ అని బ్రెయిలీ లిపిలో భగవద్గీత రాసింది. కళ్ళులేని వారందరూ దాన్ని చదువుకోవాలని ఎంత కష్టపడిందో చూడు. మనం ఎన్నిపనులైనా సాధించవచ్చును" అంటూ చిన్న చిన్న మాటలతో శ్రుతి వాడికి అన్నీ చెపుతుంది.

కారమ్స్ ఆడటం ఎలాగో దగ్గరుండి నేర్పిస్తుంది. వాడు కాస్త ఎదిగితే చదువుకోసం మంచి స్కూలుకి పంపినా తప్పులేదనుకొంటుంది. ఈలోపు అయిదవ సంవత్సరం వచ్చిందని శ్రుతి రాఘవరావుని బలవంతం చేసి అక్షరాభ్యాసం చేయించింది. వాడికి ఆమె మాట అంటే వేదం. రాఘవరావు శ్రుతి చేస్తున్న పనులకి పొంగిపోయేవాడు. మనవడు ఆమెవలన దిగులు మరిచిపోయి ఉత్సాహంగా ఉండటం చూసి కొంత ఊరట చెందేవాడు. వాడు ఇప్పుడు ఇంట్లో చిన్న చిన్న పనులు చేయడానికి ముందుకు వస్తున్నాడు.




వద్దని ఆయన వారించబోతే శ్రుతి ఆయనతో ఒకసారి దెబ్బలాడింది. మన సానుభూతి ఎదుటివాళ్ళని పనికిరానివాళ్ళని చేయకూడదు. మనం వాళ్ళల్లో ఆత్మవిశ్వాసం పెంచాలి. మనకి వాళ్ళు ఎందులోనూ తీసిపోరని వాళ్ళు అనుకొనేలాగ మనం ప్రవర్తించాలి అంది. శ్రుతి ఆలోచనలు ఆయనకి ఎప్పుడూ నచ్చుతాయి. ఇంత వయసులో పెద్దవాడిని ఇవి నాకు ఎందుకు తోచలేదు చెప్మా అనుకొంటారు.

ఇప్పుడు వాడే శ్రుతి గురించి చెప్పేస్తాడు. "ఆంటీ కళ్ళు ఇంత పెద్దవి. నేను కళ్ళు మూసి ఆడుతున్నప్పుడు నాకు తెలిసింది. ఆంటీ ఎత్తుకొన్నప్పుడు సుద్దముక్కతో గోడ మీద గీశాను. ఆంటీ ఇంత పొడవు ఉంది" అని వాడు చెప్పేటప్పుడు వారిద్దరూ ఆశ్చర్య పోయేవారు. వాడి ఉత్సాహాన్ని ఎప్పుడూ భంగ పరచకూడదని శ్రుతి ఆయనతో అనేది.

తాతగారు వైజాగ్ వెళ్ళివద్దామా అన్నా వాడు రానంటాడు: తండ్రి ఎలాగూ తనని చూడటానికి వస్తూనే ఉంటారు. "అమ్మని చూసి వద్దాం రా బాబూ" అంటే "మనం వెళితే అమ్మకి కోపం వస్తుంది తాతయ్యా" అంటాడు. వాడి మాటలూ నిజమే అనుకొని, కొడుకు ఈమధ్య పదిరోజులైె రాలేదని తనే వైజాగ్ వెళ్ళివచ్చారు. శరత్‌ని శ్రుతి ఇంట్లో వదిలారు.

వీణ మళ్ళీ నెలతప్పింది. తనకి మళ్ళీ ఎలాంటి బిడ్డ పుడతాడో అని ఆమె బెంగ. ఎబార్షన్ చేయించుకొంటానని ఇంట్లో గొడవ. డాక్టర్లు ఇప్పుడు ఎబార్షన్ చేసే టైము దాటిందని వద్దంటున్నారు. వీణకి నెలసరి సరిగ్గా రాకపోవడంవలన ఆమె ఆ సంగతి ముందే తెలుసుకోలేకపోయింది.

అయిందేదో అయింది. అస్తమానూ అలాంటి బిడ్డలే కలుగుతారా? ఈ ఒక్కసారీ చూసి ఆపరేషన్ చేయించుకొందామనే వంశీకృష్ణ మాట ఆమె విన్పించుకోవడంలేదు. రాఘవరావుకి ఆ అమ్మాయిమీద జాలి కలిగింది. ఆ అమ్మాయి భయానికి బాధపడ్డారు. ఆమెకి బాగా ధైర్యం చెప్పి ఇంటికి వచ్చేశారు.

శ్రుతి కూడా విషయం విని అలాగే అంది. ఇప్పుడు ఆమె నీరసంగా ఉండటంవలన ఎబార్షన్ చేస్తే ఏమవుతుందో? ఎలాగైనా మరొక మంచి బాబో, పాపో పుడితే వీణ భయాలు మరి ఉండవనుకొంది.

శ్రుతికి భరత్ ఒక సమస్య అయ్యాడు. పై చదువు చదవమంటే వాడు వినడంలేదు. ఫస్టుక్లాసులో బి.యస్.సి. పాసై వాడు యం.యస్.సి. చదవనంటే శ్రుతికి కోపం. శ్రుతి ఎంత చెప్పినా వాడు విన్పించుకోవడంలేదు. వాడు చూస్తే తను పట్టిన కుందేలుకి మూడే కాళ్ళు అంటున్నాడు. ప్రసాద్, ప్రీతి వాడికి నచ్చచెప్పలేక దండంపెట్టి వదిలేశారు.

బాంక్ టెస్టులూ, వగైరా రాస్తానని ప్రిపేర్ అవుతున్నాడు. తండ్రి కోరిక తీర్చడంకోసమైనా పై చదువు చదవమని శ్రుతి కన్నీళ్ళతో బతిమాలినా వాడు దారికి రాలేదు.

ఏ ఉద్యోగం వస్తే ఆ ఉద్యోగంలో చేరతాననీ, యూనివర్సిటీలో చేరి చదివితేనే చదువు కాదనీ, ప్రైవేటుగా ఇంగ్లీషుగాని, మేథ్స్‌గాని యం.ఏ. చేస్తానని అంటాడు. అక్కగారు తండ్రిపోయిన దగ్గర్నుండీ కుటుంబం లాగుతోంది. ఇంక ఆవిడను తను శ్రమపెట్టనని వాడు గట్టిపట్టుదల పట్టి కూర్చున్నాడు. "ఇన్నాళ్ళు ఎలాగో చదివించానుకదా! ఒక్క రెండేళ్ళు ఎంతసేపు" అని శ్రుతి తల్లికి ఫిర్యాదుచేసింది.

ఉద్యోగం వస్తే మధ్యలో చదువు వదిలి రావడం అవదు. కనుక ఉద్యోగం చేస్తూ ప్రైవేటుగా పరీక్షకి కట్టితీరతానని, అయినా చదువుకు అంతేమిటని వాడు తల్లిదగ్గర వల్లించడం చూస్తే శ్రుతికి చిరాకు.

"ప్రీతక్క తన కొడుకుని ఎత్తుకొందుకి ఇచ్చేందుకు తెగ నీల్గుతోంది. ఈ ఏడాదైనా శ్రుతక్క పెళ్ళిచేద్దాం. శ్రుతక్క బాబైతే మన ఇష్టంకదూ అమ్మా" అంటూ సంభాషణని వాడు పక్కదారి పట్టించడం చూస్తే శ్రుతికి ఒళ్ళుమంట.

అందుకే చివరికి లక్ష్మమ్మకి ఫిర్యాదుచేసింది. "అది అంతలాగ చదువుకోమన్నప్పుడు చదువుకోవచ్చునుకదురా! దాన్ని ఎందుకు బాధపెడతావు. ఆడపిల్లలు కూడా పెద్ద చదువులు చదివేస్తున్నారు కదా!" అని ఆవిడ మనవడిని కేకలు వేసింది.

"అదేనే నా బాధ... ఆడపిల్లలు చదివే ఈ చదువుకోసం ఎందుకు శ్రమ అని. ఉద్యోగం పురుషలక్షణం అన్నారు. అందుకే నువ్వు చచ్చిపోకుండా సంపాదనాపరుడనై నీకు చీరలు కొందామని. అయినా నువ్వే చెప్పు... ఇంట్లో ఉన్న ఒక్కగానొక్క మగనలుసుని దూరం పంపెయ్యాలా? ముసలిదానివి నువ్వు ఉన్నావన్న ఆలోచనే వీళ్ళకి లేదు. రేపు నీకు ఏదన్నా అయితే గుక్కెడు తులసితీర్థం ఎవరు పోస్తారు చెప్పు?" అని అంటున్న మనవడిని చూసి లక్ష్మమ్మ మరి మాట్లాడలేదు.

ఏది ఏమైనా మగబిడ్డ మగబిడ్డే. వాడి కడుపులో ఎన్ని ఆలోచనలో... అంటూ లక్ష్మమ్మ మురిసిపోయేది. వాడి మాటల చతురతకి శ్రుతికి వళ్ళువండిపోయేది. తల్లిదగ్గరా అంతే. ఏవేవో చెప్పేస్తాడు.

తల్లి కూడా చివరికి వాడిమాటప్రకారం కానిద్దామనేసరికి శ్రుతికి ఏంచేయాలో తోచలేదు. పై చదువు ఎలాగైనా చదివి నీకు చూపిస్తాడుటే అనే తల్లి అమాయకత్వానికి శ్రుతికి నవ్వు వచ్చింది.

శ్రుతి ఉద్దేశంలో మగపిల్లలలో తృప్తి ఎక్కువ. సాధించిన దానిని చూసి మురిసిపోతారేతప్ప సాధించవలసినదాని గురించి ఆలోచించరు. సంపాదనలోపడి పై చదువువైపు దృష్టి వెళ్ళదేమో అని ఆమె బెంగ. వాడుమాత్రం ఆమె భయాలను తేలిగ్గా తీసిపారేస్తాడు.

శ్రుతక్కకి తమ్ముడిననే మాట మరిచిపోతానా? అని వాదిస్తాడు. రాఘవరావు వాడి మాటలూ సరైనవేనంటారు. శ్రుతికి సంబంధాలు చూడమని లక్ష్మమ్మ ఆయనకి చెప్పింది. శ్రుతికి ఇప్పుడు మరొక కొత్త గొడవ వచ్చిపడింది.

స్కూల్లో సురేష్‌కుమార్‌కి శ్రుతంటే ఇష్టం. అందం, ఆస్తి, ఉద్యోగం ఉన్న తను కబురుపెడితే ఎగిరి గంతేసి ఆమె ఒప్పుకుంటుందనుకొన్నాడు. కాని, శ్రుతి అతడు పలకరిస్తే తగినంతవరకే జవాబు చెప్పి తప్పించుకొనేది. 'గంటలు గంటలు ఆ ముసలాయనతో మాట్లాడటానికి కబుర్లు ఉంటాయి. అందగాడు, వయసులో ఉన్నవాడు. తనతో ముక్తసరిగా మాట్లాడుతుందేమిటి? గర్వమా?' అని అతడు బుర్ర బద్దలు కొట్టుకొనేవాడు.

ఇంక స్టాఫ్‌రూంలో కూడా అతడి వరుస చిరాకుగా ఉండేది. అతడికి వంతపాడే మేస్టార్లు ఎక్కువ. అతడిని మంచి చేసుకొంటే అప్పో, సొప్పో ఇస్తాడని వాళ్ళ బాధ. ఇంక ఆ హిందీ పండిట్‌ను, సెకండరీ మేష్టారుని దగ్గర పెట్టుకొని గంటలు గంటలు జోకులేస్తాడు. క్రాఫ్టు, డ్రాయింగ్ మేస్టార్లయితే అతడికి కుడి, ఎడమ భుజాలే.

అతడి మూడ్స్ ఎప్పుడు ఎలాగ ఉంటాయో ఎవరికీ తెలియదు. హెడ్‌మేష్టారుకి అతడంటే భయం. ఎంతమాటయినా అనేస్తాడనో, లేక పెద్దవాళ్ళతో పలుకుబడి ఉన్నవాడనో కొంత జంకుతారు. స్కూల్లో అన్ని విషయాలూ అతడికే కావాలి. డ్రిల్లుమేష్టారు కనుక స్కూల్లోని విద్యార్థులందరూ అతడి కంట్రోల్‌లోనే ఉంటారు. దానికిసాయం అతడి పర్సనాలిటీ. అందువలన పిల్లలందరికీ అతడంటే భయమే. ఏ టీచరు కాస్త అమాయకంగా కనబడినా వాళ్ళ మీద ఇతడు సవారీ చేయడమే. కృష్ణమాచార్యులుగారు నవ్వుతూ ఎప్పుడూ అంటారు "సురేషూ! కాస్త శాంతం, ఓర్పు ఉన్న అమ్మాయిని పెళ్ళిచేసుకోవోయ్. నీ స్పీడుకి, కోపానికి బ్రేకువడుతుందని" అతడు నవ్వి ఊరుకొంటాడు.

స్కూల్లో పిల్లలందరికీ శ్రుతి మేడమ్ అంటే ఎంతో ఇష్టం. హెడ్‌మేష్టరు కూడా ఆమె కష్టపడి పనిచేస్తుందని అభిమానిస్తారు. దానితో శ్రుతి పేరు స్కూల్లో అందరి నాలుకమీద ఉండేది. సురేష్‌కుమార్‌లో మరొక గుణం వుంది.

అతడిచుట్టూ ఎప్పుడూ అతడికన్నా తక్కువస్థాయివాళ్ళే ఉంటారు. అలాగ అతడు చూసుకొని తిరుగుతూ ఉంటాడు. శ్రుతి అందం, తెలివితేటలు అతడిని పగలూ, రాత్రి నిద్రపోనీయడంలేదు.

తెలిసో, తెలియకో మేష్టర్లందరూ కృష్ణమాచార్యులుగారిని ఏదో ఒకటి అడిగి సందేహాలు తీర్చుకొంటూ ఉంటారు. ఆయనకూడా ప్రతివారికీ గౌరవమిస్తారు. స్టాఫ్‌రూంలో సాహిత్యచర్చలేమైనా అయితే సురేష్ ఆ చుట్టుపక్కలకి రాడు. అలాంటిది ఇప్పుడు శ్రుతి చేరాక




స్టాఫ్‌రూం వదిలేవాడు కాదు. కాంపోజిషనులు దిద్దుతోనో, మేప్ బుక్స్ చూస్తూనో శ్రుతి కాలం గడిపితే పేపరు మొహానికి అడ్డంపెట్టుకొని ఓరగా శ్రుతిని చూస్తూ గడిపేవాడు.

ఎలాగైనా శ్రుతితో సంభాషణ జరపాలని ప్రయత్నించడం, ఆమె దృష్టిలో విలువ పోగొట్టుకోవడం జరిగేది. "మీ చెల్లెలుని ఒక అవిటివాడు చేసుకొంటానని అంటేమాత్రం ఎందుకిచ్చి పెళ్ళిచేశారు?" అని అడిగాడు ఒకసారి. ఎదుటివారి లోపాన్ని ఎత్తి పదేపదే చూపేవాళ్ళంటే ఆమెకి నచ్చదు.

"అవిటితనమా? మా ప్రసాద్‌కా. మాకెప్పుడూ అది కన్పించలేదే? ఈ సంఘంలో చాలామంది మనసు అవిటిది, మాట అవిటిది. నేను వాళ్ళని చూసి జాలిపడతాను. మా ప్రీతి వలచి, వరింపచేసికొని పెళ్ళిచేసుకొంది" అంటూ కాల్చి వాతపెట్టినట్లు సమాధానం చెప్పింది. అతడు మరి మాట్లాడలేదు.

మనిషి తను బతుకుతూ పదిమందికీ ఉపయోగపడాలని శ్రుతి ఉద్దేశం. కానీ సురేష్‌కుమార్‌లాంటివాడు తను బతకడంకోసం పదిమందిని దెబ్బతీసినా ఫర్వాలేదంటాడు. ఎంతసేపూ అతడి మాటలు, ప్రవర్తన చూస్తూంటే హోదాకి, డబ్బుకి ప్రాణం ఇచ్చేరకమని శ్రుతి అనుకొంటుంది.

కృష్ణమాచార్యులుగారి దగ్గర శ్రుతిని పెళ్ళిచేసుకోవాలని ఉందని, ఆయనే పెద్దరికం వహించి, తమ పెళ్ళి చేయాలని చెప్పాడు. ఆయన సంతోషించి, శ్రుతిదగ్గర అతడి అభిప్రాయం చెప్పారు. అతడిని చేసుకోవడం శ్రుతి కిష్టంలేదు.

అలాగని చెపితే అతడు బాధపడతాడు. అందుకే శ్రుతి తనకి ఇంకా కొన్ని బాధ్యతలున్నాయని, అప్పుడే పెళ్ళిచేసుకొనే ఊహలేదని చెప్పింది. ఆ మాట వినగానే సురేష్ అహం దెబ్బతింది. తను పెళ్ళిచేసుకొంటానంటే ఎవరైనా ఎగిరి గంతేసి ఒప్పుకొంటారని అతడి ఉద్దేశం.

ఏ వస్తువు అయినా పొందలేనపుడు దానియందు మరింత ఆకర్షణ పెరుగుతుంది. అందుకే స్నేహితుల సలహామేరకు శ్రుతిని మరొకసారి తన గురించి ఆలోచించమని, తొందరలేదని స్వయంగా వచ్చి చెప్పాడు. తామిద్దరూ పెళ్ళిచేసుకొంటే సుఖంగా జీవితం గడపవచ్చని చెప్పాడు.

అతడిలాంటి ఉన్నతునికి తాను తగనని, తను చాలా సామాన్యురాలనని ఆమె అంటోంటే అతడికి మతిపోయింది. అతడు కోరుకొంటే ఎందరో గొప్పింటి పిల్లలు క్యూలో నిలబడతారు అని అంది.

కొద్దిరోజులు ఆగితే శ్రుతి మనసు మారుతుందని అనుకొన్నాడు.

వంటింట్లో టిఫిన్ చేస్తున్న శ్రుతి ఎవరో వచ్చిన అలికిడికి తల ఎత్తి చూసింది. ఎదురుగా ద్వారబంధం పట్టుకొని వంశీకృష్ణ కన్పించాడు. అతడిని చూసి శ్రుతి తొట్రుపడింది.

మొదట హాలులోకి తీసికెళ్ళి కూర్చోపెడదామనుకొంది. ఆమెకే నచ్చలేదో, ఏమిటో తన గదిలోకి తీసికెళ్ళి పడక కుర్చీ వేసింది. "మీరు అనవసరంగా కంగారుపడకండి. నేను రెండు మాటలు మీతో మాట్లాడదామని వచ్చాను" అని అతడు అంటోంటే మొదట అతడిని కూర్చోమని చెప్పి శ్రుతి లోపలకు పరుగెత్తింది.

తను చేస్తున్న ఉప్మాని దించి ప్లేటులో పెట్టి, తల్లి చేసిన మైసూర్‌పాకం ముక్కలు రెండు వేసి అతడికి తెచ్చి ఇచ్చింది. వంశీకృష్ణ మొహమాటంతో వద్దన్నాడు. "మీరు వాటిని తీసుకోకపోతే, నేను మీరు చెప్పే విషయమే వినను" అంటూ బెదిరించింది. అతడు ఏమనాలో తోచనివాడిలాగ ప్లేటు చేతిలోకి తీసుకొన్నాడు.

"ఇవి మీరు చేశారా?" అని అడిగాడు.

"ఉప్మా మనం చేశాం. మైసూర్‌పాకం అమ్మ చేసింది" అని నవ్వుతూ "నేను మైసూరుపాకం చేస్తే మీరు బాధపడవలసిందే. మా ప్రెస్‌లో అప్పుడు పేపర్ వెయిట్ల ఖర్చు ఉండదు" అని చెప్పింది. అతడు ఏమీ మాట్లాడలేదు.

టిఫిన్ పూర్తయ్యాక అన్నాడు, "మీరు అబద్ధం చెప్పారు. ఉప్మా బ్రహ్మాండంగా చేశారు" అంటున్న అతడి మాటలకి శ్రుతి సిగ్గుపడింది. "నాకు వంట, టిఫిన్లు అసలు రావని

చెప్పానా? ఫర్వాలేదు. కొన్ని ఐటమ్స్‌మాత్రం రావు. నేను చేసినవి తినవచ్చులెండి'' అని అతడికి కాఫీ తీసుకొని వచ్చి ఇచ్చింది.

వంశీకృష్ణ కాఫీ తాగుతూ తను కూర్చున్న గదిని పరికించి చూశాడు. ఆగది చాలా అందంగా, పొందికగా సర్దిఉంది. మంచానికి అందుబాటులో అల్మరాలో పుస్తకాలు నీటుగా సర్దివున్నాయి. వాటిని చూస్తూ ఎంత పెద్ద లైబ్రరీయో అనుకొన్నాడు. శ్రుతిని చూస్తూ ''ఇది మీ గదా?'' అని అడిగాడు.

''అవును... ఇది నా ప్రపంచం. ఇంట్లో ఉంటే ఇక్కడే గడుపుతాను'' అని చెప్పింది. మరొక అలమరాలో శ్రుతికి అనేక సంస్థలవాళ్ళు ఇచ్చిన బహుమతులు ఉన్నాయి. అతడికి గబుక్కున తను వచ్చిన పని గుర్తుకి వచ్చింది.

''మా శరత్‌కి మీరు ఎంతో కంపెనీ ఇస్తున్నారు. వాడిలో ఇప్పుడున్న ఉత్సాహం నేను ఎప్పుడూ చూడలేదు. వాడు ఇప్పుడు నోరు విప్పితే మీ గురించి కబుర్లే. వాడికి చదువు కూడా నేర్పుతున్నారుట. సెలవలు అయ్యాక స్కూలుకి పంపుతానని చెప్పారుట. మీకు నా కృతజ్ఞతలు తెలియచేద్దామని వచ్చాను'' అని ఆమెను చూస్తూ చెప్పాడు.

శ్రుతికి అతడు ఎందుకు వచ్చాడో ఇప్పుడు అర్థమైంది. అతడు తనకి పరాయివాళ్ళల్లాగ కృతజ్ఞతలు చెప్పడం ఆమెకి నచ్చలేదు. అందుకే ''మీరు, మేము స్నేహితులం. మీ నాన్నగారు మమ్మల్ని ఎన్నోవిధాలుగా ఆదుకొన్నారు. మావలన మీకు, మీ నాన్నగారికి ఏమాత్రం సహాయం జరిగినా మాకు సంతోషమే. మనమధ్య కృతజ్ఞతలు ఉండకూడదు'' అంటున్న ఆమెను సాలోచనగా చూశాడు.

వచ్చినపని అయిపోయినట్లు కుర్చీలో నుండి లేచాడు. అప్పుడే గుర్తుకి వచ్చినట్లు ''అన్నట్లు మీవాళ్ళు ఎవరూ లేరేమిటి?'' అని అడిగాడు. అప్పటికైనా అతడు ఆ విషయం గ్రహించినందుకు శ్రుతికి నవ్వు వచ్చింది. నవ్వుతున్న శ్రుతిని ఒక నిముషం తదేకంగా చూశాడు. 'అదృష్టవంతురాలు... ఎంత నిర్మలంగా నవ్వుతోందో' అని అనుకొన్నాడు.

ఇంట్లో ఉండే మామ్మ, తల్లి కోవెలకి వెళ్ళారని చెప్పింది. భరత్ ప్రీతిదగ్గరకు వెళ్ళాడు. ఇల్లు చూద్దురుగాని రండి అంటూ ఇల్లు చూపించడానికి నడిచింది. ముందు శ్రుతి నడుస్తోంటే అతడు వెనుకగా నడుస్తూ అన్నీ చూశాడు.

పొడవైన శ్రుతి జడ, చీరకి, జాకెట్టుకీ మధ్య అందంగా కన్పిస్తున్న సన్నటి నడుం చూస్తూ పరాకుగా ఉండిపోయాడు. తను అడిగిన ప్రశ్నకి సమాధానం రాకపోయేసరికి శ్రుతి అతడివైపుకి వెనక్కి తిరిగి చూసింది. ఇద్దరి కళ్ళు కలుసుకొన్నాయి. మరుక్షణమే శ్రుతి తన చూపులను వెనక్కి తీసికొని సంగీత కళాశాలవైపు నడిచింది.

తను దానిగూర్చి పేపర్లో చదివాననీ, తర్వాత తండ్రి కూడా వివరంగా చెప్పారనీ అన్నాడు. భరత్ గురించి అడిగాడు. శ్రుతి వాడి విషయం చెప్పగానే ఉద్యోగం వస్తే ఈరోజుల్లో వదలడం మంచిది కాదన్నాడు. ఈలోపు లక్ష్మమ్మ, వసుధ వచ్చారు. వాళ్ళకి వంశీకృష్ణను పరిచయం చేసింది. వాళ్ళు అతడిని ఏవో నాలుగు కుశలప్రశ్నలు అడిగి లోపలకి వెళ్ళిపోయారు.

లక్ష్మమ్మ అతడి గూర్చి తర్వాత శ్రుతిదగ్గర ఎంతో మెచ్చుకొంది. ఆవిడకి ఎవరైనా ఓపికగా తను అడిగే ప్రశ్నలకు సమాధానం చెపితే చాలు... ఎంతో సంబరపడిపోతుంది. వాళ్ళు మాట్లాడుకొంటూంటే శ్రుతిమాత్రం చాలా భయపడింది. లక్ష్మమ్మ మాటలలో ఎక్కడ వీణ గురించి తేలికగా మాట్లాడుతుందో అని శ్రుతి భయం. అందుకనే మధ్యలో అతడికి పని ఉందని, ఇంటికి వెళ్ళాలని ఆపేసింది. లేకపోతే ఆవిడ ఒకపట్టాన వదలదు.

రాఘవరావుగారు శ్రుతి ఇంటికి కొడుకు వెళ్ళాడని విని చాలా ఆశ్చర్యపోయారు. శరత్ భోజనం చేయకుండా అతడికోసం కూర్చున్నాడు. తనని తీసికెళ్ళకుండా తండ్రి ఆంటీ ఇంటికి వెళ్ళాడని విని అలిగాడు. తర్వాత మళ్ళీ రేపు తీసుకెళతానని అన్నాక శాంతించి, భోజనానికి వచ్చాడు.

మర్నాడు సాయంత్రమవగానే, శరత్ తండ్రిని ఆంటీ ఇంటికి బయలుదేరమని పేచీ మొదలుపెట్టాడు. వాళ్ళు మళ్ళీ వెళితే




ఏమనుకొంటారో అని అతడికి మొహమాటం. శరత్ ఊరుకోడు. చివరికి కొడుకుతో కలిసి వెళ్ళాడు.

శ్రుతి అప్పుడే స్కూలునుండి వచ్చి, స్నానం చేసి వచ్చిందేమో... కడిగిన ముత్యంలాగ ఉంది. శరత్ ఆమెను చూస్తూనే అల్లుకొని పోయాడు. ఒక్కసారిగా వంశీకృష్ణ తెల్లబోయాడు. వాళ్ళిద్దరిమధ్య అంతలాగ చనువు ఉందని అతడు అనుకోలేదు. అతడు కొడుకు కోసమే వచ్చాడని శ్రుతి గ్రహించింది.

భరత్‌ను పిలిచి అతడు వచ్చాడని చెప్పింది. భరత్ ఏవో కబుర్లు చెపుతోంటే అతడు వింటున్నాడు. శ్రుతి శరత్ ప్రశ్నలకు సమాధానాలు చెపుతోంది. వాళ్ళవైపు చూసిన శ్రుతికి వంశీకృష్ణ రూపు చూస్తే బాధనిపించింది. వెనుకటి రూపమే లేదు అతడిలో. కాస్త నలుపు వచ్చాడు. అసలే తక్కువగా మాట్లాడే మనిషి ఇప్పుడు మూగవీణయిపోయాడు.

అతడికి అక్కడ ఎక్కువసేపు ఉండాలనిపించలేదు. కొడుకుని వదిలి ఇంటికి వచ్చి వైజాగ్ బయలుదేరాడు. ''గొడవలేం లేవు కదా'' అని అడిగిన తండ్రికి ''ఊ'' అని చెప్పి వైజాగ్ బయలుదేరాడు. తండ్రికి తనవలన ఎలాగో సుఖం లేదు. ఇంకా అన్ని విషయాలూ చెప్పి బాధించడం ఎందుకు?

అతడికి బస్సులో వీణ గుర్తుకి వచ్చింది. ఆమెకి దూరంగా ఉంటే ఊరుకోదు. ఏవో అనుమానాలు. పోనీ అని దగ్గరకి వస్తే పిల్లలు వద్దని ఆంక్షలు. పీరియడ్స్ రెగ్యులర్‌గా రాక పోవడంవలన తాము తెలుసుకోలేకపోయారు. ఇంక ఇంట్లో యుద్ధమే.

బిడ్డలు వద్దని, ఎబార్షన్ చేయించుకొంటానని ఆమె గొడవ. డాక్టర్లు ఆమె నీరసంగా ఉందని, ఇంక ఎబార్షన్ చేయడం మంచిది కాదని అంటున్నారు. ఈ ఒక్కసారీ చూద్దామని, తను తర్వాత ఆపరేషన్ చేయించుకొంటానని ఎంతో నచ్చచెప్పాడు. మరి శరత్‌లాంటివాడు మళ్ళీ పుడితే ఏం చేద్దామంటుంది ఆమె. భగవంతుడి నిర్ణయం ఏమిటో ఎవరికి తెలుసును? ఒక చెట్టు కాయలు అన్నీ ఒకేలాగ ఉంటున్నాయా? ఒక తల్లి బిడ్డలందరూ ఒక్కలాగే ఉంటారా? తనమాట వినదు. తను కావాలని పిల్లల్ని కంటున్నట్లు మాటలు... ఛ... ఎంత సిగ్గుచేటు. అందరూ ఏమనుకొంటారు.

అసలు వీణ ప్రవర్తనే తనకి నచ్చదు. తను ఊరునుండి వచ్చానని తెలిసినా శరత్ గూర్చి ఒక్క మాట అడగదు. రానురాను ఆమెలో తల్లిలో ఉండవలసిన సహజ మమకారం లోపిస్తోందనిపిస్తోంది. దేన్నయినా తను భరించగలడుకానీ ఈ ప్రేమరాహిత్యాన్ని భరించలేడు. శరత్‌ను చూడాలని ఎప్పుడూ అనుకోదు. వాడి మాటే ఎత్తదు.

పేగు తెంచుకొని పుట్టిన బిడ్డమీద మనసు ఎందుకు కరగదో అతడికి తోచదు. వాడిలోని లోపం మాత్రమే ఆవిడకి తెలుసును. వాడు తన బిడ్డ అన్న విషయాన్ని ఆ లోపం తలచనీయడంలేదు. ఎవరితో అందామన్నా భార్యను అదుపులో పెట్టుకోలేని చేతకాని వాడివి సుమా అన్నట్లు చూస్తారేమోనని భయం. ఎవరికీ చెప్పుకోలేడు. మనసు కుంగిపోతోంది.

చచ్చినట్లు ఈ గరళం అంతా శివుడిలాగ మింగుతున్నాడు. ఆమధ్య శరత్ అడిగాడు కదా అని వాడు పుట్టినరోజుకి వైజాగ్ తీసికొని వచ్చాడు. కర్మకొద్దీ ఆరోజే శ్రీవల్లి అత్తగారు, మామగారు తమ ఇంటికి వచ్చారు. తను, శరత్ వెళ్ళేటప్పటికి ఇంట్లో మరదలితోపాటు వాళ్ళందరూ ఉన్నారు. శరత్‌కి ఆ విషయం తెలియదుకదా!

''అమ్మా'' అంటూ వీణను అల్లుకొనిపోయాడు. వాళ్ళందరూ వాడిని చూసి జాలిపడటం, వీణకి ఓదార్పుమాటలు చెప్పడం వింటే తనకి ఒళ్ళుమండింది. వీణ మొహం అప్పుడే ఎలాగో అయింది. వాళ్ళు వెళ్ళాక ఏం జరుగుతుందా అని తను భయపడ్డాడు. తను అనుకొన్నట్లే జరిగింది.

వాళ్ళు వెళ్ళగానే తనమీద విరుచుకుపడింది. తనని పదిమందిలో అల్లరి చేయడానికే తను శరత్‌ను ఇంటికి తీసికొని వచ్చాడుట. ఇంక ఒకటే గొడవ. చివరికి సహనం కోల్పోయి తను కూడా దెబ్బలాడాడు. ఈ గొడవ వింటూ శరత్ భయంతో బిక్కచచ్చిపోయాడు.

తర్వాత వాడు ఎప్పుడూ వైజాగ్ వస్తానని తనని అడగలేదు. తమ బిడ్డను తామే ఈసడి

స్తే ఎవరు ఇంక ఈ లోకంలో వాడిని చూస్తారు? చెట్టుకి కాసిన కాయను చెట్టే మోయలేనంటే ఎలాగ? అంధుడిగా పుట్టడం వాడి తప్పా?

ఆలోచనలోపడ్డ అతడు వైజాగ్ రావడమే గమనించలేదు. రుమాలుతో మొహం గట్టిగా తుడుచుకొని రైలు దిగి ఇల్లుచేరుకొన్నాడు.

వీణ అడగకపోయినా సరే శరత్ కబుర్లు చెప్పడం అతడు అలవాటు చేసుకొన్నాడు. కొడుక్కి తన తండ్రి అక్షరాభ్యాసం చేయడం, వాడికి శ్రుతి చదువు చెప్పడం అన్నీ విషయాలూ చెప్పాడు. వీణ ఆరోజు తన నిర్ణయాన్ని వంశీకృష్ణకు చెప్పేస్తే అతడికి మతిపోయింది.

పనిమనిషిద్వారా వాకబుచేస్తే ఎవరో మంత్రసాని తనకి ఎబార్షన్ చేస్తానంటే రమ్మన్నానని కబురు పెట్టిందిట. మర్నాడు తను ఏమైపోయినా సరే ఎబార్షన్ చేయించుకొంటానని చెప్పింది. పెద్ద చదువు చదివిన డాక్టర్లు వద్దంటే మధ్య డబ్బుకోసం కక్కుర్తిపడే మంత్రసానిచేత చేయించుకోవడమా? రేపు ఏదైనా జరిగితే? అందుకే అతడు ఒప్పుకోలేదు. ససేమిరా వీల్లేదన్నాడు.

వీణ తనతో రెండురోజులు మాట్లాడకపోయినా భరించాడు. మెంటల్‌గా తమకి మంచి బాబుగాని పాపగాని తప్పక పుడతారని ధైర్యం చెప్పి ప్రిపేర్ చేసేవాడు. ఆమెకి నెలలు గడుస్తున్నకొద్దీ అతడికి సమస్యలే ఎక్కువయ్యాయి. పళ్ళు బిగువుతో వాటిని ఎదుర్కొనేవాడు.

పుట్టింటికి పంపిద్దామంటే వాళ్ళు ఆమె బుర్రని మరీ ఖరాబు చేస్తారేమో అని భయం. తను ఆఫీసుకి వెళ్ళినప్పుడు ఏ సినిమా కేసట్టో తెచ్చుకొని వేసుకోమనీ, ఏ టేపురికార్డరో పెట్టుకొని మంచి పాటలు విని ఆనందిచమనీ తను ఎన్నోసార్లు చెప్పేవాడు. అయినా సరే ఆమె దారి ఆమెదే. ఇంట్లో పని చేసుకొన్నా ఈ బాధ ఉండదు. పని చేయడం గిట్టదు. తమ హెూదాపోదూ? పనిమనుషులే అన్నీ చేయాలి.

స్వప్నకి బాడంగి మండలంలో ఉద్యోగం రావడం కూడా శ్రుతికి సంతోషంగానే ఉంది. దగ్గర్లోనే స్నేహితురాలు ఉంది. అయితే స్వప్న సమస్యలు వేరుగా ఉన్నాయి. అక్కడికీ తన పాపను చూసుకొందుకి పనిమనిషిని కుదుర్చుకొందిట. మరొక ముసలమ్మకి డబ్బు ఇచ్చి తనతో కేంపులకు సాయం తీసికొని వెళుతోందట.

పల్లెటూళ్ళల్లో ఆడవాళ్ళకి కూడా తన ఉద్యోగం మీద, తన మీద సదభిప్రాయం లేదంటుంది. ఆడవాళ్ళు తేలికగా చూస్తారుట. మగవాళ్ళయితే సరేసరి వేళాకోళాలు, వెక్కిరింతలు చేస్తారట. పోనీ ఉద్యోగం మానేస్తావా అని శ్రుతి అడిగింది. ప్రసాద్‌తో చెప్పి ప్రెస్‌లో పని ఇప్పిస్తానంది.

అంతగా చెయ్యలేనపుడు ఎలాగో రాక తప్పదు. మరికొంతకాలం చూద్దామని స్వప్న అనడంతో శ్రుతికి ధైర్యం అన్పించింది. ప్రతి ఉద్యోగంలోనూ ఏవో సాధక బాధకాలుంటాయి. వాటిని గూర్చి భయపడితే ఆడవాళ్ళు ఏ ఉద్యోగమూ చేయలేరన్న స్వప్న మాటలకు శ్రుతి ఆనందం అనుభవించింది.

శ్రుతి స్వప్న గురించే ఆలోచిస్తూ కూర్చుంది. ఎవరైనా స్వప్న జీవితం తెలిసి వివాహం చేసుకొందుకి ముందుకి వస్తే చేసుకోవడంలో ఏ తప్పు లేదని శ్రుతి స్వప్నకి చెప్పింది. ఎవరికైనా సరే జీవితంలో మగతోడు కావాలి కదా! స్వప్న అది వింటూనే చేతులెత్తి నవ్వుతూ దండంపెట్టేసింది.

"తల్లీ! పెళ్ళిమాట అనకు. నాకు ఈ జీవితమే బావుంది. పాపతో చాలా ప్రశాంతంగా ఉంది. ఊపిరి సలుపని ఉద్యోగం. ఇంక నా కష్టసుఖాలు అంటావా ఎలాగో నువ్వు ఉన్నావు. చూస్తున్నావు" అంటూ తేల్చేసింది. "సారథి నా బిడ్డకు తండ్రే. కానీ దాన్ని ఆసరాగా తీసికొని అతడి జీవితాన్ని చిందరవందర చేయను" అనే స్వప్న మాటలు తృప్తినిస్తాయి. కాలం కలిసివస్తే స్వప్నకి మళ్ళీ మంచి డితో పెళ్ళి జరిగితే బావుండునన్పిస్తుంది శ్రుతికి.

భరత్‌కి పిల్లలంటే ఉన్న మమకారం కొద్దీ స్వప్న కూతురిని ఎత్తుకొని తిప్పుతాడు. స్వప్న "భరత్‌కి మా అమ్మాయిని ఇచ్చి పెళ్ళి చేస్తాను" అని అన్నప్పుడు మాత్రం చేతులు ఎత్తి నమస్కారం చేస్తాడు. "తల్లీ! నీ కూతురు పెద్దదయ్యేటప్పటికి నా తల నెరిసిపోతుంది. నా పళ్ళు ఊడిపోతాయి" అంటూ "ఏమైనా




సరే. నువ్వే నా అల్లుడివి'' అన్న స్వప్న మాటలకు అందరూ నవ్వుకొనేవారు.

లక్ష్మమ్మకి వయస్సు అయిపోతున్నా తావ త్రయం మాత్రం పోదు. ఇంట్లో అన్ని విషయాలూ కల్పించుకొంటుంది. చేతికర్ర ఒకటి పుచ్చుకొని దగ్గరలోనున్న అన్ని ఇళ్ళకు వెళ్ళి వాళ్ళ కబుర్లు సేకరించి వస్తుంది. అదే ఆవిడ కి కాలక్షేపం.

మధ్యాహ్నం ఎండలో ఇంటికి వచ్చిన భరత్‌ను చూస్తూ ''ఎండలో ఎక్కడకి వెళ్ళి వచ్చావురా? ఒక్క క్షణం ఇంట్లో కూర్చోవుకదా!'' అంటూ దెబ్బలాడింది. ప్రీతి ఇచ్చిన మంచినీళ్ళు తాగి భరత్ ఆవిడ పక్కన కూలబడ్డాడు. ''చూడు మామ్మా! కాటికి కాళ్ళు చాచుకొన్నదానివి. నువ్వే కర్ర టిక్కుటిక్కులాడిస్తూ ఊరంతా తిరిగేస్తున్నావు. కుర్రవెధవను నేను తిరగవద్దా? బావుందే నీనన. నేను కృష్ణా, రామా అనుకొంటూ జపమాల తిప్పుతూ ఇంట్లో ఉంటాను. నువ్వు మాత్రం షికార్లు కొట్టిరా'' అంటూ వాదన పెట్టుకొన్నాడు.

లక్ష్మమ్మ మనవడి నుదిటిమీద ముద్దుపెట్టుకొని, అతడి మొహానికి పట్టిన చెమటను పమిటతో తుడిచింది.

పోస్టుమెన్ వచ్చి పిలవగానే ఒక్క పరుగున భరత్ వెళ్ళాడు. అతడికి గరివిడిలో ఎల్లయిసీలో ఉద్యోగం వేశారని ఆర్డరు. గరివిడిలో కొత్త బ్రాంచి పెట్టడంతో అక్కడ భరత్‌కి ఉద్యోగం వచ్చింది.

''మేమంటే ఏమిటనుకొన్నారు? ఆఫీసులో వచ్చి చేరమనే అయ్యగారికి ఆర్డరు పంపించారు. చూశారా? ఇప్పుడు భరత్‌గారు ఎల్లైసీలో అసిస్టెంటు'' అంటూ గావుకేకలు పెట్టాడు. వసుధ ఎంతో సంతోషించింది. ఇంతలో శ్రుతి వచ్చింది. భరత్ అక్క కాళ్ళకి నమస్కరించి, ఆర్డరు కాగితం చూపించాడు. శ్రుతికి ఎంతో సంతోషం అనిపించింది. తన వెనకాల నిన్నో మొన్నో పుట్టినట్టున్న తమ్ముడు ఇప్పుడు ఉద్యోగస్థుడు.

''కుర్రవెధవ్వి... అప్పుడే నీకు ఉద్యోగం ఏమిటిరా?'' అంటూ మనవడు ఉద్యోగంచేసి కష్టపడవలసివస్తోందని వాపోయింది లక్ష్మమ్మ. ''అవి ఏం మాటలే మామ్మా! ఈరోజుల్లో స్త్రీలు విజృంభించి అన్ని ఉద్యోగాలూ చేసేస్తున్నారు. పురుషపుంగవులం. మనం ఇంట్లో కూర్చుంటే నామోషీ కాదూ'' అంటూ అక్కలను చూస్తూ కొంటెగా జవాబిచ్చాడు.

సెలవురోజు కదా అని పిల్లల పేపర్లు దిద్దుకొంటున్న శ్రుతి గాబరాగా వస్తున్న రాఘవరావుగారిని చూసి అవి అక్కడ వదిలేసి లేచింది. ''ఏమిటి అంకుల్. అలాగ కంగారుగా ఉన్నారు?'' అంటూ ఎదురెళ్ళింది.

''చూశావా శ్రుతీ! వీణ ఎంత పని చేసిందో? నిద్రమాత్రలు మింగేసిందిట. వీడు సాయంత్రం వచ్చేసరికి ఆలస్యం అయిపోయిందిట. ఇప్పుడు హాస్పిటల్‌లో ఉందిట'' అంటూ ''నేను వైజాగ్ వెళుతున్నాను. వీడికి కాస్త నేను వచ్చేవరకూ ఉంచుకొంటావని తీసికొని వచ్చాను'' అంటూ వచ్చినంత వేగంగానూ వెళ్ళిపోయారు.

శ్రుతి మెదడు మొద్దుబారిపోయింది. ఆయన చెప్పిన విషయం విన్నాక ఆమెకు ఏ ఆలోచనా తోచలేదు. ''అలాగా'' అని నిశ్చేష్టురాలై ఉండిపోయింది. ''అయ్యో పాపం!'' అంటూ వసుధ గోలపెట్టి శరత్‌ను దగ్గరకి తీసుకొంది.

కాస్సేపటికి తెప్పరిల్లాక శ్రుతి భరత్‌తో ప్రసాద్‌ను తీసికొని రమ్మనిపంపింది. వాళ్ళిద్దరినీ వెళ్ళి రాఘవరావుకి సాయంగా ఉండమని వైజాగ్ పంపించింది. అసలు తనే వెళదామనుకొంటే శరత్‌ను వదిలివెళ్ళాలి. వాడసలే తల్లి విషయం విని బెంబేలుపడి, ఏడుస్తున్నాడు.

శ్రుతికి మనసులో ఒకటే ఆలోచన. ఎందుకు వీణ అలాగ తొందరపడిందని. కనీసం భర్త మొహం చూసైనా ఈ అఘాయిత్యం మానింది కాదు. ఎలాగ ఉందో ఏమిటో అని బెంగపడింది.

రాత్రికి ఇల్లుచేరిన భరత్ వీణ హాస్పిటల్లో చనిపోయిందని చెప్పాడు. ప్రసాద్ వాళ్ళకు సాయంగా అక్కడ ఉండిపోయాడు. శ్రుతికి శరత్‌ను ఆపడం బ్రహ్మప్రళయమైపోయింది. వాడు తాతగారు, తండ్రి కావాలని గొడవ. అమ్మను చూస్తానని ఏడుపు. వాడిని శ్రుతి

మరపించేటప్పటికి గగనమైపోయింది.

మర్నాడు ఉదయం ప్రసాద్ శ్రుతికి శరత్‌ను తీసికొని రమ్మని ఫోను చేశాడు. శ్రుతికి సాయంగా ప్రీతి కూడా బయలుదేరింది. వీణ దహనమయ్యాక ఆ వాతావరణంలో శరత్‌ను ఉంచడం మంచిది కాదని శ్రుతి వెనక్కి తీసికొని వచ్చింది.

నాలుగవరోజుకి రాఘవరావు కొడుకును తీసికొని వచ్చేశారు. తండ్రీ కొడుకులిద్దరూ ఈ హఠాత్సంఘటనతో బెదిరిపోయారు. జీవచ్ఛవాలుగా తిరిగి వచ్చిన వాళ్ళను చూసి శ్రుతీ వాళ్ళు ఎంతో బాధపడ్డారు.

"కోడలు పోయిన దుఖం ఒకప్రక్క, ఆమె తల్లిదండ్రుల మాటలు, నిందలు మరొకపక్క నన్ను నిలబడనీయలేదమ్మా! వాళ్ళు వాడిని నిందించని క్షణం లేదు. అందుకే అక్కడ ఉంటే నా బిడ్డ బతకడని తీసికొని వచ్చేశాను. ఇక్కడే మిగిలిన తంతుచేద్దాము" అని కళ్ళనీరుతో అంటున్న రాఘవరావు మాటలకు శ్రుతి అలాగే చేద్దాం అన్నట్లు తల ఊపింది.

వీణ కర్మకాండను రాఘవరావు ఘనంగా జరిపించారు. పదవ రోజుకి వీణ అన్నదమ్ములు, తల్లిదండ్రులు అందరూ వచ్చారు. వీణ తల్లి అల్లుడిని తిట్టని క్షణం లేదు. "నా బిడ్డను పొట్టన పెట్టుకొన్నావు. నా కడుపులో చిచ్చుపెట్టావు. పిల్లలో, పిల్లలో అని దాని ప్రాణం తీశావు. చూస్తాను. నీ బిడ్డ ఎలా బతికి బట్టకడతాడో? నేను చూడకపోను" అని శాపనార్థాలతోను, ఏడుపుతోను ఇల్లు గందరగోళం చేసింది.

రాఘవరావుగారు నోటిమాట రానివాడిలాగ కార్యక్రమం అంతా జరిపించారు. ఎవరో బంధువులు శరత్‌ను తీసికెళ్ళి ఆవిడ ఒళ్ళో ఉంచారు. "ఇంక వీడిని చూసి మీ దుఖం మానుకోవాలి. మీ బిడ్డ రక్తం. మీ వాడు" అంటూ ఓదార్చబోయారు. ఆవిడ శరత్‌ను చూసి మరింత మండిపడింది.

"ఈ దరిద్రుడే నా బిడ్డను చంపాడు. అసలు ఈ వెధవ కడుపున పడటమే దానికి శని పట్టేసింది. తల్లిని మింగిన వెధవ. ఈ వెధవను నా కళ్ళ ఎదుట ఉంచవద్దు" అంటూ తోసేసింది.

ఆవిడ మాటలకి, ప్రవర్తనకి శరత్ భయపడిపోయాడు. జ్వరంతో మూసిన కన్ను తెరువలేదు. జ్వరం వచ్చిన మనవడిని శ్రుతి దగ్గరకి తీసికొని వచ్చి వదిలేశారు రాఘవరావు. ఈ రెండు రోజులూ నువ్వే వాడికి దిక్కు తల్లీ! వాడిని ఎవరూ నిలబడనీయడంలేదు" అంటూ వెళ్ళారు.

శ్రుతి భయంతో ఉలిక్కిపడుతున్న శరత్‌ను గుండెలకు హత్తుకొంది. "ఆంటీ! అమ్మను నేను చంపేశానా? అమ్మమ్మ అలాగ ఎందుకు అంటోంది?" అని అడుగుతున్న శరత్‌ను మరిపించి, మాత్రలు వేసి పడుకోపెట్టింది.

ప్రతివాళ్ళూ చెప్పిన కబుర్లనుబట్టి శ్రుతికి అన్నివిషయాలూ తెలిసాయి. వంశీకృష్ణ అత్తగారు పదవరోజు సాయంత్రమే ఊరు వెళ్ళిపోయింది. బావ మరదులు, మామగారు మాత్రం పన్నెండవ రోజువరకూ ఉండిపోయారు.

వంశీకృష్ణ తన గదిలోనుండి ఒక్కసారి కూడా ఇవతలకు రాలేదుట. ఎంతో క్రుంగిపోయి, పిచ్చివాడిలాగ ఉన్నాడుట. రాఘవరావుకి వచ్చిన కష్టం సామాన్యమైనది కాదు.

ఒకపక్క విశ్రాంతిగా కూర్చుని కొడుకు దగ్గర వార్ధక్యం గడుపుకోవలసిన వ్యక్తి కొడుకుని కళ్ళల్లో వత్తులు పెట్టుకొని కాపాడుకోవలసివచ్చిందంటే ఎంత శిక్ష? కొడుకుని బతిమాలి పాలు, అవీ తాగించడమే ఆయనకు కష్టమైపోతోంది.

ఏనాడూ తండ్రి చేతనైనా పన్నెత్తు మాట పడని వంశీకృష్ణ బతుకు అపనిందలపాలయింది. అతనిదే తప్పు అన్నట్లు అందరూ అనేవారే. బయటకు రావడమే మానేశాడు. తన ఇంట్లో తనే పరాయివాడులాగ బతుకుతున్నాడు. ఏదీ ఎవరితో మాట్లాడడు.

రాఘవరావు పని చెప్పడానికి వీలులేనట్లుగా ఉంది. కొడుకు ఏం చేస్తాడో అన్నట్లు రెప్పవేయకుండా కావలా కాయడం కష్టంగా ఉంది. వేళకు ఇంత తిని, పడుకోవలసిన మనిషి కొడుకు కోసం తిండి, నిద్రమాని ఉండవలసివస్తోంది.

ఆయన కొడుక్కి ఎంత ధైర్యం చెప్పినా అతడు మాత్రం మామూలు మనిషి కాలేకపోతున్నాడు. లోకం పదిరకాలుగా అంటుంది.






జరిగిన యదార్థం గుర్తించదు. అందుకే అన్నారు. లోకం నోరు మూసే మూకుడు ఉందా అని. "నువ్వు వాళ్ళ మాటలు పట్టించుకోకు" అని పదిరకాలుగా చెప్పేవారు. ఎంత చెప్పినా విని పించుకోకపోతే "నాన్న గురించి అయినా ఆలోచించవద్దా?" అని అడిగేవారు. దేనికీ అతడిలో స్పందనలేదు "నాన్నగారూ! నా వలన మీకు సుఖం లేదు. నేను చాలా నష్టజాతకుడిని. నన్ను వదిలెయ్యండి" అంటున్న కొడుకుని ఆయన కావలించుకొని భోరుమని ఏడ్చేవారు.

శ్రుతి అక్కడికే మిగతా పనులను తగ్గించుకొని వాళ్ళకు ధైర్యం చెప్పడానికి ప్రయత్నించేది. ఆమెకి స్కూలుకి వెళ్ళక తప్పదు కదా! పబ్లిక్ పరీక్షలకు కోర్సు పూర్తిచేయవలసిన బాధ్యత ఆమెపై ఉంది.

రాఘవరావుకి ఎన్నో విధాలుగా ధైర్యం చెప్పడానికి ప్రయత్నించేది. ఆయన శ్రుతితో "నిజమేనమ్మా! నీ మాటలు యదార్థమే. కానీ ఈ ఫూల్ ఇవన్నీ తెలుసుకోడే. బతకడమే అనవసరమనుకొంటున్నాడు" అని బాధగా అనేవారు.

ఆ అమ్మాయిని చూస్తే ఆయనకి జాలివేసేది. తమకన్నా చిన్న వయసుపిల్ల అయినా ఎంతో ఆరిందాగా ప్రవర్తిస్తోంది. శ్రుతిని చూసీ, ఆమె చెప్పే మాటలు వినీ ధైర్యం తెచ్చుకొనేవారు.

ఆయన దగ్గర ఉన్నంతసేపు ఇంటికి సంబంధించిన విషయాలు చూసేది. వంశీకృష్ణ తీరే ఆమెకి నచ్చలేదు. మగవాడై ఉండి పిరికివాడిలాగ అలాగ ప్రవర్తించడం ఏమిటి? ఆమె పిలిస్తే, బుజ్జగిస్తే శరత్, రాఘవరావు దేనికైనా లొంగేవారు. కానీ వంశీకృష్ణ చేతఅన్నం తినిపించడం మాత్రం ఆమెవలన అయ్యేదికాదు. చెప్పిచెప్పి విసిగిపోయేది.

కొడుకు వచ్చి అన్నం తినేవరకూ రాఘవరావు అన్నం తినరు. వంటావిడ వండేసి, ఏదో రెండుసార్లు వాళ్ళను పిలిచి, విసిగి వెళ్ళిపోయేది. ఇంక రాఘవరావుకి కొడుకుని సాగదీసి పిలిచేసరికి నీరసం వచ్చేది. ఒక్కొక్కసారి

మరి చెప్పలేక మనవడికి పెట్టేసి, తనూ కొడుకుతోపాటు అభోజనంగా ఉండిపోయేవారు.

సాయంత్రం స్కూలునుండి వచ్చిన శ్రుతి వంట పాత్రలు చూసి ఉసూరుమనేది. తండ్రి వాలకం చూసి శరత్ శ్రుతి ఇంటికి రావడం మానేశాడు. తండ్రినే అంటిపెట్టుకొని కూర్చునేవాడు. గంటలు గంటలు శూన్యంలోకి చూస్తూ అతడు ఆలోచించే విషయం ఏమిటో ఎవరికీ అర్థమవదు.

భరత్ శ్రుతి మాటమీద సాయంత్రం వేళల్లో వాళ్ళ ఇంటికి శ్రుతితోపాటు వచ్చి, ఆ నిశ్శబ్దాన్ని భరించలేక మానేశాడు. "అబ్బ... తివిరి ఇసుమున తైలంబు తీయవచ్చు, తిరిగి కుందేటి కొమ్ము సాధింపవచ్చు అన్నట్లు అవన్నీ చెయ్యవచ్చు కానీ వాళ్ళ కొంప మాత్రం మార్చలేము" అని భరత్ ఇంట్లో తేల్చి చెప్పేశాడు.

ప్రసాద్ మాత్రం విన్నా వినకపోయినా వంశీకృష్ణకి ధైర్యం చెపుతూనే ఉండేవాడు. సరైన ఆహారం వేళకి లేక, నిద్రలేక రాఘవరావు ఒకరోజు కళ్ళుతిరిగి పడిపోయాడు. కబురు రాగానే శ్రుతి సెలవు చీటీ పంపేసి ఆయన దగ్గరకి వచ్చేసింది. బాగా నీరసంగా ఉన్నందువలన అలాగ జరిగిందని డాక్టరు వచ్చి ఇంజక్షను ఇచ్చారు. మర్నాడు టెస్టులు చేస్తానన్నారు.

పాపం... ఎప్పటికో గంటకి తెలివివచ్చాక శ్రుతిని చూసి ఆయన చిన్నపిల్లాడిలాగ ఏడ్చారు. "నాకు చావైనా రాదమ్మా" అంటూ బాధపడ్డారు. ఆయనకి అసలే హై బి.పి. అది మళ్ళీ పెరిగింది. డాక్టరు ఆయనను జాగ్రత్తగా చూసుకోమని మందులు రాశారు. శ్రుతి వంశీకృష్ణ వినేలాగ బాగా విసుక్కొంది.

తండ్రి అనారోగ్యంతో ఉన్నా చూడనందుకు, సరిగ్గా ప్రవర్తించనందుకు కోపగించుకునేది. కష్టాలు, సమస్యలు రాకుండా ఎవరూ లేరనీ, అవి అందరకీ ఉంటాయనీ అనేది. ఎంత కోపంగా పరోక్షంగా అంటున్నా అతడిలోగాని, ప్రవర్తనలోగాని మార్పులేదు.

తండ్రికి బాగా తెలివివచ్చేవరకూ అక్కడే కూర్చున్నాడు. కళ్ళు తెరిచి చూశాక "ఎలా ఉంది నాన్నగారూ?" అంటూంటే ఆయన తట్టుకోలేక ఏడ్చేశారు. "నువ్వు మామూలు మనిషివి కావాలిరా! నిన్ను ఇలాగ చూస్తూ నేను బతకలేకపోతున్నానురా" అంటూ బాధపడ్డారు.

శ్రుతి ఆయనని రెండు పూటలా వెళ్ళి చూసి వచ్చేది. శరత్‌తో తాతగారిని వంటరిగా వదలవద్దని అప్పచెప్పింది. వంశీకృష్ణ మాత్రం ఇంట్లో ఏం జరుగుతోందో తెలియనట్లు ఉండేవాడు.

నాలుగురోజులు గడిచాక డాక్టరుగారు ఇంటికి వస్తోంటే చూసి భరించలేక, ఆయనే రిక్షాలో కొంత ఓపిక తెచ్చుకొని వెళ్ళివచ్చేవారు. డాక్టరు దగ్గరకి వెళుతూ శ్రుతికి ఆరోజు ఆదివారమే కనుక ఇంటికి వెళ్ళి కొడుకుని, మనవడిని చూడమని చెప్పారు. ఆయనకి కొడుకుని ఒంటరిగా వదలడం భయం. ఆరోజు పని కుర్రవాడు రాలేదని శ్రుతికి చెప్పారు.

శ్రుతి ఆయన భయానికి జాలిపడింది. ప్రీతి కొడుక్కి అన్నం పూర్తిగా తినిపించి, బట్టలు మార్చుకొని శ్రుతి రాఘవరావుగారింటికి బయలుదేరింది. రాఘవరావుగారి ఇల్లు చూస్తే తలుపులన్నీ వేసి ఉన్నాయి. శ్రుతికి మాత్రం ఏదో అనుమానం వచ్చింది.

బయట చూస్తే తాళం కనబడుతోంది. రాఘవరావు కొడుకు, మనవడు ఇంట్లో ఉన్నారని చెప్పారు. అందుకే శ్రుతి గాబరాపడుతూ తలుపు కొట్టింది. ఎవరూ లేచి వస్తున్న అలికిడి విన్పించలేదు.

"శరత్‌ను ఎన్నోసార్లు పిల్చింది. అయినా సమాధానం లేదు. చివరకి ఆమెకు అంత గాబరాలోను బాత్‌రూం తలుపు వక్కగది గుర్తుకి వచ్చింది. పెరటి తలుపులు లోపల బిగించబడి ఉన్నాయి. కానీ ఈ చివరగానున్న గది తలుపు మాత్రం దగ్గరగా వేసిఉంది.

ఎప్పుడైనా చుట్టాలు వస్తే అవసరమవుతుందని రాఘవరావు వెనుక గది వక్కగా మరో బాత్‌రూం కట్టించాడు. ఆ బాత్‌రూం వక్కగదిలో బంధువులొస్తే పడుకొనేవారు. అది కొంచెం ఇంట్లో మూలగా ఉంటుంది. ఎవరూ




రానప్పుడు పనివాళ్ళు కూడా ఆ బాత్‌రూం ఉపయోగించేవారు.

శ్రుతి భగవంతుడికి కృతజ్ఞత చెప్పుకొని ఆ బాత్‌రూం పక్కనున్న గదిలోనుండి లోపలకి వచ్చింది. వంట ఇంటిద్వారం దగ్గరకి వచ్చిన శ్రుతికి నోటిమాటరాలేదు. ఏనాడూ వీణ పోయాక వంశీకృష్ణ వంటింట్లోకి రాలేదు. తన చేత్తో కొడుక్కి అన్నం పెట్టలేదు. అటువంటివాడు కంచంనిండా అన్నం కలుపుతున్నాడు. శరత్‌ను ఎదురుగా కుర్చీలో కూర్చోపెట్టాడు.

శ్రుతికి అతడు చేయబోతున్న పని అర్థమైంది. ఒక్క పరుగున వెళ్ళి అతడి చేతిలోని కంచం లాక్కొంది. ఆమెను ఆ క్షణంలో అక్కడ చూసిన అతడు మొదటలో తెల్లబోయాడు. తర్వాత తెప్పరిల్లి కంచం కోసం పెనుగులాట ప్రారంభించాడు. ఆ అన్నాన్ని చూడగానే, దాని వాసన తగలగానే అందులో ఎండ్రిన్ కలిపాడని గ్రహించింది శ్రుతి.

ఆ క్షణంలో ఆమెకు అంత బలం ఎలా వచ్చిందో తెలియదు. కానీ ఒక చేత్తో కంచం లాగి, మరొక చేత్తో అతడిని దూరంగా త్రోసేసింది.

కిందపడిన అతడు ఆమె వైపునకు దూకబోతేంటే ఆమెకు కోపం ముంచుకొచ్చింది. అతడి చొక్కాను పట్టుకొని మళ్ళీ వెనక్కి తోసింది. వెంటనే గబగబ ఆ కంచం తీసికెళ్ళి అన్నం పెరట్లో పడేసింది.

వంశీకృష్ణ తమ పెనుగులాటలో కిందపడిన అన్నం మెతుకులవైపు చూస్తూ అలాగే ఉండిపోయాడు. శ్రుతి లోపలకు వచ్చి శరత్‌ను దగ్గరికి తీసుకొంది. వాడికి జరిగినదేదో కనబడకపోయినా తండ్రి ఏదో చెయ్యబోయాడని గ్రహించాడు.

"ఛీ... మీరు మనుష్యులేనా? ఒక పసివాడిని చంపి, మీరు చచ్చిపోదామనుకొన్నారా? మీకన్నా వీణే నయం. శరత్ జోలికి ఆమె రాలేదు. శరత్ కళ్ళులేనివాడనేకదూ అన్నంలో విషం కలిపి పెట్టబోయారు. వాడికే కళ్ళు ఉంటే మీ ప్రయత్నం సాగేదా? మీరు వాడికి చేయబోయిన అన్యాయానికి మిమ్మల్ని వాడు జీవితంలో క్షమించడు" అంటూ ఆమె ఆవేశంతో రొప్పసాగింది.

"మధ్యలో వచ్చి నా ప్రయత్నం భగ్నం చేసింది చాలక నన్ను తిడుతున్నారు? అసలు ఇప్పుడు మిమ్మల్ని ఎవరు రమ్మన్నారు? మమ్మల్ని ఎందుకు బతికించారు? ఈ బతుకు బతకడానికి ఎంత రోతగా ఉందో మీకేం తెలుసును? అసలు మీరు ఎవరు మమ్మల్ని ఆపడానికి" అంటూ రంకెలు వేశాడు. అతడిలో అంత ఆవేశాన్ని శ్రుతి ఎప్పుడూ చూడలేదు.

"చచ్చిపోతాననడానికి మీకు సిగ్గులేదూ? పిరికివాడు రోజుకి పదిసార్లు చస్తాడు. ధైర్యవంతుడికి జీవితంలో ఒక్కసారే చావు" అంటున్న శ్రుతి మాటలకి అతడు ఏమీ బాధపడలేదు.

"అవును... నేను పిరికివాడిని. మీరు అలాగ అంటే నేను ఏమీ రోషపడను. తండ్రికి ఏమీ చేయలేని కొడుకుని, కొడుకుని సక్రమంగా పెంచలేని అసహాయుడిని. అసమర్థులైనవాళ్ళు బతకడం ఎందుకు? భూమికి భారానికా?" అంటూ తల పట్టుకొని కూర్చున్నాడు.

మళ్ళీ తనే అన్నాడు.

"మీకేం తెలుసును? చావడానికి కూడా చాలా ధైర్యంకావాలి. ఎంతో మనసును కూడ గట్టుకొంటే కాని చచ్చిపోలేము. వీణకి నేను ఏం తక్కువ చేశాను? ఎందుకు నన్ను ఇలాగ శిక్షించింది? నా జీవితం ఎంత అస్తవ్యస్తం చేసింది? లోకులు నన్ను ఎంత హేళన చేస్తున్నారో మీకేం తెలుసును?

"భార్యను పొట్టను పెట్టుకొన్నానంటున్నారు. ఎబార్షన్ మంచిది కాదని డాక్టరు చెప్పారని వద్దన్నాను. మరొక బిడ్డకోసం ఎంత ధైర్యం చెప్పానో ఆమెకి. భగవంతుడు ఎందుకో ఒక్కొక్కళ్ళ జీవితాలు ఎంత నరకం చేస్తాడో?" అని తన మనసులోని బాధనంతా చెప్పడం మొదలుపెట్టాడు.

అతడి మనసులోని ఆవేదనను వింటున్న శ్రుతికి ఎంతో బాధ అన్పించింది. తనకి తెలి

యకుండానే అతడి కుర్చీ దగ్గరకి వచ్చి నిలుచుంది. మృదువైన స్వరంతో అంది. "భగవంతుడు ఏమీ చేయలేదు. ఆయన మనకి అద్భుతమైన జీవితాన్ని ఇచ్చాడు. మనమే బతకడం చేతకాకా, చక్కగా బతికే సామర్థ్యం లేకా జీవితాలను నాశనం చేసుకొంటున్నాము. ఆడవారైనా, మగవారైనా జీవితంలో కష్టసుఖాలను ఎదుర్కొంటూ సామర్థ్యంతో బతకాలి.

"సముద్రం ఒడ్డుకి ఈత నేర్చుకొందుకి వెళ్ళి అలలంటే భయపడటం న్యాయమా? జీవితం అన్నాక కష్టసుఖాలు రెండూ ఉంటాయి. మీ పిచ్చి కానీ మీరు పిరికితనంతో ఆత్మహత్యచేసుకొంటే మాత్రం ఈ లోకులు మిమ్మల్ని ఏమీ అనరని అనుకొంటున్నారా? మీ నాన్నగారు మీరు లేకుండా బతకగలరా? మీరు ఎంత ఆలోచన లేకుండా ప్రవర్తించబోయారో చూడండి" అని శ్రుతి అంటూంటే అతడు మౌనం వహించాడు.

కాసేపాగి "నా జీవితమే ఒక అపశ్రుతైపోయింది. ఎవరు ఏమనుకొంటే నాకేం" అంటున్న అతడిని జాలిగా చూసింది.

"వెలుగునీడలు పగలు రాత్రులవంటివి వంశీ! ఏదీ అలాగే ఉండిపోదు. చీకటి వెనుక వెలుగు వచ్చి తీరుతుంది. అందుకే "బాధపడిన హృదయమ్మే పలికించును పరమాత్మను, పెల్లగిల్లిన కొండ్రలోనే పల్లవించు పసిడి పంట" అని అన్నారు కవిగారు. ధైర్యంగా బతకడం నేర్చుకోండి" అంటున్న శ్రుతి మాటలలో ఏదో తెలియని ఓదార్పు లభించింది.

వాళ్ళ మాటలను వింటున్న శరత్ నెమ్మదిగా బయటకి నడిచాడు.

"వంశీ" అని ఆమె నోటివెంబడి తన పేరు ఆత్మీయంగా రావడం చూసి అతడు ఆశ్చర్యపోయాడు.

ఆమె కళ్ళు స్నేహపూర్వకంగా అతడిని సేదతీరుస్తున్నాయి. ఇది కలా, నిజమా అని అతడికి అన్పించింది. కామెర్ల రోగికి లోకం అంతా పచ్చగా కన్పిస్తుందిట. ప్రేమను, స్నేహాన్ని కోరుతూ, తపిస్తున్న తనను తన కళ్ళు మోసం చేయడం లేదు కదా! ఎలాగైతేనేం, తన సందిగ్ధాన్ని వదుల్చుకొన్నాడు. నెమ్మదిగా శ్రుతివైపు చూస్తూ "నాకు ఈ జీవితం చాలా నరకంగా ఉంది శ్రుతీ! ఏ ఆశ చూసుకొని ఈ జీవితాన్ని సాగించాలి?" అని అన్నాడు.

శ్రుతి పసివాడి మాటలకు తల్లి నవ్వినట్లున వ్వింది. "ఒక పెద్ద ఇంజనీరు అనవలసిన మాటలేనా ఇవి? మీకు కొన్ని బాధ్యతలున్నాయి. మీ నాన్నగారిపట్ల మీ ధర్మం నిర్వర్తించాలి. శరత్‌ను బాగా పెంచాలి. ప్రపంచానికి ఉపయోగపడాలి. ఇన్ని బాధ్యతలు మీ ముందు ఉంటే ఇలాగ బేలగా మాట్లాడటం తగునా?" అంటూ మందలించింది.

"అవును... అవన్నీ నా బాధ్యతలే! ఒప్పుకొంటున్నాను కానీ నాకు తోడు ఏదీ? నువ్వు నా బాధ్యత వహించగలవా? చెప్పు శ్రుతీ! నాకు జవాబు కావాలి. నా జీవితంలోకి నువ్వు రాగలవా? జీవితాంతం నాకు తోడు, నీడగా ఉండగలవా? నా జీవన ప్రాంగణంలోకి నిన్ను ఆహ్వానిస్తున్నాను. ఇలాగ కోరానని నేను స్వార్థపరుడిననుకోకు. ఇప్పటికైనా ఈ బ్రతుకును పండించుకోవాలని ఆశపడుతున్నాను. అంగీకరిస్తావా శ్రుతీ!" అని ఆవేశంగా అంటున్న అతడి మాటలకి శ్రుతి ఇంక ఆగలేకపోయింది.

"తప్పకుండా వంశీ! మీకు జీవితాంతం తోడు నీడగా ఉంటాను. నా జీవితం మీ కుటుంబాన్ని దారికి తేవటానికి ఉపయోగపడుతుందంటే నాకు అంతకన్నా ఏం కావాలి? ఈ జీవితం ఇంక మీదే" అంటున్న ఆమెను అతడు ఆర్తిగా దగ్గరకు తీసికొని గుండెలకు హత్తుకొన్నాడు.

"తాతయ్యా! మీరు వెళ్ళాక ఎంత ప్రమాదం జరిగిందో తెలుసా"? అంటూ తాతగారికి జరిగిన విషయం చెప్పబోయిన శరత్‌ను రాఘవరావుగారు ఆపేశారు.

"మనకి ఏం ప్రమాదం జరగలేదు బాబూ! నాకు తెలిసిందిలే. అంతా మనకి మేలే జరిగింది" అంటూ మనవడి చేతిని పట్టుకొని, ముందుకు నడిచారు.







# చతుర ప్రపంచం

## ఊహించని మగతనం

ఆపరేషన్ చేశాక పేషెంటు కడుపులో కత్తెర్లు ఉంచి కుట్టేయడం, పిప్పిపళ్లు వదిలేసి మంచి పళ్లు పీకేయడం, రోగికి గ్లూకోజు బదులు పొరపాటున కిర్సనాయిలు ఎక్కించడంవంటి తలతిక్కపనులు చేసే డాక్టర్ల గురించి మనం ఇప్పటికే చాలాసార్లు విన్నాం. వాళ్లందరికంటే ఏడాకులు ఎక్కువ చదివాడు బల్గేరియాకు చెందిన డాక్టర్ పీటర్ ఫ్రాన్క్యా.

1988 డిసెంబర్ 23న వానియా అనే కీ సెక్స్ మార్పిడి ఆపరేషన్‌చేసి చేతులు కడిగేసుకున్నాడాయన. ఆపరేషన్ చేసేటప్పుడు ఆయనకు సహకరించిన నర్సులు కూడా అంతటి తెలివిగల వారే కావడంతో జరిగిన పొరపాటును ఎవరూ గమనించలేదు. తీరా స్పృహవచ్చాక వానియాకు అసలు విషయం అర్థమై లబోదిబోమంది. తన భార్యకాస్తా తన లాగే మగవాడైపోవడంతో ఆమె మొగుడు జుట్టు పీక్కున్నాడు. ఆ దంపతులకు పుట్టిన




నలభై అయిదేళ్ల మహిళ గర్భసంచి తీయించుకునే నిమిత్తం ఆయన పనిచేస్తున్న ఆసుపత్రికి వచ్చింది. ఆమెకు ఆపరేషన్ చేయవల్సిన డాక్టర్‌గారు హఠాత్తుగా సెలవు పెట్టడంతో ఆ బాధ్యతను మన పీటర్ మహాశయులకి అప్పగించారు ఆసుపత్రి నిర్వాహకులు. ఆరోజు అప్పటికే సెక్స్‌మార్పిడి ఆపరేషన్లు నాలుగు చేసి, బాగా అలిసిపోయి ఉన్నాడాయన. అదే సమయంలో వానియా ఆపరేషన్ బాధ్యత కూడా ఆయననెత్తిన పడడంతో కేసు షీట్ పూర్తిగా చదవకుండానే గబుక్కున ఆమె ముగ్గురు పిల్లలూ "అమ్మా... నువ్వు ఉన్నట్లుండి నాన్న అయిపోయావ్‌గా మరి నాన్నకాస్తా అమ్మ అయిపోతాడా?" అని అమాయకంగా వానియాని ప్రశ్నిస్తున్నారు.

ఆ కుటుంబంలో ఇంతటి సంచలనం సృష్టించిన డాక్టర్ పీటర్‌గారు ప్రస్తుతం ఉద్యోగం ఊడగొట్టించుకుని ఇంట్లో గోళ్లు గిల్లుకుంటూ కూర్చున్నారు.

# తండ్రి ప్రతిభ - కూతురి విశ్వాసం

క్రికెట్ ఆట ఎంత ఆసక్తికరంగా ఉంటుందో అంతకు రెట్టింపు ఆసక్తికరంగా ఉంటాయి క్రికెటర్ల వ్యక్తిగత విషయాలు. సరదాగా వినో దంకోసం ఇవి ఎన్నయినా చెప్పుకుంటారు క్రీడాభిమానులు. మన మాజీ క్రికెట్ ప్లేయర్ విజయ్‌మర్చంట్ ఆటనుంచి రిటైరై, ఎంచక్కా పెళ్ళాడి ఓ పాపకి తండ్రి కూడా అయ్యాడు. ఆ పాపకి ఐదేళ్ళొచ్చాక తండ్రీకూతుళ్ళిద్దరూ కల్సి సరదాగా ఓరోజు క్రికెట్‌మ్యాచ్ చూడ్డానికి వెళ్ళారు. ఆరోజుల్లో మన్సూర్ అలీఖాన్ పటౌడీ క్రికెట్ ఆటని దున్నేస్తున్నాడు. అంతేకాదు, నటి షర్మిలాటాగూర్‌తో ఆయన సాగిస్తున్న ప్రే




మాయణం కూడా పాకాన పడడంతో వార్తల్లో వ్యక్తిగా ఆయన సుప్రసిద్ధుడైపోయాడు. అంచేత చిన్నాపెద్దా అందరికీ అతనిపట్ల విప రీతమైన క్రేజు పెరిగిపోయింది. విజయ్‌మ ర్చంట్ కూతురు కూడా తరచూ 'పటౌడీ' ప్రస్తావన తెస్తూ ఆరిందాలా అతని ఆట గు రించి వర్ణించి చెపుతుండేది. ఆరోజున ఆట య్యాక పటౌడీ వీరవిహారాన్ని తల్చుకుని తెగ మురిసిపోతున్న ఆ పాప ఉన్నట్టుండి తండ్రి వైపు తిరిగి, "డాడీ... ఎంచక్కా నువ్వూ క్రికెట్ నేర్చుకోకూడదూ ఊర్కే కూర్చోకపోతే?" అంది. అంతే! డంగైపోయాడు తండ్రి. 11 డబుల్ సెంచరీలు చేసి 12 వేల పరుగులకు పైగా చేసి అంతర్జాతీయ క్రీడాకారుడిగా గుర్తింపు పొందిన ఆ తండ్రి, కూతురి ప్రశ్నకు ఏం సమాధానం చెప్పాలో తెలియక మూర్ఛపోయా డట.

1926-27 ప్రాంతాల్లో యం.సి.సి. టీమ్ తరఫున ఆడిన ప్రసిద్ధ బౌలర్ ఆర్థర్ గిలిగాన్ అంటే బ్యాట్స్‌మెన్‌కి గుండెదడ పుట్టుకొచ్చేది. ఆ రోజుల్లో కేవలం 30 పరుగులిచ్చి ఆస్ట్రేలి యన్ టీమ్ మొత్తాన్ని ఔట్‌చేసిన ఘనుడా యన. అంతటి బౌలర్‌కూడా బ్యాటింగ్ విష యానికొస్తే పరమ పూర్. దాన్ని గురించి ఓ గమ్మత్తయిన ఉదాహరణ చెబుతారు. ఓ మ్యా చ్‌లో ఆర్థర్ బ్యాటింగ్‌కి బయలుదేరాడట. అంతలో అతనికి ఎక్కడినుంచో ఫోన్ వచ్చింది. ఫోన్ ఎత్తిన ఆర్థర్ కూతురు, "డాడీ... ఇప్పుడే బ్యాటింగ్‌కి వెళ్ళారు. మరికొన్ని క్షణాల్లో ఆయన ఔటయి పెవిలియన్‌కి వచ్చేస్తారు. కొన్నిక్షణాలు వెయిట్ చేయండి అంకుల్" అని అవతలవ్యక్తికి చెప్పిందట. అంటే క్రీజులో తన తండ్రి కొన్నిక్షణాలు కూడా నిలబడలేదని ఆమె ఉద్దేశ్యం. అది విన్న అవతలి వ్యక్తి ఆమె సెన్సాఫ్ హ్యూమర్‌కి పొట్టచెక్కలయ్యేలా నవ్వాడట.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 229428. Office address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad Tel. Hyderabad: 223422, 229444, Madras 470434, Vijayawada 476685, Visakhapatnam 52211, Tirupati 5291, Anantapur 22977.

